Published under the auspices of
"Andhra Provincial Homoeopathic Association"



# ఆర్గనాన్ అను హోమోపతీసిద్ధాంతశాస్త్రము

## (Organon of Medicine)

అనువాదకులు.
డాక్టరు నరసింహదేవర కామేశ్వరరావు,
హెచ్. యమ్. డి.
ప్రధాన చికిత్సకులు
ఆలమూరు గ్రామపునర్నిర్మాణ హోమోపతీ వైద్యశాల
ఆలమూరు, తూర్పు గోదావరిజిల్లా

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

రామచంద్రపురమున పల్లె సేతునారాయణరావుపంతులు గారి
శ్రీఆనంద తీర్థ ముద్రాశాల యందు ముద్రితము.

 [Price Rs. 4—0—0

1937.

# అంకితము.

సారూప్యౌషధ వైద్యము మన ప్రాంతములలో ప్రచారములో లేని కాలమున దీర్ఘవ్యాధులకులోనై అకాలమృత్యువాతబడిన నాపెద్ద సోదరులగు వెంకటశాస్త్రి, సూర్యనారాయణగార్ల యొక్కయు పరుగులిడి ఆటలాడుచు ప్రమాదవశమున నొసటను దెబ్బతగిలి మృతినొందిన చిన్నసోదరుడగు వేణుగోపాలము యొక్కయు నామములు చిరస్మరణీయముగ నుండుటకు యీగ్రంథము నంకితమొసగి వారియెడ నాకుగల భక్తి ప్రేమాస్పదములతో నీగ్రంథకుసుమమును సమర్పించి యుంటిని.

ఇట్లు
నరసింహదేవర కామేశ్వరరావు,
అనువాదకుడు.



అనువాదకులు.

డాక్టరు నరసింహదేవర కామేశ్వరరావు.

హెచ్. యమ్. డి.

# పీఠిక.



మన దేశమున నేడనేక వైద్యవిధానములు ప్రచారములో నున్నవి. కొలదికాలమునుండి మాత్రమే సారూప్యౌషధ విధానము (Homoeopathy) ఆంధ్రదేశమున క్రమ క్రమముగ వ్యాప్తి జెందుచున్నది. ఆంగ్లవిద్యనభ్యసించని అనేకులు ఆంధ్రమున గల కొలది పుస్తకములను మాత్రమే పఠించి ఈవైద్యమును కృషిసల్పుచున్నారు. సారూప్యౌషధ విధానమును అభ్యసించుటకు మూలాధారమగు "ఆర్గనాన్"ను పఠించిన గాని సారూప్యౌషధచికిత్సను శాస్త్రీయముగ నవలంభించుటకు వలను పడదు. వైద్యవిధానములలో కెల్ల సారూప్యౌషధ విధానము శాస్త్రీయమైన ఉత్తమ విధానమని ప్రపంచము నందంతటను నిష్పక్షపాతబుద్ధిగల ఉత్తమ వైద్యశిఖామణులచే అంగీకరింపబడెను. ఉత్తమ వైద్యచికిత్స లభింపక అనేకులు ప్రాణములను గోల్పోవుచుండిన మాట నిజము. ఉత్తమ విధానమగు సారూప్యౌషధ శాస్త్రమునకు మూలాధారమగు ఆంగ్ల భాషలో గల "ఆర్గనాన్" అను గ్రంథమును ఆంధ్రభాషలోనికి తర్జుమా చేసి ఈవైద్య విధానము ఆంధ్రదేశమున విపుల వ్యాప్తి జెందుటకు కొంతసేవ గావింపవలయునని తలచి ఈకార్యమునకు పూనుకొని యుంటిని. ఆంధ్ర, ఆంగ్ల భాషల యందు నాకు పాండిత్యమించుకయును లేకున్నను, యీవైద్య

విధానము మన ఆంధ్రదేశమున విపులవ్యాప్తి జెందవలయుననూ అభిలాషయే నన్నీ ఘనకార్యమునకు ప్రోత్సహింపజేసి కార్య సాధనకు మనోనిశ్చయము కలిగించి యుండెను.

ఉభయభాషలయందును నాకు గల అల్ప పరిజ్ఞానముతో ఈఉద్గ్రంధమును ఆంధ్రీకరణము గావించుటకు యత్నించుట కడు సహాయమని ప్రథమమున అధైర్యము జెందితిని గాని ఈ ఈవైద్యవిధానమునందలి ఉత్కృష్టతను మనమున దలంచి వ్యాధిగ్రస్తమగు మానవ ప్రపంచకమునకు శక్తికొలది సేవ గావింపవలయునను వేదన ముందుకు త్రోయ దైవముపై భారమువైచి గ్రంధ రచనకు ప్రారంభించితిని. అనేక భాషల యందు గల పరిపూర్ణమైన పాండిత్యముతో మేధావియగు హెనిమాన్ చే వ్రాయబడిన ఈగ్రంథమునందలి భాష అభిప్రాయములు ఎంతభావ గర్భితములై యుండగలవో విశేషించి వ్రాయనవసరములేదు. ఇట్టి భావములను భాషాంతరీకరణము గావించుటలో ఎంతటి పట్టుదల ఉత్సాహశక్తులు గూడ విఫలమగుచుండ సత్సంకల్పమునకు ఎప్పుడు సహాయభూతమగుచుండు అంతరంగమున ప్రవేశించిన దైవబలమే నన్నీ కార్య సాఫల్యమున కృతార్థుడను గావించెను గాని నాప్రజ్ఞా విశేషమేమియు లేదని విన్నవించుకొనుచున్నాను. పాండిత్యలోపముచే భావములను తేటతెల్లముగ వెల్లడించుటయందును సరిగ భాషాంతరీకరించుట యందును అనేక లోపములు జనింపక

తప్పదు. పాఠకమహాశయులును, పండిత శ్రేష్టులును అట్టి లోపములను నాకు తెలియజేసిన, రెండవ ప్రచురణమునందు సవరణ చేసికుందునని మనవి జేసుకొనుచున్నాను. ఈవైద్య విధానమునందు మిక్కిలి అభిమానముగల ఆనందతీర్థ ముద్రాలయా యజమానులు ప్రత్యేక శ్రద్ధ వహించి ఈపుస్తకమును అచ్చొత్తించుటకు పూనుకొని నాకు మిక్కిలి సహాయభూతులయిరి. అనివార్యముగ అచ్చటచ్చట అచ్చుతప్పులు దొర్లి యున్నవి గాన తప్పొప్పులపట్టిక చివరున ప్రచురింపబడినది. ఈపట్టిక సహాయమున పాఠకులు అచ్చులోపములను సవరింప ప్రార్థించుచున్నాను.

సారూప్యౌషధ విధానము జర్మనీ దేశస్థుడగు సామ్యూల్ హానిమాన్ చే కనిపెట్టబడెను. ఈతడు 1755 సం॥రం ఏప్రిల్ 10వ తేదీని సామాన్య బీదకుటుంబమున జన్మించెను. 22 సం॥ రముల వయస్సు రాకమున్నే అనేక భాషలలో సంపూర్ణ పాండిత్యమును సంపాదించి 1770 వ సంవత్సరమున డాక్టరు పరీక్ష యందు తీర్ణుడై 1781 వ సంవత్సరమున వైద్యవృత్తి నవలంభించెను. జీవనోపాధి నిమిత్తము తాను అవలంభించిన అల్లోపతీ వైద్యవిధానమును కృషిసల్పుచు ఇతరభాషలలోగల అనేక వైద్యగ్రంథములను తర్జుమాచేసి యుండెను. ఆకాలమున అల్లోపతీవైద్యవిధానమును కృషిసల్పు వైద్యశ్రేష్టులలో హానిమాన్ అగ్రస్థానము వహించి యున్నప్పటికి ధనార్జన

ప్రధానముగ నెంచి తానవలంభించిన వైద్యవిధానమే శ్రేష్టతర మైనదని సమర్థింపక స్వానుభవమును బట్టి అందలి లోపము లను విమర్శించి ఈఅల్లోపతీ వైద్యవిధానము వ్యాధుల చికిత్సకు అనుపయోగము ప్రమాదకరముయగు వైద్యవిధాన మని దృష్టాంతరములతో విమర్శించి శాస్త్రీయమగు సారూ ప్యౌషధ విధానమును నిర్మాణము జేసెను. సారూప్యౌషధ విధానమును నిర్మాణము చేయుటకు ముందు చిరకాలము కృషి చేసిన అల్లోపతీ వైద్యవిధానమునందు అతని కెట్టి యభిప్రాయ ములు జనించెనో "Lessor writings" అను గ్రంథములో ప్రచురింపబడిన అతని లేఖయందలి ఈక్రింద వివరింపబడిన విష యములను బట్టి గమనింపనగును.

"వైద్యగ్రంథములలో వ్యక్తిపరముగా నిర్ధారణ చేయబడిన ప్రయోగముల ననుసరించి రోగులకు చికిత్సచేయు మార్గము కంటె వేరొండు మార్గములేక యిట్టి అగమ్య గోచరమున పని చేయుట మిక్కిలి విచారము కలుగజేయుచున్నది. వ్యాధి పీడి తులగు సోదరుల అగోచరమగు జబ్బుస్థితిని ఈ తెలియని మందులచే నివారణచేయ యత్నించుటకు మనసొప్పకున్నది. ఈమందుల విచిత్రగుణములు సంపూర్ణముగ తెలిసికొనబడి యుండక పోవుటచే నివిప్రయోగింపబడినప్పుడు శరీరతత్వములో

నూతనగుణములను కలుగజేయుటయే గాక దీర్ఘవ్యాధులలోనికి దింపి మరణమునకు కూడ సిద్ధము చేయగలవు. గాన ఈవిధముగ హంతకుడను లేక నాసోదరుల చిత్రవధ చేయువాడనగుచుంటిననే భావము మిగులభయోత్పాతము వేదనకల్గించుచుండ ఏవిధమగు హానియు జరిగింప నవకాశము లేకుండుటకు గాను నావివాహమైన వెంటనే ఈవైద్యమును విసర్జించియుంటిని".

హేనిమాన్ అల్లోపతీ వైద్య వృత్తిని విసర్జించిన పిమ్మట కొందరి అనుచరులతో అనేక సంవత్సరములు వ్యాధి నివారణకు నిశ్చయమైన శాస్త్రీయమగు వైద్యవిధానమును నిర్మాణముచేయుటకు కృషిసల్పి సారూప్యౌషధవిధానమును నిర్మాణము చేసి తన ప్రయత్నఫలితముల నన్నింటిని స్థిరముగ సిద్ధాంతముగావించి "ఆర్గనాన్" అను గ్రంథరూపమున 1810 వ సంవత్సరమున ప్రచురించియుండెను. దినదినము వృద్ధిగాంచిన యనుభవముతో ఈగ్రంథమునందు అనేక సవరణలను గావించి 1819, 1824, 1829, 1833 సంవత్సరములలో తిరిగి ప్రచురణగావించి కడపటి 6 వ ప్రచురణమును 1842 వ సంవత్సరములో ప్రచురించి మానవ ప్రపంచమునకు అపారమగు సేవ గావించియుండెను. ఈఆరవ ప్రచురణములో వెలువడిన ఆరనాన్ నుండి

ఈ గ్రంథము అనువదింపబడి కాపీరైటు అధికారముగల అమెరికా దేశమునందలి బోరిక్ అండు టేఫిల్ వారి అధికారము పొంది ప్రచురింపబడినది. ఈ గ్రంథమునందలి లోపములను మన్నించి ఈ నా ప్రయత్నమును ఆంధ్రలోకము ప్రోత్సహించ ప్రార్థించుచున్నాను.


ఆలమూరు గ్రామపునర్నిర్మాణ హోమియోపతీ వైద్యాలయము, ఆలమూరు: తూర్పుగోదావరి.

ఇట్లు విధేయుడు
డాక్టరు—నరసింహదేవర కామేశ్వరరావు
హెచ్. యం. డి.




# భూమిక.

మానవ సౌభాగ్యమునకు ప్రపంచమున నవతరించి మహానుభావులలో హానిమను మహాశయుడొకడు. నేటివరకు జన్మించిన వైద్యశాస్త్రజ్ఞులలో హానిమన్ అగ్రస్థానమునుపొంది యున్నాడు. హానిమనునకుపూర్వము వైద్యప్రపంచము గాఢాంధకారమున మునిగియుండెను. రోగనివారణపద్ధతులు మిక్కిలి ఘోరమైనవిగ యుండెను. రోగబాధకన్న రోగనివారణపద్ధతుల వల్ల బాధ అధికముగనుండెను. అయినను రోగవిమోచనమెన్నటికిని లేకుండెను. హానిమన్ గొప్ప వైద్యుడై యుండి అదివరకు అమలులోనున్న వైద్యశాస్త్రపద్ధతులవలన రోగులకు నిజమైన స్వస్థత చేకూరుటలేదని స్వానుభవమువలన గుర్తించి వైద్యవృత్తి కూడ విరమించుకొనెను. కాని భగవత్ప్రేరేపణచే కొంత కాలమైనపిమ్మట "వ్యాధిని త్వరితముగా, సౌమ్యముగ, శాశ్వతముగ నివారణచేయ"గల విధానమును పరిశోధించ సమకట్టి పెక్కుసంవత్సరములు మిక్కిలి శ్రమదమాదులనొంది సారూప్యౌషధ రోగనివారణ విధానమును కనిపెట్టెను. హానిమను జీవితచరిత్రను చదివినచో యీ నూతనవిధానమును పరిశోధించుటలోను సారూప్యసూత్రమును నిర్మించుటలోను ఎట్టికష్టములను బాధలును పొందినదియు, ఎట్టియాటంకములు ప్రతిఘటించవలశి

నచ్చినవియు బోధపడగలదు. యీనూతన వైద్యసిద్ధాంతము నేరముగా పరిగణించబడి ప్రభుత్వమువారి నిందారోపణలకు సమాధానము చెప్పుకొనవలసిన అవసరకూడ కలిగెను. తుదకు హానిమను మాతృదేశమునుగూడా వదలి దేశాంతరగతుడు కావలసివచ్చెను. భగవత్స్వరూపమైన సత్యమును గ్రహించి ప్రపంచమునకుబోధించు మహాత్యాగుల చరిత్రలలో ఎట్టి విషాదాంశములను చూడగల్గుదుమో హానిమన్ చరిత్రలోగూడ నట్టి దుఃఖకరమైన అధ్యాయములెన్నియో గలవు. ఎన్నియో బాధల కోర్చి, ఎన్నియో అడ్డంకులను దాటి ప్రాణములను గోల్పోవుటకైనను సిద్ధపడి దారిద్ర్యము, అవమానములను సహించి కడు ధైర్యముపొంది సాహసముతోను భగవత్సహాయముచే హానిమను సారూప్యౌషధశాస్త్రము నిర్మాణముచేసెను.

సారూప్యౌషధశాస్త్రమునకు మూలము ఆర్గనాన్. ఆర్గనన్ వైద్యప్రపంచమునకు మిక్కిలి పవిత్రగ్రంథము. భగవద్గీత, బైబిల్, ఖురాన్ మొదలుగాగల గ్రంథములవలె ఆర్గనన్ కూడ శాశ్వతమగు పవిత్రతనుగలిగివుండి ఆచంద్రార్కము విలసిల్లుచుండెను. ఆర్గనములో సారూప్యౌషధశాస్త్రమంతయు మిక్కిలి క్లిష్టమైన పదజాలముతో పూరించబడి విశేషభావగర్భితమైన శైలి రచియింపబడియున్నది. యిందుశాస్త్రవిషయములన్నియు 291 యొక్క పరిచ్ఛేదములలో వివరించబడియున్నవి. ప్రతి పరిచ్ఛేదమును ఒక్కొక్క నూతనవిషయమును తెల్పు సూత్రమై

యున్నది. ప్రతిసూత్రమునందు విశేషముగా విస్తరింపజేయబడీ గల విషయము యిమిడియున్నది. ఒక్కొక్కసూత్రమందలి భావమును విస్తరింపజేసిన ప్రతిసూత్రమునకు అనేక పుటలాక్రమించు భాషలోవ్రాయబడెను. ఆర్గనను హానిమన్ జీవితకాలమందే ఆరుముద్రణముల పొందియుండెను. ప్రతి ముద్రణమునందును హానిమను అనుభవమునుబట్టి కొన్ని మార్పులు చేయుచుండెను. ఆరవముద్రణమున, ఔషధముల పొటెన్సీలనుగురించి పూర్వపుముద్రణములలో ప్రచురించిన భావములను విశేషముగ మార్పుజేసి నూతనవిషయముల జేర్చెను. ఈతెనుగున భాషాంతరీకరణమొనర్చిన గ్రంథము హానిమనుగారి ఆరవముద్రణమునకు విలియంబోరికుగారు ఆంగ్లమున భాషాంతరీకరణమొనర్చిన గ్రంథమున కనువాదమగుటచే హానిమనుగారి సంపూర్ణభావమును కలిగియేయున్నది.

ఈపవిత్రమైన ఆర్గనన్ పాశ్చాత్య వైద్యప్రపంచమును మిక్కిలి కలవరపఱచినది, నేటికిని కలవరపరచుచున్నది. తత్కాలమున పాశ్చాత్యవైద్యప్రపంచమున నావరించియున్న వైద్యవిధాననిర్మాణమును హానిమను ఛేదించియున్నాడు. ఆర్గనన్నకు హానిమనురచించిన ఉపోద్ఘాతములో ఆకాలమున వైద్యపద్ధతుల ఘోరములను, అందలి దుష్ఫలితములను, అందలిశాస్త్రవిరుద్ధమును మిక్కిలి గంభీరముగతర్కించి, అల్లోపతివైద్యవిధానము అశాస్త్రీయమని సహేతుకమైనది కాదని, అపాయకరమని నిరూపించబడియున్నది. అశాస్త్రీయమైన, అజ్ఞానభూయిష్టమైన

అంధకారబంధురమైన అల్లోపతి (వైరూప్యౌషధ) సిద్ధాంతములు విచ్ఛేదము చేయబడినపిమ్మట సహేతుకరమైన, శాస్త్రసమ్మతమైన, సకలశాస్త్రవిజ్ఞాన భూయిష్ఠమైన, మానవసౌభాగ్యకరమైన నూతనవిధానము నిర్మించబడినది. ఆర్గనను గ్రంథములో హానిమనురచించిన ఉపోద్ఘాతము, అల్లోపతి విచ్ఛేద పరిచ్ఛేదము, అని చెప్పవచ్చును. ఈభాగమున హానిమను అల్లోపతివిధానమును మిక్కిలి గాఢమగుభాష నుపయోగించి విమర్శించెను. ఈభాగమును చదివిన అల్లోపతివైద్యులు యిప్పటికిని విభ్రాంతిచెందుచున్నారు. హానిమనుతరమును షోతు వాదనయు స్తుతి పెట్టునవై గొడ్డలినరుకువలె, కత్తిపోటువలె, గుండుదెబ్బవలె ఎట్టిధీర వైద్యునైనను తృటిలో పడగొట్టును. ఉపోద్ఘాతానంతరము హానిమను సారూప్యౌషధ సూత్రమును శాస్త్రానుగుణ్యముగ బలమైన తర్కశాస్త్ర సూత్రముల నాధారముచేసికొని నిర్మాణముచేసెను. అల్లోపతివిధానము శాస్త్రసమ్మతమైనదికాదు! ఎందుకొరకు ఉద్దేశించబడెనో అట్టి ఉద్దేశ్యమును నెరవేర్చలేకపోవుచున్నది గాన వర్జనీయము. అట్లయిన రోగప్రపంచమునకు పరమావధి యేది. ఇట్టిపరమావధి యెట్టి లక్షణములు కల్గియుండవలెను? ఎట్టి పరీక్షకు నిలువవలెను? ఈ విషయమును గ్రహించుటకుముందు ఆరోగ్యమనగానేమి? అట్టి పరిస్థితిని కలిగించునదేది? రోగియందు మార్పుచెందవలసినదేది? మందులయందు అట్టిమార్పులను కలుగజేయునదేది? రోగికి స్వస్థత చేకూరుటయెట్లు? రోగనివారణ వైద్యవిధానమెట్టిదిగా

యుండవలెనో, ఈవిషయములన్నియు హానిమను తర్కించెను. ఏ వైద్యవిధానముగాని రోగికి "త్వరితముగను, సౌమ్యముగను శాశ్వతముగను" స్వస్థత చేకూర్చగల్గినదో మాత్రముననే సరియైన వైద్యవిధానము. అట్టిస్వస్థత కలిగించగల్గినవాడే వైద్యుడు ఆవిధముగా రోగికి ఆరోగ్యము కలిగించుటే వైద్యునకు ఆశయముగానుండవలెను. ఇట్టిలక్షణములలో నొక్కటైన అల్లోపతివిధానమున గన్పట్టునా? ఆరోగ్యము అనారోగ్యము వీటి విభేదములు మందులు మందుగుణములు రోగనివారణమార్గములు అన్నియు తర్కించి సహేతుకముగాతర్కించి, తర్కించి, అందలిఫలితముల పరిశోధించి వాటినుండి సాంప్రదాయముల నిర్మించి వాటిని మరల పరీక్షించి పిమ్మట ఈసిద్ధాంతములను ప్రచురించెను. ఈవిధానమంతయు ఆర్గనను ప్రథమభాగమనదగిన మొదటి డెబ్బది సూత్రములలో వివరింపబడెను. డెబ్బదవ సూత్రమున మొదటి అరువదితొమ్మిది సూత్రములలోను వివరించబడిన సాంప్రదాయముల సారాంశము వ్రాయబడివున్నది. డెబ్బదియొకటవ సూత్రమునుండి ఆర్గనను రెండవభాగముగ పరిగణించవలెను. ఈసూత్రమున రెండవభాగమందు వివరించు విషయములన్నియు సూచించబడినవి. రోగనివారణకొరకు గుర్తించవలసినదేమి? రోగనివారణ సాధనముల (మందులు) శక్తులనెట్లు తెలిసికొనవలెను? రోగనివారణలో యీమందుల నెట్లుపయోగించవలెను. ఈమూడువిషయముల గురించియు హానిమన్ విపులముగ వివరించెను. రోగములు, దీర్ఘరోగములు

కరణరోగములు, అల్లోపతి. మొదలగు వైరూప్యౌషధముల వలన కలుగు రోగములు దురలవాటులవల్ల కలుగు రోగములు వాతావరణాది దోషజనిత రోగములు, జన్మరోగములు, సోరా, సిఫిలిస్, సైకోసిస్ తత్వవిజృంభణములు మొదలగు రోగములు డెబ్బదియొకటినుండి తొంబదిరెండు వరకు సూత్రములలో నిమిడియున్నవి. ఏనామకరణమైననుసరే రోగమనగా రోగిబాధలు, రోగియందు పంచేంద్రియములచే గుర్తించబడు మార్పులు వీటి సముదాయ దృశ్యము, యివియే రోగియందు నివారణచేయబడ వలసినవి. యిట్టిబాధలను గలుగజేసి యిట్టి మార్పులను కలిగించి వీటి సముదాయ దృశ్యమును సృష్టించ గల శక్తియే మందులయందుగల రోగనివారణశక్తి. మొదటిది రోగులను పరీక్షించి తెలుసుకొనవలెను. రోగిని పరీక్షించు విధానము ఆర్గనను 83 మొదలు 104 వరకు సూత్రములలో వివరించబడినది. రోగియందు వ్యక్తీకరింపబడియున్న రోగదృశ్యమును గ్రహించవలెను. ఇదియే రోగనిదానము లేక రోగి నిదానము. ఈభాగములోనే హోమోపతీశాస్త్ర విశేషమంతయు కలదు. హోమోపతీ రోగనిదానమునకును అల్లోపతీ రోగ నిదానమునకును విశేషతారతమ్యము గలదు. హోమోపతీ రోగులకారోగ్యముకలిగించును అల్లోపతీ రోగబాధలను తశ్శాంతిజేయును. అల్లోపతీ రోగనిదానములో యంత్రతంత్ర సాధనములచే రోగఫలితములను గుర్తించి అందు ననుసరించి చికిత్సచేసెదరు. హోమోపతీ రోగనిదానములో ఆరోగ్యమైన

మనుష్యునియందుండ వలసిన మానసిక, శారీరక పరిస్థితులకు రోగపీడితునియందు వ్యతిరేకముగానుండు, విరుద్ధముగానుండు లక్షణసముదాయ దృశ్యమును గుర్తించుట ముఖ్యకర్తవ్యము. రోగియందు నివారణకావలసినవి సాధారణ రోగలక్షణములు కావు. రోగియందు రోగచిహ్నముగ గోచరించు అసాధారణ విచిత్రలక్షణములు రోగియందు నివారణకావలసిన లక్షణసముదాయ దృశ్యమును గుర్తించినవో హోమోపతీవైద్యుడు చాలవరకు రోగమును జయించినట్లే యెంచవలెను. అట్లుగుర్తించలేనివాడు హోమోపతీవైద్యుడు కానేరడు. విచిత్రరోగ లక్షణ రూపమును గుర్తించినగాని సారూప్యౌషధమును నెట్లు గ్రహించగలడు? సారూప్యౌషధ ప్రయోగముసగాని, రోగ నివారణ మార్గము వేరొండులేదని హానిమను ఘంటాపదముగ రుజువుచేసెను. గనుక యీభాగము మిక్కిలి జాగ్రత్తగ గమనించవలసి వున్నది. ఆర్గనను 105 మొదలు 145 సూత్రములాలములలో ఔషధలక్షణముల గుర్తించు విధానము ఔషధముల యందుగల శక్తిరూపములు ఔషధములందుగల రోగిరూపములు గ్రహించుమార్గములు విస్తరించబడి యున్నవి. ఔషధ లక్షణముల గ్రహించుటకు ఔషధములను మానవులపై ప్రయోగించి ఫలితముల గమనించవలెను. ఆరోగ్యవంతులగు మానవులపై ప్రయోగించుటవలన గుర్తించబడిన లక్షణములే ఔషధ లక్షణములుగా పరిగణించవలెను గాని జంతువులపై ప్రయోగించుటవలన గోచరించు లక్షణములు ఔషధలక్షణములుగ

గుర్తించకూడదు జంతురోగ నివారణవిధానములో నట్టిలక్షణ ములగుర్తించవచ్చునుగాని మనుష్యరోగనివారణవిధానములో సారూప్యౌషధనిర్ణయమునకు, మనుష్యులపై రుజువుచేయబడిన ఔషధములే అవుసరముకాని జంతువులపై రుజువుచేయబడిన మందులు పనికిరావు. జంతువులకును మానవులకును సహస్రవిషయముల విభేదముకలదు. ఈసాంప్రదాయములన్నియు పై సూత్రములలోవివరింపబడియున్నవి. మరియు ఔషధములరుజువుచేయువిధానమంతయుగూడ చెప్పబడియున్నది. అర్గనను 145 మొదలు 248 వరకు సూత్రములలో సారూప్యసూత్రప్రయోగ విధానము వివరింపబడినది. రోగోద్రేకములు. ఉపశమనములు, వివిధరోగములలో సారూప్యవైద్యవిధానము, కుదరనిరోగములు తక్శాంతి మొదలగు అనేక వైద్య విషయములీ సూత్రములలో నిరూపించబడినది. 269 మొదలు 285 వరకు సూత్రములలో ఔషధ పరిమాణమును, ఔషధప్రయోగ విధానమును వివరించబడియున్నవి. చివర సూత్రములలో ఆహార, పత్య పానీయ విషయములు ఉపవిధులుగూడ సూచించబడినవి

ఈవిధముగా రోగనివారణ విధానమున కవసరమైన జ్ఞానమంతయు అర్గనములోకలదు. రోగనిరోధమున కవసరమగు ఆరోగ్యసూత్రములు సహితమిందుగలవు. ఆరోగ్యము, అనారోగ్యము, వీటి కారణములు, రోగనివారణ పద్ధతులు, సాధనములు, మందులు తయారుచేయు విధము, మందుల పరిమాణములు, ప్రయోగవిధానములు, పత్యపానీయాది విషయములు

ఉపచికిత్సా విధములు మొదలగు వైద్యశాస్త్ర విషయము లన్నియు మిక్కిలి సారవంతమైన భావములలో నిమిడి అర్గనను లోకలవు. అనేకములైన విషయములు విశేషభావగర్భితమైన పదజాలములో నిరుకుకొని క్లుప్తమైన సూత్రములలో దాగి యుండుటచే చదువరులు మిక్కిలి సూక్ష్మబుద్ధి నుపయోగించి చదివినగాని అర్గనను సూత్రములలోని భావమును గ్రహించుట సాధ్యముకాదు. ప్రతిసూత్రమును పదిసారులైనను జాగ్రత్తగా పఠించి ప్రతిపదముయొక్క భావమునుగూర్చి యోచించవలెను

పై విధముగా చదివినచో అర్గనములో అమూల్యమైన సంగతులు గోచరించును. కేవలము వైద్యవిషయములేగాక సకలశాస్త్రజ్ఞానమును, నైతికశాస్త్రము, వేదాంతసారము, రసాయనిక పదార్థవిజ్ఞాన, భౌతిక, జంతు, వృక్షశాస్త్రముల సారము అంతయు అర్గనములో కేంద్రీకరించబడినది. విశ్వమంతయు నాదిభౌతిక, నిర్వికార, నిరంజన స్వయంభువ శక్తితో నిండి యున్నది. ఇదియే పరమాత్మ స్వరూపము. ఈమహాశక్తి జీవరాసులయందు, జంతువృక్షఖనిజములందు చైతన్యమును కలిగించుచున్నది. మనుష్యుని ఆరోగ్యస్థితికిని ప్రపంచవాతావరణాది సక్రమస్థితికిన్ని ఇదియేకారణభూతము. మానవుని అనారోగ్యస్థితికిన్ని, పంచభూతముల క్రమవిరుద్ధములకును, రోగములకు, వర్షపాతములకు, భూకంపములకు, సమస్తమార్పులకును యిదియే కారణము. ఈమహాచైతన్యశక్తియే మనులోని, డినోబోగార్గ యందును, హిట్లరు, గాంధి, నెహ్రూలయందును

రవీంద్రుడు, అరవిందుడు, రమణమహర్షి, హరినాథులయం దును, చక్రవర్తి మొదలు కూలివానియందును వివిధవిధము ప్రసరించుచున్నది. అధికారకాంక్ష, ధనాశయము, వ్యభిచారము గర్వము, త్యాగము, భూతదయ, సోదరభావము, సన్మార్గ ములు, దుర్మార్గములు, రోగములు, యుద్ధములు, పంచభూత ప్రళయములను చైతన్యశక్తి యొక్క విపరీత పరిస్థితులు. ఇవ న్నియు చైతన్యశక్తి యొక్క అక్రమస్థితివలన కలుగుచున్నవి. నేరస్తులందరును రోగులే. ఈభావము మన భగవద్గీతయందు విస్తరించబడియున్నది. హోమోపతీ శాస్త్రమందు చైతన్యశక్తి యొక్క విపరీతపరిస్థితుల చిహ్నములగు విపరీతమానసిక లక్షణ ముల నివారణచేయు మార్గములు గలవు.

మరియు నాది భౌతికమైన స్థూల పదార్థముచే గప్పబడి యున్న అధ్యాత్మికశక్తి స్థూలపదార్థ సూక్ష్మవిభాగముల చే విముక్తిచెందుటవల్లనే విజృంభించగలదు. పొటెన్సీ సిద్ధాం త మంతయు స్థూలసూక్ష్మ ప్రపంచములకు గల సంబంధమును నిరూపించుచున్నది.

ఆర్గనములో ఇంకను ఎన్నియో విశేషాంశములుగలవు. ఇట్టి విశేషములను సవిస్తరముగా తెలియ పరచవలసిన-చో ప్రత్యేక గ్రంథమొకటి వ్రాయవలసివచ్చును.

హానిమను యీనూతన శాస్త్రవిషయములను ఆర్గనను దీర్ఘరోగములు, వస్తుగుణదీపిక అను మూడు గ్రంథములలో

సంపూర్ణముగా విశదపరచెను. ఈగ్రంథ త్రయమును ప్రతి హోమియోపతీ వైద్యుడును పఠించవలసియున్నది. ప్రపంచము లోని అన్ని వైద్యసాంప్రదాయములును క్షణక్షణమును మారి పోవును. హోమియోపతీ సిద్ధాంతములు మాత్రము శాశ్వతముగ నిలిచియున్నవి. మరియు నట్లే నిశ్చలముగ నుండును.

ఆంధ్రభాషలో ఆర్గనను వెలువడుటకిదియే ప్రథమము ఈగ్రంథము ప్రచురణవల్ల గ్రంథకర్త ఆంధ్రహోమియోపతీ ప్రపంచమునకు చేసిన మహోపకారము మిక్కిలి వర్ణనాతీతము ఆంధ్రమున ఆర్గనను లేక పోవుటచే హోమియోపతీశాస్త్రమునకు ఆంధ్రమున పునాదిలేదు. ఇట్టి కొరత గ్రంథకర్త తీర్చి ఆంధ్రుల మన్ననలకుపాత్రుడయ్యెను. ఆంధ్రభాషలో ఆర్గనను భాషాంతరీ కరణ మొనర్చుట సులభమైన పనిగాదు. ఉభయభాషా ప్రావీణ్యత ఎంతయున్నను శాస్త్రవిషయములతోగూడినగ్రంథ ములలోని భావములను అన్యభాషలలోనికి మార్చుట మిక్కిలి కష్టతరమైనపని. అయినను గ్రంథకర్త మిక్కిలి శ్రమపడి విలియంబోరిక్‌గారి ఆంగ్లానువాదమునకు, సాధ్యమైనంతవరకు సరియైనభావమునకు భంగము లేకుండగ ఆంధ్రానువాదము చేసి యున్నారు. వీరిని ఆంధ్ర హోమియోపతీ సంఘమువారి తరఫున మేమెంతయు అభినందించుచున్నాము.

ఈగ్రంథరచన యొక్కటిమాత్రమేగాక ఇంకను పెక్కు హోమియోపతీగ్రంథములను ఆంధ్రమున రచయించ నుద్యమించి

నట్లు తెలియవచ్చుచున్నది. ఇట్టి ఉద్యమమందు పరమేశ్వ
వీరికి సహాయభూతుడగునని విశ్వసించుచున్నాము. కేవ
గ్రంథరచనమాత్రమేగాక, అలమూరు గ్రామపునర్ని
కేంద్రముతరఫున వీరు హోమోపతీవైద్యాలయమును స్థా
వేలకొలది రోగపీడితులను ఆరోగ్యవంతులుగ జేయుచున
గ్రంథకర్త మామిత్రులును, మాసంఘసభ్యులునుకూడ నగ
యింతకన్న విశేషముగా వీరినిగురించి ప్రస్తాపించుట, ఆత్మ
వంటిదని పొరపడుటవకాశమిచ్చును గాన యింతటితో
మించుచున్నాము.

కాకినాడ.
24—5—37.

పొన్నాడ వెంకటరావు, బి. ఏ
డాక్టరు లంక రామారావు.
ఆంధ్రహోమోపతీ సంఘ కార్యదర్శు



5. పేరా— వ్యాధిమూలకారణములను, ఉద్రేకకారణములను, యితర పరిస్థితులను, నివారణకు సహాయభూతములుగ గుర్తించవలెను.

6. వైద్యుడు వ్యాధిలక్షణ సముదాయమునే వ్యాధియని భావించవలెను.

నోటు:— వ్యాధియొక్క ప్రధాన స్వభావమును కనుగొనుటకు ప్రాచీనవిధాన వైద్యులుగావించు వ్యర్థప్రయత్నములు.

7. ఆయిదవపేరాలో తెల్పబడినపరిస్థితులయందులక్ష్యముంచి వైద్యుడు వ్యాధిని నివారణ జేయుటకు వ్యాధిలక్షణ సముదాయమును మాత్రమే తొలగించిన జాలును.

నోటు:— 1. ప్రత్యక్షముగ వ్యాధిని జనింపజేయు కారణమును వ్యాధిని నిలిపియుంచు కారణమును తొలగింప వలయును.

2. ఒక్క ప్రత్యేక లక్షణమునే నిర్దేశించి గావించు ఉపశమనకర చికిత్సాపద్ధతిని విసర్జింపవలెను.

8. వ్యాధియొక్క సమస్తలక్షణములను నిర్మూలముజేసిన అంతరంగమునందలి వ్యాధికూడ నిర్మూలమగును.

నోటు:— ఈవిషయము అవివేకముగ ప్రాచీనవిధాన వైద్యులచే అధిక్షేపింపబడి యుండెను.

9. ఆరోగ్యస్థితియందు ఆధ్యాత్మికశక్తి (జీవశక్తి) శరీరమునకు చైతన్యమొసగి సామరస్యమున నుంచును.

10. చైతన్యము కలుగజేయు జీవశక్తి లేని శరీరము మృత కళేబరము.

11. వ్యాధియందు జీవశక్తిమాత్రమే ప్రథమమున వ్యాధిగ్రస్తమై తనబాధలను (అంతరంగమార్పు) శరీరముయొక్క విపరీత యింద్రియజ్ఞాన కార్యాచరణ ధర్మములమూలమున వెల్లడిజేయును

చైతన్యశక్తి (Dynamis) అనుపదముయొక్క భావార్థము.

12. నోటు:— వ్యాధిని నివారణముచేయుటమూలమున వ్యాధిలక్షణసముదాయమదృశ్యమగుటచే జీవశక్తియొక్కవ్యాధి అనగా అంతరంగ బహిరంగవ్యాధి సమస్తము తొలగింపబడుచున్నది.

నోటు:— జీవశక్తి వ్యాధిలక్షణముల నెట్లు జనింపజేయుచున్నదో వ్యాధినివారణజేయుటకు తెలిసికొనుట అనవసరము.

13. శస్త్రచికిత్ససంబంధమయిన వ్యాధులుగాక యితర వ్యాధులను మానవనిర్మాణమున నివసించు నొకస్పష్టమైన విచిత్రవస్తువుగ పరిగణించుట అసంగతము. ఇట్లుపరిగణించుట మూలముననే ప్రాచీనవైద్యవిధానము మిక్కిలి హానికరమైయున్నది.

14. నివారణజేయదగిన వ్యాధిస్వభావముగల ప్రతివిషయము వ్యాధిలక్షణములమూలమున వైద్యునకెరుకపరచును.

15. వ్యాధిగ్రస్తమైన జీవశక్తియొక్క వ్యాధియు, అందుపై జనించిన వ్యాధిలక్షణములు విభాగింపబడని ఏకరూపము. ఇవి రెండు ఒకటేగాని వేరువేరుగాదు.

16. వ్యాధికర ఆధ్యాత్మిక ప్రాబల్యమున మాత్రమే మననిరాకార జీవశక్తి వ్యాధిగ్రస్తముకాగలదు. ఈవిధముగనే ఔషధముయొక్క ఆధ్యాత్మిక కృత్యము మూలముననే తిర్గి ఆరోగ్యము చేకూర్చబడును.

17. వైద్యుడు వ్యాధిచిహ్నములయొక్క సముదాయమును తొలగింపవలసియుండును. అందుమూలమున వ్యాధినంతయు పూర్తిగా తొలగించగలుగును.

నోటు:—నిదర్శనలతోకూడిన ఉదాహరణము.

18. వ్యాధిలక్షణసముదాయమే ఔషధనిర్ణయమునకు ప్రధానచిహ్నము. మరియు ప్రధానమార్గదర్శి.

19. — మానవుని ఆరోగ్యమున మార్పులుగలుగ జేయగల శక్తి లేని ఔషధములు వ్యాధులయందలి ఆరోగ్యపరిస్థితులయొక్క మార్పులను (వ్యాధిలక్షణములను) నివారణజేయజాలవు.

20. ఆరోగ్యపరిస్థితిని మార్పుజేయు ఔషధములయొక్క శక్తిని ఆరోగ్యమైన వ్యక్తులయందు అవి కలుగజేయు గుణముల మూలమున మాత్రమే తెలిసికొనవచ్చును.

21. ఆరోగ్యమైన వ్యక్తులయందు ఔషధములు జనింపజేయు వ్యాధిలక్షణములనుండి మాత్రమే వానియొక్క వ్యాధి నివారణ శక్తిని మనము తెలిసికొనగలము.

22. వ్యాధిలక్షణములకు సారూప్యమగు లక్షణములుగల ఔషధములచే వ్యాధి నిశ్చయముగ, శాశ్వతముగ నివారణచేయబడ గలదని యనుభవము జూపుచున్న పక్షమున సారూప్యలక్షణముల గల ఔషధములనే నిర్ణయముగా నెంచవలెను. వ్యాధికి ప్రతికూలమైన ఔషధలక్షణముల మూలముననే వ్యాధి మిక్కిలి నిశ్చయముగ శాశ్వతముగ నివారణయగునట్లుగుపడిన ప్రతికూల లక్షణముల గల ఔషధమునే చేపట్టవలయును.

నోటు: — శరీరమునందు విభేదమైన పద్ధతిలో పనిచేయు వ్యాధిలక్షణమునకు సంబంధములేని లక్షణములుగల ఔషధముల ప్రయోగము వైరూప్యౌషధ పద్ధతిని (అలోపతీపద్ధతి) నిరూపణజేయును. దీనిని విసర్జింపవలెను.

23. ప్రతిపక్షమైన ఔషధలక్షణములుగల ఔషధములను ప్రయోగించుట మూలమున (వైరూప్యౌషధ చికిత్సాపద్ధతి) కడవక బాధించు వ్యాధిలక్షణములు నివారణయగుటలేదు.

24-25. తక్కిన మరియొక చికిత్సాపద్ధతి సారూప్యౌషధ చికిత్సాపద్ధతి. వ్యాధికి సారూప్యమగు లక్షణములుగల ఔషధములమూ

మున గాంచు చికిత్సలన్నిటికన్నా రోగమే ఎల్లప్పుడు ప్రయోజన కరమగు చికిత్సయని యనుభవము జూపుచుండెను.

26. శ్లో:— "సజీవమానవశరీరమునందలి బలహీనమైన చైతన్యకర వ్యాధి ఆవ్యాధికిమిక్కిలి సారూప్యమై బలతరమై జాతియందుమాత్రము విభేదమై మరియొకదానిచే, శాశ్వతముగ నిర్మూలంచేయబడును" యను ప్రకృతియొక్క స్వతంత్రచికిత్సాసూత్రముపైనిది ఆధార పడియున్నది.

నోటు:— ఇది ధాతికవ్యాధులకు, మానసికవ్యాధులకు గూడ వర్తించును.

27. గాన ఔషధములయొక్క నివారణాశక్తి వ్యాధిలక్షణము లకు సారూప్యముగ వానికిగల లక్షణములపై ఆధారపడియుండును.

28-29. ప్రకృతియొక్క చికిత్సా సూత్రములను వివరించు ప్రయత్నము.

30-33. మానవశరీరము ప్రకృతిసిద్ధముగ జనించిన వ్యాధులమూల మునకంటె ఔషధశక్తులమూలమున విశేషముగ వ్యాధిగ్రస్త మగును.

34-35. దీర్ఘకాలమునుండిగల వ్యాధుల చికిత్సలో సారూప్యౌష ధేతర చికిత్సయొక్క అనుపయోగమునుబట్టి, సారూప్యౌషధ చికిత్సాసూత్రముయొక్క క్రమమైన సత్యము జూపబడుచున్నది. మరియు నిందు సహజమైన రెండువ్యాధులు శరీరమునకలసి ఒకదానికొకటి విభేదమైయున్న పక్షమున ఒకదానినొకటి తొల గించుటగాని, నివారణచేయుటగాని జరిగింపజాలవని గూడ చూపబడియున్నది.

36. I శరీరమునందుగల ప్రాచీనవ్యాధి నూతనముగ జనించిన వ్యాధికంటె అధికమైనబలముగాని లేక సమానమైన బలముగాని

కలిగియున్న పక్షమున ప్రాచీనవ్యాధి విభేదమైన నూతనవ్యాధిని
తొలగించివేయును.

37. పేరా— ఇట్లు సౌమ్యమైన సాదృశ్యేతర చికిత్సయందు దీర్ఘ
వ్యాధులు యథాస్థితియందేయుండును.

38. II లేక ఇంతకుపూర్వమే వ్యాధిగ్రస్తమైయున్న ఒక వ్యక్తికి
సంభవించు బలతరమైన నూతనవ్యాధి ఆవ్యాధి యున్నంతకాలము
తనకు విభేదమైయున్న వెనుకటివ్యాధిని శరీరమున అణచిపెట్టి
యుంచును గాని ఎప్పుడును తొలగించదు.

39. ఈవిధముగనే శరీరమునందుగల వ్యాధికి సారూప్యముగు
లేలక్షణములను ఉద్దేశించజాలని అల్లోపతీ ఔషధములచే
గావించు తీవ్రమైనచికిత్స దీర్ఘవ్యాధులను నివారణజేయక శక్తి
వంతమైన యీ ఔషధములయొక్క గుణముండునంతకాలము
మాత్రము అణచిపెట్టియుంచును. ఈ ఔషధగుణము తగ్గినపిమ్మట
నీదీర్ఘవ్యాధి పూర్వముకంటె దుస్థితిలో బయల్పడగలదు.

40. III లేక యీ క్రొత్తవ్యాధి చాలకాలము శరీరమునపనిచేసి
తనకు విభేదమైయున్న వెనుకటివ్యాధితో కలియుటచే అందుపై
ద్వంద్వవ్యాధి (క్లిష్టమైన వ్యాధి) బయలుదేరును. విభేదమైన
యీరెండువ్యాధులు నొకదాని నొకటి తొలగించజాలవు.

41. ప్రకృతిసిద్ధముగ ఒకశరీరమునందు విభేదమైన రెండు
వ్యాధులు కలయుట, తరచుగ సంభవించునప్పటికి నిట్టిసందర్భ
ములో తీవ్రమైన అననుకూలమగు (అల్లోపతీ) ఔషధములను
సాధారణముగా దీర్ఘకాలము ప్రయోగించుట మూలమున
ఔషధజనిత వ్యాధి మిక్కిలి. తరుచుగ సంభవించి సహజముగ
జనించిన విభేదమగు పాతవ్యాధితోగలిసి అందుపై రోగిని
ద్విగుణీకృతముగ వ్యాధిగ్రస్తముగావించును.

42. శ్లో:- ఇట్లొకదానితో నొకటి క్లిష్టముగ నేర్పడిన వ్యాధులు ఒక దానికొకటి విభేదమై యుండుటచే శరీరమున దేనికి అనుకూలమైన స్థానమును అది ఆక్రమించుకొనును

43-44 గాని, శరీరమున అంతకుపూర్వముగల వ్యాధితో సారూప్యమగు బలతరమగువ్యాధి కలసినసందర్భము వేరువిధముగనుండును ఇట్టిపరిస్థితియందు బలతరమైన క్రొత్తవ్యాధి పాతవ్యాధిని తొలగించి నివారణజేయును.

45. ఈవిషయమునుగూర్చి సమాధానము.

46. సారూప్యమగు బలతరమైన మరియొకవ్యాధి సంభవించుట మూలమున అప్రయత్నముగ దీర్ఘవ్యాధులు నివారణమైన దృష్టాంతరములు.

47-49 ప్రకృతిస్థితియందు వ్యాధులుకలసి సంభవించిన పరిస్థితుల యందు సారూప్యలక్షణములుగల వ్యాధిమాత్రమే వేరొకవ్యాధిని తొలగించి నివారణజేయును. వైరూప్యలక్షణములుగల వ్యాధి ఎన్నడును నిట్లుగావింపజాలదు. ఎట్టి ఔషధములచే వ్యాధి రూఢిగ నివారణయగునో యీవిషయము వైద్యునకుబోధచేయ గలదు. అనగా సారూప్యౌషధములచేతనే వ్యాధినివారణ యగు నని యీవిషయమును బోధించగలదు.

50. వ్యాధుల నివారణ నిమిత్తము ప్రకృతి సారూప్యముగ స్వస్థత చేకూర్చుగలుగుకొలది వ్యాధులనుమాత్రమే గలిగియుండెను ఈనివారణా ప్రతినిధులైనను, అనేకములైన యిబ్బందులతో అనుసరించియుండెను.

51. అందుకుమారుగ వైద్యునకు యింతకంటె అత్యధిక ఉప యోగకరములగు అసంఖ్యాకములైన నివారణాప్రతినిధులుగలవు.



52. పేరా— ప్రధానమైన చికిత్సలు రెండుగలవు. ఒకటి సారూప్యౌషధ పద్ధతి. (హోమియోపతి). రెండవది వైరూప్యౌషధ పద్ధతి. (అల్లోపతి). ఒకదానికొకటి సరియైన ప్రతిపక్షము. మరియు నీరెండును ఒకదానినొకటి సమీపింపజాలవు. మరియు కలియ జాలవు.

53. సారూప్యౌషధ చికిత్సాసూత్రము అమోఘమైన ప్రకృతి సూత్రమునుబట్టి ఆధారపడియున్నది. గాన నిదొక్కటే అత్యుత్తమైన చికిత్సాపద్ధతిగ రుజువుచేయబడు చున్నది.

54. శాస్త్రీయవిధానములని పేరుపెట్టుకొని పలువిధములైన విభేదములగు అనేక విధానములొకదానినొకటి అనుసరించి ఏర్పడిన పర్యవసానముగ వైరూప్యౌషధవిధానము బయటికు వచ్చెను. ఈవిధానము వ్యాధులయందొక వ్యాధికరపదార్థము గలదని గుర్తించి ఊహలమీదను, మిశ్రమౌషధములమీదను ఆధారపడు వస్తుగుణదీపికను నిర్మాణము జేసియుండెను.

55.-56. అల్లోపతీవైద్యుల హానికరమైన చికిత్సావిధానమునందు ఉపశమనకర చికిత్సతప్ప వేరొండులేదు. ఇట్టిచికిత్సయింకను రోగుల విశ్వాసము నిలుపుకొని యుండవచ్చును.

నోటు:—ఐసోపతీ.

57. వైరూప్యౌషధ లేక ఉపశమనకర చికిత్సావిధానమునందు వ్యాధియొక్క ఒక్కలక్షణమునందు మాత్రమే లక్ష్యముంచబడి వ్యతిరేకగుణముగల ఔషధములతో చికిత్స జేయబడును. ఉదాహరణలు.

58. ఈ వైరూప్యౌషధ చికిత్సావిధానము లోపభూయిష్టమై యుండుటకు కారణము కేవలము నీవిధానమున చికిత్స. వ్యాధియొక్క ఒక్క లక్షణమునందే లక్ష్యముంచి చికిత్స చేయుటను

బట్టికాదు. పట్టివిడువక బాధించు వ్యాధులలో నీచికిత్సయందు తాత్కాలికముగ స్వల్పకాలము ప్రత్యక్షముగ కానుపడు ఉపశాంతి కలిగి పిమ్మట యదార్థమైన ఉద్రేకము సంభవించుటకూడ వేరొక కారణము.

నోటు:—ఈవిషయమునందలి సత్యమునుగూర్చి గ్రంథకర్తలొసగిన ప్రామాణ్యములు.

59. కొన్నివైరూప్యచికిత్సాపద్ధతులు, అందలిహానికరగుణములు

60. ఔషధము ప్రయోగించునప్పుడెల్ల ఉపశమనకరౌషధము యొక్క మోతాదును వృద్ధిచేయుటమూలమున దీర్ఘవ్యాధి ఎన్నడును నివారణ జేయబడదు. మరియు నింకను నెక్కుడు హాని కలుగజేయును.

61. గాన యీకారణమునుబట్టి ఈపద్ధతికి వ్యతిరేకమైనదియు, చికిత్సావిధానములలోనెల్ల నుత్తమమైనదియు యగు హోమియోపతీ విధానమును తెలిసికొనుటలోగల ఉపయోగమును ఊహింపవలసియున్నది.

62. ఉపశమనకరచికిత్స హానికరస్వభావము గలిగియుండుటకును, సారూప్యౌషధ ప్రయోగము మిక్కిలి ప్రధానముగ ఉపయోగకరమై యుండుటకునుగల కారణము.

63. ఇది ప్రతిఔషధముయొక్క ప్రాబల్యముక్రింద సంభవించు ప్రథమగుణమునకు పిమ్మట సజీవశరీరనిర్మాణముచే (జీవశక్తి) కలుగజేయబడు ద్వితీయగుణమునకుగల వ్యత్యాసముపై ఆధారపడియుండును.

64. ప్రథమ ద్వితీయగుణములయొక్క వివరము.

65. ఈరెండింటియొక్క ఉదాహరణలు.

1 L . 31

66. చికిత్సయందు ప్రయోగించు సారూప్యౌషధముయొక్క సూక్ష్మమైన మోతాదులనుండి కలుగు జీవశక్తియొక్క ద్వితీయ గుణము; ఈఔషధము ఆరోగ్యము చేకూర్చుటకు ఎంతప్రతీకార మవసరమో అంతమాత్రమే జూపించును.

67. ఈసిద్ధాంతములు హోమోపతీ చికిత్సయొక్క అనుకూల స్వభావమును, వైరూప్య (ఉపశమన) విధానముయొక్క కుటిల స్వభావమును బోధించును.

నోటు:—వైరూప్యౌషధ ప్రయోగము మాత్రమే గావింప అంగీకరింపదగు వ్యాధులు.

68. ఈసిద్ధాంతములనుబట్టి హోమోపతీ విధానముయొక్క ప్రయోజనమెట్లు రుజువు చేయబడినది?

69. ఈసిద్ధాంతములనుబట్టి వైరూప్య చికిత్సాపద్ధతియొక్క హానికరమెట్లు రుజువుచేయబడుచున్నది?

నోటు:—సజీవమానవ శరీరమున ప్రతిపక్ష భావనలు ఒండొంటిని ప్రతిహతము గావింపవు. గాన యీప్రతిపక్ష భావనలు రసాయన శాస్త్రమునందలి ప్రతిపక్షవస్తువులవంటివిగావు

నోటు:—నిపర్యనపూర్వక ఉదాహరణలు.

70. సారూప్యౌషధ విధానముయొక్క సంగ్రహము.

71. నివారణ జేయుటకవసరమగు మూడుసూత్రములు.

1. వ్యాధిపరిశీలన 2. ఔషధగుణముల పరిశీలన 3. ఔషధముల అనుకూల ప్రయోగము.

72. వ్యాధులగూర్చి సర్వసామాన్యావలోకనము.

తరుణవ్యాధులు, దీర్ఘవ్యాధులు.

73. ప్రత్యేకవ్యక్తుల నావహించు తరుణవ్యాధులు క్వాచిత్క

ములకు (Sporadic Diseases) సమకాలికములకు (Epidemics) సంబంధించిన తరుణవ్యాధి తత్వములు.

74. అల్లోపతివైద్యుల అకృత్యములచే జనింపజేయబడిన దీర్ఘ వ్యాధులు, మిక్కిలి దుష్టతరగతివ్యాధులు; మిక్కిలి బలహీనము గావించు బ్రౌసియా (Brousseau) అల్లోపతీ చికిత్సా పద్ధతి.

75. ఇట్టిచికిత్సాపద్ధతులమూలమున మానవశరీరమున నాశింప బడు వ్యాఘాతములు, నివారణకు అసాధ్యములు.

76. జీవశక్తి యింకను తగినంతశక్తివంతమై యున్నప్పుడు మాత్రమే నైరూప్యాపహ చికిత్సమూలమున కలిగింపబడినవానిని దీర్ఘకాలము చికిత్సజేసినపిమ్మట సహజముగ జనించినవ్యాధి సారూప్యవిధానమున నిర్మూలము చేయబడినప్పుడు మాత్రమే చక్కబరుప వచ్చును.

77. అయుక్తముగ దీర్ఘవ్యాధులని నామకరణము గావింపబడిన వ్యాధులు.

78. క్రిమమైన దీర్ఘవ్యాధులు:— ఈవ్యాధులన్నియు దీర్ఘ వ్యాధి తత్వమునుండి జనించును.

79, సిఫిలిస్ (సవాయి) సైకోసిస్ (సెగ)

80—81 సోరా (చిడుము) : సిఫిలిస్, సైకోసిస్‌కు సంబంధించిన వ్యాధులుతప్ప తక్కిన సమస్తమైన దీర్ఘవ్యాధులకు మాతృస్థానము సోరా.

నోటు:- సాధారణవ్యాధి విచక్షణాశాస్త్రమునందలివ్యాధినామములు

82. ఈదీర్ఘవ్యాధితత్వముల చికిత్సకొరకు అందుముఖ్యముగా సోరాచికిత్సకొరకు కనుగొనబడి నిర్దిష్టముగావింపబడిన ఔషధ ములలో మిక్కిలి నిర్దిష్టమైన ఔషధములనుండి ప్రతివ్యక్తికి తగ

మైన దీర్ఘవ్యాధిని నివారణజేయుటకు గావించు ఔషధనిర్ణయము ఎక్కుడు జాగరూకతతో కావింపవలయును.

83. వ్యాధిచిత్రము తెలిసికొనుటకు అవసరమగు విషయములు.

84–99 వ్యాధిచిత్రమును పరిశీలనజేసి నిరూపణజేయుటకు వైద్యునకు సూచనలు.

100–102 ముఖ్యముగ సమకాలిక వ్యాధులపరిశీలన.

103. ఈవిధముగనే దీర్ఘవ్యాధులయొక్క (సవాయిసంబంధమైన వ్యాధులుగాక తక్కినవ్యాధులు)మూలకారణమును పరిశీలనజేసి సోరాయొక్క సంపూర్ణచిత్రమును బహిర్గతముగావింపనగును

104. వ్యాధిని నివారణజేయుటకు చికిత్సామధ్యమున సహకారియగుటకు వ్యాధిచిత్రమును వ్రాతమూలముగ యుంచుకొనుటవలన ఉపయోగము.

నోటు:—వ్యాధిస్థితిని ప్రాచీన విధానవైద్యులు పరిశీలనగావించు విధము.

105–114 ఆరోగ్యమైన శరీరముగల వ్యక్తులయందు ఔషధములయొక్క పరిశుద్ధగుణములకు పరిశీలనజేయుటకు గమనించవలసిన ప్రాథమికవిధులు: ప్రథమగుణము: ద్వితీయగుణము.

115. ఔషధములయొక్క పర్యాయగుణములు(Alternating actions)

116–117 ప్రకృతిజన్యములు *(Idiosyncrasies)*

118–119 ప్రతిఔషధముయొక్క గుణము, వేరొక ఔషధముయొక్క గుణముతో విభేదమై యుండును.

నోటు:—ఒకదానికి బదులుగా వేరొకటి నీయవచ్చునను విధముగా నేవస్తువులు నుండవు.

120. గాన ఔషధముయొక్క ప్రత్యేకగుణవిశేషములను తెలిసికొనుటకు ప్రతి ఔషధమును మిక్కిలి జాగరూకతతో రుజువు చేయవలయును.

121–140. ఇతరవ్యక్తులపై ఔషధములను పరీక్షించునప్పుడు అవలంబింపవలసిన పద్ధతి.

141. ఆరోగ్యమైన వైద్యుడు తనపై స్వయముగ గావించుకొను పరిశోధనలు అత్యుత్తము లైనవి.

142. వ్యాధులయందు, ఔషధములయొక్క పరిశుద్ధగుణములను పరిశీలన జేయుట కష్టము.

143-145. ఆరోగ్యమైన వ్యక్తులపై ఔషధములయొక్క పరిశుద్ధగుణములు తెలిసి కొనుటకు గావింపబడిన యిట్టిపరిశోధనలనుబట్టి మాత్రమే యదార్థమైన వస్తుగుణదీపిక తయారు కాగలదు.

146. పరిశుద్ధగుణములను తెలిసికొనబడిన ఔషధములను చికిత్సార్థము మిక్కిలి అనుకూలముగ ప్రయోగించు విధము.

147. వ్యాధికి మిక్కిలి సారూప్యముగ సరిపోవు ఔషధమే మిక్కిలి అనుకూలమైన ఔషధము. ఆఔషధమే నిర్దిష్టౌషధము.

148. సారూప్యౌషధ నివారణ ఎట్లు కలుగగలదో వివరణ.

149. త్వరితముగ సంభవించిన వ్యాధులకు సారూప్యనివారణ త్వరితముగ కలుగగలదు గాని దీర్ఘవ్యాధుల నివారణ సరిసమానముగ నెక్కువ కాలము దీసికొనును.

నోటు—హోమోపతీ వైద్యులకు యితర వైద్యములతో హోమోపతీ చికిత్సకూడ కలిపి కృషిచేయు సంకరజాతికిగల భేదము.

150. స్వల్పమైన అస్పష్టలక్షణములు.

151. ప్రాముఖ్యమైన వ్యాధుల నేకలక్షణములుగలిగి యుండును.

152. అనేకములైన ప్రాముఖ్యలక్షణములుగల నీవ్యాధులకు రూఢిగ సారూప్యౌషధమును కనుగొనవచ్చును.

153. ఔషధము నిర్ణయించుటలో నిట్టితరగతియౌషధములను ముఖ్యముగ గమనించవలెను.

154. సారూప్యౌషధము ఎట్టికలతలు కలుగజేయకుండగనే నివారణ జేయును.

155. ఇట్టివిధముగ నివారణలలో కలతకలుగకుండుటకు కారణము.

156. అందుకు స్వల్పముగ వ్యతిరేకములుండుటకు కారణము.

157-160. అసలువ్యాధికి సారూప్యమై కొంతవరకు హెచ్చుశక్తిగలఔషధ జనిత వ్యాధి సారూప్యోద్రేకమని గూడ పిలువబడును.

161. దీర్ఘవ్యాధులలో (సోరాసంబంధమైన) సారూప్యౌషధముల యొక్క సారూప్యోద్రేకము, కాలక్రమమున కొన్నిదినముల లో యగుపించును.

162-171. పరిశోధన చేయబడిన యౌషధములసంఖ్య కొలదిగానున్నప్పుడు, సరియైన సారూప్యౌషధమును తెలిసికొనుటకు అవలంబించవలసిన చికిత్సాసూత్రములు.

172-184 మిక్కిలి కొలదిలక్షణములతోగల వ్యాధులను చికిత్స చేయుటకు నిబంధనలు. ఏకపక్షవ్యాధులు.

185-203. స్థానికలక్షణములతోనున్న వ్యాధులచికిత్స. ఇట్టి స్థానికలక్షణములకు గావించు బాహ్యచికిత్స ఎల్లప్పుడు హానికరము.

204-205. సక్రమముగ పిలువబడు సమస్త దీర్ఘవ్యాధులు (అనారోగ్య జీవితము నడుపుటమూలమున జనించి, పోషింపబడు వ్యాధులుగాక) శక్తివ్యాధులు అంతరంగమునుండి మాత్రమే యీవ్యాధులకు

264–266 మిక్కిలి శక్తివంతమైనట్టియు, మిక్కిలి పరిశుద్ధమైనట్టియు ఔషధముల నిర్ణయము.

నోటు:—ఆహారపదార్థము తయారుచేయుటలో కొన్నివస్తువుల యందు కలుగు మార్పులు,

267 నూతనముగా తీయబడిన మొక్కలనుండి మిక్కిలి శక్తివంతమైనట్టియు, దీర్ఘకాలము చెడకుండ నిలువయుండునట్టియు, రూపములో ఔషధములను తయారుచేయువిధము

268 ఎండిన ఉద్భిజ్జపదార్థములు

నోటు: —నిలువయుండునట్లు చూర్ణములను తయారుచేయు విధము,

269–271 సారూప్యౌషధ చికిత్సాపద్ధతియందు విచిత్రవిశేషమగుప్రకృతి సిద్ధమైన ఔషధవస్తువులయందు వీలగునంతవరకు అంతర్నివారణా శక్తులను వృద్ధిజేయుటకు గావించుపద్ధతి,

272–274 ఏకకాలమందు అమిశ్రమమైన సాధారణమగు ఒక్క ఔషధమును మాత్రమే రోగులకు ప్రయోగింపవలయును

275–283 సారూప్యౌషధ చికిత్సకొరకు ఔషధబలము నెట్లు హెచ్చింపవచ్చును లేక ఎట్లుతగ్గింపవచ్చును? మిక్కిలి పెద్దమోతాదులవలన ప్రమాదము.

284 ఔషధ ప్రాబల్యమునకు శరీరమునందలి ఏఏభాగములువశ్యమగును

285 ఔషధములయొక్క బాహ్యచికిత్స. ఖనిజ సంబంధమైన జల [స్నానములు.

286 విద్యుచ్ఛక్తి: రసాయనికగుణజనిత విద్యుచ్ఛక్తి

287 ఖనిజ అయస్కాంతము

288 జంతువశీకరణము: మెస్మరిజము

290 మాలీసు

291 ఉష్ణోగ్రతనుబట్టినీటి స్నానములను నివారణాసాధనములుగ నుపయోగించుట.

—0—

# ఆర్గనాన్ అను
# హోమోపతీ సిద్ధాంత శాస్త్రము.

( హా నిమా న్ కృ త ము )

## ఉ పో ద్ఘా త ము.

—:o:—

ప్రాచీన విధాన వైద్యములో, నింతవరకు అవలంబింప బడుచున్న చికిత్సావిధానము (Therapeutics) వైరూప్యౌషధ పద్ధతి (Allopathy) ఉపశమనకర చికిత్స (Palliative treatment) యొక్క విమర్శన.

మానవులు జీవించియుండునంతకాలము, సమూహము గగాని, వ్యక్తిపరముగగాని, భౌతికనైతిక కారణములమూలమున వ్యాధులకు లోనగుచుందురు. ప్రకృతియొక్క అనాగరిక పరిస్థితులయందు, సామాన్యజీవితపద్ధతి, కొలదివ్యాధులకుమాత్రమే, తావొసంగియుండుటచే, కొలది ఔషధములుమాత్రమే అవుసరమయ్యెను. కాని మానవజాతియొక్కనాగరికత హెచ్చినకొలదియు నిందుకుప్రతికూలముగ వ్యాధికారణములు, ఔషధసహాయముయొక్క అవుసరము హెచ్చెను. ఆకాలమునుండియు (హిపోక్రేట్సునకు పిమ్మట 2500సంవత్సరములు) మానవులు, భేషజప్రవర్తనమున ద్రోవతప్పి అనవరతము వృద్ధిజెందు అనేకమైనవ్యాధులకు, ఔషధసహాయము, కలుగజేయు పద్ధతు

లను, కల్పనజేయుటకు, హేతువాదములు, ఊహాలుమూల మున, ప్రయత్నింపబడిన చికిత్సలకు పాల్పడియుండిరి. పలువిధ ములైనబుద్ధి విశేషములుగల వ్యక్తులనుండి వ్యాధులస్వభావ ముగూర్చియు, వానియొక్క నివారణాసాధనములగూర్చియు, అసంఖ్యాకములైన విభేదభావము లుద్భవించి, యీఊహింప బడిన అభిప్రాయములతో వారిచే పిలువబడు విధానములు ఉత్పత్తియయ్యెను. ఇట్లు ఉత్పత్తికాబడిన విధానములుఅన్యోన్య భేదములతో స్వవిరుద్ధమై యుండెను. ప్రథమమున నీవిధానము లు కల్పించుటకు వెల్లడి చేయబడిన యీసూక్ష్మభావములలో గల గొప్ప విజ్ఞాన విశేషములు శ్రోతలను దిగ్భ్రమగొల్పు, విస్మయమున పడద్రోసి అనేకమంది అనుచరులను ఆకర్షించి యుండెను. గాని యీవిధానములు వ్యాధులను నివారణ జేయు టలో నిసుమంతయు ఉపయోగించక పోవుటచే నీఅనుచరులు యీవిధానములను వెనుకకు ద్రోసి కేవలము వ్యతిరేకమైన మరియొక క్షణభంగురమగు ఖ్యాతివహించెడి క్రొత్తపద్ధతి వచ్చువరకు, వెనుకటి విధానములను సమర్థించుచు అస్వాభావిక కుతర్కములనే మారుబల్కుచుండిరి. ఈవిధానముల యందె య్యదియు, అనుభవముతోగాని ప్రకృతితోగాని అనుకూలించి యుండలేదు. మరియు మిక్కిలి యుక్తితోగూడి ప్రకృతికి వ్యతి రేకమై యుండి వ్యర్థవాదములకు మాత్రమే ఉపయోగించుచు మిక్కిలి కపటముతో గూడి యుండుటచే రోగులకు గావించు చికిత్సయం దుపకరించక, కేవలము కపటముగా ప్రవర్తించు

మనస్సాక్షియొక్క తాంత్రిక బుద్ధితో అల్లబడిన భావనిర్మిత లూతాతంతు వితానములు మాత్రమే యైయుండెను.

ఈకాలమందే యీసమస్త సూత్రములకు స్వతంత్రముగ, అనుభవమునకును, ప్రకృతికిని సంపూర్ణముగ విభేదమై ఒకానొక భాతిగ వస్తువుయందు దృష్టియుంచబడి, నిరంకుశముగ కల్పింపబడిన వ్యాధులయొక్క తరగతులకు తెలియని ఔషధవస్తువులతో కల్పింపబడిన మిశ్రమ ద్రావకఔషధముల మూలమున గావించు చికిత్సాపద్ధతి ఉద్భవించెను. ఇది వైద్యాశాస్త్రౌషధ విధానమని (Allopathy) పిలువబడు ప్రాచీన వైద్యము.

వైద్యమునకు సహాయభూతమగు ప్రకృతి తత్వశాస్త్రము, రసాయనశాస్త్రము, వివిధశాఖలలో ప్రకృతిచరిత్ర, ప్రత్యేకముగ మానవుని గూర్చి మానవ ప్రకృతి చరిత్రా శాస్త్రము. (Anthropology) సజీవశరీరకార్యక్రమ ధర్మశాస్త్రము (Physiology) శరీరమును ఛేదించి అంగవిన్యాసమును విమర్శించు శాస్త్రము (Anatomy) మొదలగు శాస్త్రముల కొరకు పదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞులనేకులు గావించినసేవ నెంతమాత్రమును నిరసింపక వైద్యముయొక్క ఆచరణభాగమును గూర్చియు, నివారణాశాస్త్రమును గూర్చియు, మరియు నింతవరకు వ్యాధులెంత అక్రమముగా చికిత్సజేయబడుచున్నవో యగుపరచుటకు యిచ్చట వివరింపతలచితిని. అమూల్యమైన మానవప్రాణిని ఔషధనిర్ణయకర పుస్తకములనుబట్టి అనాలో

చిత్రమైన పరిపాటుగాగావించు చికిత్స నాదృష్టికిదూరమైయున్న గాని యీపుస్తకములింకను తరుచుగ నుపయోగింపబడుచున విషయము యీపుస్తకముల నిరంతరప్రచురణము తెలియజేయ చున్నది. ఔషధనిర్ణయ కరపుస్తకములద్వారా గావించు చికిత్స పద్ధతి తక్కువజాతి సాధారణవైద్యులచే అవలంబింపబడు నీ పద్ధతిక్రింద భావించి అందుపై లక్ష్యముంచక విడచియుంటిని గాని శాస్త్రీయస్వభావముగలిగియున్నదని స్వతఃభావింపబడు ప్రాచీనత్వమున బలిష్టమై నేటివరకు అవలంబింపబడుచున వైద్యవిధానమునుగూర్చి యిచ్చట విమర్శింపదలచితిని.

ప్రాచీనవిధాన పక్షస్థులు తాముమాత్రమే వ్యాధికారణమును తొలగించుటకు కృషిజేయుదుమనియు, వ్యాధులయందు ప్రకృతిచేగల్పింపబడిన పద్ధతినే అనుకరింతుమనియు, ఈకారణమున "శాస్త్రీయసిద్ధవైద్య"మను బిరుదు తమవిధానమున న్యాయముగ వర్తించగలదని ప్రగల్భములు పలికియుండిరి.

"ట్రాల్ శాసమ్" అనివారు విడువకుండ కేకలిడిరి కాని యిట్లువ్యర్థముగ కేకలు వేయుటతప్ప వేరేమియు గావించియుండలేదు. వ్యాధికారణమును కనుగొనగలిగితిమనిమాత్రమే భ్రమపడియుండిరి. ఇదిగోచరమగు నదియు కనుగొన సాధ్యమగు నదియు గాకపోవుటచే కనుగొనబడియుండలేదు. ఏలన వ్యాధులు చాలావరకు చైతన్యమూలోత్పత్తితో (Dynami Origin) ఆధ్యాత్మిక (Spiritual) చైతన్య స్వభావమ [Dynamic Nature) ఆధ్యాత్మిక (Spiritual] కలిగియుండ

టచే వ్యాధికారణ మింద్రియ జ్ఞానమునకు గోచరముగాదు. క్రమమైన అచేతన మానవశరీర భాగములను పరీక్షించి (Anatomy) అందలి విషయములను వ్యాధితో మృతినొందిన వ్యక్తియొక్క శరీరాంతర్భాగముల యందలి మార్పులతో (Pathological Anatomy) సరిపోల్చియు అసంఖ్యాకములైన వ్యాధి పరిస్థితులలో (Pathological Semeiotics) గల అంతులేని మార్పులను ఆరోగ్యజీవియందలి (శరీరవ్యాపారశాస్త్రము Physiology) దృగ్విషయములతోను అవయవ కార్యాచరణ ధర్మములతోను సరిపోల్చియు, తన్మూలమున ఊహించి తెలిసికొనబడిన విషయములనుబట్టి మానవుని అంతరంగమున వ్యాధులలో ఎట్టిమార్పులు గలుగగలవో అందుకు సంబంధించిన అగోచరమగు పద్ధతినిగూర్చి సారాంశములు దేల్చుటకు అనగా భావనిర్మిత వైద్యమున (Theoretical Medicine) వ్యాధి ఆదిమ కారణమని ‡1 (Prima causa morbi) పరిగణించుమనఃకల్పిత చిత్రము నొకదానిని భావనచేయుటకు శ్రమపడియుండిరి.

---

‡ 1. ఈవిధాన వైద్యులు వ్యాధినినివారణచేయగలుగుటకు, ఉత్పత్తి కారణమును, వ్యాధికారణముగ (Causa Morbi) పరిగణించి దానిని కనుగొనుటకు ప్రయత్నించి యుండి ఒకే విధమైన ఉద్రేక కారణముగల వ్యాధులలో ఉపయోగకరముగ వర్తించిన, ఔషధమును అట్టి విషముగనే ఉత్పత్తిఅయినవ్యాధులకుగూడనుపయోగించియీపద్ధతినిజయప్రదముగచికిత్స గావించి యుండగలిగిన నయ్యది మానవసహేతువాదములతోను, వస్తు స్వభావముతోను మిక్కిలి అనుకూలమై యుండియుండును. ఇందుల కుదాహరణము యిదివరలో సుఖసంబంధమైన పుండ్లకుపయోగించిన పాదరసమే

ఒకవస్తువుయొక్కగాని, సంగతియొక్కగాని, కారణ భూతము వస్తువుగాని, సంగతిగాని ఎన్నడును అయియుండజాల దని ఉత్తమమానవహేతువాదము మనకు బోధించుచున్నప్పటికి యిట్లు సమీపవ్యాధికారణము, అంతరంగ వ్యాధిస్థితియనియు

---

(మెర్క్యురీ) దుష్టసంయోగమున జనించిన మర్మాంగముపైగల పుండునకు ఆరీతినే సమర్థముగ ఉపయోగించును. ఈవిధాన వైద్యులు, సమస్తమైన ఇతర దీర్ఘవ్యాధులయొక్క (సుఖసంబంధముగాని వ్యాధులు) ఉద్రేక కారణము, ఎప్పుడో ఒకప్పుడు అంకురించిన, చిడుము వ్యాధియని (సోరా) తెలిసికొన గలిగి ప్రతివ్యక్తి పరమైన వ్యాధియొక్క విచిత్రలక్షణములయందు లక్ష్య ముంచి యీసమస్తమైన వ్యాధులకు ఒక సర్వసామాన్య చికిత్సా పద్ధతి కను గొనిన పక్షమున తన్మూలమున ప్రతి దీర్ఘవ్యాధిని నివారణ చేయగలిగి యుందురు. అప్పుడు దీర్ఘవ్యాధుల చికిత్సలలో ఉపయోగకరము లభ్యము అగు ఒకదీర్ఘతత్వ వ్యాధి కారణము దృష్టియందుంచుకొని యుంటిమని స్వయముగ ప్రగల్భములు పలుక వచ్చును. ఈవిషయమును ఆధారముగ చై కొనిన పక్షమున యిట్టి దీర్ఘవ్యాధులను ఉత్తమఫలితములతో చికిత్స గావిం చగలిగి యుందురు. గాని గత అనేక శతాబ్దములలో యీవైద్యులు యీ దీర్ఘవ్యాదులయొక్కమూలోత్పత్తి సోరా దీర్ఘతత్వమునుండి యని తెలిసి కొనక పోవుటచే (యిది ప్రథమమున సారూప్యౌషధ చికిత్సావిధానములో తెలిసికొనబడి అందుల కనుకూలమగు చికిత్సా విధాన మేర్పరుపబడెను.) కోట్లకొలది దీర్ఘవ్యాధులను నివారణ చేయజాలక పోయిరి. గాని యీ వైద్యులు తాము మాత్రమే చికిత్సయందు యీవ్యాధుల ఆదికారణమును దృష్టియందుంచుకొని చికిత్స గావింతుమనియు సోరామూలోత్పత్తియొక్క పరిజ్ఞానము నందలి ఉపయోగమును గూర్చి యినుమంతయును తలంపలేక దీర్ఘవ్యాధుల చికిత్స చిందరవందర గావించునప్పటికి తాము మాత్రమే శాస్త్రసిద్ధముగ చికిత్స గావింతుమనియు ప్రగల్భములు పలికియుండిరి.

స్వతస్సిద్ధముగ వ్యాధియనియు ప్రాచీనవైద్య విధానమున నిరూపణ చేయబడెను. గాన తమను తాము మోసముగావించుకొనకుండ యీ అగోచరమగు అంతరంగస్థితిని చికిత్సచేయవలసిన ఒకవస్తువుగ యోచించి అందులకై ఔషధములయొక్క నివారణా శక్తి సర్వసాధారణముగా తెలియని ఔషధములను నిర్ణయించుటయు, మరియు ఔషధసంపుటీకరణము (Prescription) యను నామముతో తెలియని పలువిధములైన ఔషధములను మిశ్రమముగావించి యిచ్చుటయు ఎట్లుసాధ్యమగును?

కాని యీమహాసీయమైన విషయమగు వ్యాధియొక్క అగోచరమగు అంతరంగకారణముయొక్క ఆదిమము (Priori) కనుగొనువిషయము అథమము మిక్కిలి సూక్ష్మబుద్ధిగల ప్రాచీనవిధానవైద్యులయందైనను, లక్షణములయొక్క ఆధారముతో (యిది సత్యము) తమముందుగల వ్యాధియొక్క సర్వసాధారణ స్వభావము బహుశ ఎట్టిదై యుండగలదని దలంపవచ్చును? యను విషయమునుగూర్చి పరిశోధనగావించుటకు మనోనిశ్చయము గలిగించుచుండెను. ♦1

---

♦1 ఇట్టిసర్వసాధారణస్వభావమునుబట్టి చికిత్స చేయు ప్రతివైద్యుడు హోమోపతీ వైద్యుడననిపించుకొనుట కెంతయధికారముగలిగియున్నప్పటికి అట్టిగౌరవమున కర్హుడుగాక ఎల్లప్పుడునుగూడ, సర్వసామాన్యపద్ధతులనవలంబించు వైరూప్యౌషధ (Allopathy) వైద్యుడై యుండగలడు. ఏలనన మిక్కిలి అతిసూక్ష్మముగ, వ్యక్తిపరిశీలన గావించినగాని సారూప్యౌషధ చికిత్స సాధ్యముగాదు.

ఇది కండరముల యీడ్పురోగమా, లేక, బలహీనతా, లేక, పక్షవాతమా, లేక, జ్వరమా, లేక, మంటపోట్లుకలిగూడిన వాపా, లేక, నట్టివాపా, శరీరమున యొకభాగమునందలి, అవరోధమా, లేక శరీరద్రవములయందు, అమ్లజని (Oxygen) కర్బనము (Carbon) నత్రజని ( Nitrogen ) ఉదకజని (Hydrogen) లోపించియున్నవా, లేక, అమితమైయున్నవా, ధమని, శిర, కేశనాళ (Arterial, Venus, and capillary) నిర్మాణకార్యక్రమధర్మము వృద్ధియగుటా లేక క్షీణగుటా, స్పర్శజ్ఞానము, ఉద్రేకము, స్ఫూరణ, యీశక్తులయందలిమార్పులా? యని ప్రాచీనవిధాన అనుచరులచే సంభవచిహ్నములను (casual indications)నామముతో గౌరవింపబడు మనఃకల్పితభావనలు చికిత్సకొరకు సాధ్యమగు యుక్తవిషయములుగ తలంపబడుచుండెను. ఈభావనలు మిక్కిలి అహేతుకమై ఆచరణయందెట్టి ఉపయోగములేని భావనిర్మిత విషయములు. మరియు నీభావనలెట్టి సక్రమాధారములు గలిగియున్నను, వ్యాధికనుకూలించు ఔషధమును నిరూపణజేయుటకు అసమర్థములు. ఈ ఊహాలు వీనినికల్పనజేసిన శాస్త్రజ్ఞుని భేషజమునకు ముఖస్తుతియై, ఆచరణయందు మార్గదర్శకమున కుపయోగించినప్పుడు, అపమార్గమునకు మార్గదర్శక మగుచుండుటచే, నిందు మనఃపూర్వకపరిశోధనా విషయముకంటె భేషజమెక్కువయున్నట్లు సాక్షీభూతమగుచుండెను.

శరీరమున ఒకభాగములో నలుపు పోటుతోఁగూడిన, వాపు ప్రత్యక్షముగనుండ వేరొకభాగమున పక్షవాతము లేక యింద్రియరోగము, నుండుట యెంతతరుచుగా సంభవించుటలేదు. మరియు సర్వసాధారణ దుస్స్వభావవ్యాధులలో ప్రతివ్యాధికి సిద్ధౌషధమెచ్చటనుండి లభింపగలదు? ఈవ్యాధులకు నిశ్చయముగ ఉపయోగించు ఔషధములు వ్యాధిఉద్రేకమునకు సారూప్యగుణముగల నిర్దిష్టౌషధములు తప్ప వేరొండుగాజాలవు. గాని యీసారూప్యగుణములుగల మందును ప్రయోగించుట మూలమున సారూప్యోద్రేక గ్రహణమువ్యాధులలో మిక్కిలివృద్ధిజెందుట, పరిశీలనయందు గాంచబడుటచే యిట్టిఔషధములను సాధారణ మోతాదులలో ప్రయోగించుట ప్రాణమునకు భంగకరమని†1 యిట్టిఔషధముల ప్రయోగము ప్రాచీనవిధాన వైద్యులచే అధిక్షేపింపబడి నిషేధింపబడెను. ప్రాచీనవిధాన వైద్యులు చిన్నమోతాదుల గూర్చియు అతిసూక్ష్మమోతాదుల గూర్చియు నెన్నడును కలనైనతలంపలేదు. తదనుగుణ్యముగ సారూప్య

---

†1. సారూప్యపద్ధతిని పనిచేయు ఔషధములయొక్క గుణవిశేషమును వివరింపజాలని పరిస్థితులయందు అర్థములేకుండ సిద్ధౌషధమని Specific) పేరుపెట్టి యీప్రియాసను తొలగించి అందునుగూర్చి ముందు పరిశీలన విడువబడుచుండెను. గాని సారూప్యోద్రేక ఔషధములగు సిద్ధౌషధములు (Homeopathic specific medicine) మిక్కిలి హానికర శక్తులుగలిగియున్నవని చాలకాలముక్రిందటనే నిషేధింపబడెను. (రావ్ గారిచే రచింపబడిన సారూప్యౌషధ చికిత్సయందలి ఉపయోగములు అను గ్రంథమునుండి చూ. 101 102)

నిర్దిష్టౌషధములమూలమున సరియగు (మిక్కిలిస్వభావసిద్ధమైన) మార్గమున నివారణచేయుటకెట్టిప్రయత్నము గావించియుండ లేదు. మరియు చాలవరకు ఔషధములయొక్క గుణములింకను అపరిచయమై యుండుటచేతను, పరిచయమైయున్నప్పటికి వ్యాధినిగూర్చి సర్వసామాన్య అభిప్రాయములు కలిగియుండుట చేతను సరియగుఔషధమునుగుర్తించుటకష్టము. గాన ఔషధ గుణమును సరిగ తెలిసికొని యీసర్వసామాన్య భావములను వీడినగాని సరియగుమార్గమున చికిత్సచేయ వలనుపడదు.

వ్యాధియొక్క భౌతికకారణమును (Material cause) తొలగించుటమూలమున ప్రత్యక్షపద్ధతిలో వ్యాధిని నివారణ చేయవచ్చునని ప్రాచీనవిధానవైద్యులు విశ్వసించు చుట్టుమార్గమున బోవుటకంటె సాధ్యమైనపక్షమున వేరొక్క తిన్ననైన మార్గమును వెదకుట న్యాయము. వ్యాధిని పరిశీలనజేసి అందుపైనొకయభిప్రాయ మేర్పరచుకొనుటయందును, నివారణకరచిహ్నమును పరిశీలన చేయుటయందును, స్థూలభావములను (Mete-rialistic ideas) విడనాడి వ్యాధులని పిలువబడు ఆధ్యాత్మిక భౌతికశరీరముయొక్క కార్యాచరణ యింద్రియజ్ఞానములయందలి ముఖ్యమైన జీవశక్తియొక్కమార్పులు ప్రధానముగ సూక్ష్మశక్తి (ఆధ్యాత్మిక) మూలమున తప్ప వేరొకమార్గమున గలుగజేయబడజాలని స్వభావముగల ఉన్నతసత్వమని, ఆధ్యాత్మిక భౌతిక శరీరమును యీప్రాచీనవిధానవైద్యులు పరిగణింపరు. గాన వ్యాధియొక్క స్థూలకారణమును (Material cause)

తొలగించిన వ్యాధినివారణ యగునని నీప్రాచీనవిధానవైద్యులు విశ్వసించియుండిరి.

శరీరమున నొకచోకూడిన రక్తకూటమి (Congestion) వలన సంభవించిన విశేషపరిస్థితులు, శరీరమునుండి విసర్జింపబడు మలిన పదార్థములు మరియు వ్యాధిమూలమున మార్పుజెందిన సమస్తపరిస్థితులు, వ్యాధిఉత్పత్తికరములనియు, ఊహింపబడు వానియొక్క ప్రతీకారశక్తినిబట్టి వ్యాధిపోషకరములనియు ప్రాచీనవిధానవైద్యులచే పరిగణింపబడి యుండెను. ఈయభిప్రాయమే నేటికిగూడ వ్యాపించియున్నది.

గాన ఊహించి, భావించి తెలిసికొనబడిన వ్యాధియొక్క యీస్థూలకారణములను తొలగించుటకు ప్రయత్నించుటమూలమున తాత్కాలిక నివారణలు కలుగజేయుటకే యీ ప్రాచీన విధానవైద్యులు తలంచి యుండిరి. అందుమూలముననే యీప్రాచీనవిధానవైద్యులు పైత్యజ్వరములలో 1♦ పైత్య

♦1. గౌరవనీయులగు హోంపాథిస్ డాక్టరులాల్ గారు హోమోపతీ విధానముతో సరియైన పరిచయములేనప్పుడుగూడ యీజ్వరములుద్భవించుటకుగల సూక్ష్మశక్తికారణమును సంపూర్ణముగ విశ్వసించి భేదిమందుల యవసరములేకుండగనే, ఒకటి రెండు సారూప్యౌషధ మోతాదులనిచ్చి యీ జ్వరములను నివారణజేసియుండెను. అతని గ్రంథములలో యిట్టి రెండు అసాధారణవ్యాధులనుగూర్చి వివరించియుండెను.

♦2 అసహ్యకరమైన విరామములేని చెడినఆహారముయొక్క రుచితోగూడిన త్రేణుపులతో, సర్వసాధారణముగ ఉత్సాహమునశించి, చల్లబడిన కాళ్ళు చేతులతోగూడియుండు లక్షణములతో అకస్మికముగచెడిన జీర్ణకోశమునకు సాధారణవైద్యుడు తీవ్రమైనవమనకరౌషధములతో, జీర్ణకోశమును శుభ్రపరుపవలయునని తలంచి తన్మూలమున వ్యాధిగ్రస్తమైయున్న జీర్ణకోశము నెదుర్కొనుటకు యింతవరకలవాటుపడి యుండెను. ఈ యుద్దేశ్యము సర్వసాధారణముగా టార్ టార్ ఎమెటిక్, ఇపెకాకన్హాతో కలిపిగాని, కలుపకుండగాని నెరవేర్పబడుచుండెను. అందుపై రోగికి వెంటనే స్వస్థతచేకూరి, చురుకుదనము, ఆహ్లాదముకలుగుచుండెనా? లేదు! సర్వసాధారణముగాగల్గు మనోవికల్పము, ( దుఃఖము, భయము, విచారము ) చలి, భోజనానంతరము (తరుచుగ మితభోజనమైనపిమ్మటను గూడ) శరీరమానసిక విశేషపరిశ్రమ, మొదలగు కారణములమూలమున, చైతన్యమూలోత్పత్తినుండి, జీర్ణకోశమున కిట్టిపరిస్థితి సంభవించియుండును. ఈరెండు ఔషధములు వమనములుగలిగించునంత సులభముగా, యీచైతన్యవ్యాధికరమార్పును, తొలగింపజాలవు. మరియు, టార్ టార్ ఎమిటిక్, ఇపికాకణ్హా, తమకుగల యితరవ్యాధికరశక్తులనుండి రోగియొక్క ఆరోగ్యమునందు, యింకను హానికలుగజేసి పైత్యరసస్రావమును, భగ్నపరచును. రోగి యిట్టితీవ్రమైన నిత్యము హానికరమగు వమనకరౌషధములను తీసికొనుటకుమారుగ, పల్సటిల్లారసముతో, పెద్దపొటెన్సీలో పెట్టబడిన ద్రావకముతో తడుపబడిన ఆవగింజపరిమాణముగల ఒక్కమాత్రను ఒకమారు వాసనజూచిన, ఆతని ఆరోగ్యమునందు, సర్వత్రగల అనారోగ్యము ప్రత్యేకముగ జీర్ణకోశమునందుగల అనారోగ్యము నిశ్చయముగ తొలగింపబడి రెండుగంటలలో మిక్కిలి సుఖముగా నుండగలడు. త్రేణుపులు తిరిగి సంభవించిన అసహ్యకరముగ నుండక దుర్వాసన రహితమైయుండును. జీర్ణకోశము శుభ్రపడి, తిర్గిభోజనముచేయు సమయమునకు యథారీతిని ఆకలికలిగియుండి

చేయించుట, పాలిపోయిన ముఖముతో విపరీతమైన ఆకలి,

---

రోగి సౌఖ్యముగ ఆహ్లాదకరముగ నుండగలడు. యదార్థమైన హోత్వర్ధక చికిత్సయన నిది. మొదట తెల్పబడిన చికిత్స పట్టి మనఃకల్పిత చికిత్స. మరియు యీచికిత్స రోగియందు హానికరగుణములు గలుగజేయును.

అజీర్ణపదార్థములతో జీర్ణకోశము నింపబడినప్పుడు గూడ వమనకరౌషధమెప్పుడును అవుసరము లేదు. ఇట్టిసందర్భములయందు వికారము, తిప్పు, వాంతులు మూలమున యీపదార్థమును బైటబడజేయుటకు ప్రకృతియే సమర్థమైయున్నది. లేదా నోటియందలి అంగుడికి కొండనాలుకయొక్క యిరుపార్శ్వమునగల భాగములకు ఉద్రేకము గలుగజేయుట మూలమున వమనములు గావింపవచ్చును. గాన వమనకరౌషధములయొక్క సహాయమవుసరము లేదు ఈవిధముగ తీవ్రమైన ఔషధములయొక్క సహచరఔషధ గుణములను తప్పించుకొనవచ్చును. స్వల్పముగ కాఫీనిచ్చిన జీర్ణకోశములో మిగిలియున్న పదార్థములు క్రిందకు విరేచనముల మూలముగ కొట్టివేయబడును.

జీర్ణకోశము అమితముగ బరువెక్కింపబడిన పరిస్థితియందు జీర్ణకోశము ద్రేకము జెంది వమనముల మూలమున నీపదార్థమును వెడలింపలేనిస్థితిలో నున్నప్పుడు లేక అట్టి ఉద్రేకము గలుగజేయుస్థితి సంపూర్ణముగ నశించియున్నప్పుడును, మరియు నిందుకుతోడుగ కడుపులో విపరీతమైన బాధగలిగి యున్నప్పుడును, అనగా జీర్ణకోశము చైతన్యము తప్పినస్థితియందున్నప్పుడు యీస్థితి తప్పించుటకుగాను వమనకరౌషధమిచ్చిన ప్రమాదకరముగ మలకోశములు ద్రేకింపజేయబడును గాన ప్రాణహానిగలుగగలదు. అందుకు మారుగ కొంచెము బలమైన కాఫీతరుచుగ నిచ్చిన చైతన్యహీనమైన జీర్ణకోశమును సూక్ష్మశక్తిలో నుద్రేకింపజేసి అందలి పదార్థమెంత విస్తారముగనున్నను, ఊర్ధ్వముఖముగాగాని, అధోముఖముగాగాని, వెలుపరించుస్థితిలో పెట్టును. గాన యిచ్చటగూడ కపటహోత్వర్ధచికిత్సకు స్థానము లేదు.

దీర్ఘవ్యాధులతో బాధపడు రోగులు ఘాటగు జఠరరసముతో గూడిన త్రేనుపులతో తరుచుగా బాధపడుచుందురు. గాని, యీజఠరరసమును

ఊసరకడుపు, కడుపునొప్పితో బాధపడు పిల్లల ♦3 పాములు, నులిపురుగులు, చీము, వీనిని విరోచనముల మూలమున వెడలగొట్టుట, విపరీత రక్తస్రావములయందు, †4 రక్తనాళ

---

వమనకరౌషధముల మూలమున మిక్కిలి బాధకలుగజేసి తొలగింపవచ్చును. ఈజఠరరసముతోగూడిన త్రేన్పులబాధ ఆదినమున శాంతించినప్పటికి యీ ప్రయత్నమంతయు వ్యర్థమై మరుసటిదినమున, తిర్గి విస్తారముగగూడిన జఠరరసముతో త్రేన్పులు తిర్గి సంభవింపగలవు. గాని సల్ఫ్యూరిక్ యాసిడ్ యొక్క పెద్దపొటెన్సీలో ఒక చిన్నమోతాదుమూలమునయీవ్యాధియొక్క చైతన్యమూలోత్పత్తిని తొలగించిన యీజఠరరసాధిక్యత, దానంతనదియే తగ్గిపోవును. లేక యీబాధ తిర్గి తరుచుగ సంభవించుచున్న పక్షమున, యితరలక్షణములతోగూడ సారూప్యమగు సోరా శాంతికరౌషధమ్మును అతి సూక్ష్మమోతాదులలో ప్రయోగించుటయింకను ఉపయోగకరము. ప్రాచీన విధానవైద్యులచే గావింపబడు కపటహేత్వర్థక చికిత్సలన్నియు చాలవరకు పైనచెప్పినవిధముగనే యుండగలవు. ఈవైద్యుల ముఖ్యప్రయత్నమంతయు, చైతన్యవ్యాధిగతమార్పునుండి జనించు భౌతికఫలితములను తమకు బాధకరమైనట్టియు, రోగులకు హానికలుగజేయునట్టియు, అతిదీర్ఘమగు చికిత్సాక్రియలమూలమున తొలగింప యత్నించుటకే యైయున్నది. గాని వ్యాధులయొక్క చైతన్యమూలోత్పత్తిని దృష్టియందుంచుకొని, దానియొక్క భౌతికఫలితములను, సారూప్యౌషధపద్ధతిని నిర్మూలముజేసిన పక్షమున యీవైద్యులు సయుక్తమైన నివారణగావించగలిగియుందురు.

♦3. ఈపద్ధతిముఖ్యముగా సోరాతత్వముపై యాధారపడియుండును. అనగా వృద్ధిజెందిన సోరానుండుద్భవించును. వమనకరౌషధములయొక్కయు భేదిమందులయొక్కయు అవసరములేకుండగనే సారూప్యమగు (సూక్ష్మశక్తిలో) సోరా శాంతికరౌషధములచే నీవ్యాధులు సులభముగ నివారణచేయబడగలవు.

†4. వ్యాధిసంబంధమైన రక్తస్రావములన్నియు చాలవరకు జీవశక్తియొక్క (ఆరోగ్యస్థితి) చైతన్యవ్యాధి గతమార్పుమీదనే ఆధారపడియుండు

ములకు రంధ్రముగావించి రక్తముతీయుట, *5 ఉద్రేకవాపుల యందు ప్రధానసాధనమగు, పలువిధముల రక్తస్రావముల గలి

---

ను. గాన ప్రాచీనవిధానవైద్యులు యీవ్యాధికారణము రక్తాధిక్యతయని తలంచి, జీవశక్తికి ఆధారమగు యీరక్తము కావలసిన పరిమాణముకంటె విశేషముగ గలదని తలంచి తీసివేయుదురు. ఈపద్ధతిమూలమున హానికరఫలితార్థముగ లేపలేనంత బలహీనత సంభవించుటయు, మరియు సన్నిపాతస్థితికి సూచకమగుటయు లేక సన్నిపాత స్థితిలోనికి మారుటయు, మొదలగు పరిస్థితులు సంభవింపగలవు. ఈవైద్యులు నివారణ చేయజాలని యిట్టిపరిస్థితి సంభవించినప్పుడు వ్యాధి యీరీతి దుష్టమైన వ్యాధియని వ్యాధిపైననే నిదియంతయు యారోపణజేయుదురు. తాము గావించిన చికిత్స "కాజమ్‌టాలీ" అను తమసిద్ధాంతమున కనుగుణ్యముగనే యున్నదనియు, పర్యవసానమేమైన ప్రకృతికి శక్తినొసంగనలేక రోగికి జేయవలసిన చికిత్సయంతయు కావింపబడినదనియు తెల్పుదురు.

*5. సజీవమానవశరీరమునందు, ఒక్కరక్తపుచుక్కగూడఅధికముగ నెప్పుడును యుండదు. గాని రక్తస్రావములకు వాపుతోగూడిన ఉద్రేకములకు, ఊహింపబడు రక్తాధిక్యతయే భౌతికకారణమని తలంచి, రక్తనాళములకు రంధ్రముగావించుట మూలమునను, శస్త్రపరికరసహాయమూలమునను, జలగలపట్టించుట మూలమునను యీవైద్యులు రక్తమును తప్పక తీసివేయుదురు. దీనినే అవిధానవైద్యులు, యుక్తమైన చికిత్సాపద్ధతియనియు హానివర్ధకచికిత్సయనియు తలంతురు. సాధారణ ఉద్రేకజ్వరములలోను ప్లూరసీయను ఊపిరితిత్తులపైనుండు పొరకు సంబంధించిన వ్యాధియందును, రక్తమునందుగల మేధస్సు (Lymph) ఘనీభవించుననితలంచి (Meteria Peccans పతె Buffy coat అని యిదిపిలువబడును) రక్తనాళములకు రంధ్రముచేసి తీయురక్తస్రావముమూలమున తొలగింపయత్నింతురు గాని యిందుమూలమున (Buffy coat) యొక్క సాంద్రత మరియు యెక్కుడిగ వృద్ధిజెందుచుండును. ఇట్టిచర్యలవలన జ్వరముతగ్గనిచో కొంచ

గించు పద్ధతులు, మొదలగు సాధనములకు గడంగుచుండిరి. ఈకడపటి సాధనములయందీవైద్యులు, ఖ్యాతివహించిన రక్తపి

---

మెచ్చుతగ్గుగ రోగిమృతినొందువరకు యిట్లు రక్తమునుతీసివేయుచుందురు. గాని యీరక్తోద్రేకము, తరుణజ్వరమునుండుద్భవించిన లక్షణములనియు వ్యాధిగత చైతన్యశక్తియొక్క ఉద్రేకప్రకోపమనియు, యీరక్తనాళనిర్మాణమునందలి వ్యాధులకు ప్రధానకారణ మీచైతన్యశక్తియొక్క ఉద్రేకప్రకోపమేయనియు యిది సారూప్యౌషధ అతిసూక్ష్మ మోతాదులమూలమున తొలగింపబడుననియు తలంపరు. ఇందుకుదాహరణముగ మిక్కిలి తీవ్రమైన ప్లూరాసంబంధజ్వరములలో, పొటెన్సీలో పెట్టబడిన ఎకొనైటుయొక్క ఒక్క చిన్న మోతాదును ప్రయోగించిన యిరువదినాలుగుగంటలలో సమస్త సహచరలక్షణములతోను, రక్తస్రావము గలిగించుట, ఉద్రేకము శాంతింపజేయు ఔషధములుపయోగించుట, మొదలగు నిట్టిసాధనములు అవసరము లేకుండగనే తొలగింపబడి, ఆరోగ్యస్థితిలోనికి మార్పుజెందింపబడును. (ఇప్పుడురక్తనాళమునుండి కొంచమురక్తముతీసిపరీక్షించిన (Buffy coat) యొక్క చిహ్నముకెవ్వియునుగూడ యగుపించవు]. ఈవ్యాధిసంభవించిన మరియొక రోగి ప్రాచీనవైద్యశాస్త్రపద్ధతిని చికిత్సచేయబడిన పక్షమున చెప్ప నలవిగాని బాధలతో పలుసార్లు గావింపబడు రక్తస్రావములకు మృతినొందక జీవించినప్పటికిని కొన్నిమాసములవరకు శల్యావశిష్టమైన శరీరముతో నిలచుటకైన శక్తిలేనిస్థితిలో జీవితము గడపుచుండెను. తదా యీలోపుగ [యిట్టి దుష్టమైన చికిత్సలమూలమున తరుచు సంభవించుచుండును] రక్తక్షయ, సన్నిపాతజ్వరము, లేక ఉబ్బువ్యాధిమూలమునమరణించును.

ప్లూరసీవ్యాధి సంభవించుటకు ముందు నిర్మలముగానుండు రోగి యొక్కనాడి యీవ్యాధిసంభవించిన రెండుగంటలకుపిమ్మట ఉష్ణస్థితియందు పరీక్షించిన మిక్కిలి ఆశ్చర్యముగొలుపు తీవ్రమైన రక్తాధిక్యముతోగొట్టుకొనుచు తత్క్షణము అనేకసార్లు రక్తనాళమునకు రంధ్రముగావించి పౌనుల కొలది రక్తమును తీసివేయవలసిన అవసరమునుగల తీవ్రమగు [illegible]

పాసియైన, యొకపక్షీయక వైద్యుని అనుకరించి (కసాయివాని సద్యశ్శాలకు గూడ మెడలో గంటగట్టిగి దారిచూపు పెద్దగొఱ్ఱె (Bell wether) వెనుక నడచు గొఱ్ఱెలమందవలె) శరీరమునం

---

పట్టుచుండును. గాని యీవ్యాధిసంభవించిన రెండుగంటలకు పూర్వము ఆరోగ్యస్థితియందున్నపుడు గల రక్తముకంటె యిప్పుడు యీరక్తనాళములలో ప్రవహించురక్తము ఒక్కడ్రామైనను హెచ్చియుండలేదు.

ఈకారణమునుబట్టి నైరూప్యౌషధ విధానవైద్యుడు (Allopathic physician) తరుణజ్వరములతో బాధపడు రోగుల శరీరమునుండి తీసివేయురక్తము శరీరమునందుండవలసిన రక్తముకంటె విపరీతముగ అమితమైయుండలేదు. ఈవిధముగరక్తమును తీసివేయుట మూలమున ప్రాణమునకు అత్యావశ్యకమైనదియు శరీరమునకవుసరమైనదియునగు రక్తము బలాత్కారముగా హరింపబడుచుండెను. ఇందుమూలమున రోగియొక్క బలమంతయు హరించివేయబడుచుండెను. గాని యీనష్టమును ఏవైద్యునియొక్క శక్తియు గూడ కూడదీయజాలదు. ఇట్లుగావించి "కాజమ్‌టాలీ" అను సిద్ధాంతమునకనుగుణ్యముగ చికిత్సగావించితినని ప్రాచీనవిధానవైద్యుడు వ్యర్థముగ తలంచును. ఈవ్యాధియందు వ్యాధికారణము, రక్తాధిక్యతయగుట అసంభవము మరియు శరీరమునకవుసరమగు రక్తముకంటె అధికముగనుండియుండలేదు. శరీరమునందలి రక్తప్రసరణ నిర్మాణముయొక్క వ్యాధిగతచైతన్యోద్రేక ప్రకోపమే యీవ్యాధికి ప్రధానముఖ్యకారణము. ఈవిషయము, పైనజెప్పబడిన వ్యాధియు అట్టివిధమగు సర్వసాధారణ ఉద్రేకజ్వరము, ఎకోనైటు రసముతో అతిసూక్ష్మరూపములో తయారుచేయబడిన ఒకటిరెండు మోతాదుల మూలమున తొలగింపబడి సత్వరముగ శాశ్వత నివారణగావింపబడిన దృష్టాంతరములనుబట్టి ఋజువుచేయబడుచున్నది.

ఈవిధముగనే స్థానిక, ఉద్రేకములగు వాపులయందుగూడ, బ్రొసియస్‌యొక్క పిచ్చిపద్ధతుల ననుసరించిప్రస్తుతము అనుసరింపబడు జలగలనుపట్టించు రక్తము హరింపజేయు పద్ధతిలోగూడ ప్రాచీన విధానవైద్యులు

దలి వ్యాధిగ్రస్తమైన ప్రతిభాగమును ప్రతిఘటించుటకు తలంచి ప్రమాదకర సంఖ్యాకములైన జలగలు పట్టించి తొలగించుట విధియని భావింతురు.

ఇట్లు చికిత్స గావించుట మూలమున హేత్వర్థక నిర్ణయములను, శిరసావహించి, యుక్తమైన పద్ధతిలో చికిత్స గావించుచుంటిమని ప్రాచీన విధాన వైద్యులు తలంతురు. మరియు, ముక్కు, చెవి, ఆసనము, మొదలగు స్థానములయందు వ్రేలాడు కంతుల సంబంధమగు (Polypus) అను వ్యాధియందు బంధములు ఉపయోగించుట, మాంసగ్రంధులయొక్క కఠినమైన వాపులకు స్థానికముగ లేపనములమూలమున ఉద్రేకముగలుగజేసి చీముపట్టించుట, కంతులు కోసివేయుట, ఆసన సంబంధమైన, కంటిసంబంధమైన ఫిస్టులాను (Fistula) శస్త్రము

---

పొరబడుచున్నారు. ఇట్టి చికిత్సవలన ప్రథమమున బాధకొంతవరకు శాంతించినప్పటికి సత్వర శాశ్వితనివారణ ఎంతమాత్రము గలుగజాలదు. మరియు నిట్టి విధమగు చికిత్సగావింపబడినభాగము వ్యాధితో నీరసించి (తరచుగా యీనీరసము శరీరమునందంతటను యగుపించును) యీవాపునకు కారణము స్థానిక రక్తాధిక్యమని తలంచుటలోగల పొరబాటును యగుపరచును. మరియు నిట్లురక్తముతీసివేయుటమూలమున సంభవించు అనంతరఫలితములు మిక్కిలి విచారకరముగ నుండగలవు. ఇట్లు అన్యాయముగ రక్తముదీసి వేయుటకుమారు యీచైతన్య కరస్థానిక ఉద్రేకప్రకోపమునకు అతిసూక్ష్మమైన ఎకోనైటు మోతాదుగాని పరిస్థితులనుబట్టి బెల్లడోనా మోతాదుగాని ప్రయోగించినపక్షమున నీయుద్రేకము త్వరలో శాశ్వితముగ తొలగి వ్యాధియంతయు నిర్మూలమయి నివారణయగును.

చేయుట, స్థనములయందలి కంతులను శస్త్రము చేసి తీసి వేయుట, చైతన్యరహితమైన అవయవములను ఛేదించి వైచుట మొదలగు సాధనములు గావించుటమూలమున వ్యాధిని సమూలముగ నివారణ చేయుచుంటిమనియు, వ్యాధి కారణమునకే చికిత్సగావించుచుంటిమనియు విశ్వసింతురు. మరియు వ్యాధి నణచిపెట్టు ఔషధములు ప్రయోగించి కాళ్ళయందలి దీర్ఘకాలమునుండియు స్రవించురణములకు ఆక్సైడ్ ఆఫ్ లెడ్ కాపరు, లేక జింకు(Oxide of lead, copper or Zinc)మొదలగునవి పైకిఉపయోగించిన నిర్మూలమగుననియు (రోగికి తరుచుగ భేదిమందులుగూడ నిచ్చుచు గావించు చికిత్స మూలమున రోగికి నిస్సత్తువ గలుగును గాని యీవ్యాధికి మూలాధార రక్తదోషమునందెట్టి గుణమును గలుగదు)ఎండిపోవు ఆసనగండ మాలను స్థానికముగ నిర్మూలము చేయుట మూలమున నశించిపోవుననియు కొరుకుపుండ్లకు తీవ్రమైనమందులు వ్రాసి చురకపెట్టిన నిర్మూలమగుననియు, చిడుము, సల్ఫరు, ఆక్సైడ్ ఆప్ లెడ్, మెర్క్యురీ లేక జింకు వీనితో తయారు చేయబడిన తైలములతో తొలగింపబడుననియు, కంటి వ్యాధులు లెడ్ లేక జింకు ద్రావకముతో అణచిపెట్టిన నివారణ యగుననియు కాళ్ళయందు చేతులయందు లాగుచున్నట్టి బాధలు కర్పూరతైలముతో చేయబడిన లేపనములు మూలమునను ఎమ్మోనియా హైడ్రేటుతో చేయబడిన తైలముమూలమునను ఇంగిలీకము, అంబరుకాల్చి పొగపట్టుట మూలమునను తొలగిపోవు

ననియు తలంతురు. ప్రతివ్యాధి యందును వ్యాధి కారణమును బట్టి సయుక్తమైన చికిత్సగావించి బాధను తొలగించి వ్యాధిని జయించితిమని భావింతురు గాని పర్యవసానమేమి? ఇట్టి చికిత్స మూలమున వ్యాధి దేహమునందలి ఒకభాగమునుండి వేరొక భాగమునకు మారుచుండు వ్యాధిగ పరిణమించి (Matastic affections) వెంటనే గాని లేక కొంతకాలమైన పిమ్మటగాని పూర్వముకంటె, విపరీతమైన స్థితితో క్రొత్తవ్యాధి రూపమున తప్పక యగుపించగలదు. అప్పుడు లోగడగావించినతప్పిదము రుజువయి వ్యాధుల యొక్క లోతగు సూక్ష్మస్వభావమును, సూక్ష్మశక్తిమూలముననే నివారణ చేయబడు సూక్ష్మశక్తికర ఔషధముల మూలమున చికిత్సగావించవలయునని యీప్రాచీన విధాన వైద్యులు కండ్లు తెరువక తప్పదు.

ప్రాచీన విధాన వైద్యులు కొంచెమెచ్చు తగ్గుగ నేటి వరకు, (మిక్కిలి ఆధునికముగ యనిచెప్పజాలను) వ్యాధులను జనింపజేసిన భౌతిక కారణమును (Material Causes)శరీరము నుండి తొలగించుటకు వ్యాధులయందలి వ్యాధికర పదార్థములను (ఆమ్ల పదార్థములును) రక్తనాళములునుండి మేధస్సు పారెడి నాళమునుండి (Lymphatic glands) చర్మము, మూత్రావయవము లాలాజలమూరెడు కోశము విసర్జనావయవములు మొదలగువానినుండి శ్లేష్మరూపమున ఊపిరితిత్తులనుండి కంఠమునుండి వాంతులు విరోచనములు మూలమున జీర్ణకోశ, మలకోశములనుండి బైటకు దోసివై చి యిందుమూలమున

తిరుగలేని హేత్వర్థక చికిత్స గావించవచ్చునని యొక ప్రియమైన భావము గలిగియుండిరి.

వ్యాధిగతశరీరములో అన్యపదార్థములను (Issues and setores) జొనుపుటమూలమున శరీరమున రంధ్రములుగావించి (ప్రాతరణములక్రింద మార్పుజెందిన యీపుండ్లు సంవత్సరములకొలది యుంచబడును.) పీపాకుగల కుళాయిమరత్రిప్పి అందలి మురికినీరు తీసివేసినట్లు యీరంధ్రములద్వారా వ్యాధిగ్రస్త దేహమునుండి వ్యాధియొక్క స్థూలదోషమంతయు (ఎల్లపుడు సూక్ష్మశక్తికరమై మాత్రమే యుండును) తీసివేయ ప్రయత్నింతురు. నిరంతరము శరీరముపై వేయు మెజరీం సంబంధమైన లేపనములు మొదలగు దానిమూలమున, శరీరమునందలి మలినపదార్థములను తొలగించి వ్యాధిగత శరీరమును అతిశుభ్రముగ నుంచుటకు యోచించెదరు. ఇట్టి అనాలోచిత అస్వభావిక పద్ధతుల మూలమున సర్వసాధారణముగ వ్యాధినివారణ యసాధ్యమగు హీనస్థితిలోనికి బెట్టబడుచుండెను.

నివారణచేయదలచు వ్యాధులయందువైద్యునిమనమున నొకభావమేర్పరచు కొంతవ్యాధికరపదార్థము గలదని (రోగియిట్టి యభిప్రాయములకే గూడ తావొసంగును గాన) భావించుట మానవదౌర్బల్యమున కనుకూలమైయుండగలదని నేనంగీకరింతును. ఏలనన యీసందర్భమునందు వైద్యుడు, రక్తమును శరీరమునందలి యితర స్రావములను శుభ్రపరచుటకు, మూత్ర విసర్జనము విస్తారముగావించుటకు, చెమట విస్తారముగ పట్టించు

టకు, కఫము వృద్ధిచేయుటకు, జీర్ణకోశము, మలకోశము, కాళీ చేయుటకు అవసరమగు వలసినన్ని ఔషధములు సంపాదించు కొనుటకంటె తీసికొనవలసిన జాగ్రత్తవేరేమియులేదు. గావుననే నేటివరకు పదార్థతత్వశాస్త్రము (Materia medica) ను గూర్చి ప్రచురణము గావింపబడిన ప్రతి గ్రంథమునందును గూడ వ్యక్తిపరౌషధములయొక్క ప్రత్యేక విచిత్రగుణములను గూర్చి ఏమియు వ్రాయబడియుండలేదు. గాని పలువిధములైన వ్యాధి నిరూపరణా నామములుగల వ్యాధులలో నీమందులుపయోగిం చునని భావింపబడుటచే మూత్రము వృద్ధిచేయు ఔషధము, కఫమువృద్ధిచేయు ఔషధము, చెమటనుపట్టించు ఔషధము, ఋతుస్రావమును వృద్ధిచేయు ఔషధము, అనియు మరియు జీర్ణకోశమునుండి లేక మలకోశమునుండి అధోముఖముగ వెలు వరించునా లేక ఊర్ధ్వముగ వెలువరించునా? యను వివరములు యుందు తెలుపబడియున్నవి. వైద్యునియొక్క సమస్త ఆశయ ములు ప్రయత్నములు ఆతడు వ్యాధికారణమని భావించు స్థూలవ్యాధికరపదార్థములను వివిధఅమ్మ పదార్థములను వెలువ రించుటకైయుండి వానిమీదనే ఎల్లపుడు ప్రధానముగ లక్ష్య ముంచబడుచుండెను. గాన పదార్థతత్వశాస్త్రమునందిట్టి వివర ములే యొసంగబడెను.

సులభమగు మార్గమున వ్యాధినివారణ వ్యాధికరస్థూల పదార్థమును తొలగించుటమూలమున సంభవింపగలదని భావిం పబడుటచే తదనుగుణ్యమగు చికిత్సాపద్ధతి కనుకూలముగ నుం

మటకు చాతుర్యముగ వ్యర్థభావములు కల్పనజేయబడెను. ఇవి యన్నియు స్వప్నతుల్యమై నిరాధార • భావనాయుతమైన వట్టి యూహలు మాత్రమే యైయున్నవి. గాని వ్యాధులయొక్క ప్రధానస్వభావము, వానియొక్క నివారణ, యిట్టివిధమగు భావనాయుత విలాసములకు సాధ్యమగునవిగావు. వైద్యుని యొక్క సులువుమార్గమున కనుగుణ్యముగ వర్తించునవియు గావు. ఇట్టి వివేకవిహీనమైన నిరాధారభావనల కనుగుణ్యమై యుండుటకు, వ్యాధులు, కార్యాచరణస్పర్శజ్ఞానములయందు, ఆధ్యాత్మికజీవపద్ధతులయొక్క చైతన్యకర (ఆధ్యాత్మిక) వ్యాధికరమార్పులై అనగా, మన ఆరోగ్యపద్ధతులయందలి సూక్ష్మకరవ్యాధిగతమార్పుగ (immaterial derangments) నుండనుండయుండవు. అనగా వ్యాధులు సూక్ష్మకరవ్యాధిగతమార్పులుగాని వేరొండుగావు.

‡1 అన్యస్థూలపదార్థమెంతటి సౌమ్యకరముగ మనకు యగుపడుచు, స్వల్పముగ, యున్నప్పటికి నది రక్తనాళములో ప్రవేశపెట్టపడినపుడు, అది యొక విషపదార్థమువలె జీవశక్తి చే తక్షణము బైటకు త్రోసివేయబడుచున్నది. గాన మనవ్యా

‡1 నల్లరక్తనాళములోనికి (Vein) గొంచము పరిశుద్ధమైన నీరు యింజక్షను చేయుటచే ప్రాణహానిసంభవించెను (రాయల్ సొసైటీచరిత్రము) రక్తనాళములోనికి గాలియింజక్షను చేయుటచే మరణము సంభవించెను. (జె. యమ్. వగ్నపత్రిక పేజీ 25) నల్లరక్తనాళములోనికి యింజక్షను చేయబడిన మిక్కిలి సౌమ్యమైన ద్రవముగూడ ప్రాణహానికలుగజేసెను. (ఆబెక్రీద్ యొక్క శరీరశాస్త్రము పేజీ 784)

ధులయొక్క కారణభూతము స్థూలకరమై యుండజాలదు. ఇట్లు హైటకు(త్రోసివేయబడనిపక్షమున మరణముసంభవించును.

శరీరమునందలి సున్నితమైన భాగములలో అతిసూక్ష్మమైన కరర్రిముక్క గుచ్చుకొన్నప్పటికి, బాధ, జ్వరము, చీము పట్టుట, పుండుపడుట, సంభవించి ఆముక్కను తొలగింపజేసిన గాని శరీరమునందంతటనుగల జీవపద్ధతి (Vital principle) శాంతినొందదు. ఇరువదిసంవత్సరములనుండిగల ఒక చర్మసంబంధవ్యాధిలో హానికరమైన చర్మసంబంధవ్యాధి కరస్థూలపదార్థమును (చర్మముపైగల పొక్కుసంబంధమైన, స్కాఫ్యులా సంబంధమైన, ఆమవాత ఆమ్లసంబంధమైన, స్థూలపదార్థమును) శరీరమునందలి ద్రవములయందు జీవపద్ధతిఎట్లు పరిశాంతముగ సహించి యుంచుకొనగలదు? ఏవ్యాధినిరూపణ శాస్త్రజ్ఞుడైనను, మిక్కిలి నమ్మకముగ నీవిషయమును దెల్ప నధికారముగలిగి యుండుటకు, అందుపై చికిత్సాపద్ధతి నిర్మాణముచేయుటకు నెప్పుడైనను స్వయముగ తనకండ్లతో నీపదార్థమునుగాంచి యుండెనా? ఏవ్యక్తియైనను, ఆమవాతముయొక్కవ్యాధి కర పదార్థమును స్కాఫ్రిఫ్యులాయొక్క విషమును యగుపరచుటకు ప్రయత్నించి కృతార్థుడయ్యెనా?

చర్మముపై గాని పుండుపై గాని పట్టింపబడినస్థూలపదార్థ (Meterial Substance) అంకురమున (Infection ) వ్యాధులను వ్యాప్తిజేయునప్పుడు (తరచుగా వ్యాధి విచక్షణాశాస్త్రమునందు సమర్థింపబడిన విషయము) యీపదార్థమునందలి

కొంతస్థూలపదార్థము శరీరద్రవములలోనికి ప్రవేశించెననియు లేదా ఇందుగొంత శరీరరంధ్రములలోనికి పీల్చబడి గ్రహింపబడెననియు 1‡ ఎవ్వరు రుజువుచేయగలరు?

దుష్టసంయోగము గావించిన పిమ్మట, ఎట్టి ఆలస్యము గావింపక మిక్కిలి జాగరూకతతో మర్మావయవములను గడిగినంతమాత్రమున సుఖసంబంధకొరుకు వ్యాధి అంకురింపకుండ శరీరమును సంరక్షింప జాలరు. మసూచికము దగిలియున్న మనుష్యుని శరీరమునుండి వచ్చు ఒక్క శ్వాసమాత్రపుగాలి ఆరోగ్యమైన బిడ్డయందు భయంకరమైన మసూచిక వ్యాధి కలుగజేయుటకు జాలును.

ఈమొదటి యుదాహరణ యగు సుఖసంబంధమైన వ్యాధిలో (నివారణ చేయక వదలిన జీవితాంత్యము నందు మరణముతోనే నిర్మూలమగును.) దీర్ఘరక్తదోషము(సవాయి) వృద్ధి జేయుటకు శరీరద్రవముల లోనికి ఎంతపరిమాణముగల స్థూల పదార్థము గ్రహింపబడినది? రెండవ ఉదహారణయగు శరీరమంతయు చీము పట్టు పొక్కులతో *1 తరుచు సత్వర మరణ

1‡ గ్లాస్గో పట్టణమునందు ఏనిమిది సంవత్సరముల వయస్సు గల నొకబాలికకు పిచ్చికుక్కకరచిన వెంటనే శస్త్రచికిత్సకుడు, కరచిన భాగమును గోసి తీసివైచి శుభ్రపరచెను. గాని ముప్పది ఆరుదినములు గడచిన పిమ్మట హైడ్రోఫోబియా యను పిచ్చికుక్కకాటువలనగలుగు వ్యాధిసంభవించి రెండుదినములలో మృతినొందెను.

*1 వ్యాధిఅంకురము (Infection) సంభవించినపుడు, దీర్ఘవ్యాధి (miasm) రూపములోగాని, ఒకస్థూలపదార్థము లోపలకు ప్ర

ము గావించు మసూచికము నందు శరీరద్రవములలోనికి ఎంత పరిమాణము గల స్థూలపదార్థము గ్రహింపబడినది?

---

వేశించినట్లుగాని, యగుపించదు. అయినప్పటికి వ్యాధులయందు తరుచుగా సంభవించు, విస్తారమైన మురిగిన మలసంబంధమైన పదార్థమ్ముగూర్చియు, దుర్వాసనతోగూడిన స్రావముగూర్చియు, సమాధానముచెప్పుటకును నివి వ్యాధిని ఉద్రేకింపజేసి నిలిపియుంచు స్థూలపదార్థములని, తె ఎవుడుజేయ గలిగియుండుటకును అంకురించినపదార్థ మెంతసూక్ష్మమైయున్నప్పటికి, శరీరములో నీపదార్థము మార్పుజెందక యితరపదార్థమును తనవంటి దుష్ట పదార్థముగ, మార్పుజెందించు వస్తువుగనె (ferment) పనిజేసి, శరీరము నందలి ద్రవములనన్నిటిని అట్టివిధమగు అపరిశుద్ధముగావించి, యీవిధముగా శరీరమునందలి ద్రవములను అట్టివిధమగువ్యాధికర ఫిర్మెంట్సుగా మార్పు జెందించుటమూలమున, నివి ఎడతెగక వ్యాధితో వృద్ధిజెందుచు వ్యాధిని పైకిదీసికొనివచ్చుచుండునని సమాధానమొసగబడి భావనిర్మితసూత్రమున ) Hypothesis ) నిట్టి యభిప్రాయ మవలంబింపబడెను. గాని పరిశుద్ధజేయు బలకరమైన ఎట్టి ఔషధముద్రావకములు నిరంతరము వృద్ధిజెందు ఫిర్మెంటులను, వ్యాధికర పదార్థమని తలంచు యీ రాసినుండి యీసూత్రమును బట్టి తిరిగి తక్కిన పదార్థము క్రొత్తవ్యాధికర పదార్థముగ జేయబడకుండుటకు ఫెర్మెంటుయొక్క ఒక్కరేణువైనను లేకుండ శరీర ద్రవములను పరిశుద్ధముజేసి శుభ్రపరుపగలవు? ఇది నిజమైన పక్షమున నీ మార్గమున నీవ్యాధులను నివారణ జేయుట నిస్సందేహముగ అసాధ్యము సమస్త భావనిర్మిత సూత్రములు, సత్యమునుండి నిర్మింపబడనిచో ఎంతటి బుద్ధివిశేషముతో కల్పింపబడి నప్పటికి ప్రత్యక్షమైన అసంగతములలోనికి దోవజూపగలవు. సోరాతో క్లిష్టమైయుండి ముక్కులి లోతుగ వేళ్లు బారి యున్న సవాయి వ్యాధి పేటెన్సీలోగల మెర్క్యూరీ (పాదరసము) యొక్క ఒకటి రెండు మోతాదులచే సోరా తొలగింపబడిన పిమ్మట నివారణ చేయ బడి అందుమూలమున శరీరద్రవముల యందలి సవాయి దోషము శాశ్విత ముగ (సూక్ష్మశక్తిలో) నిర్మూలము గావింపబడి తొలగింపబడుచున్నది.

ఈవ్యాధులయందును యిట్టివిధమగు యితర సమస్త వ్యాధులయందును, రక్తములోనికి స్థూలవ్యాధికర పదార్థము ప్రవేశించుచుండెనను భావమును, ఆదరించుటకు సాధ్యమగునా? మిక్కిలి దూరదేశమున రోగిగదియందు వ్రాసినఉత్తరముద్వారా, యీవుత్తరమును జదివిన పురుషునకు అలంటు వ్యాధి తరుచుగా గలుగజేయబడుచున్నది. ఈసందర్భమునందు స్థూలవ్యాధికర పదార్థము శరీరద్రవములలోనికి బ్రవేసించునను యభిప్రాయము అంగీకరింపబడగలదా? గాని యిట్టి దృష్టాంతరములు అవసరమేమి? ఉద్రేకముగలుగ జేయు ఒక్కమాట ప్రమాదకరమైన పైత్యజ్వరమును తీసికొని వచ్చుట ఎంత తరుచుగా సంభవించుటలేదు? మరణమును గూర్చి తెల్పబడిన జ్యోతిషము సరిగా ఆకాలమునకు మ ర ణ ము ను గలుగజేసి యుండెను. హఠాత్తుగా తెల్పబడిన సంతోషవార్తగాని, దుఃఖవార్తగాని, ఆకస్మికమరణము గలుగజేసి యుండెను. ఈసందర్భములయందు స్థూలముగ తొలగించి శుభ్రపరచినగాని నివారణ అసాధ్యమనబడు శరీరములోనికి ప్రవేశించిన స్థూలవ్యాధికర పదార్థమేది?

ఈవ్యాధికర పదార్థ సూత్రబోధులు ప్రాణియొక్క ఆధ్యాత్మిక స్వభావము గూర్చియు వ్యాధోద్రేక కారణముల యొక్క ఆధ్యాత్మిక చైతన్యకరశక్తిగూర్చియు దెలిసికొనక అనాలోచితముగ నిర్లక్ష్యము జేయుటకు సిగ్గుపడవలయును. ఇట్లు తెలిసికొనక పోవుటచే వ్యాధిగ్రస్తమైన శరీరమునుండిలేనివ్యాధి

కరపదార్థమును తొలగించు ప్రయత్నములో వ్యాధినివారణ చేయుటకు మారు ప్రాణము దీయుచు వట్టిపాకీ పనిజేయు డాక్టర్లుగ (Scavenger Doctors) తయారగు చుండిరి.

వ్యాధులయందు సంభవించి విసర్జింపబడు యీమలిన పదార్థములు (excretions) నిజముగ వ్యాధులను జనింపజేసి, వృద్ధిగావించు పదార్థములా? 1‡

ఈవిసర్జింపబడు మలిన పదార్థములు ఎల్లప్పుడు వ్యాధి నుండి జనించిన అనగా, సూక్ష్మశక్తికరముగ వ్యాధిగ్రస్తమై అనారోగ్య స్థితియందున్న ప్రాణినుండి జనించిన మలిని పదార్థములుగావా? వ్యాధి ఉత్పత్తినిగూర్చియు, వ్యాధియొక్క స్వభావమును గూర్చియు యిట్టి అన్య స్థూలాభిప్రాయములతో అనామకవైద్యుడు, యీవైద్యవిధానములను నిర్మించిన నిర్మాణ కర్తలు వీరందరు గూడ చేయు ప్రయత్నము లన్నియు ఊహించబడిన యీవ్యాధికర స్థూలపదార్థమునను ప్రత్యేకించి విసర్జింపజేయబడుటకే నిర్ణయింపబడి లాలాజలము, శ్లేష్మ కళ్లెలు, చెమట, మూత్రము మొదలగు విసర్జనముల ద్వారా మూలికలయొక్క సౌమ్యమైన పలువిధ కషాయముల మూల మున లేని యీవ్యాధికరస్థూల పదార్థమును తొలగించి రక్తమును పరిశుద్ధము గావించుటకే యయి యుండుటచే నిందు

1 ‡ అట్లైన పక్షమున చీది, ముక్కు జాగ్రత్తగా తుడిచివేసి దీర్ఘకాలమునుండిగల రొంపను నిశ్చయముగ త్వరలో నివారణజేయవచ్చును.

విపరీతమైన హాని ప్రాప్తించుచుండుటచే భావనాయుత స్థూల పదార్థమును తొలగించు ‡1 మార్గమున గావించు యీచికిత్సా

---

1‡ క్రిమిసంబంధమైన వ్యాధులలో, విరేచనకరౌషధముల మూలమున, విరోచనములుకలిగించి క్రిమివెడలగొట్టవలసిన అవసరమున్నట్లు కనబడును. ఇదిగూడ వట్టిఅసత్యము. కొంతమందిపిల్లలో (Lumbrice) అను క్రిమి కొలదిగనుండును. చాలమందిపిల్లలలో నులిపురుగు విస్తారముగా నుండును. అనారోగ్యకరమైన పద్ధతిలోగడుపు జీవితముతో సర్వసాధారణ తత్వచిహ్నము గలిసి ( సోరా ) యుండు పరిస్థితులపైనది ఆధారపడియుండును. అనారోగ్యజీవితపద్ధతి చక్కజేసి, సారూప్యపద్ధతిని క్రిమికి చికిత్సజేసినపక్షమున యీవయస్సులో సులభముగ గుణముగలుగును) ఒక్కనులిపురుగైనను యగుపడకుండ నివారణయగును. ఈవిధముగ చికిత్సచేయబడినపిల్లలు తిరిగిఎన్నడును యీక్రిమిచే బాధపడరు. గాని సినాపిత్తులతోకలుపబడిన భేదిమందులిచ్చినపిమ్మటగూడ విస్తారముగ యీనులిపురుగు తిరిగి యగుపించగలదు.

బద్దెపురుగు (Tape worm) అను ఒకవిధమైన ఏటికపాము, క్షయములో మానవజాతిని హింసించుటకు సృష్టింపబడిన యీరాక్షసిని, తొలగించివేయుటకు, సర్వప్రయత్నములు గావింపవలయునని కొందరు విపరీతముగ బల్కుటవింటిని. ఒక్కొక్కప్పుడిది తొలగింపబడుట సత్యమే! గాని ఎట్టిశ్రమతో! ప్రాణమునకు ఎట్టి అపాయముదో! ఈబద్దెపురుగును తొలగించుటకు ప్రయోగించబడు భయాకరతీవ్రవిరేచనకరౌషధములకు ఎన్నివందల మానవప్రాణములు, అర్పణచేయబడినవి. అట్లుగాక చావునుండి తప్పించుకొనిన వ్యక్తులు ఎన్నిసంవత్సరములు అస్వస్థతతో బాధపడియుండిరి! మరియు ఆరోగ్యమును ప్రాణమును నిర్మూలముచేయు యిట్టి భేదిమందులను కొన్నిసంవత్సరములు తరుచుగా ప్రయోగించినప్పటికి యీపురుగు బయటపడకుండుట ఎంత తరుచుగా చూచుచుండుటలేదు! ఈ ప్రయత్నములతో బద్దెపురుగునుతొలగించినప్పటికి, తిరిగి సంభవించుటలేదా!

ల గూర్చి అంత ఆశ్చర్యము జెందననవసరము లేదు. మరియు యీవ్యాధికరస్థూలపదార్థమును (Setons, issues) మొదలగు సాధనముల మూలమునను చర్మముపై వేయబడు రక్షలు మెజీరం పట్టయొక్క పట్లు మొదలగు సాధనముల మూలమునను మలకోశములద్వారా భేదిమందుల మూలమునను తొలగింప జూచు యత్నములకు అంత ఆశ్చర్యము జెంద నవసరములేదు. అనేకములైన సాధనముల మూలమున తొలగింప యత్నించు శత్రుకరమైన యీవ్యాధికర పదార్థమని ఊహింపబడు యీ పదార్థము మానవశరీరమున వ్యాధిని కలుగజేయుటగాని నిలిపి యుంచుటగాని జరిగింపజాలదు. వ్యాధియనునది ప్రాణియొక్క కార్యాచరణ స్పర్శజ్ఞానములయందు, ఆధ్యాత్మిక సూక్ష్మశక్తి కరమార్పులు గాని వేరొండుగాదు.

గాన అజీర్ణ పదార్థములుగాని యితర హానికర పదార్థములుగాని జీర్ణకోశములోనికి గాని లేక యితరశరీరద్వారముల లోనికి గాని ప్రవేశపెట్టబడు మూ ల ము న ను శరీరములోనికి గుచ్చుకొని ప్రవేశించు అన్యవస్తువుల మూలమునను సంభవించువ్యాధులుగాక తదితర సమస్త వ్యాధులు, స్థూలపదార్థముల మూలమునగాక ఆరోగ్యముయొక్క విచిత్రమైన సూక్ష్మశక్తికరమార్పుల మూలమున సంభవింప గలవని నిస్సందేహముగ అంగీకరింపవచ్చును. ఇట్టి సందర్భములయందు మానవజాతియొక్క ప్రధానవ్యాధులలో అనగా దీర్ఘస్వభావముగల వ్యాధులలో యిట్టి చికిత్సాపద్ధతిచే (అల్లోపతి) మంచికి బదులు

పద్ధతి ఎట్టి అన్యాయమగు పద్ధతియో, వివేకముగల ప్రతి వ్యక్తికిని గోచరించగలదు.

---

ఈ బద్దెపురుగును చంపి, తొలగించుటకు యాకూర్రమైన తీవ్ర ప్రమాదకర ప్రయత్నముల యొక్క అవసరము కొలదిపాటియు లేకుండ జరుగదా!

ఈజాతి బద్దెపురుగులు సోరాతత్వదోషముతోనే సంభవించును. ఈ తత్వదోషమును నివారణజేసిన నివి యదుర్శ్యమగును. నివారణ పూర్తి జెందక పూర్వము, రోగి మితమైన ఆరోగ్యము ననుభవించుచున్న పరిస్థితులలో యీబద్దెపురుగు ఎట్టికలతయు కలుగజేయక మలకోశములో అందుండు మలముతో జీవించుచు కోశమునకు తగులక ఎట్టిబాధయు కలుగజేయక యుండగలదు. గాని ఏదైన తరుణవ్యాధిరోగికి సంభవించినప్పుడు మలకోశమునందలి పదార్థము యీజంతువునకు భరింప నశక్యమై మెలికలుదిరుగుచు సున్నితమైన కోశమునకు ఉద్రేకము కలుగజేసి విచిత్రమైన తరగతి శూలతో రోగియొక్క బాధలు విశేషముగ వృద్ధిజేయును. (ఈవిధముగనే గర్భములోనిపిండము తల్లివ్యాధిగ్రస్తమైనప్పుడు అస్థిమితము జెంది తిరుగుచు తన్నుచుండును. తిరిగి తల్లికి ఆరోగ్యముచేరిన పిమ్మట యిట్టిబాధలు గలుగజేయక గర్భకోశదర్శము నందీదు చుండును)

ఈబద్దెపురుగు (Tape worm) అను ఒకవిధమగు ఏటికపాముల తో బాధపడు రోగులయొక్క బాధలు, (సారూప్య పద్ధతిని) మేల్‌ఫీరణ్ వేరుయొక్క ద్రావకపు చిన్న మోతాదుతో సర్వసాధారణముగ అతిత్వరితముగ నివారణ జేయబడును. గాన యీవిషయము గమనించదగి యున్నది. ఈఔషధముచే యీపురుగునకు గలిగిన అస్థిమితమునకు కారణభూతమగు అనారోగ్యము అప్పటికి తొలగింపబడును. అందుపై యీజంతువు తిరిగి మలకోశము నందలి మలములో రోగికి ప్రత్యేకమైన నెట్టిబాధలు కలుగజేయక స్వస్థతగ నుండగలదు. పిమ్మట సోరా శాంతికర చికిత్సగావించి సోరాను తొలగించిన పక్షమున మలకోశమునందలి పదార్థము యీబద్దెపురుగునకను

వ్యాధులయందగుపించు మలిన పదార్థములు నిశ్చయముగ విశేషముగ వ్యాధిగ్రస్తమైన శరీరము యొక్క వ్యాధి నుండి పుట్టిన పదార్థములేగాని వేరొండుగావు. ఇవి శరీరము చేతనే తగినంత తీవ్రముగ (తరుచుగ మిక్కిలి తీవ్రముగ) వెల వరించు సాధనసహాయ మవుసరము లేకుండగనే బయటకు త్రోసివేయబడుచుండును. శరీరము వ్యాధితో బాధపడునంత కాలము ఎల్లప్పుడు క్రొత్తమలిన పదార్థము వృద్ధిజెందుచుండును యదార్థమైన వైద్యుడీ పదార్థములను, వ్యాధియొక్క సరియైన లక్షణములుగ పరిగణించవలయును. వైద్యుడు సారూప్యౌషధ వ్యాధికర ప్రతిసిధుల మూలమున వ్యాధిని నివారణ జేయుటకును వ్యాధియొక్క స్వభావమును కనుగొనుటకును యీలక్షణములు వ్యాధి యొక్క సరియైన చిత్రమును ఏర్పరచుటకు సహాయ భూతమగును.

కాని ప్రాచీనవిధాన ఆధునిక అనువర్తనులు, స్థూల వ్యాధికరపదార్థములను తొలగించుటకే వారి చికిత్సయందు లక్ష్యముంచుచుండిరని భావించుటకు అంగీకరింపరు. వారిచే గావింపబడు పలువిధములైన విరోచనకర పద్ధతులను వ్యతిరేక ఉద్రేకము (Derivation) మూలమున గావించు చికిత్సాపద్ధతి యని తెల్పుదురు. ప్రకృతి వ్యాధిగతమైన శరీరమునకు సహా

---

కూలింపక తత్క్షణము అదృశ్యమగును. ఇట్లు భేదిమందులవసరము లేకుండ సారూప్యచికిత్సచే నివారణ చేయబడిన రోగియందు నీబద్దెపురుగు తిరిగి యగుపించకుండ అదృశ్యమగును.

య భూతమై జ్వరమును, చెమట, మూత్రము మూలమునను ప్లూరసీవ్యాధిని ముక్కునుండి రక్తస్రావములు, చెమట, శ్లేష్మ కళ్లెలు మూలమునను యితర వ్యాధులను వమనములు, విరేచనములు, ఆసనమునుండి రక్తస్రావములు, మూలమునను కీళ్ళ బాధలను కాలియందు చీముపట్టి బయలుదేరు రణముల మూలమునను, వాపుతో గూడిన గవదకాయల వ్యాధిని, లాలాజలము మొదలగు వాని మూలమునను హరింపజేయును. లేక వ్యాధిస్థానమునకు దూరముగనుండు భాగములను మరియొక వ్యాధిరూపముగ మారి అచ్చట వృద్ధిజెందుట మూలమునగాని రణముల క్రిందవృద్ధిజెందుట మూలమునగాని తొలగించును.

కాన యీవిధాన వైద్యులు ప్రకృతిని అనుకరించుటయే యుత్తమమైన పద్ధతిగ నెంచి ఎట్టి సహాయముగలుగ జేయక వదలి వేయబడిన జీవశక్తి అనుకరించుపద్ధతిని ప్రదక్షిణ మార్గమున అపసవ్య పద్ధతిని వ్యాధుల చికిత్స చేయతలంచిరి. 1*

వ్యాధిస్థానమునకు దూరముగనున్న అవయవములకు వైరూప్యమైనట్టియు (Heterogeneous) వ్యాధిగతమైన శరీర నిర్మాణపదార్థములకు సంపూర్ణముగ విభేదమైనట్టియు, తీవ్ర

*1 శరీరమున బలమును నశింపజేయక వ్యర్థప్రయాసను బొందింపక హోమోపతీ చికిత్సయందు గావించురీతిని వ్యాధిలక్షణములపై సూటిగ పని చేయు, సాదృశ్యసూత్రకర ఔషధప్రతినిధుల మూలమున సత్వరముగ వ్యాధిని నిర్మూలము చేయుటకు బదులు, అల్లోపతీవైద్యులు యీ అపసవ్య పద్ధతిని తలంచియుండిరి.

మైన ఉద్రేక కరపదార్థములను ప్రయోగించుటమూలమున విరేచనములు గలుగజేసి అచ్చటనుండి వ్యాధినిబైటకు లాగుచున్నట్లు విరోచనములు సాగించుచు ఇట్టిఅపసవ్యపద్ధతిని అల్లోపతీ వైద్యులు వ్యాధులను చికిత్సచేయతలంచితిరి.

వ్యతిరేక ఉద్రేకమను (Derivation) యీపద్ధతి ప్రాచీనవిధాన చికిత్సాపద్ధతులలో నొకప్రధానపద్ధతిగ నింతవరకు నడచియుండుటయేగాక యింకను నడచుచున్నది.

ప్రకృతియొక్క స్వయంసహాయ కార్యాచరణయని కొందరిచే పిలువబడుపద్ధతి యనుకరించుటకో యీప్రాచీన విధానవైద్యులు ఔషధజనితవ్యాధిని సహింప సమర్థములై యున్నటువంటివిన్ని, వ్యాధిగ్రస్తముగానటువంటివిన్ని, బలాత్కారముగ కండరములకు నూతనలక్షణములుద్రేకింపజేసి ప్రకృతికర శక్తుల మూలమున ♦1 క్రమక్రమముగా ఆరోగ్యముచేకూరు

---

♦1 సామాన్యతరుణవ్యాధులుమాత్రమే, వానియొక్క స్వాభావసిద్ధమైన వ్యాధిపరిమాణకాలము గతించినపిమ్మట తీవ్రముగనెదుర్కొను నైరూప్యౌషధము లిచ్చినను, యీయకుండినను గూడ శాంతముగ క్షీణించి (inresolution) తగ్గిపోవును. చైతన్యశక్తి బలముచేకూర్చుకొని, అనారోగ్యస్థితినుండి శరీరమును క్రమముగ ఆరోగ్యస్థితిలోనికి మార్పుజెందించును. తీవ్రమైన తరుణవ్యాధులలో సహాయభూతమగుటకు, ప్రకృతికిగాని ప్రాచీనవిధానవైద్య విధానమునకు గాని నెట్టిశక్తియులేదు. ఈవ్యాధులయందు స్వసహాయశక్తిగలిగిన జీవశక్తిగాని, ప్రకృతిని. అనుకరించు నైరూప్యఔషధచికిత్సగాని వ్యాధిక్రమక్షీణత (Lysis) గలిగింపజాలవు. ఏదైనగొంతసుగుణము గలిగింపగలిగినచో తాత్కాలికవిరామము గలిగించును. ఈలోపుగ వెంటనేగాని కొంతకాలమైనపిమ్మటగాని యింకను మిక్కిలి దౌర్జన్యముతో ఎదుర్కొనుటకు వ్యాధి కట్టుదిట్టముజేసికొనుచుండును.

టకుంగాను యీఔషధకర వ్యాధులమూలమునను, వ్యాఘాత ముల రూపమునను (Crises) బహిష్కరింపబడు మలినపదార్ధ రూపమునను సహజముగ జనించిన వ్యాధినితొలగించి వైచుటకు †2 ప్రియత్నించియుండిరి.

ఈకార్యమును, స్వేదకారక ఔషధములు Diaphoric remedies) మూత్రికరౌషధములు, (Diuretie remedies) రక్తస్రావకారక సాధనములు, (Blood lettings) Setons, issues మొదలగు సాధనముల మూలమునను మరియు ముఖ్యముగా మలకోశములద్వారా విరోచనములు గలుగజేయుటకు ఉద్రేకము గలుగజేయు ఔషధముల మూలమునను ఒక్కొక్కప్పుడు ఊర్ధ్వముఖముగా వమనములు గలుగుజేయు వమనకరౌషధముల మూలమునను నెరవేర్చెదరు. ఈఔషధములు "భేదికర, విలీనకర ఔషధములు" ‡1 (Aprerient and dissolvent remedies) అని పిలువబడును.

ఈవ్యతిరేక ఉద్రేక పద్ధతికి (Derivative method) సహాయ భూతమగుటకు, అల్లోపతీ వైద్యులు వ్యతిరేక ఉద్రేకకరముల మూలమున (Counter irritants) తత్సంబంధమగు

---

†2 ఎట్టిదైన ఒక అభౌతికపదార్థమును తీసివేయగలిగినట్లే తొలగించి వైచుటకుప్రియత్నించపబడుచున్నది. తొలగింపవలసిన వస్తుప్రనందు వ్యాధికరపదార్థము కలదను యభిప్రాయమిచ్చుట గూడగలదు.

‡1 కరగింపజేసి తొలగింపవలసిన వ్యాధికరపదార్ధ మొకటిగలదని యీవైద్యులు ముందుగభావించి అనుకొనినట్లే యీపదభావముగూడ మోసబుచ్చుచున్నది.

చికిత్స గావించుచుండిరి. తదనుగుణ్యముగ చర్మమునకు ఉన్ని దుస్తులు, అంగరక్షలు, తగిలించుట, వికారము గలిగజేయు ఔషధము లుపయోగించుట, నిరాహార చికిత్స మూలమున జీర్ణకోశమల కోశములకు వేదన గలుగజేయుట, ఆవాలు, కేంతరైడ్సు, మునగవేరు, మెజీరం మొదలగు వానిపట్టీల మూలమున బాధ వాపుగలుగజేయుట, చీముపట్టించుట టార్ టార్ ఎమెటిక్ తైలము లుపయోగించుట, సూదులతో పొడుచుట, రక్షలు వేయుట మొదలగు సాధనముల మూలముననుయిట్టి చికిత్సకు గడంగుచుండిరి. ప్రకృతి ఎట్టి సహాయమ్ము లేక నిస్సహాయియై యున్నపుడు చైతన్యకరమైన వ్యాధిని (దీర్ఘ వ్యాధులలో) శరీర భాగములయందు గలుగచేయు బాధ, కురుపులు, పొక్కులు, చీముపట్టు రణములు, మొదలగు వాని మూలమున వదలించుకొనుటకు ఎట్లు ప్రయత్నించునో యీ పద్ధతియే అనుకరింపబడుచున్నది.

ఈవ్యతిరేక ఉద్రేకకరముల మూలమున నిస్సహాయ, హానికర అక్రమచికిత్సాపద్ధతిని అవలంబించిన ప్రాచీనవిధాన వైద్యుల వైద్యావలంభను సులభముచేయు నుద్దేశ్యము కొరకు పుట్టిన అనుకరణముగాని ప్రత్యక్షముగ సయుక్తమైన పద్ధతి ఎంతమాత్రముగాదు. ఈచికిత్సాపద్ధతి అసమర్థమైనట్టియు, నిస్సత్తువ గలుగజేయునట్టియు, హానిగలుగజేయునట్టియు చికిత్సాపద్ధతి: మరియు, కొలదికాలము వ్యాధులను ఉపశాంతి గావించును. లేదా మొదటివ్యాధి అంతరించి అంతకంటె దుష్ట

తిలో వేరొకవ్యాధి కలుగజేయుటకు దోవజూపును. ఇట్టినాశకరమగు పద్ధతిని గావించునివారణ, నివారణయని పిలువబడజాలదు.

ఈవిధాన వైద్యులు సౌమ్యమైన తరుణవ్యాధులలో గూడ జయప్రదముగాంచని 1♦ సహజ ప్రకృతియొక్క

♦1 వ్యాధులయందు శరీరమున స్వస్థతచే కూర్చుండుటకు ఔషధ సహాయములేక ప్రకృతిగావించు ప్రయత్నములు అనుకరింపదగిన, చికిత్సా ప్రతిరూపములుగ, ప్రాచీనవైద్య విధానములో పరిగణింపబడుచుండెను. గాని యిదిగొప్పపొరబాటు. తరుణవ్యాధులలో వ్యాధినుండి విముక్తిగావించుకొనుటకు జీవశక్తి గావించు, జాలిగొల్పు అక్రమప్రయత్నములను గాంచి, వివేకజ్ఞానముగల బుద్ధినుపయోగించి, స్వయంకృతహింసలు, నిలుపు జేయదగును. నూతనముగా సంభవించు వ్యాధులలో (దీర్ఘవ్యాధులలో ప్రతిరోధశక్తి చాలదు) శరీరమునందుగల వ్యాధికి సారూప్యమైన వ్యాధిని ప్రకృతికలుగజేయలేని పరిస్థితియందు (సూత్రము 43–46) అంతకుముందు గల వ్యాధికి సారూప్యమగు వ్యాధిని కలుగజేయుశక్తి ప్రకృతికిమిక్కిలి అరుదుగ గలదు. (సూత్రము 50) బాహ్యసహాయములేక స్వయముగనే, వ్యాధినితొలగించుకొనుపరిస్థితికి, ప్రకృతివదలివేయబడినపుడును, ఏవిధముగనైనను, వ్యక్తినిరక్షించుటకు తరుచుగా మిక్కిలి ప్రమాదకరమైన ప్రయత్నములుగూడ ప్రకృతిగావించును. ఇట్టిప్రయత్నములు, చూచుటకు మిక్కిలి బాధకరముగనుండుటయేగాక, తరచు రోగిప్రాణములు తీయుటతో అంతమొందగలవు.

శరీరారోగ్యమున అంతర్భాగనిర్వహణమునందేమి జరుగుచున్నదో మానవవంశసంభూతులమగు మనకు గోచరముగాదు. సర్వోపగతుడగు సృష్టికర్తయు ప్రాణికోటి సంరక్షణకర్తయు నగు భగవంతునకీవిషయ. మెట్లు దృగ్గోచరమో అట్లుమనకు, అగోచరమైయుండుట సృష్టిధర్మము

వ్యాధులయందలి అంతరంగిక వ్యాపారములు, గోపరమగు మార్గములు, బాధలు లక్షణములమూలమున విశదమగును. ఈలక్షణముల మూలమున అంతరంగమునందలి కలతను ప్రాణియే బయటకు తెలుపును. గాని వ్యాధియందు వ్యాధి కరప్రతినిధియొక్క ప్రధమగుణముచే గలుగజేయబడిన లక్షణములెవ్వియో, తన స్వస్థతకొరకుగావించు జీవశక్తియొక్క ప్రతీకారగుణము (reaction) మూలమున గలుగజేయబడిన లక్షణములెవ్వియో తెలిసికొనజాలము. ఈరెండును విభజింపనలవిగాని విధమున కలసియుండి, శరీరమునందలి, వ్యాధి బాధలనుతొలగింప, నిస్సహాయమైన జీవశక్తిగావించు సాఫల్యములేని ప్రయత్నములతో అంతరంగవ్యాధియొక్క సంపూర్ణప్రతిబింబచిత్రము యగుపించగలదు. వ్యాధియొక్క ఆఖరుదశయందు ప్రకృతి సర్వసాధారణముగా, కలుగజేయు విఘాతములు (crises) అని పిలువబడు తీవ్రగమనముతో నడచు విరోచనములలోగూడ తరచుగా తగినంత ఉపశాంతికంటె బాధ విశేషముగనుండును.

జీవశక్తి యిట్టివిఘాతముల నెందుకు కలుగజేయుచున్నది? ఎట్లుచేయుచున్నది? అనువిషయము సశరీర చైతన్యకరవ్యాపార కార్యాచరణ ధర్మము వలెనే మనకు తెలియని గూఢమగునూయ. కాని ఒక్కవిషయము మాత్రము నిశ్చయము. ప్రకృతియొక్క యీప్రయత్నములలో వ్యాధిగ్రస్తముగాని తక్కినభాగములను సంరక్షించుటకు కొంచెమెచ్చుతగ్గుగా వ్యాధిగ్రస్తమైన సమస్త భాగములు త్యాగముచేయబడి నిర్మూలముచేయబడుచుండెను. తరుణవ్యాధిని తొలగించుకొనుటకు గావింపబడు జీవశక్తియొక్క యీస్వయంసహాయ కార్యాచరణములన్నియు సేంద్రియ ప్రాణశాసనముల యాజ్ఞానువర్తనముగ గావింపబడుచుండెను. గాని బుద్ధివిశేషముతోకూడిని ఆలోచనలచే నడిపింపబడు చుండుటలేదు. విఘాతములమూలమున ప్రారంభమున వ్యాధిగ్రస్తమైన అవయవములను వ్యాధినుండి విముక్తి గావించుటకు మలకోశములకు తీవ్రమగు విశేషమైన చలనముగలుగజేసి వ్యాధిని అస్థానమునుండిస్థా

శరీరము యొక్క సేంద్రియ శాసనములపై (Organic law) ప్రాకృతిగ ఆధారపడియుండు, యుక్తాయుక్త వివేకములేని ప్రాణరక్షణశక్తి వ్యాధులయందు, యీశాసనముల కనుగుణ్యముగనే నడువ సమర్థమై యుండెనేగాని వాదనములను బట్టియు ఆలోచనలబట్టియు నడిపింపబడదు. ప్రాచీన విధాన వైద్యులీ ప్రకృతిపద్ధతినే అనుకరింతురు. సూక్ష్మ బుద్ధిగల శస్త్రచికిత్సకుడు తెగినగాయమున విడిన చర్మముయొక్క భాగమును దగ్గరకు జేర్చి నివారణ జేయునట్లు ప్రకృతి గావింపలేదు. విరిగిపోయి ఒకద్దానికొకటి దూరముగానుండి ఎముక సంబంధమైన క్రొత్త పదార్థమును విస్తారముగా స్రవింపజేయు ఎముక ముక్కలను దగ్గరజేర్చు శక్తి ప్రకృతికిలేదు. తెగినరక్తనాళమును బంధించు శక్తి ప్రకృతికిలేదు. అందుకు మారుగ రక్తమును స్రవింపజేసి ప్రాణముదీయును. భుజము ఎముక బుజముయొక్క గ్రంధినుండి తప్పినపుడు తిరిగి గూటియందెట్లు జేర్చవలయునో ప్రకృతికి

---

నమునకు అనగా మలకోశములకు జేర్చుటకిట్లు గావింపబడుచున్నది. అందుపై వాంతులు, విరోచనములు, మూత్రాధిక్యము, చెమట, కురుపులు మొదలగునవి సంభవించును. సూక్ష్మశక్తికరముగ వ్యాధిగ్రస్తమైన నరములశక్తి స్థూలపదార్థభారమును తొలగించుకొనుటకు ప్రథమమున వ్యాధిగ్రస్తమైన భాగమునుండి దూరస్థమగు భాగముల యందుగలుగు యీయుద్రేకముల మూలమున ఒకవిధమగు వ్యతిరేక ఉద్రేకము (Derivation) గలుగజేయుటచే వాంతులు, విరోచనములు, మూత్రాధిక్యత, కురుపులు, మొదలగునవి సంభవించును. అందుపై సూక్ష్మశక్తికరముగ వ్యాధిగ్రస్తమయిన నరముల శక్తి స్థూలపదార్థభారమును తొలగించుకున్నట్లగపడును.

దెలియదు. అందుకుమారుగ ఆప్రదేశమున వాపుగలుగజేసి తిరిగి గూటియందు జేర్చుటకవరోధము గలుగజేయును.
కంటిపాపయందు ప్రవేశించిన యితర వస్తువును తొలగి జేయుటకు చీముపట్టించి కంటిపాపనంతయు నిర్మూలముజేయును. క్రిందకు దిగజారి మలకోశముల కష్టపడిన గిలక, మలకోశముల యందు పుండు గలుగజేసి మరణము గలుగజేయును. సూక్ష్మశక్తికర వ్యాధులలో ప్రకృతి గలుగజేయు వ్యతిరేక కల్పనల (metaschematisms) మూలమున అసలు వ్యాధిస్థితికంటె తరచు మిక్కిలి దుస్థితికి పాలుచేయబడును. చైతన్యశక్తి ఇహలోకసంబంధమైన మహత్తర వ్యాధులని పేరుగాంచి వేనకువేలు సంవత్సరములనుండి మానవజాతిని పీడించి బాధించు అనంతములైన వ్యాధులను, అంటించి రగుల జేయు నిప్పు నెరుసులనదగు దీర్ఘ వ్యాధులని పిలువబడు (Chronic Miasms) సోరా

---

తరుణవ్యాధులలో నిస్సహయియైన ప్రకృతి శరీరమునందలి కొంత భాగమును త్యాగముగాగణించి నిర్మూలముచేయుటమూలమున మరణము సంభవించని సందర్భములయందు నెమ్మదిగ లోపభూయిష్టముగ ఆరోగ్యము చేకూరగలదు.

వ్యాధి దానికగు నివారణమైనప్పుడు, నివారణమైనపిమ్మట, గాంచబడు వ్యాధికిలోనయిన భాగములు మిక్కిలి నీరసించినస్థితి, శరీరము శుష్కించినస్థితి, మొదలగునవి యిందుకు దృష్టాంతరములు. శరీరముయొక్క స్వయంసహాయశక్తి వ్యాధిని నెదుర్కొనునప్పుడు చూచుటకు బాధలుతప్ప వేరొండు గోచరముగావు. యదార్థమైన శాస్త్రీయపద్ధతిలో వ్యాధిని నివారణ జేయదలంచినపక్షమున యీ పద్ధతియందు అనుకరింపదగినదియు, అనుకరింపవలసినదియు, నెయ్యదియు నుండదు.

(Psora )సిఫ్లిస్ (Syphilis)సైకోసిస్ (Sycosis) తత్వముల లోనే యొక్కటిని జీవశక్తి స్వయముగకొంచెమైనను తొలగింప జాలదు. అందుకు మారుగ నెట్టి సందేహము లేకుండ శరీరము లోనికి స్వీకరించి దీర్ఘకాలము జీవితమును దుఖః భాజనము గావించి మృత్యుముఖమున బడచేయువరకు నివి శరీరమున రగులు కొనుచుండుటకు ఆస్కారమొసంగుచుండును.

మిక్కిలి బుద్ధిచాతుర్యము, యోచన, నిర్ణయము అవుసర మైన యిట్టివిషయమగు చికిత్సయందు, సయుక్తమైన విధాన మని బిరుదుగాంచిన ప్రాచీనవిధాన వైద్యమును కృషిజేయు వైద్యులు, బాధపడు మానవకోటికి అనుకూలమైన ఆరోగ్య సహాయము కలుగజేయుటకు ఆలోచనాయుక్తజ్ఞానవిశేషము, అంతులేని వివేకజ్ఞానము భగవంతుడు ప్రసాదించియుండ విజ్ఞానరహిత జీవశక్తిని ఉత్తమమైన గురువుగభావించి, జీవశక్తి యొక్క అక్రమవిప్లవకార్యాచరణ పద్ధతులను యింతకంటె వేరొండు ఉత్తమమైన పద్ధతులు లేవనితలంచి, అనాలోచితముగ అనుకరించుచున్నారు.

ఈ ప్రాచీనవిధానవైద్యులు అనాలోచితముగ, వివేక విహీన, స్వతశ్చలన జీవశక్తిని, వ్యతిరేక ఉద్రేకకర చికిత్సా విధానమునుమూలమున అనుకరించునపుడు, రోగులకు మిక్కిలి బాధకరమగు బాధలను కలుగజేసియు బలవంతముగ విరోచనములు కలుగజేసియు, (యిట్లు తరుచు జరిగించుచుందురు) ఎట్టిబాధయు కలుగజేయని యితరశరీర భాగములను శరీరావ

యవములను నెదుర్కొందురు. ఇందుమూలమున శరీర బలము, శరీరద్రవములు నిర్మూలముచేయబడును. ఇట్లుగావించుటలో ప్రథమమున వ్యాధిగ్రస్తమైయున్న భాగములయందలి వ్యాధిగత జీవశక్తియొక్క కృత్యమును (Action) యిట్లు కల్పితముగ బాధకలుగజేయబడిన అవయవములకు త్రిప్పుట కుద్దేశించి యీవిధముగ శరీరమునందలి అరోగ్యముగానున్న భాగములయందు అక్రమముగ, మిక్కిలివిభేదమైన, వెనుకటి వ్యాధికంటె బలమైన ఒకవ్యాధిని కలుగజేయుటమూలమున సహజముగజనించిన వ్యాధిని నివారణజేయుటకుద్దేశించియుండిరి. ఇట్టి ప్రదక్షిణమార్గ చికిత్సాపర్యవసానముగ శరీరబలము మిక్కిలి వ్యయపరుపబడి సర్వసాధారణముగ రోగికి విశేషమైనబాధ కలుగజేయబడును. ‡1

---

‡1 దీర్ఘవ్యాధులలో యిట్టియుక్తిసాధనముయొక్క విచారకరఫలితములను అనుదిన అనుభవముచూపుచునే యున్నది. నివారణతప్ప ఏదియో మరియొకటి జరుగుచున్నది. శత్రువును ప్రత్యక్షముగ నెదుర్కొని ముఖాముఖిని యుద్ధముజేసి శత్రుఘాతములను పరిమార్చుటకుమారు పిరికిపద్ధతిని వెనుకనుండి శత్రుబలమును సమస్తమును నిరోధముగావించి వలయు సమస్తపదార్థములయొక్క ఆధారమును త్రెంచివైచి పరిసరము చాలవరకు కాల్చివైచి గావించినకృత్యమును జయమని నెవ్వరు పిలువగలరు? ఇట్లుగావించుటమూలమున నెదుర్కొనుటకుగల ఉత్సాహమంతయు తొలగించగలుగుదుము గాని శత్రువును నిర్మూలముజేయవలయునను మన ఆశయము నెరవేరజాలదు. శత్రువు అచ్చటనే యుండును. తిరిగి తాను ఆహారపదార్థములను వలయు సాధన సామగ్రిని లభింపజేసికొనినప్పుడు తిర్గి తలయెత్తి పూర్వముకంటె తీవ్రముగ విజృంభించును. వ్యాధియనుశత్రువును నశింపుజేయుటకుమారు యిట్టి చికిత్సలవలన నిరపరాధియైన దేహము చాలకాలమువరకు తిరిగి యథాస్థితికి

వ్యాధి తరుణవ్యాధియై తదనుగుణ్యముగ స్వల్పకాల గమనిక గలిగియున్న పక్షమున విభేదమైన దూరభాగములయం దిట్టి వైరూప్యసంఘటనము లవసరములేకుండగనే నిశ్చయముగ అదృశ్యమగును. గాని యిది నివారణయనదగదు. సహజముగ వ్యాధిగ్రస్తమైన శరీరభాగములకు క్రిమమైనట్టియు, సత్వరమైనట్టియు, వ్యాధినిరూపణకరసంబంధములేని యీ విప్లవచికిత్స యందు "నివారణ" యని గౌరవనామమీయవలసిన విషయ మెయ్యదియునులేదు. శరీరేతరభాగములయందు గలుగజేయు నిట్టి తీవ్రసంఘటనము లవసరములేకుండగనే కొలదిపాటి అనంతరబాధలతోను, బలమును యింతగత్యాగము చేయనవసరము లేకుండగను, తమంతటతామే యీతరుణవ్యాధులు తప్పక తగ్గగలవు. గాని శుద్ధప్రకృతియొక్క కార్యాచరణపద్ధతి గాని దాని అనుకరణమగు అల్లోపతీవైద్య విధానముగాని, బలమును సంరక్షించుచుసత్వరముక్రమపద్ధతిలో వ్యాధిని నిర్మూలముగావించుచు,సూక్ష్మశక్తికరచికిత్స(Dynamic treatment) గావించు హోమోపతీవిధానముతో నెంతమాత్రము సరిపోల్ప బడజాలవు.

---

రాజాలనంతస్థితివరకు నిర్మూలము గావింపబడును. ఈపద్ధతినే వ్యాధిస్థానమునకు దూరముగ నిరపరాధియైన భాగములను అక్రమమార్గమున నెదుర్కొను పద్ధతిలో అల్లోపతీవైద్య విధానమునందు (ప్రాచీనవిధానవైద్యము) దీర్ఘ వ్యాధులు చికిత్స చేయబడును. ఈచికిత్సాపద్ధతి నివారణచేయుటకు బదులు శరీరభాగములను నిర్మూలముజేయును. ఈవైద్యవిధానముయొక్క హానికర కృత్యముల మూలమున పర్యవసానమేమి?

వ్యాధులలో చాలవరకు, అనగా దీర్ఘవ్యాధి స్వభావముగల వ్యాధులలో చాలవరకు నిస్సత్తువగలుగజేయు నట్టియు వ్యాకుల పరచునట్టియు ప్రాచీన విధాన అక్రమ చికిత్సాపద్ధతులు నిరుపయోగము. ఈ చికిత్సా పద్ధతులు మిక్కిలి బాధకరమగు లక్షణములను తదితర లక్షణములను కొంతకాలము మాత్రము నిలుపుజేసియుంచును. శరీరనిర్మాణమున వ్యాధిస్థానమునకు దూరముగ యితరభాగములయందు గలుగజేయబడు ఉద్రేకమునకు అలవాటుపడినపుడు వైరుధ్యకరబాధలచేతను [1] అవివేకముగ గలుగజేయబడిన విరోచనములచేతను జీవశక్తి శక్తివిహీనమగును. వ్యాధితిగ్గి సంభవించుటయేగాక పూర్వముకంటె దుస్థితిలో వ్యాధి సంభవింపగలదు.

తనస్వస్థతకొరకు నిస్సహాయియైన శుద్ధప్రకృతిగావించుకొను ప్రయత్నములను, ప్రాచీనవిధానవైద్యులు చాలమంది,

---

1. Issues అని పిలువబడు దుర్గంధమున వెలువరించు కల్పితరణములు మూలమున ఎన్నడైనను ఎట్టి సత్ఫలితము లైనను ప్రాప్తించినవా? ప్రథమమున ఒకటి రెండు వారములలో నివి బాధకరముగ నున్నప్పుడు వైరుధ్యముగ దీర్ఘ వ్యాధిని కొంతవరకు నిరోధించినట్లగుపడును గాని క్రమక్రమముగ నీబాధకు అలవాటుపడిన పిమ్మట దీర్ఘవ్యాధి యింకను వృద్ధిజెందుట కెక్కుడు అవకాశమొసగుటయే గాక, రోగిని నీరసింప జేయుటకంటె వేరొండు గుణము గలుగజేయ జాలవు. ఈ పందొమ్మిదవ శతాబ్దమునందెవ్వరైనను వ్యాధిదోషమును బోగొట్టుటకీ కల్పితరణములు వ్యాధిదోషము బయటకు బోవు మార్గముగ నుపయోగ పడగలవని యోచింపగలరా? గాని చూపరుల కిట్లు జరుగునట్లే యగుపించగలదు.

సర్వసామాన్యపద్ధతిగా అనుకరించువారిలో తమ కృషియందు గొన్ని భావనాయుత చిహ్నములనుబట్టి మార్గదర్శకమై, యుక్తమనియోచించిన వట్టి భావనాఫలితములైన వ్యతిరేక ఉద్రేకములను ( Derivations ) సాగించియుండిరి. ఇతరులు వేరొక ఉన్నత భావమునందు లక్ష్యముంచి వ్యాధులయందు యగుపడు రీతి విరోచనములను కలుగజేయుట మూలమున వ్యాధులయందు గాంచబడురీతిని, ఒకస్థానమునుండి వేరొక స్థానమునకు మార్పుజెందు వైరుధ్యవ్యాధులను వృద్ధిజేయుట మూలమున, జీవశక్తియొక్క ప్రయత్నములను పెంపుజేయుటకు ప్రయత్నించియుండిరి. ఈపద్ధతి మిక్కిలి హానికరమైనపద్ధతి యైనప్పటికీ ప్రకృతిననుసరించుచుంటి మనియు, ప్రకృతియొక్క ప్రధానప్రతినిధులమను బిరుదు తాము పొందగలమనియు వీరు విశ్వశించియుండిరి.

దీర్ఘవ్యాధులయందు, రోగియొక్క ప్రకృతిశిద్ధమైన శక్తులమూలమున గలుగజేయబడు, విరోచనములు, బాధకరమైన లక్షణములు, తీవ్రమగుబాధలు, పక్షవాతము, యీడ్పు రోగము, మొదలగు వ్యాధులు, వ్యాధిని స్వల్పకాలము శాంతింపజేయు సూచికములై వర్తించును. గాన ప్రాచీనవిధాన వైద్యులు వ్యతిరేక ఉద్రేకములే (Derivations) వ్యాధిని నివారణజేయుటకు యదార్థమార్గములని భావించి, విరోచనములు గలిగించి, కావించుచు, ఇంకను వృద్ధిచేయుటకు ప్రయత్నించుచుండిరి. ఎట్టిసహాయములేక తనకుదాను వదలి

వేయబడిన ప్రకృతిచే దీర్ఘవ్యాధులలో గలుగజేయబడు యీ విరోచనములు, విసర్జనములు (Excretions) తాత్కాలికోప శాంతికరములు మాత్రమే యని వీరుగాంచియుండలేదు.

ఈ వ్యతిరేక ఉద్రేకములు యదార్థమైన నివారణకు సహాయభూతమగుటకు మారుగ నివి గలుగజేయు వికారముల మూలమునను బలహీనతమూలమునను అంతరంగరక్తదోషము ఉద్రేకింపజేయబడును. శుద్ధప్రకృతియొక్క యిట్టిప్రయత్నముల మూలమున దీర్ఘరోగి శాశ్వితమైన ఆరోగ్యము చేకూరియుండుట, నెవ్వరును, నెప్పుడును, గాంచియుండలేదు. మరియు శరీరమునందుగలిగిన యిట్టి విరోచనములమూలమున, నేదీర్ఘవ్యాధియు నివారణయగుట గాంచియుండలేదు *1

ఇందుకు వ్యతిరేకముగ వ్యాధిని నివారణజేయుటకు మారు యిట్టి పరిస్థితులయందు, ఆదియందుగల రక్తదోషము యిట్టివ్యతిరేక ఉద్రేకము గలిగినపిమ్మట ప్రత్యక్షముగ యగు ందురీతిని ఉద్రేకించగలదు. ఇట్టి చికిత్సయందిట్టి సాధనములు పెర్తిర్తి గావించినపుడు ప్రథమమున అగుపించిన ఉపశాంతియొక్క కాలపరిమాణము క్రమముగతగ్గుచు, వ్యాధిని శాంపజేయుటకు విరేచనములు నిరంతరము కావించుచున్నప్పటికి వ్యాధియొక్క దుష్టలక్షణములు మిక్కిలి శీఘ్రముగను, క్కిలి తీవ్రముగను సంభవించగలవు.

*1 కల్పితముగ గలుగజేయబడిన విరేచనములు (enema etc.) ాడనిట్లే వ్యాధిని నివారణ జేయుటలో నసమర్థములు.

ప్రకృతి తన ఆధారభూతములు దానుజూచుకొనుటకు వదలవేయబడి అంతరంగదీర్ఘవ్యాధిచే ఉద్రేకింపబడి ప్రాణము దీయుటకు యత్నించు లక్షణములు సంభవించినప్పుడు ప్రాణమునకు ముఖ్యమైన భాగములనుండి ప్రమాదమును తప్పించి అంతకంటె అముఖ్యమైన భాగములయందు బాహ్యస్థానిక లక్షణములనుగలుగజేయుటతప్ప వేరొండు జేయజాలదు విజ్ఞానవిహీనమైనట్టియు, అయుక్తమైనట్టియు, దూరదృష్టిలేని చైతన్యశక్తియొక్క శక్తియుత కృత్యములు యదార్థమైన స్వస్తత అరోగ్యము చేకూర్పజాలవు. ప్రకృతియొక్క కృత్యములు, ప్రమాదకరమైన అంతరంగ వ్యాధిని శాంతింపజేయు పద్ధతిలో కొలదికాలము మాత్రమే నిలుపుజేయును. ఇందుకొరకు రోగియొక్క బలము శరీర పోషక ద్రవములు విస్తారముగ వ్యయపరుప బడుచున్నవి గాని ఆదియందుగల వ్యాధి ఒక్క కేశపరిమాణమైనను తగ్గజాలదు. ఇట్టి రోగికి హోమోపతి చికిత్స గావింపని పక్షమున తప్పక మరణము సంభవించును. గాని ఈ పద్ధతి అల్లోపతీ చికిత్స ఆమరణమును కొలదిగ ఆలశ్యము చేయగలుగును. గాని నివారణ జేయజాలదు.

ప్రాచీన వైద్య విధానమగు వైరూప్యౌషధ పద్ధతి (అల్లోపతి) ప్రకృతి యొక్క శుద్ధ స్వతశ్చలనశక్తుల యొక్క యీప్రయత్నములయందు విశేషముగ విలువయుంచి వానిని గూర్చి సంపూర్ణముగ తప్పు అభిప్రాయములు దీసికొని యీ ప్రకృతియొక్క ప్రయత్నములను యదార్థమగు నివారణా

సాధనములని పౌర బాహ్యగ తలంచి వ్యాధినంతయు యిందు మూలమున సమూలము నివారణజేసి నిర్మూలము గావించుటలో సాఫల్యమొందవచ్చునని వ్యర్థముగ భావించి ప్రకృతి గావించు విధముగ యీప్రాచీన విధాన వైద్యులు విరేచనములు విసర్జనములు కావించుటకు ప్రయత్నించుచుండిరి. దీర్ఘ వ్యాధులయందు అంతరంగ వ్యాధియొక్క బాధకర లక్షణములను జీవశక్తి చీముతో గూడిన పొక్కులు మొదలగు వాని మూలమున శాంతింపజేయుటకు ప్రయత్నించును. గాన యీ రసికారు భాగములకు కేంథార్రైడ్సు, మెజీరం, పప్లు మొదలగు లేపనములు, ఉపయోగించి పట్టీలు వేయుట మూలమున రసి, దుష్టరక్తము మొదలగు వానిని పైకి ద్రవింప జేసి ప్రకృతికి సహాయభూతమై నివారణ గావించుటకు అల్లోపతీ వైద్యులచే యత్నింపబడుచున్నది. ఔషధగుణము మిక్కిలి తీవ్రమైయుండి యీచర్మసంబంధమైన పొక్కులు దీర్ఘకాలమునుండి యుండి తత్వము మిక్కిలి ప్రకోప తత్వమైయున్న పక్షమున యిట్టి బాహ్య చికిత్సల. మూలమున వ్యాధికి ఎట్టి లాభములును గలుగక బాధ లుద్రేకించి రోగికి నిద్రలేకుండ జేసి నిస్సత్తువ గలుగజేయును. ఇట్టి చికిత్సమూలమున ఒక్కొక్కపుడు దుష్టమైన జ్వరముతో గూడిన పొక్కు సంబంధ చర్మవ్యాధి లోనికి వృద్ధిజెందగలదు. లేక స్థానికమైన వ్యాధికి (కొలది కాలము క్రిందనే సంభవించినది) గావించు బాహ్యచికిత్సల మూలమున గలిగిన గుణములు సౌమ్యమయిన స్వభావముగలిగియున్న పక్ష

మున అంతరంగవ్యాధికి ఉపశాంతి కరముగ నుండుటకు ప్రకృతిచే బాహ్యప్రదేశమగు చర్మముపైకి తీసికొనరాబడిన స్థానిక లక్షణములకు అక్రమముగ గావింపబడిన నీబాహ్యచికిత్సల మూలమున వ్యాధివెనుకకు మరల గొట్టబడుటచే అంతరంగ వ్యాధి తిరిగి మిక్కిలి ప్రమాదకరముగ వృద్ధిజెందింపబడును. ఇట్లు స్థానికమైన వ్యాధిని వెనుకకు మరలగొట్టుట మూలమున, యింకను దుస్థితిలోనికి వచ్చినవ్యాధిని, జీవశక్తిముఖ్యమైన మరియొక భాగములకు వ్యాధిని మార్పుజేయుటకు నిర్బంధింపబడును. అందుమూలమున యీవెనుకకు గొట్టబడిన స్థానిక వ్యాధికి బదులు, ‡1 ప్రమాదకరమైన, నేత్రరోగము, చెముడు జీర్ణకోశమున శూల, మూర్ఛ, అపస్మారము, క్షయ, ఉన్మాదము, మొదలగునవి సంభవింపగలవు.

వ్యాధిగ్రస్తమైన ప్రకృతిశక్తి, ఆసనమునందలి రక్తనాళములకు, రక్తమును స్రవింపజేయునపుడు (రక్తము స్రవింపని మూలశంఖ) జీవశక్తియొక్క నివారణా ప్రయత్నములకు సహాయభూతము గావలయునను దురభిప్రాయములో రక్తస్రావము బైటకు బోవుటకు దారికల్పన జేయవలయునను ఆలోచనతో అల్లోపతీవైద్యులు తరచుగా జలగలను విస్తార

‡1 స్థానిక లక్షణములనిట్లు అంతరంగమునకు తిరిగి మరల గొట్టుటవలన సంభవించిన వికృతి గుణములు (అనగా పైనుదహరించిన ఇతర వ్యాధులు) అల్లోపతీ వైద్యములచే మరియొక తరగతికి జెందిన క్రొత్త వ్యాధులుగ తరచు పరిగణింపబడు చుండెను.

ముగా ఆ స్థానమునఁబెట్టింత్రి. అచ్చటఁజేరు రక్తమును పీల్పించెదరు. ఇందుమూలమున బాధ విమోచనము తగినంత లేకపోవుటయే గాక శరీరము నిస్సత్తువ గావింపబడును. మరియు అసలు వ్యాధి స్వల్పముగనైనను తగ్గకపోవుటయేగాక యీభాగము నకు పూర్వముకంటె నెక్కుడురక్తము జేరగలదు.

వ్యాధిగ్రస్తమైన జీవశక్తి ప్రమాదకరమైన అంతరంగ వ్యాధియొక్క తీవ్రతను శాంతింప జేసికొనుటకు వాంతులు, దగ్గు మొదలగు వాని మూలమున రక్తమును వెలువరించుటకు ప్రయత్నించు సమస్త వ్యాధులయందును ప్రాచీన విధాన వైద్యులు అనుకూలమైన ప్రయత్నములని భావించు యీ ప్రకృతి ప్రయత్నములకు సహాయ భూతమగుటకు ఆలస్యము గావింపక యిట్టి వ్యాధులలో విస్తారముగ రక్తస్రావము గావించుటకు రక్తనాళమునకురంధ్రముగావింతురు. ఇందుమూలమున హానికరమగు ఫలితములు జనించుటయేగాక శరీరమున విస్తారమగు నీరసము గలుగ గలదు.

తరుచుగాసంభవించుచు దీర్ఘకాలమునుండిగల కడుపులో వికారముతో సంబంధించియుండు సమస్త వ్యాధులలోను ప్రాచీన విధానవైద్యులు ప్రకృతియొక్క ఉద్దేశ్యమునకు సహాయ భూతమగుటకుగాను తీవ్రమైన వమనకరౌషధములతో జీర్ణకోశమునుండి విస్తారమైన వాంతులు గలుగజేయుచుండిరి. ఇందు మూలమున ఎట్టిసత్ఫలితమును లభింపక దుష్ఫలితములు పొందుటయే గాక తరుచుగా ప్రమాదకరమైన ప్రాణహాని

గలుగజేయు పరిస్థితులు గూడ సంభవించుచుండెను.

అంతరంగవ్యాధినితొలగించుకొనుట కొక్కొక్కప్పుడుజీవశక్తి బాహ్యశరీరమున మాంసగ్రంథులయందు కఠినమైన వాపులు గలుగజేయును. ప్రకృతియొక్క ఉద్దేశ్యమునకు సహాయ భూత మగుటకు ప్రాచీన వైద్యులు వేడిగలుగజేయు పలువిధములైన తైలములు, పట్టీలు మొదలగు ప్రకృతి సేవకుల సహాయమున ఉద్రేకింపజేసి కురుపు పక్వమునకు వచ్చిన పిమ్మట కత్తితో ఛేదించి వ్యాధికరపదార్థమును తొలగించి వేయుదురు. ఇట్టి పద్ధతి మూలమున స్థిరమైన దుష్ఫలితములు ప్రాప్తించుట అనుభవమును బట్టి అనేకవందల పర్యాయములు గాంచబడెను

రాత్రిభాగమందు స్వయముగ సంభవించు చెమట లేక తరుచుగా వెళ్ళు నీళ్ళవిరేచనముల మూలమున దీర్ఘవ్యాధుల యొక్క తీవ్రలక్షణములు కొలదిగా శాంతించుట తరుచుగ గాంచి ప్రకృతి నుండి గాంచబడిన యీ సూచనను శిరసావహించుట విధియని ప్రాచీన విధాన వైద్యులు తలంచి దీర్ఘవ్యాధినంతయు నివారణ జేయునని తలంపబడు ప్రకృతి యొక్క యీప్రయత్నములకు సహాయభూతమగుటకు యీ లక్షణములను వృద్ధిగావించి తన్మూలమున రోగియొక్క వ్యాధిని (వ్యాధికరపదార్థము) నిశ్చయముగ సత్వరము తొలగింప జేయుటకు నిరంతము చెమటపట్టుచుండునట్లు శ్వేదచికిత్స (Sweating teatment) గావించుచుండుటగానిలేక సంవత్సర

ములు కొలది సౌమ్యమగు విరేచనకరౌషధములు ( Gentle laxatives) ప్రయోగించుచుండుటగాని జరిగించుచుండిరి.

గాని యిందుమూలమున యీవైద్యులు, మిక్కిలి వ్యతిరేక ఫలితములు మాత్రమే గలుగజేయుచుండిరి. అనగా, అసలువ్యాధిని ఉద్రేకింపజేయుచుండిరి.

నిరాధారమైనట్టియు, ఊహింపబడినట్టియు, యిట్టియభిప్రాయములతో ఏకీభవించి ప్రాచీనవిధానవైద్యుడు రోగికి విరేచనములు వ్యతిరేకఉద్రేకములు కలుగజేయుచు వ్యాధిగ్రస్తమైన జీవశక్తియొక్క ప్రయత్నములకు సహాయభూతమగు చుండిరి. ♦1 కాని యీకృత్యము లెన్నడును, అపేక్షించు పర్యవసానమునకు మార్గదర్శకము గాక ఎల్లపుడును

♦1 ప్రాచీనవిధానవైద్యులు, యీ చికిత్సకు విరుద్ధముగ తరుచు కావించుచుండిరి. జీవశక్తి అంతరంగవ్యాధిని శాంతింపజేసి కొనుటకు, శరీరబహిర్భాగములయందు, గలుగజేయు, స్థానికలక్షణములు, విరోచనములు, మిక్కిలి బాధకరముగ నున్నపుడు, ప్రతిఘాతకరౌషధములతో వీనిని అణచిపెట్టుచుండిరి. దీర్ఘకాలమునుండి బాధించు, పోట్లును, నిద్రలేమిని విరేచనములను ప్రమాదకరస్థితిలోనికీడ్చు నల్లమందు మొదలగువానిమూలమునను వాంతులను పొందునట్టి లక్షణములు మూలమునను (ఫ్రూట్ సాల్ట్ మొదలగునవి) పాదములపై సంభవించు దుర్గంధయుతమైన చెమటను, ఘాటైన తైలములను పట్టించుటమూలమునను, చన్నీటితో తడుపుచుండుట మూలమునను, చర్మముపైగల పొక్కులను సీసముతోను (lead) యశదముతోను (zinc) తయారుచేయబడిన తైలములమూలమునను అణచిపెట్టుచుండిరి. గర్భాశయ రక్తస్రావములను ద్రాక్షసారా ఇంజక్షనుల (injection) మూలమున నిరోధించుచున్నారు. విస్తారముగపట్టు చెమటను పటిక

మిక్కిలి ప్రమాదకరమగు ఫలితములను బొందజేయగలవు. యీస్థానిక వ్యాధులు, విరేచనములు ఎట్టి సహాయము లేక తనకుదాను వదిలివేయబడిన జ్ఞానరహితమైన జీవశక్తిచే ఆదియందలి దీర్ఘ వ్యాధిని శాంతింప జేసికొనుటకు గలుగ జేయబడెనని యీవైద్యులెరుగరు. ఈస్థానిక లక్షణములు విరేచనములు మొదలగునవి యదార్థముగ వ్యాధి

---

(Alum) మూలమునను, స్వప్నస్ఖలనములను హారతికర్పూరమును (Camphor) తరుచు ఉపయోగించుటమూలమునను, శరీరమునందును, ముఖమునందును తరుచుగలుగుచుండు ఉడుకును, నత్రము (Nitre) ఉద్భిజ్జ ఆమ్లములు (Vegetable caids) గంధకామ్లము (Sulphuric acid) ఉపయోగించుటమూలమునను ముక్కునుండి స్రవించు రక్తస్రావమును, సారాయందును, ఘాటైన ద్రవములయందును తడుపబడిన గుడ్డపత్తులను ఎక్కించుటమూలమునను నిరోధించుచుండిరి. మరియు, అంతరంగవ్యాధిని శాంతింపజేసికొనుటకు జీవశక్తి కలుగజేయు కాళ్ళయందలి స్రవించు రణములను సీసఆమ్లజనితముతోను (Oxide of lead) యశదామ్లజనితముతోను (Oxide of zinc) యెండగొట్టుచుండిరి. ఇందుమూలమున నెట్టిహానికర ఫలితములు బొందబడియుండెనో వేనకువేలు వ్యాధులయందు గోచరించియుండెను.

చేతిలోగల కలముతో అసంగతములువ్రాసి, నోటియందుగల నాలుకతో అసత్యప్రగల్భములు పల్కి ప్రాచీనవిధానవైద్యుడు తాను న్యాయమైన వైద్యుడననియు, వ్యాధిని మూలచ్ఛేదముగావించు చికిత్సజేయుటకు వ్యాధికారణమును గనుగొందుననియు తెల్పుచు ప్రపంచమును మోసముజేయుచుండెను. ఈవైద్యుడు చికిత్సజేయునప్పుడు వ్యాధిలక్షణములలో ఒక్క లక్షణమునందు మాత్రమే లక్ష్యముంచి చికిత్సగావించుచు అందుమూలమున నెల్లప్పుడు హానికర ఫలితములే ప్రాప్తింపజేయును.

రొక్క అనగా సంపూర్ణ వ్యాధి యొక్క దృశ్యముగాని వేరొండుగాదు. యదార్థము తెలుపవలసివచ్చిన నీలక్షణ సముదాయమునకు సమర్థమైన ఔషధము సారూప్యగుణముల కనుగుణ్యముగ నిర్ణయము చేయబడి క్రమమైన పద్ధతిలోపనిజేయు ఒక్క సారూప్యౌషధము మాత్రమే యైయున్నది.

తరుణవ్యాధులయందును మఱియు ముఖ్యముగ దీర్ఘవ్యాధులయందును వ్యాధినుండి విమోచనము గానించుకొనుటకు శుద్ధప్రకృతి గావించు కృత్యములన్నియు మిక్కిలి అక్రమకృత్యములు. ఈకృత్యము లన్నియు యథార్థమైన నూతనవ్యాధిని కలుగజేసి రోగికి యింకను మిక్కిలి హానికలుగ జేయునని సులభముగ గ్రహింపవచ్చును. జీవశక్తి గలుగజేయు విఘాతముల (Crises) కాధారభూతమగు రహస్యమార్గములను అనుకరించుటకు తగుస్థితియందు వైద్యశాస్త్రము లేకపోవుటచే జీవశక్తి తనఆధారములను తనకుతాను జూచుటకు వదలి వేయబడినప్పుడు గావించు కృత్యముల కంటెను బాహ్యమునుండి తీవ్ర పద్ధతులపై గావించుకృత్యములు తక్కువ లాభదాయకమై యుండగలవు గాన తరుణవ్యాధులలోనైనను యిట్టి పద్ధతులు ప్రకృతి గావించు కృత్యములను జక్కజేయజాలవు. అందుకు మారుగ చికిత్స మూలమున గావింపబడు నీకృత్రిమకృత్యములు రోగితత్వమును మిక్కిలి కలతజెందించి నిస్సత్తువ గలుగజేయగలవు. ప్రకృతిసిద్ధ వ్యతిరేకోద్రేకములనుండియు విఘాతముల నుండియు సిద్ధించు స్వల్పమగు ఉపశాంతియైనను

వ్యాధిని గొంతవరకు శాంతింప జేయగలవు. గాని ఔషధయోగ నిర్ణయ గ్రంథములో (Pharmacopeia) చూపబడిన భేది మందులు, అంతమాత్రమైన ఉపశాంతి గలుగజేయవు. ఈ భేదిమందులు రోగోపశాంతి జేయుటకు మారు రోగిని ఇంకను దుస్థితికి పాల్పడ చేయునని అనుదినయనుభవము జూపుచుండెను

యుక్తి, విజ్ఞానము, ఆలోచన వీనిమూలమున నడిపింప బడక, భౌతిక శరీరనిర్మాణమున కనుగుణ్యముగ మాత్రమే వ్యవహరించ గలుగు జీవశక్తిని అనారోగ్యస్థితి తొలగించి స్వస్తత చేకూర్చుట కుపకరించు నివారణకర ప్రతినిధిగ పరిగణించుటకు మానవున కొసంగబడియుండలేదు. మరియు వ్యాధి నుండి విముక్తిగావించుకొనుటకు జీవశక్తి గావించు లోపభూయిష్ట అక్రమ వ్యాధికర ప్రయత్నములను వైద్యులు అనుకరించి జీవశక్తి ప్రయత్నములకంటెను కాఠిన్యమైనట్టియు అననుకూలమైనట్టియు, కృత్యములను గావించుటకు జీవశక్తి మానవున కొసంగబడి యుండలేదు. ప్రకృతిశక్తి స్వస్తత కొరకు గావించుకొను సందేహాస్పదమైనప్రయోజనముగల తాత్కాలిక స్వప్రయత్నముల యనుకరణమే శాస్త్రయుక్తమైన చికిత్సా పద్ధతి యని భావించి యదార్థమైన చికిత్సాపద్ధతియని తలంచి యదార్థమైన నివారణా శాస్త్రమును కనుగొనుట కుపయోగించవలసిన తమ వివేకమును, ఆలోచనాజ్ఞానమును, బుద్ధిని, వ్యయపరుపక భద్రపరచి యుండిరి.

అదే విధముగా వైరూప్యౌషధపద్ధతిని గావించు చికిత్సల వలన లభింపజాలదు. ఈ వైరూప్యౌషధములతో గావించు సర్వ ప్రయత్నములలోను జీవశక్తి తనకుదాను వదలి వేయబడినపుడు గలుగ జేసికొను యుపశాంతియైనను యీవిధాన వైద్యులు గలుగజేయజాలరు.

తలపోటుగల రోగికి అప్పుడప్పుడు స్వభావసిద్ధముగ ముక్కునుండి రక్తస్రావము గలుగుచుండును. ఈపద్ధతిని అనుకరించి దీర్ఘకాలమునుండి బాధించు తలపోటును శాంతింపజేయుటకు భయము గొల్పు ఆయుధములతో ముక్కునుండి రక్తస్రావము గలిగించుటకు యీవిధానవైద్యులు ప్రయత్నింతురు. ఈయుద్దేశ్యముతో నాసికా రంధ్రములనుండి విస్తారముగ రక్తమును స్రవింపజేయవచ్చునుగాని తన్మూలమున గలుగు ఉపశాంతి సూన్యము. ప్రకృతిసిద్ధమైన జీవశక్తి మరియొకప్పుడు తనకుదాను యిట్టి స్రావము గలిగించునప్పుడు స్రవింపజేయు కొలది రక్తపు చుక్కల మూలమున కొలది యుపశాంతి కలిగి యుండవచ్చును వైద్యునిచే గావింపబడిన విస్తారమగు రక్తస్రావము మూలమున గలుగు ఉపశాంతి ఆమాత్రమైనను యుండదు.

కోపము, భయము, బెణుకు (Sprain) చలి, వీనిచే నుద్రేకింపబడి, సంభవించు అకస్మిక అనారోగ్యమునందు జీవశక్తిచే గలుగజేయబడు చమట, విరేచనములు యీతరుణ

స్వసంరక్షణకొరకు భౌతికశరీరము గావించు స్వప్రయత్నములను వివేకముగల ఏవ్యక్తి అనుకరించును? ఈప్రయత్నములే వాస్తవముగ వ్యాధి. వ్యాధిగ్రస్తమైన జీవశక్తి మనదృష్టికి గోచరించు వ్యాధిని గలుగజేయుచున్నది.గాన యీ యత్నములను అణచిపెట్టుట, యనుకరించుట, జరిగించిన పక్షమున, అనుకరించుట మూలమున వ్యాధి వృద్ధిజెందుటగాని, లేక యణచిపెట్టుటమూలమున, రోగిస్థితి ప్రమాదకరమగుట గాని తప్పక జరుగగలదు. ఈరెండు పద్ధతులు వైరూప్యౌషధ విధానములో జరుగుచున్నవి. ఇవి, నివారణాచికిత్స, శాస్త్రీయమైన నివారణా చికిత్సయని తలంపబడు వైరూప్యౌషధ చికిత్సావిధానము (అల్లోపతి) యొక్క హానికరకృత్యములు.

మానవశరీరము నందలి సమస్తభాగముల యందును, స్పర్శజ్ఞానచలనోద్రేక తంతువుల యందును, సమానముగ, అద్భుతమైన సహజశక్తి గలిగి శరీరసౌమ్య కార్యాచరణ ధర్మములయందు, అంతులేనిశక్తిని గలుగజేయుచుండు జీవశక్తి వ్యాధులయందు తనకు తాను సహాయము జేసికొనుటకుగాని, అనుకరింపదగిన నివారణాచికిత్సను నిర్వహించుటకుగాని సృష్టింపబడి యుండలేదు. జీవశక్తి వ్యాధిమూలమున విపరీతకార్యాచరణములకు గడంగినప్పుడు తిరిగి జీవశక్తియందు మార్పుగలిగించుటకు సారూప్యౌషధముచే వ్యాధికంటెను బలకరమైన సారూప్యౌషధవ్యాధిని గలుగజేయుటమూలమున ప్రకృతిసిద్ధ వ్యాధి జీవశక్తిపైగల తన బలమును వీడుటచే జీవశక్తి వ్యాధి

నుండి విముక్తియయి సాధ్యమైన బలతరఔషధకరవ్యాధితో నుండును. జీవశక్తి యీ ఔషధకరవ్యాధిని తొలగించుటకు తనశక్తినంతయు కేంద్రీకరించి, త్వరితముగ నద్దానిని జయించ గలదు. ఇట్టి వ్యాధినుండి విముక్తి జెంది ఆరోగ్యముజెందు పరివర్తనమునందు బాధకరమగునట్టియు, సస్వస్థత్వగలుగజేయు నట్టియు, ఎట్టివిఘాతములను జీవశక్తి అనుభవింపక, శరీరప్రాణ పోషణము, శరీరారోగ్యసంరక్షణము యగు తనసక్రియ కార్యాచరణధర్మములకు మరలి స్వస్థతచేకూరును. స్వతంత్రాలోచనలతో గూడిన ఉన్నతవిజ్ఞానబుద్ధి వివేకముల నుపయోగించి సూత్రాధారమున నిర్ణయించి గావించు సత్ఫలయుక్తమగు యిట్టి చికిత్సయే యథార్థమైన నివారణాచికిత్సగాని వేరొండు గాదు. పై నుదహరింపబడిన విధమున నెట్లు స్వస్థతచేకూర గలదో సారూప్యౌషధ విధానము మనకు బోధించగలదు.

ఇంతకుమున్నే తెల్పబడిన వైరూప్యౌషధవిధాన చికిత్సా పద్ధతుల (అల్లోపతీ) మూలమునగూడ చాలమంది రోగులు నిశ్చయముగ వ్యాధినుండి విముక్తిబొందియుండిరి. గాని దీర్ఘ వ్యాధి స్వభావములేని వ్యాధులు (సుఖసంబంధముగాని వ్యాధులు) అనగా తరుణవ్యాధులు ప్రమాదకర పరిస్థితులలో లేనప్పుడు మాత్రమే అల్లోపతీ చికిత్సయందు నివారణగావింప బడుచుండెను. ఈ నివారణలైనను ప్రదక్షిణమైన విసుపు గలిగించు దీర్ఘమైన మార్గములనుబట్టి తరచు అసంపూర్తిగా గావింపబడుచుండుటచే, యీ అల్లోపతీ చికిత్సను సౌమ్యమైన

పద్ధతిని గావింపబడు చికిత్సయని పిలుచుటకెంతమాత్రమును అనకాశముఁలేదు. మరియు యీ చికిత్సయందు ప్రమాదకర మైన తరగతికిఁజెందిన తరుణవ్యాధులు రక్తనాళములకు రంధ్రము గావించి రక్తమును స్రవింపజేయుట (Venesections) వైద్యో పశమన కరౌషధముల మూలమున వ్యాధి ప్రధానలక్షణ మును అణచిపెట్టుట వ్యాధిస్థానముల యందుగాక యితర భాగములయందు, వ్యతిరేకోద్రేక కరౌషధములను (Derivation remedies) ప్రయోగించి వ్యాధిని అణచిపెట్టియుంచుట మొదలగు పద్ధతులమూలమున (తరుణ) వ్యాధియొక్క సహజ మైన గమనకాలము గతించువరకు నిలుపుజేయబడుచుండెను. ఈపద్ధతులన్నియు రోగియొక్క బలమును, శరీరపోషకద్రవము లను హరింపజేయు అక్రమమార్గములతోఁగూడిన పద్ధతులగుటచే యీపద్ధతులపై చికిత్సపొందు రోగులు వ్యాధినుండి సంపూర్ణ ముగ విముక్తినొంది తిరిగి శరీరద్రవములనుచేకూరిి శక్తిబొందు టకు అవుసరమగు ముఖ్యకార్యక్రమమంతయు, ప్రాణసంరక్ష ణశక్తి యగు ప్రకృతిచేతనే గావింపబడవలసియున్నది, గాన యీ ప్రాణసంరక్షణశక్తి (Life preserving power) ప్రకృతి సిద్ధమైన తరుణవ్యాధిని తొలగించుకొనుటకు తోడు అకృత్రిమ చికిత్సాపద్ధతులనుగూడ నెదుర్కొనవలసియుండును. ఈ విధ ముగ వైరూప్యౌషధచికిత్స ప్రమాదరహితమైన వ్యాధులలో మాత్రమే తనస్వశక్తిచే తరుచుగా విసుగు జనింపజేయు లోప భూయిష్టమైన బాధకరమగు పద్ధతిలో క్రమక్రమముగ స్వస్థత

చేకూర్చగలుగును. దీర్ఘ వ్యాధులలో నీచికిత్స నిరుపయోగము.

ప్రాచీనవిధానచికిత్స తరుణవ్యాధులలో జీవశక్తి ఆవలంబించు పద్ధతికంటె వేరువిధముగ పనిజేయజాలదు. అనగా అపసవ్యమార్గమున పనిచేయును గాన ఆరోగ్యము చేకూర్చుటలో యీప్రాచీనవిధాన చికిత్స యదార్థముగ సహాయభూతమై వ్యాధియొక్క గమనకాలపరిమితి తగ్గించగలుగునాయను విషయము మిక్కిలి సందేహాస్పదమై యున్నది.

ప్రాచీనవిధాన వైద్యమున మరియొకపద్ధతి చికిత్సగలదు ఇది (బలవర్ధకౌషధముల మూలమున) చురుకుపుట్టించి బలము గలుగజేయు పద్ధతియని పిలువబడుచున్నది. 1♦ Stimulating and strengthening system). ప్రాచీనవిధానవైద్యమీపద్ధతి నెట్లుశ్లాఘించగలదో యాశ్చర్యము గలుగజేయుచున్నది.

దీర్ఘవ్యాధులలో సంభవించి, నిలచియుండు లేక వృద్ధిజెందు స్థూల శరీరమునందలి నీరసము నిస్సత్తువ, సారాయము మొదలగు పుష్టినిగలిగించు ఔషధములమూలమున తొలగించుటలో యీవిధానవైద్యులెన్నడైన సఫలీకృతులై యుండిరా? ఈచికిత్సయందు సారాయమును త్రాగించినకొలదియు యింకను విశేషముగ బలము తగ్గుచుండును. ఏలనన, యీనీరసమునకాధారభూతమగు దీర్ఘవ్యాధి యీసారాయము మూలమున తొలగింపబడుటలేదు. మరియు యీసారాయముచే కృత్రిమము

1♦యదార్థము తెలుపవలసివచ్చిన నిది ఉపశమనచికిత్స. ఈవిషయము నుగూర్చి 53వ సూత్రమున వివరించియుంటిని.

గ కల్పింపబడిన బలము జీవశక్తి యొక్క ప్రతీకారగుణముచే పట్టుపడలేని పిమ్మట నంతకంటె నెక్కుడు నీరసస్థితి సంభవించును.

పలువిధములైన గుణములు గలిగియుండి పలువిధము లైన తరగతులుగ హానికలుగజేయు చింకోనాపట్టుగాని దాని యొక్క చేదుగుణముగాని తరుచు సంభవించు నీవ్యాధుల యందు బలముగలుగజేయగలవా?

సమస్త పరిస్థితులయందును బలము గలుగజేయగలవని తలంపబడు, మూలికాసంబంధమగు వస్తువులతోను యినుము తోను (Iron) తయారుచేయబడిన బలవర్ధకౌషధములు, వానికిగల విచిత్రఔషధ వస్తుగుణవిశేషముల మూలమున దీర్ఘ కాలమునుండియున్న గ్రహింపజాలని అంతరంగవ్యాధినందుద్భ వించిన నీరసమును తొలగించుటకుమారు అసలువ్యాధికి క్రొత్త బాధలు కలుగజేయును.

దీర్ఘ రక్తదోషమునుండి జనించిన, చేతియొక్కగాని, కాలియొక్కగాని పక్షవాతమును యీసారాయి సంబంధమైన నీబలవర్ధౌషధముల మూలమున రక్తదోషమును నివారణజేయ కుండ నీపక్షవాతమును తగ్గించుటలో నెవ్వరైన కృతార్థులై యుండిరా? లేక పక్షవాతమునకు సంబంధించిన భాగములకు విద్యుచ్ఛక్తిని ప్రయోగించుటమూలమున కండరములయొక్క యు, నరములయొక్కయు, స్పర్శోద్రేకములు నశింపచేయబడి

క్రమక్రమముగ వ్యాధి హెచ్చి పూర్తియైన పక్షవాతము సంభవించుట తప్ప అంతకంటె ఉత్తమఫలితము లెప్పుడైన గాంచబడెనా? ♦1

సాధారణముగ పరిశీలనజేయని దీర్ఘవ్యాధి తత్వముపై ఎల్లపుడు ఆధారపడియుండి క్రమక్రమముగ క్షీణించు, పుంసత్వశక్తికి బలముకలుగజేయుటకు ప్రసిద్ధిగాంచిన, యాంబగ్రిస్, సిన్నమర్, వనిల్లా మొదలగు బలవర్ధకౌషధముల నుపయోగించుట మూలమున సంపూర్ణముగ నపుంసత్వము తీసికొని రాబడుటలేదా?

కొలదిగంటలు మాత్రమే చురుకుతనము, ఉత్సాహము గలుగజేసి. తత్ఫలితములు శాశ్వతముగనుండుటకు మారు ఉపశమనకరగుణముయొక్క సూత్రము ననుసరించి, అనంతర ఫలితములు వ్యతిరేకగుణములతో గూడియుండి వ్యాధినివారణ అసాధ్యపరిస్థితిలోనికి దీసికొనివచ్చి నీపద్ధతికెట్లు గౌరవము బాయవచ్చును?

---

1♦ మాటసరిగా వినబడక చెముడువచ్చినప్పుడు సౌమ్యమైనవిద్యుచ్ఛక్తిని ప్రయోగించుటమూలమున కొలదిగంటలుమాత్రము యీచెవుడు తగ్గగలదు, గాని యీసౌమ్యమైన విద్యుచ్ఛక్తియొక్క శక్తివెంటనే తొలగి పూర్వపుస్థితివచ్చును. తిరిగిఅట్టిగుణము కలుగజేయుటకు విద్యుచ్ఛక్తియొక్క బలము హెచ్చుజేయవలెను. ఈశక్తియొక్కబలముగూడ కొలదికాలముండి తగ్గుటచే యింకను శక్తి వృద్ధిచేయవలసియుండును. క్రమముగా విద్యుచ్ఛక్తి బలము హెచ్చించినప్పటికి అందలి ఫలితములు క్రమముగ తగ్గుచు కడకు ఎంతశక్తి ప్రయోగించినను ఎట్టిగుణమును గలుగజేయక యీచికిత్సాఫలితముగా స్థిరమైన బధిరము సిద్ధించును.

ప్రాచీనపద్ధతి ప్రకారము ఎక్సెక్టిక్ షియా, రోబో రక్ షియో, యను బలవర్ధకౌషధములు, తరుణవ్యాధులలో స్వస్తత చేకూర్చుటకు కొలదిపాటి సుగుణము కలిగించినప్పటికి దీర్ఘవ్యాధులలో అనేకవేలరెట్లు దుర్గుణములకు పాల్పడజేసి యుండెను.

దీర్ఘవ్యాధులలో నేమిచేయవలయునో ప్రాచీనవిధాన వైద్యులకు తెలియనప్పుడు (Alternative remedies) అని పిలువబడు ఔషధములతో అనాలోచితముగ చికిత్స చేయు దురు. వీనియందు పాదరససంబంధమైన ఔ ష ధ ము లు (Calamel corrosive sublimate and mercurial ointments) అగ్రస్థానము వహించియున్నది.

ఈ మందులను సుఖసంబంధముగాని వ్యాధులలో దీర్ఘ కాలము పెద్దమోతాదులలో నుపయోగించిన పక్షమున యీ ఔషధములకు గల నిర్మూలనా గుణవిశేషములచే కడకు అరో గ్యమంతయు సంపూర్ణముగ లోలోపలనాశనముగావింపబడును. ఈవిధముగా నీమందులు రోగిశరీరమున అననుకూలమగు హాని కరమైన గొప్పమార్పులు గలుగజేయును. అక్రమముగ ప్రయోగింపబడు యిట్టి మిక్కిలిహానికరమైన లోహము లెల్ల పుడును ఆరోగ్యమును సంపూర్ణముగ భగ్నముగావించును.

అంటువ్యాధులవలె దేశమున విస్తారముగ వ్యాపించు సమస్తవిడుపు జ్వరములకు ప్రాచీనవిధానవైద్యులు చింకోనా పట్టును పెద్దమోతాదులతో ప్రయోగించి (చవిటిప్రదేశము

లలోగల యదార్థమైన చలిజ్వరములకుమాత్రమే సారాణో గలిసియున్నప్పుడు చింకోనాపట్టు సారూప్యజ్వరహర, శిద్ధౌష ధము) తమ అవివేకమును ప్రత్యక్షముగ వెల్లడిజేయుదురు. ప్రతిసంవత్సరమునందును యీజ్వరములు ఒక్కొక్క ప్రత్యేక మైన స్వభావములతో వ్యాప్తిజెందుచుండును. గాని వానిని నివారణజేయుటకు వేరువేరు సారూప్యౌషధములు అవసరమై యున్నవి. ఈ ఔషధములయొక్క ఒకటి రెండు మోతాదు లతో కొలదిరోజులలో సమూలముగ నీజ్వరములను, నివారణ జేయవచ్చును. ఈ సమూహజ్వరములు [Epedimic fevers] నియమితకాలోద్రేకము ( Periodicity ) గలిగియుండుటచే ప్రాచీనవిధానవైద్యులు యీ నియమితకాలోద్రేకమునందు మాత్రమే లక్ష్యముంచెదరు. మరియు, యీ చింకోనా ఔష ధముకంటె వేరొండు ఔషధము కనుగొనుటకు శ్రద్ధవహింపరు. ఈ జ్వరములయొక్క నియమితకాలోద్రేకము చింకోనాయొక్క యు, చింకోనా ఆమ్లజనిదమగు క్వైనాయొక్కయు విస్తారమైన మోతాదులమూలమున అణచిపెట్టగలిగిన పక్షమున సమూహ చలిజ్వరములను నివారణజేయగలిగితిమని దలంతురు. (ఈసంద ర్భమునందు ఎక్కువ వివేకముగ ప్రవర్తించు జీవశక్తి కొన్ని మాసములవరకు గూడ నీవ్యాధిని అణచియుంచుటకు ప్రయ త్నించును). గాని యీక్వైనా మూలమున జ్వరముయొక్క యీ నియమితకాలోద్రేకము అణచిపెట్టబడి యిట్లు వచింప బడిన రోగి పాలిపోయిన ఆకారముతోను, వగర్పు, కడుపులో

బిగబట్టినట్లుండుబాధ, నిస్సత్తువ, నిద్రాశ, కాళ్ళువిస్తారముగ వాచుట, కడుపు, ముఖము, చేతులు, పొంగరించుట మొదల గు లక్షణములతో జ్వరముతోనున్న స్థితికంటె దుస్థితిలో వ్యాధి నివారణ గావింపబడెనని వైద్యాలయమునుండి పంపివేయబడు ను. ఇట్టిచికిత్సమూలమున విస్తారముగ హానికలుగజేయబడిన రోగులకు వ్యాధినివారణజేసి ఆరోగ్యముచేకూర్చుటట్లుండ మృత్యుముఖమునుండి తప్పించుటకు గొన్నిసంవత్సరములు సారూప్యౌషధ చికిత్సగావించవలసిన అవుసరము తరుచుగ గలు గుచున్నది.

నియమితకాలోద్రేకముగల జ్వరములతో సంభవించు మగత వైరూప్యముగ పనిచేయు వెలేరియన్ అను ఔషధము మూలమున యీవైద్యులు తొలగించగలిగినపుడు మిక్కిలి ఆనందింతురు. ఈఔషధముమూలమున గలుగు చురుకుదనము కొలదిగంటలు మాత్రమే యుండగలదు. గాని తిరిగి మగత గలిగినప్పుడు యీమగతను బోగొట్టి చురుకుదనము గలిగించు టకు యీఔషధముయొక్క మోతాదులు వృద్ధిగావించుచు తిరిగితిరిగి ప్రయోగించవలసియుండును. గాని కడకుమోతాదు నెంత హెచ్చించినప్పటికి గుణముగలిగించక నిలిచిపోవును. ఈఉప శమనకరౌషధము ప్రథమగుణమునందు ఉద్రేకముమాత్రము గలుగజేయగలిగియుండుటచే అనంతరగుణములయందు జీవ శక్తిని చైతన్యవిహీనముగావించును. ఈప్రాచీనవిధానముయొక్క యిట్టి అయుక్తమైన చికిత్సమూలమున రోగినిశ్చయముగ సత్వ

రముగ మృత్యువాతబడును. గాని యీవైద్యులు యీపద్ధతు లమూలమున తమరోగులను సందేహములేకుండగ నిశ్చయముగ చంపుచుంటిమని తెలిసికొనలేకుండిరి. మరియు వ్యాధియొక్క దౌష్ట్యముననే రోగిమరణించియుండెనని ఆరోపింతురు.

దీర్ఘరోగులకు యింతకంటెను మిక్కిలిదారుణమైన ఉపశమనకర చికిత్స డిజిటలిస్ ప్ఫూర్‌ప్యూరియా అను ఔషధము మూలమున గావింపబడుచున్నది. దీర్ఘవ్యాధిచే బాధపడు రోగులలో ఉద్రేకించి వేగముగాకొట్టుకొనునాడిని యీఔషధము మూలమున బలవంతముగ మందగింపజేసి రోగికి ఉత్కృష్టము సేవగావింతుమని ప్రాచీనవిధానవైద్యులు తలంతురు. ఈరోగులలో వేగముగ నాడికొట్టుకొనుట యదార్థముగ నొక లక్షణము. ఈభయంకరమైన ఔషధము యిట్టివ్యాధులయందు వైరూప్యముగ ప్రయోగింపబడినప్పుడు మొదటిమోతాదుతోనే ఉద్రేకించి వేగముగకొట్టుకొను నాడిగమనమును తగ్గించుట యదార్థము. గాని వెంటనే పూర్వముకంటెను నాడివేగము హెచ్చిపోవును. తిరిగి యీవేగమును తగ్గించుటకు మోతాదు హెచ్చించి ప్రయోగించవలసి యుండును. గాని దీని గుణము పూర్వముకంటెను తగ్గి కొలదికాలముమాత్రమే యుండును, అపుడు యింతకంటెను పెద్దమోతాదు యింకను తరుచుగా యీయవలసియుండును. ఈఔషధముయొక్క ద్వితీయ గుణమునందు (Secondary action) యీశక్తిని నిలుపుకొనజాలక యీఔషధముపయోగించక పూర్వముగల గమనము

కంటె లెక్కింప నశక్యమగుస్థితిలో నాడిగమనము హెచ్చిపోవు ను. క్రమముగా నిద్ర, బలము, ఆకలి, నశించిపోవును. మృత్యువు ఆసన్నమగును.

ఈవిధముగ చికిత్సగావింవబడిన రోగులు జీవించినను నివారణ అసాధ్యమగు ఉన్మాదవ్యాధికెరగాకుండ నొక్కరు తప్పించుకొనజాలరు. 1♦

వైరూప్యౌషధవిధాన వైద్యులు గావించు చికిత్స యిట్టిది. ఇతర వైరూప్యౌషధవిధానవైద్యులు గూడ యిట్టి వంచన కరగ్రంథములనుండియే తమజ్ఞానమును సంపాదించి యుండుటచే, యింతకంటె వేరు ఉత్తమసహాయము బొంద నవకాశములేక, అవసరమునుబట్టి రోగులు యీచికిత్సకే తల యొగ్గి వలసి వచ్చుచుండెను.

దీర్ఘవ్యాధులయొక్క (సుఖసంబంధముగానివ్యాధులు) ఆదికారణము గూర్చియు, వానిచికిత్సకొర కుపయోగించు ఔషధములగూర్చియు యీ ప్రాచీనవిధానవైద్యులకు తెలి యదు. గాని యీవ్యాధులయొక్క యుత్పత్తి క్రమమునందు,

♦ 1 ప్రాచీనవిధాన వైద్యులలో అగ్రగణ్యుడగు హ్యూఫ్‌లాండు అనునతడు, యిట్టివ్యాధులయందు డిజిటలిస్ ప్రయోగించుటనుగూర్చి మిక్కిలి తృప్తికరముగా యీక్రిందిపదములలో శ్లాఘించియుండెను. "విస్తారమైన రక్తప్రసరవేగము డిజిటలిస్ మూలమున తొలగింపబడగలదని తెల్పునపు డెవ్వరును గాదనజాలరు" యని తెల్పియుండెను. ఈవేగము శాశ్వతముగ తొలగింపబడినదా? మరియు వైరూప్యౌషధము మూలముననా? పాపము హ్యూఫ్‌లాండ్ అభిప్రాయమిది!

లక్ష్యముంచి వ్యాధినిర్ణయముగాంచి చికిత్సజేయుదుమని యీ వైద్యులు వ్యర్థముగ ప్రగల్భములు బల్కుదురు. ♦1

ఈ అనంతములైన దీర్ఘవ్యాధులను నివారణచేయుట కుద్దేశింపబడని పద్ధతులను విజ్ఞానరహిత జీవశక్తి తనస్వస్థతకొరకు గావించుకొను హానికరపద్ధతులను అనుకరించు అక్రమచికిత్సమూలమున అల్లోపతీవైద్యులు నివారణచేయుటకెట్లు విశ్వసించియుండిరి.

ఊహించితెలిసికొనబడిన వ్యాధియొక్క స్వభావమును వీరు వ్యాధియని పరిగణించుచుండిరి. అందుపై వాపు, జ్వరము ఈడ్పులు, సీరసము, శ్లేష్మము, కుళ్ళినస్థితి, అవరోధము, మొదలగు లక్షణములను ఈడ్పులను శాంతింపజేయు ఔషధములు, వాపునుశాంతింపజేయు ఔషధములు, బలవర్థకౌషధములు, భేదిమందులు, వైరూప్యౌషధములు, (వీనిని గూర్చి యీవైద్యులకు అల్పమైన పరిజ్ఞానమేకలదు) మొదలగు ఔషధములమూలమున యీప్రాచీనవిధానవైద్యులు కపటమైన చికిత్సగావింతురు.

---

♦1 హ్యూఫ్‌లాండు తన ప్రాచీన కపటవిద్యనుగూర్చి శ్లాఘించుటకు తాను ప్రచురించిన కరపత్రమునందు 20వ పేజీలో వ్యర్థప్రయత్నము గావించియుండెను. దీర్ఘవ్యాధులనుగూర్చి నాచే వ్రాయబడిన గ్రంథమునకు పూర్వము 2500 సంవత్సరములనుండి ప్రచారములోనున్న వైరూప్యవిధానము (అల్లోపతీ) దీర్ఘవ్యాధులమూలతత్వమునుగూర్చి ఏమియు తెలిసికొనియుండలేదు. గాన అట్టివ్యాధులనుగూర్చి అసత్యపు విధానములు కల్పించియుండలేదా?

ఇట్టిసర్వసామాన్యచిహ్నముల మూలమున చికిత్సజేయుటకు ఉపయోగకరమగు ఔషధములు కనుగొనబడజాలవు. మరియు ఇట్టిచిహ్నముల యాధారముతో నిశ్చయముగ చికిత్స జేయగలుగుట కనువగు ఔషధములు ప్రాచీనవిధాన వస్తుగుణదీపికయందెక్కడను యగుపించవు. నేను వేరొకచో వివరించినవిధముగా యీప్రాచీనవిధానవైద్య వస్తుగుణదీపిక వట్టిఅబద్ధములతో కలసి ‡1 ఊహాలనుబట్టి అసత్య సారాంశములతో మాత్రమే ప్రధానముగ నిర్మింపబడెను.

శరీరద్రవములగు రక్తము మొదలగువానియందు ఆమ్లజని (Oxygen) నత్రజని (Nitrogen) కర్బనము (Carbon) ఉదజని (Hydrogen) లోపించుట లేక అధికముగనుండుట, స్పర్శజ్ఞానము, ఉద్రేకము, జ్ఞాపకశక్తి, మొదలగు భావనలు, నశించుట లేక వృద్ధిజెందుట, మంచిరక్తనాళనిర్మాణము, దుష్టరక్తనాళనిర్మాణము, కేశనాళనిర్మాణము, యివి సక్రమకార్యాచరణ స్థితినుండి మార్పుజెందుట బలహీనముజెందుట మొదలగు యీవిశేషభావనాయుత చిహ్నములను అపరిచయమగు మందులమూలమున మిథ్యారూపకమైన శమ ఆశయము నెరవేర్చుట కిట్టివిధముగనే యీవైద్యులు అనాలోచితముగ నెదుర్కొనుచుండిరి. ఇదియంతయు వట్టి ఆడంబరము రోగికెట్టి యుపయోగము గలుగజేయని నిదియొక చికిత్సాపద్ధతి.

‡1 మెటీరియా మెడికాపూరా అనుగ్రంథమునందు "సామ్యవస్తుగుణదీపిక యొక్క ఆధారములు" అని వ్రాయబడిన మొదటివ్యాసమును గాంచుము.

ఈఅల్లోపతీవైద్యవిధానము ప్రాచీనకాలములో ప్రవేశపెట్టబడి శాసనముగావింపబడి యుండుటచే వ్యాధులకనుకూలమగు సక్రమచికిత్సాపద్ధతికి పూర్తిగ అవకాశమే లేకపోయెను. అపరిచితములై ఒకదానికొకటి మిక్కిలి విభేదమైయుండు పలువిధములైన ఔషధవస్తువులను సంపుటీకరణముగావించి చికిత్సగావించు యీఅల్లోపతీ చికిత్సాపద్ధతి సక్రమచికిత్సాపద్ధతికి స్థానములేకుండ జేసెను. వ్యాధియొక్క ప్రధాన లక్షణమును శాంతింపజేయగలదని వైద్యుడుభావించు ఔషధమును ప్రధానౌషధముగ దీసికొని Basis) (ఈఔషధముయొక్క ప్రధాన గుణమునందు పరిచయము లేకయే) యితర సహచర లక్షణములను తొలగించుటకు మరికొన్ని యితరఔషధములు (పైవిధముగనే అపరిచయమైనట్టి) (adjuvans) మిశ్రమము గావింపబడును. వీనికితోడు క్రమకరౌషధము (corrective remedy) అను కపటనామముతో వేరొకఔషధముగూడ యిందుతో సంపుటీకరణము గావింపబడును. (ఇదియుగూడ అపరిచయమైన ఔషధమే) ఈమందులన్నియు ఒకానొక తియ్యనిఔషధ ద్రవపదార్థముతోగాని, ఔషధసంబంధమైన వడియగట్టబడిన నీటితోగాని మిశ్రమముగావించుటకు యీఔషధ సంపుటీకరణ సూత్రమునందు (formula) చేర్చబడును. ఈమిశ్రమదాావకమునందు కలుపబడు ప్రతివస్తువు వ్యాధిగ్రస్తమైన శరీరమునందు ఔషధనిర్ణయము కావించినవైద్యుని యుద్దేశ్యమునుసరించి ఎట్టికలతలు కలుగజేయక అందు సంపుటీకరణముగావింపబడి

న యితరవస్తువుల మూలమున మారుమార్గమును బట్టింపక నిర్ణయించిన ఆయాభాగములయందు ఆయాఔషధములు పనిచేయగలవని యీవైద్యులచే ఊహింపబడుచుండెను. గాని న్యాయమునను సరించి యిట్లూసించుటకెట్టిఅవకాశమును లేదు. ఇట్లు సంపుటీకరణము గావింపబడిన నొకవస్తువు వేరొకవస్తువుయొక్క గుణమును సంపూర్ణముగ గాని కొంతవరకు గాని ఒకదానిగుణమును నొకటి నిలిపివేయును. లేదా ఊహింపజాలని వేరొకగుణమును వేరొకవస్తువునకు గాని యితరవస్తువులకుగాని గలుగజేయును. గాన ఉద్దేశించిన గుణములు బొందుట కెంతమాత్రము అవకాశముండదు. ఇట్టివిధమగు ఔషధమును ప్రయోగించుట మూలమున సాధారణముగా భవిష్యత్సూచకము తెలియని క్రొత్తవ్యాధి సంభవించగలదు. వ్యాధియందుగల విస్తారలక్షణములలో నీఔషధజనిత వ్యాధి గోచరించుట కవకాశముండదు. ఇట్లు సంపుటీకరణము గావించిన ఔషధమును దీర్ఘకాలము ప్రయోగించిన అందుమూలమున జనించిన క్రొత్తఔషధజనిత వ్యాధి శరీరమున స్థిరమగుస్థానము నేర్పరచుకొనును. ఇందు మూలమున అసలువ్యాధితో యీఔషధజనితవ్యాధి క్లిష్టముగ నేర్పడి అసలువ్యాధిని ఉద్రేకింపజేయును. ఈఔషధము (prescription) తరచు తిరిగి ప్రయోగింపక నిలుపుజేసి అందుకుమారుగ యితరవస్తువుల సంపుటీకరణమున, ఒకటి రెండు నూతనమిశ్రమ ఔషధములను తయారుజేసి తరచుగ ప్రయోగించినను రోగియందింకను శక్తిక్షీణము గలుగజేయును. ఈవిధ

ముగ ప్రయోగింపబడిన ఔషధసంబంధమైన వస్తువులు అసలు వ్యాధికి యేవిధముగను వ్యాధిలక్షణముతో సంబంధించి యుండకపోవుటచేతను, వ్యాధికిసంబంధించియుండని భాగములను అనవసరముగ హానికర పద్ధతితో నెదుర్కొనుటచేతను రోగి యందింకను బలక్షీణము కలుగజేయబడును.

మానవశరీరమున ఒక్కొక్క ఔషధముయొక్క గుణము తేటతెల్లముగ తెలిసికొనబడినప్పటికి (యీ సూచీకరపత్రి లేఖకులు (prescription writers) ఒక్కొక్కఔషధము యొక్క గుణములో నెయ్యవవంతైనను నెరుగరు) పలువిధములైన ఔషధములను మిశ్రమముగావించుటయు మరియు పలువిధములైన యిట్టి వస్తువులలో చాలవస్తువులు మిశ్రమద్రవ్యస్వభావముగలిగి యుండ అట్టివస్తువులను సమ్మేళనము గావించుటయు, యీ పలువిధములైన వస్తువులు ఒకదానికొకటి మిక్కిలి విభేదమై యున్నప్పటికి అపరిచయములైన యీమందులయొక్క విచిత్రగుణములతో ఉద్దేశింపబడిన ఒకానొక నివారణాగుణము గలిగింప రోగులకు యీ మిశ్రమగ్రాహకమును తరుచుగా తిరిగితిరిగి ప్రయోగించు పెద్దమోతాదులలో ప్రయోగించుటయు మొదలగునిట్టిప్రయత్నములన్నియు, పర్యాలోచనజేయు, నిష్పక్షపాతబుద్ధిగల ప్రతివ్యక్తికి అసహ్యముగలిగించు అవివేక కృత్యములుగ యగుపించగలవు. *1

*1 ఈ ఔషధమిశ్రమములోగల అసంగతము ప్రాచీనవిధాన వైద్య అనువర్తనులుగూడ గాంచియుండిరి. గాని యీ అసంగతమును

గుర్తించి విశ్వశించినప్పటికి యీా విశ్వాసమునకు వ్యతిరేకముగ యీాపద్ధతినే కృషియందు అవలంబించుచున్నారు. మార్కస్ హెాజీ అనునాతడు హూాఫ్లండు పత్రికయందు యీాక్రిందివిధముగ మనస్సాక్షికి వ్యతిరేకముగ బాధించు తన మనోభావములను వెల్లడించి యుండెను. "వాపుతోగూడిన ఉద్రేకపరిస్థితిని మనము తొలగింపవలచినప్పుడు, అమ్మోనియాసాల్ గాని సైటరుగాని లేక ఉద్భిజ్జామ్లముగాని (Vegetable acid) ఉపయోగింపక ఉష్ణాకర్షణములని (Antiphlogestics) పిలువబడు పలువిధము లైన మందులను తరుచు మిక్కిలి విశేషముగ సంమిశ్రమముగావించి, ఒక్కవ్యాధిలోనే విడువకుండ తరుచుగా ప్రయోగింతుము. మురిగినస్థితిని (Putridity) తొలగింపవలసివచ్చినప్పుడు, చింకోనా, ఖనిజఆమ్లములు (mineral acids) ఆర్నికా, సర్పెన్టేరియా మొదలగు క్రిమిఘాతుక (antiseptic medicines) ఔషధములను ప్రయోగించి యీా పరిస్థితిని తొలగించుటకువారు, యీామందులలో యితరమైన చాలమందులను మిశ్రమముగావించి యీాసమ్మేళనా ఫలితముకొరకు నిరీక్షింతుము. వ్యాధికేయౌషధము నిశ్చయముగ ననుకూలించునో తెలియక ఏదియో యొక ఔషధము పనిచేయగలదను ఉద్దేశ్యముతో అనేకమైన మందులను కలిపి ఒక్కమారుగా ప్రయోగించి అపేక్షించు ఉద్దేశ్యము సఫలీకృతమగుటను అదృష్టమునకు వదలివేయుచున్నాము. గాన చెమటపట్టించుటగాని అవరోధము తొలగించుటగాని, శ్లేష్మవృద్ధిజేయుటగాని, రక్తము పరిశుద్ధము గావించుటగాని, వ్యాధిని విరోచనములుద్వారా తొలగించుటగాని, పలువస్తువుల మిశ్రమముగావింపని ఒక్క ఔషధము మూలమున జరిగించుటలేదు. ఈకృత్యములకొరకు మనమొసంగు ఔషధనూదికములు (prescriptions) పరిశుద్ధమైన ఏకవస్తుప్రయోగములతో గాక మిశ్రమప్రయోగములతో నిండియుండును. మరియు ప్రతి ఒక్కొక్క ఔషధమునకుండవలసిన ప్రత్యేకగుణములు యీాసమ్మేళనమైన నానావిధ ఔషధమిశ్రమమునందగు

చికిత్సా పర్యవసానము కల్లగావించును. ఈమిశ్రమౌషధముచే

పడవు. మన సంపుటీకరణసూత్రమునందు( for mula ) మిశ్రమము గావింపబడు ప్రతిఔషధమునకు ఒక్కొక్క తరగతిస్థాన మొసంగుదుము. ప్రధాన గుణము చేయవలసిన ఔషధమునకు "మూలము" (Base) అనియు తక్కిన వానికి "సహాయకరములు, ఆధారకరములు," (Helpers & supporters) అనియు, క్రమకరములనియు (correctives) మొదలగు నామకరణము లేర్పరచి యుంటిమి. ఔషధములయందీ తరగతి నిర్మాణము పూర్తిగ, యథేచ్ఛగ గావింపబడెను. ప్రధానవస్తువెంతపని చేయునో, యీ "సహాయకరములు ఆధారకములు" గూడ అంతపని జేయును. గాని వానిగుణవిశేషమును గొలుచుటకు, ప్రమాణమైన కొలతలేకపోవుటచే, ఏవస్తువెంతపరిమాణములో పనిచేయుచున్నదో నిర్ణయింపజాలకున్నాము. ఈవిధముగనే "క్రమకరములు" (correctives) యితరవస్తువులయొక్క శక్తులపై మరియొక విభేదమైన ప్రాబల్యము గలిగియుండజాలవు. ఈ "క్రమకరములు" సంపుటీకరము గావింపబడిన యితరవస్తువుల గుణమును, వృద్ధిజేయుటగాని, క్షీణింపజేయుటగాని లేక వేరుమార్గమున బెట్టుటగాని జరిగింపగలవు. గాన యిట్టి మిశ్రమౌషధముల (prescriptions) మూలమున సంభవించిన మార్పు, ఔషధనిర్ణయమున మిశ్రమము గావింపబడిన వస్తువులయొక్క సమూహఫలితముగ సంభవించెనని పరిగణింపవలయును; గాని యీమిశ్రమౌషధమునందలి ఏ ఒక్కవస్తువుయొక్క ప్రత్యేక సామర్థ్యగుణమును ప్రత్యేకించి పొందజాలము. ఔషధమునుగూర్చి ముఖ్యముగ తెలిసికొనవలసిన విషయమును గూర్చియు, యీఔషధములు అన్యోన్యము మిశ్రమము గావింపబడినప్పుడు, అన్యోన్యము ఏర్పడు శాతవినసంబంధముంగూర్చియు, మనకుగల పరిజ్ఞానమత్యల్పమగుటచే యీ అల్పపరిజ్ఞానముపై ఆధారపడి యితరవస్తువులతో సంమిశ్రమము గావించిన, ఒకవస్తువు శరీరములోనికి ప్రయోగింపబడినప్పుడు ఆవస్తువు యొక్కగుణము ఎట్టిశక్తిలో ఎంతబాహుళ్యముగనుండగలదో ఆవిషయమునుగూర్చియు, నిశ్చయముగ తెలిసికొనజాలము.

నిశ్చయముగ ఫలితములు, మార్పులు సంభవింపగలవు. గాని వీనియందొక్కటియు లాభదాయకమైనవియు, అనుకూలస్వభావము గలవియు నుండజాలవు. ఈఫలితములు, మార్పులు, సమస్తము వినాశకరమగు హానికరములు.

వ్యాధిగ్రస్తమైన మానవశరీరమున నిట్టి మిశ్రౌషధ ప్రయోగముల మూలమున గావించు అకస్మిక విప్లవములను నివారణయని నెవ్వరు పిలునగలరో నాకు జూడకోరికగలదు.

వ్యాధిగ్రస్తమైన శరీరమునందు జీవశక్తియొక్క కార్యాచరణ ధర్మములను సక్రమముగ నిర్వర్తించుటకు యింకను నిలచియున్న చైతన్యపద్ధతిమూలమున మార్గదర్శకమై అనుకూలమగు ఔషధము మూలమున నివారణ గావింపవచ్చును. గాని శరీరమును మృత్యుముఖమున కీడ్చువరకు దుర్బలముగావించుట మూలమునగాదు. అయినప్పటికి ప్రాచీనవిధానవైద్యులు దీర్ఘవ్యాధులతో బాధపడు రోగులను హింసించి బలహీనముగావించి శరీరపోషక ద్రవములను నసింపుజేసి జీవితమును హ్రస్వముగావించు ఔషధములమూలమున నెపుడొనుటతప్ప అంతకంటె వేరొండు నేమిగావింపవలయునో వీరికి తెలియదు. ఈచికిత్సాపద్ధతిని జీవితమిట్లు నాశనముగావింపబడుచుండ రక్షింపబడుచుండెనని చెప్పవచ్చునా? ఈచికిత్స దుర్మార్గమైన చికిత్సయని పిలుచుటకంటె వేరొండునామమున కర్హమైయున్నదా? ఈచికిత్స మిక్కిలి అననుకూలమైన పద్ధతిలో గుణము గలుగజేయును అనగా ఎట్టిగుణము గలుగజేయువలయునో దానికివ్యతిరేకమైన

గుణము కలుగజేయును. దీనిని అంగీకరింపవచ్చునా? ఇక నెంత మాత్రమైనను సహింపవచ్చునా?

ఆధునికకాలమున ప్రాచీనవిధానవైద్యులు, వ్యాధిగ్రస్తులగు తోడిమానవులపై గావించు క్రూరకృత్య అననుకూల కార్యాచరణములు మితిమీరియుండెను. ఈవిషయమును నిష్పక్షపాతబుద్ధితో పరిశీలనజేయు ప్రతివ్యక్తియు అంగీకరింపక తప్పదు. ఈవిధానవైద్యులేగూడ(క్రొ)జర్ హాక్ సెస్ మొదలగు వారు) తమ మనస్సాక్షియొక్క బాధచే తమతప్పిదములను ప్రపంచ పరిముఖమున అంగీకరించియుండిరి.

మానవసంరక్షకుడును, ప్రేమమూర్తియునగు సృష్టికర్త యీదుర్మార్గములను నిలుపుజేయుటకును, యీహింసలను అపుజేయుటకును వమనకరౌషధములు మలకోశములను గోకివేయు భేదిమందులు, వేడికాపటములు, స్వేదకారకమందులు లాలాజలోత్పత్తికరౌషధములు ఏనిమూలమున శరీరపోషక ద్రవములను శక్తిని హరింపజేయకుండుటకును, వీనికన్నిటికిని వ్యతిరేకమైన యదార్థమగు నివారణా శాస్త్రమును వెల్లడిజేయవలసిన కాలమతిక్రమించెను.

మరియు, బాధకలుగజేయు పరికరములతో ప్రాణపోషక రక్తమును ధారపోసి రోగిని హింసించి క్షీణింపజేయకుండ నిరోధించుటకును, వ్యాధులతో బాధపడు రోగులకు స్వస్తత చేకూర్చుటకుమారు అపరిచితమైన వస్తుగుణములుగల తీవ్రమైన మందులను దీర్ఘకాలముపయోగించుట మూలమున వ్యా

ధి నివారణ అసాధ్య పరిస్థితులలోనికి దీసికొనిరాకుండ అపుజేయు టకును బండివెనుకను గుఱ్ఱమునుకట్టి నడిపింప ప్రయత్నించు విధమున 'వైరూప్యౌషధములు వైరూప్యవ్యాధులను నివారణ జేయును' (contraria, contraries, curentur) అనుసూత్ర మునను సరించి బలమైన ఉపశాంతికరౌషధముల మూలమున వ్యాధుల నణచిపెట్టకుండ అటంకపరచుటకును, నిర్దయులగు సాధారణవైద్యులు గావించురీతిని రోగికి సహాయము జేయుట కుమారు మృత్యుమార్గమునకు దారిజూపు అకృత్యములు గావింపకుండ నిలుపుజేయుటకును, ప్రకృతికి అనుకూలమైన చికిత్సాసూత్రమగు 'సారూప్యౌషధములు, సారూప్యవ్యాధు లను, నివారణజేయును' (similia, similibus, curentur)అను సూత్రమునను సరించి రుజువుచేయబడిన గుణములనుబట్టి అతి జాగరూకతతో నిర్ణయింపబడిన మిశ్రమముగాని కొలది ప్రత్యే కఔషధములయొక్క చిన్నమోతాదుల మూలమున ఆరోగ్య ముచేకూర్చి నిష్కళంకమైనశాశ్వతనివారణ సౌమ్యముగ, సత్వ రముగ రోగికి సాధ్యమైనంతవరకు నిస్సత్తువ గలుగజేయకుండ చే కూర్చుటకును మానవసంరక్షకుడును, ప్రేమమూర్తియు నగు సృష్టికర్త యదార్థమైన చికిత్సాశాస్త్రమును వెల్లడిచేయవలసిన కాలమతిక్రమించెను. సారూప్యౌషధశాస్త్రమును కనుగొనుటకు భగవంతుడనుజ్ఞ యొసగవలసిన సమయమే తెంచెను.

'ప్రతివ్యాధిని, సౌమ్యముగ, సత్వరముగ, నిశ్చయము గ, శాశ్వతముగ నివారణజే..యుటకు నివారణజేయదలచిన వ్యా

ధికి సారూప్యమగు వ్యాధిని గలుగజేయగల ఔషధమునే నిర్ణయించవలయును.' అను సూత్రముపైగల వైరూప్యౌషధ పద్ధతికి విభేదమైన యదార్థమగు ఉత్తమమైన చికిత్సాపద్ధతిని పరిశీలన, ఆలోచన, అనుభవము మూలమునకనుగొనియుంటిని.

ఇంతవరకు నెవ్వరును యీసారూప్యౌషధ నివారణాపద్ధతిని బోధించియుండలేదు.

ఈపద్ధతియందు మాత్రమే సత్యముగలదు. ఈఒక్క విధానమునందే సత్యముగలదని నేను రుజువుపరచగలను. ఈ త్యము వేలకొలది సంవత్సరములనుండి మరుగుపడియున్నప్పటికి గానిదియొక్క విస్పష్టచిహ్నములు ఏకాలమునందును కనుగొన వచ్చును. ♦1

ఇ ది స త్య ము. ఏకాలమునందైనను వ్యాధులు మందులమూలమున యదార్థముగ, సత్వరముగ, శాశ్వతముగ ప్రత్యక్షముగ నివారణచేయబడియున్నపక్షమున వట్టిదైవిక పరిస్థితులవలన స్వస్థత చేకూర్చబడుటగాని తరుణవ్యాధియొక్క గమనకాలము పూర్తిగగతించినపిమ్మట ఆరోగ్యముచేకూరియుండుటగానివైరూప్యవైరుధ్యచికిత్స గావింపబడిన సందర్భముల

♦1 ప్రేమరూప పరాత్పరునితోగూడ సత్యము ఆద్యాంతరహితము. భగవదాజ్ఞానుసారముగ, నిర్ణయకాలమువచ్చువరకు యీసత్యము మానవ దృష్టికి గోచరముగాదు. గాని ఆసమయమేతెంచిన వెంటనే సూర్యోదయ సమయమున ప్రచ్ఛన్నముగావించు దట్టమైన కారుమబ్బులను విడగొట్టి మానవజాతి సౌభాగ్యముకొరకు యీ సత్యముయొక్క శాంతికిరణములు ప్రసరింపగలవు.

యందు శరీరశక్తులు తమంతటాము కొంతకాలమునకు క్రమముగా ప్రాబల్యముచెంది (సక్రమపద్ధతిని ఆరోగ్యముచేకూరుటకును దీనికి చాలవ్యత్యాసముగలదు) స్వస్థతచేకూరుటగాని, జరుగని తదితర సందర్భముల యందు రోగులెల్లరు సారూప్యమగు వ్యాధిస్థితిని గలుగజేయు శక్తిగల ఔషధము (సారూప్యౌషధము) అప్రయత్నముగ ప్రయోగింపబడుటమూలముననే (వైద్యునకీవిషయము తెలియకుండగనే) కేవలము నివారణచేయబడుచుండిరి. (వైరూప్యౌషధపద్ధతిని ఔషధమును ప్రయోగించినప్పటికి ప్రయోగింపబడిన ఔషధము దైవికముగ సారూప్యౌషధమగుట మూలమున నివారణ గలుగుచున్నది.)

మిశ్రమముగావింపబడిన మందులమూలమున సంభవించిన యదార్థమైన నివారణలలో గూడ (యిట్టివిచాల అరుదు) అందుప్రాధాన్యముగ గుణముగలుగజేసిన ఔషధమెల్లపుడు సారూప్య స్వభావముగల ఔషధమై యుండితీరును.

వైద్యుడు ఔషధప్రయోగమున పలువిధములైన ఔషధములను మిశ్రమముగావించు సర్వసాధారణ పద్ధతికి వ్యతిరేకముగ ఒక్కొక్కప్పుడు ఒక్క ప్రత్యేకౌషధము మూలమున సత్వనివారణగావించి యున్నపుడీవిషయమును మిక్కిలి ప్రత్యక్షముగ గాంచవచ్చును. ఈసందర్భమునందు సత్వరనివారణ, వ్యాధికి సారూప్యమగు వ్యాధిని యీఔషధము గలుగజేయ సమర్థమైయుండుటచేతనే సంభవించియుండెనని ఆశ్చర్యముగ

మనము గాంచగలము. ఈ సందర్భములయందు తమవైద్య విధాన సూత్రములకు వైరుధ్యముగ మించి ప్రవర్తించుచున్న ట్లెరుగరు.

ఈప్రాచీనవిధాన వైద్యమున దీర్ఘకాలమునుండి వాడుకలోనున్న చికిత్సాశాస్త్రము ననుసరించి ఔషధమును ప్రయోగించుటకు మారు ఆసూత్రమునకు సరియైన వ్యతిరేక సూత్రమున ఔషధమును ప్రయోగించుటచేతనే రోగులు సత్వరముగ నివారణజేయబడి యుండిరి.

ప్రజాసామ్యముచే, అనుశ్రుతముగ వాడబడు సుఖసంబంధమైన పుండునకు పాదరసము,కముకుదెబ్బలమూలమున సంభవించిన వ్యాధి పరిస్థితులకు ఆర్నికా, చవిటిప్రదేశముల చలిజ్వరములకు చింకోనా, నూతనముగా సంభవించిన చిడుమునకు గంధకపుష్పములు, మొదలగునవి వాడబడి నివారణజేయబడుచుండెను. ఎల్లపుడు ఒకేస్వభావముతోనుండు యీవ్యాధులకీ ఔషధములు వాడబడుచుండెను. ఈమందులు యీ ప్రాచీనవిధానవైద్యులచే పరిశోధింపబడినవిగావు. ప్రజాసామ్యముచే ప్రాచీనానుభవమునుబట్టి అనుశ్రుతముగా వాడబడుచుండెను. ప్రాచీనవిధానవైద్యులు గావించు చికిత్సనుండి వీనిని మినహాయించిన, దీర్ఘవ్యాధులలో నీవిధానవైద్యులు గావించు సమస్తచికిత్సయు, వ్యాధితో బాధపడుచు దుఃఖించు రోగియొక్క వ్యాధినింకను ఉద్రేకింపజేసి అతని వినాశమునకు హేతుభూతమై అధోగతి పాలగునంతటి వ్యయము రోగికి

కలుగజేసి, వైద్యుడు తన గౌరవగాంభీర్యముల ప్రదర్శించుట కనువై ♦1 బలహీనముచేయునట్టి, పీడించునట్టి, హింసించు

---

♦1 ఈవిధముగ జలుబుజ్వరములో, చలిఅవస్థయందు, పెద్దపుష్పముల కషాయమిచ్చినపక్షమున, చర్మమునందు ప్రసారములేక నిలిచియున్నదని విశ్వశింపబడు చెమట, చర్మముద్వారా బయటకు తొలగింపవచ్చునని యీవైద్యులు తలంచియుండిరి. ఈ కషాయమునకు సారూప్యవిచిత్రగుణముండుటచే (సారూప్యముగ) యిట్టి జ్వరములను తొలగించి నివారణజేయ సమర్థమైయుండెను. మరేమియునీయక యీకషాయము యొక్క ఒక్క చిన్నమోతాదు, మాత్రమే నిచ్చిన పక్షమున చమటపట్టింపకయే, తక్షణము సమర్థముగ జ్వరమును తగ్గించును. మిక్కిలి గట్టితనముగల తీవ్రమైన వాపులయందు, విపరీతమైన ఉద్రేకముతో చీముపట్టకుండ నుండి, భరింపనశక్యమగు బాధగలిగియున్నపుడు, వెచ్చనిపట్లు తరుచుగామార్చుచు వేయుచుందురు. ఇందుమూలమున వాపుబాధ శాంతించి, ఆభాగమున గోచరమగునట్లు మెత్తబడి పసుపురంగుగా మెరుగుచు కురుపుక్రింద ఏర్పడును. ఈ పరిస్థితిపట్టి యొక్క తేమవలన సంభవించినదని యీప్రాచీన విధానవైద్యులు తలంతురు. గాని యిది పట్టిభ్రాంతి. ఈవాపునందుగల వేడిని, పట్టుయొక్క ఆధిక్యమైన వేడి సారూప్యముగ శాంతింపజేసి సత్వరముగ చీము పట్టింపగలిగెను. కంటిజబ్బుయందు ఇలిస్యను మందులో ప్రధానవస్తువైన, నేత్రములను ఉద్రేకింపజేసి వాపుగలుగజేయు రససింధూరము [red oxide of mercury] తో గూడిన నామందు నెందుకు ప్రయోగించెదరు? ఇచ్చట సారూప్యముగ ప్రయోగించియుండిరనిన వారిమనసునకు కష్టముగనుండునా? తరుచు మూత్రానుమానము గలిగి, మూత్రము జారీగానెడలక బాధించు ఆతురతతోగూడిన చిన్నపిల్లల మూత్రబాధను, సాధారణముగ గనేరియాజబ్బులలో బాధకరముగ, తరుచు మూత్రానుమానముతో మూత్రము జారీగనెడలక బాధించు బాధను, అజామోదరస (Parsley juice) మెట్లు బాధను తగ్గించుచున్నది? ఈ

నట్టి చికిత్సమాత్రమే నిలచియుండగలదు.

గుర్రిడ్డియనుభవమీ వైద్యులనొకప్పుడు సారూప్యౌషధ చికిత్సాపద్ధతికి, తీసికొనివచ్చెను. అయినప్పటికి, ప్రకృతి శాసనముల కాజ్ఞానువర్తనముగ సంభవించిన నీనివారణల్లి కావింపబడెననియు (వ్యాధికి సారూప్య మగుటవలన) ఇట్లి సంభవింపగలవనియు వీరుగాంచియుండలేదు.

---

దసము ఆరోగ్యమైన వ్యక్తులలో యిట్టిబాధను గలుగజేయు శక్తిగలియుండుటచేతనే, సారూప్యముగ నీవ్యాధిని నివారణచేయగలుగుచున్నది గవదలనుండియు, ఊపిరితిత్తుల నుండియు, శ్లేష్మమును ద్రవింపజేయు (Pimpernal root) మూలమున, శ్వాసనుబంధింపజేయు శ్లేష్మమును జయప్రదముగ తొలగించుచుండిరి. (Savine) ఆకులొక తరగతి గర్భాశయరక్తస్రావములను గలుగజేయగలవు. ఈ ఆకులతో, సారూప్యౌషధ నివారణాసూత్రమును గాంచకుండగనే, యిట్టి గర్భాశయరక్తస్రావములను నివారణజేయుచుండిరి. గిలకలోపలి అవయవములలో బంధింపబడినపుడును (incarcerated hernia) మలకోశము ఒకభాగమునుండి వేరొకభాగమునకు జారినపుడును, చాలమంది వైద్యులు మలబద్ధముగలుగజేయు నల్లమందు చిన్నమోతాదులలో నిశ్చయముగ చక్కని గుణముజేయుటను గాంచియుండిరి. ఇచ్చట సారూప్యౌషధ చికిత్సాసూత్రము చక్కగ నిదర్శనమిచ్చియుండెనను భావము వారికెంతమాత్రమును లేకయే యిట్టి సుగుణము గాంచియుండిరి. సుఖసంబంధమైన వ్యాధికి సంబంధించని గవదలయందలి రణములను యీస్థితికి సారూప్యమయిన పాదరసముతో యీ ప్రాచీనప్రధానవైద్యులు నివారణజేసియుండిరి. విరేచనములు కలిగించు రేవల్చిన్ని (Rhubarb) తో కొన్నితరగతుల విరేచనములను గట్టియుండిరి. వెర్రికుక్క కాటువలన గలిగెడి వ్యాధిని (Hydrophobia) యిట్టి వ్యాధిస్థితి గలుగజేయు బెల్లడోనాతోను, తరుణజ్వరములలో సంభ

గాన మిక్కిలి అరుదుగానున్న యీఅద్వితీయమైన, శ్రేయస్కరమగు చికిత్సలయందు యదార్థముగ నేమి జరిగియున్నదో మానవసౌభాగ్యముకొరకు తెలిసికొనుట మిక్కిలి ముఖ్యము. ఈప్రశ్నకుగల సమాధానము చాల ముఖ్యమైయున్నది. ఈఅద్వితీయమగు చికిత్ససారూప్యమగు శక్తిగల ఔషధముల మూలమున అనగా నివారణ చేయదలచిన వ్యాధికి సారూప్యమగు వ్యాధిని గలుగజేయు సమర్థములైన ఔషధముల మూలమునగాక వేరొండు పద్ధతిని ఎన్నడును గావింపబడియుండలేదు.

వైద్యులు ప్రాచీన పద్ధతులయొక్కయు, ఆచికిత్సాశాస్త్రముయొక్కయు, సూత్రములకు వైరుద్యముగ (ఏఉద్దేశ్యముతో చేయుచున్నది? ఎందుకుచేయుచున్నది? తరుచుసరిగ తెలియకుండగనే) యిట్టి సారూప్యౌషధములను దైవికముగ నుపయోగించినపుడు వ్యాధులు సత్వరముగ శాశ్వత నివారణలు గావింపబడెను. ప్రాచీన విధాన వైద్యులీవిధముగ ప్రకృతికనుకూలమైన సారూప్య చికిత్సాసూత్రముయొక్క అవసరమును తమ నిశ్చితభావమునకు వ్యతిరేకమైనప్పటికి యీవిధ

---

వించు ప్రమాదకరమైన, మగతను వేడిజేసి, మత్తుగలుగజేయు నల్లమందును చిన్నమోతాదులలో ప్రయోగించియు యిందజాలమువలె తొలగించియుండిరి. అయినప్పటికి యీప్రాచీనవిధానవైద్యులు, దుష్టమైన మనస్సాక్షియొక్క వేదననుండి ప్రేరేపింపబడిన కోపోద్రేకముతో సారూప్యౌషధపద్ధతిని నిందింతురు.

ముగ బలపరచి యుండిరి. ఈచికిత్సాసూత్రమును నిరూపణ జేయుటకు అసంఖ్యాకమై న, సూచనలు దృష్టాంతరములు యున్నప్పటికి తాముపహించియున్న చికిత్సా సంబంధమైన దురభిప్రాయముతో ప్రాచీన వైద్యులెవ్వరును ఈసత్యమును కనుగొనుటకు ప్రయత్నించియుండలేదు.

ఉత్తమ పరిశీలనాజ్ఞానము గల వైద్యతరగతికి జెందని వైద్యేతరులయొక్క గృహవైద్య కృషియందు గూడ యీ చికిత్సాపద్ధతి యదార్థమైన మిక్కిలి విశ్వసనీయమగు వ్యాధిని సమూలము నిర్మూలము గావించు చికిత్సా పద్ధతిగ అనేక పర్యాయములు రుజువు చేయబడెను.

నూతనముగ చలిచే వంకర దిరిగిన అవయవములకు (Frost bitten limb) మంచు మర్దనా చేయబడుచుండెను. లేదా పేరుకున్న కాబేజీ పులుసురసము పైన కట్టబడు చుండెను ‡1 (Frozen sourcrout).

---

†1 గృహవైద్యానుభవము నందలి యిట్టి ఉదాహరణములతో ఎమ్లక్స అను నాతడు ఐసోపతీ (Isopathy) యను చికిత్సాపద్ధతిని కనిపెట్టియుండెను. ఇందుమూలమున చికిత్సను సెట్లుగావింపగలరో తెలిసి కొనకుండగనే కొందరీపద్ధతి నప్పుడే యవలంబించియుండిరి.

ఈ దృష్టాంతరములను జాగరూకతతో పరీక్షించిజూచిన నీయభిప్రాయములందున్నట్లగుపడవు.

సజీవ మానవశరీరమునందు, శుద్ధభౌతికశక్తులు గలుగజేయు గుణమునకును, సూక్ష్మశక్తి కరఔషధము గలుగజేయు గుణమునకును వ్యత్యాసము గలదు.

## అనుభవముగలవంటమనిషి కాలినచేతిని నిప్పునకు క్రాం

మనచుట్టును ఆవరించియుండు గాలియొక్కగాని నీటియొక్కగాని లేక మనము సేవించు ఆహారపానీయములయొక్కగాని ఉష్ణము లేక శీతలము తమంతతాము, ఆరోగ్యమైన శరీరమున శక్తిహానియు గలుగజేయవు. ఉష్ణము శీతలము ఆరోగ్యమైన జీవితము గడుపుటకు, అవసరమైయున్నవి. అందుచే నవి మందులుకాజాలవు. ఉష్ణము, శీతలము వ్యాధులయందు నివారణా సాధనములుగ పనిచేయునపుడు వానికిగల ప్రధానగుణమునుబట్టి పని చేయుటలేదు. వీనియొక్క శీతోష్ణాంశము (Degree) నందలి హెచ్చు తగ్గులను బట్టియే పనిజేయుచుండెను. శుద్ధమైన భౌతిక శక్తులనుగూర్చి యీక్రింది ఉదాహరణను గమనించదగును. "ఒక పెద్దబరువుగల సీసపు గుండు నాచేతిని బాధకరముగ చితుకగొట్టెను." ఇచ్చట చితుకగొట్టి బాధగలుగజేసినది సీసముయొక్క ప్రధానగుణముగాదు. ఏలనన బరువులేని సీసముగుండు నాచేతిని చితుకగొట్టజాలదు. గాన చితుకగొట్టి బాధకలుగ జేసినది స్థూలమైన బరువుగాని వస్తుగుణముగాదు.

కాలినగాయములు, మంచువలనగలిగిన బాధలు మొదలగు అస్వస్థతల యందు ఉష్ణము, శీతలము, ఉపయోగకరములై యుండుటకు ఆరోగ్యమైన శరీరమున శీతోష్ణాది హెచ్చుతగ్గు అంశములు (Degree) హానిగలుగజేయు విధముననే వానియొక్క శీతోష్ణాదిఅంశమే (Degree) ఉపయోగకర మగుటకు కారణమగుచున్నది.

జయప్రదమగు గృహవైద్యమునందలి యీఉదాహరణలలో మనము గాంచిన చలిచే పేరుకున్న కాలికి దీర్ఘకాలము గలుగజేయబడిన శీతాంశము (Degree of cold) గాదిచ్చట, ఐసోపతీ పద్ధతిని స్వస్థతచేకూర్చునది. (ఈ శీతలాంశమే యయినపక్షమున స్పర్శజ్ఞానవిహీనము గావించగలదు.) వ్యాధిగతమైన అవయవశీతమునకు (సారూప్యపద్ధతి) కొంచ మించుమించుగా సమానమైన అనుకూలమగు శీతోష్ణమునకు క్రమముగ వృద్ధియగు శీతాంశమే (Degree of cold) స్వస్థత చేకూర్చియుండెను. ఎట్లనగ [illegible]

చము దూరములో నుంచును. ఇందుమూలమున ప్రారంభము

---

చేతిపై ( Frost bitten hand ) పేరుకున్న కేబేజీపులుసురసము (Forzen sour crout) కట్టిన, గదియొక్క ఉష్ణోగ్రతను (Temperature) నిదిరెంటనే కరగి యీ పులుసుయొక్క ఉష్ణోగ్రత 32 లేక 33 అంశమునుండి గదియొక్క ఉష్ణమునకు అనగా సుమారు 55 అంశమునకు క్రమక్రమముగా హెచ్చుటవలన హెచ్చి యీవిధముగా భౌతికసామాన్యపద్ధతిని (Physical Homoeopathy) అవయవమునకు స్వస్థతచేకూర్చబడుచున్నది. ఈవిధముగనే మరగిననీటిచే కాలినచేయి, ఐసోపతీ పద్ధతి ప్రకారము మరగిననీటిలో నాచేతిని ముంచుటవలన నివారణచేయబడుట లేదు. అంతకంటె తక్కువ ఉష్ణోగ్రతగల నీటిలో ముంచుటవలన నివారణ చేయబడుచున్నది. ఇందులకుదాహరణము:— ఈ కాలినచేతిని 160 డిగ్రీలకు వేడిచేయబడిన నీటిలో ముంచుటవలన ఆనీటియొక్క ఉష్ణము క్రమక్రమముగ గదియొక్క ఉష్ణోగ్రతకుతగ్గి అందుపై సామాన్యపద్ధతిని కాలినచేతియొక్క బాధ తగ్గింపబడుచున్నది. ఐసోపతీ పద్ధతిని బంగాళాదుంపనుండి, యాపిల్ నుండి నీరు గడ్డగట్టుచున్నస్థితిలో అందుండి ఘనీభవపదార్థము విడదీయబడజాలదు. గాని యీపని నీటిమూలమున నే, ఘనీభవఅంశము వద్దను (Freezing Point) గావింపబడుచున్నది.

భౌతికగుణమునుండి (Physical action) మరియొక ఉదాహరణ జూపుటకై క్రిందిహంశము వివరింపబడెను. ముఖముపై గట్టి వస్తువుయొక్క దెబ్బమూలమునగలిగిన గాయమునందలి వాపుబాధ ప్రథమమున ఆభాగమును గట్టిగా బొటనవ్రేలితో కొంతసేపునొక్కి పిమ్మట అంతకంటె తక్కువ బలముతో నొక్కుచునుండిన సామాన్యపద్ధతిని తగ్గిపోవును. గాని సరిసమానమైన అట్టిగట్టి వస్తువుతో అంతటి గట్టిదెబ్బకొట్టిన తగ్గదు. ఇందుమూలమున ఐసోపతీపద్ధతిని ఆపద హెచ్చును.

ఐసోపతిని గూర్చి వ్రాయబడిన పుస్తకములోని పద్ధతి మూలమున నివారణ చేయబడిన ఉదాహరణములలో చలిచే సంభవించిన మానవుల

న బాధకొలదిగ హెచ్చినను లక్ష్యముచేయడు. ఇందుమూల

కండరముల సంకోచనములు (Muscular Contractions) కుక్కకాటు సంభవించిన వెన్నుముక పక్షవాతము నీరెండును చన్నీటి స్నానము వలన (Cold bathing) సత్వరముగ నివారణ చేయబడిన ట్లుదహరింపబడెను.

ఈవిషయములు ఐసోపతీ పద్ధతిని చాల న్యాయవిరుద్ధముగ వివరింపబడెను. చలినుండి సంభవించు వ్యాధులు నామమాత్రముగ చలితో సంబంధము గలిగియుండెను. ఈవ్యాధులకు ముందుగ వశ్యమైయున్న శరీరములయందు, చలిగాక సాధారణమైన గాలికి గూడ యీవ్యాధులుత్వరముగ జనించును. ఆరోగ్యస్థితియందును వ్యాధిగ్రస్తమై యున్నప్పుడును సజీవ శరీరనిర్మాణముపై యిట్టి చన్నీటి స్నానముల వలన గలుగు పలువిధగుణములు యిట్టి మాయోపాయములతో నిర్మాణమగు పద్ధతికి ఆధారమగునట్లు సామాన్యసూత్రముగ ఏర్పడ జాలవు. పాముకాటు, పాముయొక్క భాగములచే తప్పక నివారణ చేయబడునని నీగ్రంధమునందు తెల్పబడెను. ఈ అసంభవ విషయమును రూఢియైన అనుభవము, జాగరూకతతో గూడిన పరిశీలన మూలమున తెలిసికొను వరకు పట్టి ప్రాచీనకాలపు పిట్టకథగనే పరిగణింపవలెను. పిచ్చికుక్క కాటువలన సంభవించు హైడ్రోఫోబియా యను వ్యాధితో బాధపడుచున్న రోగికి (రష్యాదేశములో) పిచ్చికుక్క చొంగ యిచ్చి వెంటనే నివారణ జేసియుండెనని చెల్పబడెను. ఈచెల్పబడిన విషయము న్యాయబుద్ధిగల వైద్యులను యిట్టి అపాయకరమైన ప్రయత్నము గావించుటకుగాని లేక మిక్కిలి ప్రమాదకరమైనట్టియు ప్రయోగమునందు మిక్కిలి యసంగతమైనట్టియు యీపిలువబడు ఐసోపతి పద్ధతిని నిర్మాణము జేయుటకుగాని బ్రహ్మత్వము గావింపజాలదు. ఈపద్ధతినిగూర్చి (Isopathy of contagions) అను కరపత్రమును రచించిన కల్మర్ చే నీవిధానము వ్యాపింపబడలేదు. ఈవిధానమును బలపరచు అనుచరులగు డాక్టరు గ్రాస్ మొదలగు వారిచే వ్యాప్తిగావింపబడెను. ఈవిధానానుచరులు అందుముఖ్యముగా డాక్టరుగ్రాస్, ఐసోపతి పద్ధతి యొక్కటి మాత్రమే సక్రమ చికి

మున కొలదికాలములో తరచు కొలదినిముషములలో కాలిన భాగమున బాధతగ్గి కాలినభాగమునందలి చర్మము ఆరోగ్యమైన చర్మముగ మారును. ఈవిషయము అనుభవమునుబట్టి యీతనికి తెలియును. 1::

వైద్యేతరులు అనగా వార్నీసులు తయారుచేయు కార్మికులు కాలిన భాగములకు సారూప్యమగు మంటను గలుగజేయు బాగుగాకాచిన సారాయి, *1 కర్పూర తైలము 2♦ మొదలైన

---

త్స సూత్రము గలిగియుండెనని ప్రగల్భములు బల్కుచు సారూప్యౌషధములు సారూప్యమగు వ్యాధులను నివారణ జేయునను సూత్రమునందు యీ ఐసోపతీ పద్ధతికి సామాన్యపరిత్యాజ్యయము కంటె వేరేమియు లేదని భావించియుండెను. తనఖ్యాతికిని అదృష్టమునకు పూర్తిగ నీ సారూప్య పద్ధతియే కారణ భూతమైయుండ యిట్టి భావములు తెల్పియుండుటచే నీతడెంతయు నీసారూప్యౌషధపద్ధతియెడ కృతఘ్నుడు.

:: 1 కాలినభాగమును నిప్పువద్దనుంచుట మూలమున వెంటనే బాధ తగ్గుచున్నది గాన కాలినభాగమునకు ఉత్తమమైన చికిత్స యీచికిత్సయేయని పిక్నిలియస్ యనునాతడు భావించియుండెను. జాన్ హాటక్ అనునాతడు కాలినభాగములను చన్నీటితో చికిత్సచేయుట మూలమున చాల హానిగలుగగలదనియు, ఆభాగమును నిప్పువద్దనుంచిన మంచిగుణము గలుగగలదనియు తెల్పియుండెను. ఈవిషయము అనుకృతముగా వచ్చు వైద్యసూత్రములను బట్టి దెల్పియుండలేదు. సారూప్యమగు ఉష్ణమును గలుగజేయుట మిక్కిలి శ్రేయస్కరమని బోధించు అనుభవమునుబట్టియే ఆతడీవిషయమును దెల్పియుండెను.

*1 కాలిన గాయములకు, సారాయిని (Spirit of wine) తరుచుగాపట్టించుట ఇతరమందులన్నిటికంటెను ఉత్తమమైనది. బెంజ్ మిన్ బెల్ అనునాతడుగూడ కాలిన గాయములకు సారూప్యౌషధము మాత్రమే

వేడితైలములుపట్టించి కొలదిగంటలలో బాధనివారణజేసికొందు తగినమందని అనుభవమునుబట్టి అంగీకరించియుండెను. ఈ విషయమును గూర్చి ఆతడీక్రిందివిధముగ చెప్పియుండెను. "కాలిన ప్రతిగాయమునకు బలమైన బ్రాందిగాని లేక తీవ్రమైన మరియొక స్పిరిటుగాని మిక్కిలి యుత్తమమైనమందు. దీనినుపయోగించిన వెంటనే తాత్కాలికముగ బాధ ఉద్రేకించినట్లగుపడును. గాని వెంటనే తగ్గి మిక్కిలి శమనముగనుండగలదు కాలినభాగమును బ్రాందియందు ముంచియుంచిన మిక్కిలి మంచిగుణము గలుగును. ఇట్లుచేయుటకవకాశములేనిపక్షమున స్పిరిటులో గుడ్డతడిపి కాలిన భాగముపైవేసియుంచి ఎల్లప్పుడు స్పిరిటుతో తడుపుచు తడిగానుంచవలెను" ఇందునుగూర్చి యీక్రింద తెల్పబడిన నాయభిప్రాయముగూడ నీవిషయమున జేర్చవచ్చును. "వేడి ఆల్కహాల్ ఉపయోగించిన యింతకంటె నెక్కుడు సమర్థముగను సత్వరముగను పనిచేయుగలదు. ఏలనన చల్లగానున్న ఆల్కహాలు కంటె ఉష్ణమైన ఆల్కహాలు ఎక్కువ సారూప్యమై యుండగలదుగాన ఎక్కుడు సమర్థముగను సత్వరముగను పనిచేయగలదు. అనుభవమంతయు మిక్కిలి ఆశ్చర్యకరముగ నీవిషయమును స్థిరపరచుచున్నది,"

†2 బొగ్గుగనులలోగలుగు పంకవాయు విదారణము మూలమున (explosion of fire damp) భయంకరముగ కాలిన కార్మికుల గాయములకు ఎడ్వర్డు కెంటిల్ అనునాతడు వేడిగానున్న కర్పూరతైలమునుగాని ఆల్కహాలునుగాని అత్యుత్తమమైన ఔషధముగ నుపయోగించి చికిత్సచేసియుండెను. మిక్కిలి ప్రమాదకరముగ శరీరమున చాలభాగము కాలిన తీవ్రమైన గాయములలోగూడ నుత్తమమైనమందుగ యీఆల్కహాలును బ్రాందిని ఉపయోగించియుండెను. ఈచికిత్సకంటె నేచికిత్సయు నెక్కుడు సారూప్యముగను సమర్థముగను నుండజాలదు.

అనుభవశిద్ధులును, గౌరవనీయులును యగు హైష్కరు తనయనుభవమును బట్టి యీవిషయమును ధృవపర్చుచు, సహించశక్యమగునంత వేడిలో

రు. చల్లదనము గలుగజేయు లేపనములు కొన్నిమాసము లుప

కర్పూర తైలముయొక్కయు, ఆల్కహాల్ యొక్కయు, ఇతర వేడిపట్లయొక్కయు, లేపనమును (application) మిక్కిలి శ్లాఘించియుండెను.

కాలినగాయములకు ఉపశాంతిజేయు శీతకరౌషధములకంటె వేడిమంట ఉద్రేకింపజేయుశక్తిగల (గాన సాహాయ్యమైనది) యీఔషధముయొక్క శ్లాఘనీయమగు ఆధిక్యతను ఒకశరీరమునగల కాలినగాయములకు ఒకదానికొకటి వ్యతిరేకమైన రెండుపద్ధతుల చికిత్సా తారతమ్యముగాంచుటకు ప్రత్యేకముగ చికిత్సగావించి వాదనకవకాశములేకుండ ప్రత్యక్ష ప్రమాణము జూపబడెను.

బెంజ్ మిన్ బెల్ అనునాతడు ఒక స్త్రీకి రెండుచేతులు గాలినసందర్భములో ఒకచేతిని కర్పూరతైలముతో తడిపియుంచియు, రెండవచేతిని చన్నీళ్ళలో ముంచియుంచియు చికిత్సజేసెను. కర్పూరతైలముతో చికిత్స చేయబడిన చేతియొక్కబాధ ఒకఅరగంటలోతగ్గిపోయి స్వస్థతచేకూరెను. కాని చన్నీళ్ళలో ముంచబడిన రెండవచేతిబాధ ఆరుగంటలవరకు బాధించుచునేయుండి నీటినుండి చేతినొకసారి పైటకుదీసిన బాధయధికమగుచు కర్పూరతైలముతో చికిత్సచేయబడిన చేతికంటె నీచేతికి చికిత్సజేయుటకెక్కువకాలము దీసికొనెను.

జన్ ఏండర్ సన్ యనునాతడు యీవిధముగనే మరుగుచున్న నూనెచే కాలిన ఒకస్త్రీయొక్క గాయములకు చికిత్సజేసెను. కాలి ఎర్రబడి మిక్కిలి బాధకరముగనున్న స్త్రీయొక్క ముఖమునకు యీప్రమాదము సంభవించిన కొలది నిముషములకు కర్పూరతైలము పట్టించబడెను. చల్లగానుండుటకు కాలినచేతులను నీళ్ళలోపెట్టియుంచవలెనని ఆమెకోరియుండుటచే ఆమెయిష్టప్రకారము చన్నీళ్ళలోయుంచెను. సుమారు ఏడుగంటలకాలములో నామెముఖమునందలిబాధ తగ్గి కొంచము సుఖముగ నున్నట్లగుపడెను చేతులుముంచిననీరు తరచుమార్చుచు చన్నీటియందేయుంచబడినప్పటికి చేతులు నీటినుండి బయటకు దీసినపుడెల్ల విస్తారమైన బాధగలుగుచుండెను.

యోగించినప్పటికి నివారణజేయ జాలవనియు, చల్లనినీరు ‡3 దుస్థితి గలుగజేయుననియు యీకార్మికులు పూర్తిగ నెరింగి యుండుటచే ఉష్ణతైలములు మాత్రమే ఉపయోగింతురు.

అనుభవముగల ముసలిరైతు, తీవ్రమైన ఎండలో జ్వరమువచ్చు స్థితివరకు విపరీతముగ పనిజేసినపుడు చన్నీళ్ళు త్రాగక, బ్రాందిని త్రాగు అలవాటులేనప్పటికి వేడిచేయు

---

మరియు చేతులు విస్తారముగ వాచిపోయెను. రాత్రియంతయు చేతులయందు విస్తారమైన బాధవచ్చెనని మరుసటి యుదయమున ఆమె తెలిపియుండెను. మోచేతివరకు వాపు హెచ్చిపోయెను. పెద్దపొక్కులు చేతియందు విస్తారముగ విస్తరించి దళసరియైన బొబ్బలు బయలుదేరెను. అటుపిమ్మట వేడిపట్టు ఆకాలినభాగముపై వేయబడి చికిత్స చేయబడెను. ముఖమునందలి బాధపూర్తిగ వెంటనే తగ్గిపోయెను. గాని చేతికి సుమారు పదిహేను దినములవరకు చర్మమును మృదువుపరచి మాన్పుతైలములుపయోగించవలసివచ్చెను.

ఈ ఉదాహరణనుబట్టి సాధారణ ప్రాచీనవిధానవైద్యులు వైరూప్యౌషధముల మూలమున గావించు మిక్కిలి నీచమైనచికిత్సకంటె సారూప్యౌషధముల మూలమునగావించు చికిత్సయందుగల అతీతమైన ఆధిక్యతను గాంచకుండ నెవరుండగలరు?

‡ 3 కాలినగాయములను చన్నీటితో చికిత్సజేయుటవలన సంభవించు హానినిగూర్చి జాన్ హంటరు అనునాతడొక్కడే చెప్పియుండలేదు. కాలిన గాయములకు మిక్కిలి హానికలుగజేసి మిక్కిలి ప్రమాదపరిస్థితులు గలుగ జేయగలవని డబ్లియు ఫాబ్రిషస్ యనునాతడుగూడ తెల్పియుండెను. కాలినగాయములకువేయు యీచల్లటి లేపనములమూలమున వాచుట, చీము పట్టుట ఒకొక్కప్పుడు కుళ్ళిపోవుటగూడ తటస్థించును.

గుర్రిక్కొడు సారాయిత్రాగును. *1 చన్నీళ్ళు త్రాగుటవలన సంభవించు ప్రమాదమాతనికి దెలియును. వేడిజేయుసారాయి త్రాగుటచేత యాతని శరీరమునగల వేడి,బడలిక వేగముగ తొలగిపోవుచున్నది. సత్యమునుబోధించు యాతని యనుభవ జ్ఞానమీ హోమోపతీపద్ధతియొక్క ప్రయోజనాధిక్యతను విశ్వ సింప జేయుచున్నది.

సాదృశమైన వ్యాధులను గలుగజేయ సమర్థములైన ఔషధములు సాదృశమగు వ్యాధులను నివారణజేయగలవని అరుదుగా కొందరు వైద్యులు సందిగ్ధాభిప్రాయములు గలిగి యుండిరి. ♦1

హిపొక్రెట్సుచే వ్రాయబడిన గ్రంథమని చెప్పబడు ........................ అను గ్రంథమునందీ క్రింది వాక్యములు గలవు. ........................ ప్రాచీనులైన

*1 ఉష్ణదేశనివాసులు తమశరీరమున మిక్కిలివేడిచేసినపుడు స్వల్పముగ సారాయిదీసికొని యీవిధముగనే అత్యుత్తమసమైన ఫలితములు పొందు చుండిరని జమ్మార్ మాన్ అనునాతడు దెల్పియుండెను.

1♦ హోమోపతీ పద్ధతినిగూర్చి పూర్వజ్ఞానముగల గ్రంథకర్తల యీ క్రింది యభిప్రాయములను యీసిద్ధాంతములను బహిరపరచు నిదర్శనములకొరకిచ్చుట వివరించియుండలేదు. ఈసిద్ధాంతమునందలి సహజమైన ఉత్కృష్ట గుణములనుబట్టియే నిది స్థిరముగ స్థాపనమయ్యెను. ఈసిద్ధాంతమును నేనే ముందుగ కనుగొంటినని వెల్లడిజేయుటకు యీగ్రంథకర్తల యభిప్రాయములను బైటకురాకుండ జేసితినని యపనింద పొందకుండుటకు గాను యిచ్చుట విశదీకరించియుంటిని.

వైద్యులు గూడ హిపోక్రేట్సునకు పిమ్మట సారూప్యౌషధ పద్ధతి యందలి సత్యమును తెలిసికొని వెల్లడించియుండిరి. ఇందు కుదాహరణముగ బౌల్డల్ అనునాతడు "రేవలచిన్ని యొక్క విరేచనకర ధర్మము, విరేచనములను కట్టించు దాని శక్తి యొక్క కారణభూతమని గాంచియుండెను".

"ఆరోగ్యమైన వ్యక్తులయందు నేలతంగేడు (Senna) ఆకులకషాయము శూలనొప్పి గలుగజేయు గుణముగలిగి యుండుటచే సారూప్యముగ నీకషాయము శూలను తగ్గించు చుండెనని"డి త్రాడ్డింగు అనునాతడు దెలిసికొనియుండెను.

"విద్యుచ్ఛక్తి గలుగజేయు బాధలవంటి బాధలను వ్యాధులయందు విద్యుచ్ఛక్తి తొలగింపగల"దని బెర్థాలన్ యనునాతడు అంగీకరించియుండెను.

"సవ్యవిద్యుచ్ఛక్తి (Prositive) నాడిగమనిక హెచ్చించ గల శక్తి గలిగియుండుటజే వ్యాధిగ్రస్థమై ఉద్రేకించిన నాడిగమనిక తగ్గించగల"దని థారీయనునాతడు ప్రామాణ్యముగ తెలిపి యుండెను.

హాన్‌స్టారిక్ యనునాతడీక్రింది సలహాలనిచ్చియుండెను. "ఉమ్మెత్త (Stramonium) ఆరోగ్యమైన వ్యక్తులయందు, మనస్సును వ్యాధిగ్రస్తముగావించి మతిభ్రమణము గలుగజేయు చుండ, ఉన్మాదవ్యాధులలో సీమాలిక మనోభావములయందు విప్లవము గలుగజేసి వివేకజ్ఞానమును చేకూర్చగలిగిన పక్షమున మనము తప్పక నుపయోగించవచ్చును" అని తెల్పియుండెను.

స్టహాల్ యను డేనిషుపటాల వైద్యుడు నిస్సందేహమగు పదములలో యీవిషయమునుగూర్చి యీక్రిందివిధముగా తన నమ్మకమును వెల్లడించియుండెను. "వ్యతిరేక గుణములను గలుగజేయు ఔషధములమూలమున చికిత్సజేయవలయునని సూచించు సర్వసాధారణముగా యనుకరింపబడు చికిత్సాసూత్రము పూర్తిగ నిరాధారమైనది. సారూప్యమగు వ్యాధులనుగలుగజేయు ఔషధములకు వ్యాధులు వశీకరణమై నివారణయగునని నేను విశ్వసించియుంటిని. కాలినగాయములు నిప్పుసెగమూలమునను, హిమహతావయవము (frost bitten limb) చన్నీళ్ళతో తడిపి యుంచుట లేక మంచుకట్టుటమూలమునను నివారణయగును. ఈవిధయుగనే అమ్లాధిక్యమునకు సూచకమైన జీర్ణకోశవ్యాధులయందు హారణకరౌషధము (Absorbent remedies) లనేకములు ప్రయోగించినప్పటికి ఎట్టియుపయోగము గలుగని సందర్భములయందు చిన్నమోతాదులలో గంధకామ్లము (Sulphuric acid) నిచ్చి జయప్రదముగ చికిత్సజేసియుంటి"నని తెల్పియుండెను.

అప్పుడప్పుడు గ్రాహ్యమగుచుండిన సీమహాసీయమైన సత్యమెంత సామీప్యముగనుండెను! గాని నిర్లక్ష్యభావముతో నిది వర్జింపబడుచుండెను. ఇంతవరకు సందిగ్ధస్థితియందున్న అక్రియ చికిత్సావిధానము, ప్రాచీనఔషధచికిత్స, తప్పక మార్పుజెంది యదార్థమైన, నిస్సంశయమగు, నివారణాశాస్త్రము, మన కాలమున సిద్ధించుటకు, నిలచియుండెను.



# ఆర్గనాన్ అను

## హోమోపతీ సిద్ధాంత శాస్త్రము

## *(Organon of Medicine)*

# ఆర్గనాన్ అను
# హోమోపతీ సిద్ధాంత శాస్త్రము
# (*Organon of Medicine*)

## 1.

వైద్యునియొక్క ప్రధానోన్నత కర్తవ్యము, వ్యాధిని తొలగించి ఆరోగ్యము చేకూర్చుట. అనగా నివారణ చేయుట. ♦1

## 2.

సులభగ్రాహ్యమగు పద్ధతులపై, మిక్కిలి నిరపాయకరము, విశ్వసనీయము, సంగ్రహమునగు మార్గమున, వ్యాధిని సంపూర్ణముగ తొలగించి నిర్మూలముచేయుట మూలమున

---

♦1 ●గోచరమగు ఆంతరంగిక తత్వమునందుద్భవించు వ్యాధుల గూర్చియు, నందుకు సంబంధించియుండు ఆంతరంగిక ప్రాధాన్యజీవశక్తి యొక్క పద్ధతులను గూర్చియు, అన్యోన్యమిశ్రితమగునట్టి యూహలు, ఆలోచనలు మూలమున నీపిలువబడు విధానములను నిర్మించుట వైద్యుని యొక్క కర్తవ్యముకాదు. ఇందులగూర్చి వైద్యులనేకులిదివరకు అత్యాశతో తమ చాతుర్యమును, కాలమును, వ్యర్థముగ వ్యయపరచి యుండిరి. మరియు, వ్యాధులయందలి దృగ్విషయములగూర్చియు, అందలి సన్నిహిత సంబంధముల గూర్చియు మితిలేని సమాధానములతోను అర్థముగాని పదములతోను, ఉత్ప్రేక్షింపబడిన గూఢమగు భావములతోను సమర్థించు యత్నము అజ్ఞానులకు ఆశ్చర్యముగలుగజేయునని పండితులూహింపగలరు గాని

త్వరితగతిని, సౌమ్యముగ, శాశ్వతారోగ్యము చేకూర్చుటయే నివారణయొక్క అత్యున్నత మనోరథము.

3.

వైద్యుడు వ్యాధులయందేమి నివారణచేయవలయునో అనగా వ్యక్తిపరమైన వ్యాధిని (వ్యాధిచిహ్నపరిజ్ఞానము) స్పష్టముగ గ్రహింపగలిగిన పక్షమునను, ఔషధములలో నెయ్యవి నివారణచేయగలవో అనగా వ్యక్తిగతమైన మందును (ఔషధశక్తియొక్క పరిజ్ఞానము) తేటతెల్లముగ తెలిసికొనగలిగిన పక్షమునను, మరియు, విస్పష్టముగ నిరూపింపబడిన పద్ధతులమూలమున, స్వస్థతచేకూర్చుటకు, నిస్సందేహముగ, రోగియొక్క వ్యాధిలక్షణములనుగుర్తించి, తానుగుర్తించిన వ్యాధిని మందులలో నేది నివారణచేయగలదో గుర్తించి దానినెట్లు ప్రయోగింపవలయునో తెలిసికొనినపక్షమునను, తాను చికిత్సచేయబోవు వ్యాధికి ఔషధప్రయోగ మేరీతిగసరిపడునో (ఔషధనిర్ణయము)

---

వ్యాధిచే పీడింపబడు మానవప్రపంచకము, నిస్సహాయియై వృధానిట్టూర్పు విడుచుచున్నది. ఈ వివిధభావములతో నేర్పడిన విధానమునకు శాస్త్రీయ వైద్యమను (Theoretic medicine) నామకరణమేర్పడి అందులకు గాను ప్రత్యేక పండితస్థానములుగూడ నేర్పరుపబడినవి. గాని యీ సిద్ధాంతము లిప్పటికే మితిమీరియున్నవి. ఇప్పటికైనను వైద్యులమని పిలుచుకొను చికిత్సకులు వట్టిమాటలతో వ్యాధిబాధితులను మానవప్రపంచమును మోసపుచ్చక, నిజముగ వ్యాధిబాధితులకు సహాయము చేయుటకు, వ్యాధులు నివారణ చేయుటకు ప్రారంభించవలసియున్నది.

ఆయౌషధము సక్రమముగ నేపద్ధతులపై తయారుచేయబడినదో యందెంత పరిమాణ మవసరమో, (సరియైన మోతాదు) తెలిసికొని తిరిగిమోతాదులీయవలసిన కాలనిర్ణయము, మరియు తుదకు నివారణయందుకల్గు అడ్డంకులు, వాటిని తొలగించు విధమునెరింగి, స్వస్తతస్థిరముగనుండునట్లు చేకూర్చుట తెలిసికొన గలిగినపక్షమునను, అప్పుడు ఆతడువివేకముగను,న్యాయానుసార ముగను నెట్లు చికిత్స చేయవలయునో గ్రహించగలడు. ఆతడే వ్యాధినివారణాశాస్త్రమందు నిజమైన వైద్యుడు.

## 4.

ఆరోగ్యమునెయ్యది భగ్నపరచి వ్యాధిని గలుగజేయునో ఆరోగ్యములోనున్న వ్యక్తులనుండి దానిని తొలగించుటెట్లో తెలిసికొనినపక్షమున, తన్మూలముననే అతడు ఆరోగ్యసంరక్షణ కర్తయైయుండును.

## 5.

తరుణవ్యాధియొక్క ప్రధానోద్రేకకారణ (exciting cause) వివరములు వ్యాధినివారణచేయుటకు సహాయభూత ముగుటలో వైద్యునకు మిక్కిలి యుపయోగకరము. ఇట్లే, దీర్ఘవ్యాధిలో వ్యాధియొక్క సంపూర్ణచరిత్రయందలి ముఖ్య విషయములే దీర్ఘవ్యాధి తత్వసంబంధమగు (Chronic miasm) మూలకారణమును (Fundamental cause) కనుగొనుటకు

సహాయభూతమగును. ఈపరిశోధనయందు కనుగొనగలిగినంత వరకురోగియొక్క శరీరతత్వమును (ముఖ్యముగా దీర్ఘవ్యాధిలో) నైతిక మానసిక వర్తనము, వృత్తి, జీవితపద్ధతి, అలవాట్లు, గృహ, సాంఘికసంబంధములు, వయస్సు, స్త్రీపురుషసంబంధ ధర్మములు మొదలగువానిని గూర్చి, యోచనచేయవలసి యున్నది.

## 6.

ఎన్నడు అనుభవమునుబట్టి అంగీకరింపబడజాలనిఊహాలు వ్యర్థములని గుర్తెరెంగియుండి, నిష్కల్మషుడగు శోధకుడు (unprejudiced observer) తానెంత శోధనా సామర్థ్యశక్తి వంతుడైనప్పటికి, బాహ్యముగ జ్ఞానేంద్రియములకు గోచరమగు, ప్రత్యేకవ్యక్తి గతవ్యాధియొక్క శారీరక, మానసిక (వ్యాధి దృశ్యము, ఆకస్మిక ప్రమాదములు, లక్షణములు) మార్పులను మాత్రము గుర్తించునుగాని తదితరవిషయముల యందు లక్ష్యముంచడు: అనగా, వ్యాధిగతమైనవ్యక్తిచే తెలిసికొనబడినట్టియు, సన్నిహితులచే చెప్పబడినట్టియు, వైద్యునిచే గుర్తింపబడినట్టియు, పూర్వపు ఆరోగ్యస్థితికిని ప్రస్తుతస్థితికిని, గల మార్పును గుర్తించును. ఈగోచరమగు లక్షణములన్నియు వ్యాధియొక్క సంపూర్ణరూపమును తెలియజేయగలవు. అనగా

నివియన్నియు కలసి యదార్థముగ గోచరమగు వ్యాధిచిత్రి మును, రూపించగలవు. :: 1

---

:: 1 రోగియొక్క మంచము ప్రక్కనుండి పరిశీలించు వైద్యుడు వ్యాధియొక్క లక్షణములను అతిజాగరూకతతో గుర్తించి వానిసహాయమున చికిత్సకు గడంగుటకంటె వ్యాధినిగూర్చి ఊహించి చికిత్సకు గడంగుటవలన నెట్లు నివారణ సాధ్యమగునో నాకు తెలియకున్నది. మరియు తెలియని అంతర్భాగమున దాగియున్న వ్యాధియందు నివారణ చేయవలసినదేదియో వైద్యులు వెదకి కనుగొన వలసియున్నది. లక్షణములయందెక్కువ లక్ష్య ముంచక అగోచరమగు అంతర్భాగమున సంభవించిన మార్పును కనుకొన గలిగితిమని గర్వముతో పరిహాసాస్పదముగా నటించుచు నయ్యది మందుల (తెలియని) మూలమున చక్కచేయుటకు యత్నించుటవలన నివారణయెట్లు సాధ్యమగునో తెలియకున్నది. ఇదియే తిరుగులేని న్యాయమైన చికిత్సయని యెంచబడుచున్నది!

వ్యాధిని కలుగజేయు ఆధ్యాత్మికమైన జీవశక్తిని నెప్పుడును గాంచ నశక్యముగాన, వ్యాధులు ప్రదర్శించుదృశ్యములనుబట్టి బుద్ధికి గోచరమగు దృగ్విషయములు వైద్యుని దృష్టియందు వ్యాధికాదా! లేక వ్యాధిని తాను ప్రత్యక్షముగ కనుగొని యందుపై నారోగ సంబంధమైన చర్యలు కనుగొని యందుపై నావ్యాధిని నివారణ చేయగడంగుట అవసరమా? ఇంతకంటె ప్రత్యక్షవ్యాధిరూపమును ప్రాతవిధానవైద్యులు (Old School Physicians) శరీరాంతర్భాగమున దాగియున్న దేనిని శోధించెదరు? మనకు వ్యాధిరూపము స్పష్టముగా లక్షణముల మూలమున తెల్పబడుచుండ నీవిషయమును తృణీకారభావముతో నీవైద్యులు విసర్జించుచున్నారు. ఈ వ్యాధిలక్షణములను తప్ప వ్యాధిలో వారు ఎయ్యది నివారణ చేయగోరుచున్నారు?

శరీరాంతర్భాగమున మరుగుబడియున్న సంబంధములగూర్చిపరిశోధనలు గావించుచున్న వైద్యశాస్త్రజ్ఞు లనుదినము పొరబడవచ్చును. కాని

# 7.

వ్యాధియొక్క ప్రత్యక్షోద్రేక కారణములను తొలగించి నంతనే ‡1 రోగసంబంధమైనలక్షణములుమాత్రమే గాంచగల్గుదుము. వ్యాధిని నివారణచేయుటకేమందవసరమో ఆలక్షణ

---

అవసరమైన లక్షణసముదాయమునంతయు నతి జాగరూకతతో గ్రహించు హోమోపతి వైద్యుడు వ్యాధిని నివారణ జేయుటకు నమ్మకమైన మార్గము కలిగియుండును. వ్యాధిలక్షణ స ము దా య ము నంతయు హోమోపతీ వైద్యుడు తొలగింప గలిగిన పక్షమున అంతర్భాగమున దాగియున్న వ్యాధి కారణమును నిశ్చయముగా నిర్మూలము జేసిన వాడగును.

‡1 సూక్ష్మబుద్ధిగల ప్రతివైద్యుడును ప్రథమమున నీ పరిస్థితిని తొలగించవలయునని చెప్పనవసరము లేదు. అందుపై వెంటనే అస్వస్థత సామాన్యముగా తగ్గిపోవును. మూర్ఛ, అపస్మారము గలుగజేయు మిక్కిలి సువాసన గల పుష్పములను గదినుండి తొలగించవలయును. కండ్లలో అన్యపదార్థము ప్రవేసించినప్పుడు ఉద్రేకము గలుగజేయు అన్య పదార్థమును గ్రుడ్డునుండి తొలగింపవలెను. గాయము పడిన అవయవమునకు ఎక్కువగా బిగించి కట్టబడిన కట్టుచే మాంసము కుళ్ళుపరిస్థితులను గమనించి కట్టు వదులుచేసి అంతకంటె నుపయుక్తమగు కట్టు కట్టుట, సొమ్మసిల్ల జేయునటుల రక్తనాళములకు తగిలిన గాయమునకు కట్టుకట్టుట, బెల్లడోనా కాయలు మొదలగు విషపదార్థములను మ్రింగిన సందర్భములయందు, వాంతిమూలమున వానిని బయటకు గ్రక్కించుటకు ప్రయత్నించుట శరీరావయవ ద్వారముల మార్గమున (ముక్కు, కంఠము, చెవులు, మూత్రావయవము, ఆసనము, స్త్రీ మర్మావయవము) ప్రవేశించిన యితర పదార్థములను వస్తువులను బయటకు తీసివేయుట, మూత్రకృచ్ఛ్రమున అవరోధము గలిగించు పొక్కులను చిదిపి వేసి అవరోధమును తొలగించుట, ఆసనద్వారము లేక జన్మించిన శిశువునకు ఆసనద్వారము కల్పించుట మొదలగు సాధనములు కావింపవలయును

ము లే యగుబరచును. వ్యాధి తత్వమందు (miasm) లక్ష్య ముంచి అందుకు సహాయభూతమగు స్థితిగతులయందు దృష్టి యుంచవలెను. జీవశక్తి యొక్క అంతరంగికవ్యాధిరూపమును బయటకు ప్రతిఫలింపజేయు యీలక్షణసముదాయమంతయు, వ్యాధికి ఏమందు అవుసరమగునో తెలియజేయుటకు ప్రధాన మైన సాధనము. ఈలక్షణసముదాయ మొక్కటియే, మిక్కిలి యుచితమైన ఔషధమును ఎంచుటకు నిర్ణయముగానించగలదు. వైద్యుడు తన శాస్త్రాధారమున వ్యాధిని నివారణజేసి ఆరోగ్యము చేకూర్చుటకు, ప్రతివ్యాధియందును లక్షణ సముదాయ *2 (Totality of symptoms) మొక్కటే రూఢియైన ప్రధానవిషయముగ గుర్తించవలసియున్నది.

---

*2 ఎల్లప్పుడును ప్రాత విధాన వైద్యులు రోగికి స్వస్థత యెట్లు చేకూర్పవలయునో తెలియక సాధ్యమైనంతవరకు మందులచే రోగమును అణచిపెట్టుట మూలమునను వ్యాధులలో గల అనేకములగు లక్షణములలో ఒక్క లక్షణమును మాత్రమే గైకొని లక్షణవిధాన చికిత్సయను పేరుతో నొక్క పక్షణమైన పద్ధతితో చికిత్సకు గడంగుట మూలమునను యీవైద్యుల చికిత్స సర్వత్ర తిరస్కారమునకు పాలుగావలసి వచ్చుచున్నది ఏలనన ఈ చికిత్సమూలమున లాభమేమియు లేక పోవుటయే గాక రోగికెక్కుడు హాని గలుగ జేయబడుచున్నది. ఒక్కకాలు మాత్రమే మనిషియొక్క రూపము ఎట్లు కాజాలదో అట్లే ఒక్కలక్షణము మాత్రము వ్యాధిరూపము కాజాలదు. గాన యీపద్ధతిని ఒక్కలక్షణమును గైకొని గావించు చికిత్స చాల నింద్యమైనది. ఈఒక్కలక్షణమునకు వైరుద్యమగు మందుమూలమున కొద్దిపాటి యుపశమనము కలిగి నప్పటికి పిమ్మట నంతకంటె నెక్కుడు చెడ్డ పరిస్థితిలోనికి వ్యాధిరాగలదు.

8.

గోచరమగు వ్యాధియొక్క సమస్తలక్షణసముదాయ మును తొలగించిన పిమ్మట, ఆరోగ్యముతప్ప తదితరమెయ్యది యు నుండజాలదు. ప్రపంచమునందేయనుభవమును బట్టియు యిందుకు వ్యతిరేకముగ రుజువుపరచుటగాని గోచరించుట గాని జర్గియుండలేదు. వ్యాధిలక్షణ సముదాయమంతయు తొలగింపబడినపిమ్మట అంతరంగమునగలవ్యాధిగతమగుమార్పు తొలగింపబడక యుండజాలదు. *1

---

*1. వ్యాధియొక్క స్వరూపములేకుండ, అస్వస్థత లక్షణములు నశింపచేయబడి, ఆరోగ్యచిహ్నాలు శాశ్వతముగ కలుగునట్లు సరియైన వైద్యునిచే రోగియొక్క వ్యాధికి చికిత్స చేయబడినప్పుడు, ఆత్మవంచనము గావించుకొనక, నెవ్వడు శరీరవ్యాధి అంతయు అంతర్గతమున గలదని చెప్పగలడు? ఈవిషయమును ప్రాచీనవిధానవైద్య ప్రముఖులగు హ్యూఫ్‌లండుగారు యీక్రింది వాక్యములతో సమర్థించుచున్నారు. "హోమోపతీ చికిత్స లక్షణములను మాత్రమే తొలగించునుగాని వ్యాధి అట్లేయుండగలదు."అని తెల్పియుండెను. మానవకోటి లాభముకొరకు హోమోపతీగాంచిన అభివృద్ధినిగూర్చిగల అసూయభావముచేతనే కొంతవరకు ఆతడీయభిప్రాయమును సమర్థించుచున్నాడు. మరియు వ్యాధిగతమైన జీవశక్తి ఆధ్యాత్మికముగ మార్పుజెందిన విషయమును, యింతవరకుగూడ గుర్తింపజాలక, వ్యాధినిగూర్చి ఆతనికిగల స్థూలభావములే యాతని యభిప్రాయమునకు కొంతవరకాధారభూతమగుచున్నవి. వ్యాధియనునది యొక స్థూలపదార్థమనియు వ్యాధినివారణ పూర్తియైనపిమ్మటను గూడ నిది శరీరాంతర్భాగమున నేదియో యొక మూల పొంచియుండి, మంచి ఆరోగ్యస్థితిలో నున్నపుడే

## 9.

మానవుని ఆరోగ్యస్థితియందు, స్థూలశరీరమునకు చైతన్యమిచ్చు ఆధ్యాత్మిక జీవశక్తి, అడ్డులేని అధికారముతో పరిపాలన చేయుచు, ఇంద్రియజ్ఞాన వ్యాపారములయందంగ క్రమముగల శరీరనిర్మాణ సమస్తభాగములను, అద్భుతమైన సామరస్యభావమున సజీవత్వ వ్యాపారములయందుంచి, వివేక జ్ఞానముతో బహూకరింపబడి యంతర్వర్తియైన బుద్ధిని, ఉన్నత జీవితసార్థక్యముకొరకు ఆరోగ్యమగు పరికరముగా స్వేచ్ఛగా నుపయోగించుకొనగలుగును.

## 10.

జీవశక్తిలేని స్థూలశరీరనిర్మాణమునకు, ఇంద్రియజ్ఞానము కార్యాచరణ, స్వసంరక్షణాసామర్థ్యము లుండజాలవు ♦1 ఆరోగ్యము నందును, వ్యాధియందును, స్థూలశరీరనిర్మాణమునకు చైతన్యమిచ్చు నిరాకారజీవశక్తి మూలముననే ప్రాధాన్యముగ

---

రొకదినమున తనయిచ్ఛవచ్చినట్లు స్థూలరూపముతో తిరిగి బయటబడుననియు అతని యుద్దేశ్యము.

ప్రాచ్యవ్యాధినిర్ణయశాస్త్రాంధత్వము యింకను నింతభయంకరముగా నున్నది. ఈవిధానము బీదరోగులను తుడిచిపెట్టుటకు ప్రాధాన్యమైన వైద్య శాస్త్రపద్ధతియగుటలో ఆశ్చర్యమేమియు లేదు.

1♦ ఈజీవశక్తి నశించిన శరీరము మృతకళేబరము. ఈమృతకళేబరము జీర్ణించి తిరిగి ప్రకృతిరసాయన సముదాయమున కలిసిపోవుచున్నది.

సమస్త యింద్రియజ్ఞానమును జీవిత సమస్త కార్యనిర్వహణా శక్తిని స్థూలశరీరము పొందుచున్నది.

## 11.

ఒకవ్యక్తి వ్యాధిగ్రస్తుడైనప్పుడు ప్రాణమునకు శత్రు కారకమైన వ్యాధి, శరీరమునందంతటను నిండియున్న ఆధ్యాత్మిక స్వతశ్చలనయుక్త జీవశక్తినిమాత్రమే ముఖ్యముగ సూక్ష్మశక్తి ప్రాబల్యమున మార్పుచెందించుచున్నది. విపరీతమైన స్థితిలోనికి మార్పుచెందిన జీవశక్తియే శరీరనిర్మాణమున మనము వ్యాధి యని పిలుచు అననుకూలేంద్రియ సంక్షోభమును అక్రమమగమన పద్ధతిని కలుగజేయుచున్నది. ఏలనన, శక్తియనునది యగోచరము. గాని దానిగుణములుమాత్రము శరీరనిర్మాణమున గాంచనగును. బాహ్యముగ జూచువానికిని, వైద్యునకును అగుపడు శరీరనిర్మాణమునందలి ఆయా భాగములయొక్క యింద్రియజ్ఞానకార్యనిర్వహణ ధర్మములమూలమున వ్యాధి గతమైన మార్పు తెలియజేయబడుచున్నది. అనగా వ్యాధి లక్షణములమూలమున తప్ప తదితరమైన యేమార్గమునను తెలియబడజాలదు. *1

---

*1 డైనమిక్ శక్తి (Dynamic Power) యననేమి? పృధివి తనయందు గల అగోచరము అంతరంగశక్తి ప్రభావమున 28 దినముల కొన్ని గంటలలో చంద్రుని తనచుట్టును త్రిప్పుకొనుచున్నది. మరియు చంద్రుడు నిర్దిష్టమైన నిర్ణయకాలములో (పౌర్ణమి, అమావాస్యలతో వచ్చు కొంత వ్యత్యాసమును మినహాయించి) ఉత్తర సముద్రములయందు పోటుపాటులను

## 12.

వ్యాధిగతమైన జీవశక్తి మాత్రమే వ్యాధులను జనింప గలుగజేయును. (ఇది ప్రకృతి వైచిత్ర్యము) ఈధర్మము భౌతిక సాధనము మూలమున గాని యంత్రసాధనము మూలమునగాని జరుపబడుటలేదు. ఈ విధముగనే కారణ గుణముల యొక్క సంబంధము తెలియకుండగనే, ఒక వస్తువుపై వేరొక వస్తువుయొక్క కార్యధర్మఫలితముగ, అసంఖ్యాకములగు యితర ధర్మములు జరుగుచుండుట మనము గాంచుచున్నాము. తారతమ్య వ్యవకలనముల యందనుభవముగల విజ్ఞానులు మాత్రము యిట్టి భావము నుండి తమ అభిప్రాయములయందు, భౌతిక సంబంధమైన లేక యంత్ర సంబంధమైన కార్యాచరణ ధర్మభావములకు వేరుగ నొకవిధముగు ఉన్నత చైతన్యభావమును నేర్పాటుచు కొనగలరు. ఇట్టి గుణమును అనగా ఒక వస్తువు ఇతర వస్తువుపై గలుగ జేయు పరిశుద్ధ, స్వతంత్ర, అమోఘశక్తి యొక్కయు గుణము యొక్కయు, ఫలితముగ నేర్పడిన ధర్మమును డైన మిక్ (సూక్ష్మశక్తి) అని విజ్ఞానులు పిలిచెదరు.

ఆరోగ్యమైన వ్యక్తిని, వ్యాధిగ్రస్తము గావించు శక్తి యొక్కడైన మిక్ గుణములు, ఆరోగ్యముచేకూర్చుటకు జీవశక్తిపై గాంచు ఔషధముల యొక్కడైనమిక్ శక్తి యీరెండును సంక్రమణము (Infection) తప్ప వేరొండుగావు. ఈ సంక్రమణము (Infection) భౌతికసాధనమునగాని యంత్రసాధనమునగాని జరుగజాలదు; ఇనుపముక్కలను లేక ఉక్కు ముక్కలను ఆకర్షించు అయస్కాంతముయొక్క శక్తి, భౌతికసంబంధమైనట్టి యు, యంత్రసంబంధమైనట్టియు శక్తి యెట్లుగాదో నిదియు నట్లే భౌతిక యంత్రసంబంధమైన శక్తిగాదు. అగోచరమగు నీ అయిస్కాంతశక్తికి, యినుము నాకర్షించుటకు స్థూలసహాయ పరికరములగు కొక్కెములేక కప్పి అవసరములేదు. అయిస్కాంతమెట్టి సహాయమవసరములేక స్వయముగనే యినుము నాకర్షించును. అయస్కాంతము, అభౌతిక, అగోచర, భావనా

జేయుచున్నది; మన జ్ఞానేంద్రియములకు గోచరమగు వ్యాధి యుత అంతరంగ సహజశక్తి మూలమున "డైనమికల్"గా (సూక్ష్మశక్తి పరముగా) యినుపముక్క మీదలేక ఉక్కుసూదిమీద పనిజేసి, ఉక్కు సూదికి, అగోచరమగు అయస్కాంతశక్తిని (Dynamically) కలుగ జేయును. ఉక్కుసూది అయస్కాంతమును తగులక కొలది దూరములో నున్నప్పటికి, అయస్కాంతీకరణమై, అయస్కాంతదండముతో అంతకు పూర్వము గలుగజేయబడిన అయస్కాంతధర్మములమూలమున, (Magnetic properties) మసూచకముగాని పొంగుగాని సోకియున్న బాలుడు, అగోచరమగు పద్ధతిలో (Dynamically) స్పృశింపకుండ సమీపమున నున్న వేరొక బాలునికి యీ మశూచి కలుగజేయు విధముననే అనగా, కొలది దూరములోగల సోకబడు బాలునకు భౌతికరూపములో నేదియు కలుగజేయక సోకు విధముగనే యితరసూదులనుగూడ అయస్కాంతీకరణము గావించును. అయస్కాంతము సమీపమునగల సూదికి అయస్కాంతధర్మమును కలుగజేయు విధముగనే, మసూచికము లేక పొంగు వ్యాధితోనున్న బాలునినుండి, సమీపమునగల బాలునకు కేవలము నిర్దిష్టమైన భావనాయుత శక్తియే మసూచికము లేక పొంగును, గలుగజేయుచున్నది.

ఈవిధముగనే సజీవమానవశరీరమున కలుగు ఔషధగుణములను యోచన చేయవలయును. ఔషధములుగ నుపయోగింపబడు వస్తువులు, శరీర నిర్మాణమున యాజమాన్యము వహించు భావనాయుత జీవపద్ధతిపై సజీవ యింద్రియజ్ఞాన తంతువుల మూలమున డైనమిక్ సంబంధమైన భావనా యుత బలముద్వారా ఆరోగ్యమును మార్పు జేయుటకు నిర్దిష్టమైన స్వశక్తి గలిగియున్నంతవరకే ఔషధములు: క్రమమైన ఔషధములని మనము పిలుచు ఔషధములయొక్క స్థూలపదార్థములయందలి ఔషధధర్మము, జంతు జీవనమునందలి ఆరోగ్యమును మార్పు జేయగలశక్తికి సంబంధించి యుండును. ఈభావనాయుత జీవపద్ధతిపై మాత్రమే యీ ఔషధముల యొక్క ఆరోగ్యమును మార్పుజేయు భావనాయుత శక్తి ఆధారపడి

రూపము అంతరంగికమార్పునంతయు తెలుపుచేయుచున్నది.

---

యుండును. అయస్కాంతధృవము (Magnetic Pole) యొక్క సామీప్యము ఉక్కునకు అయస్కాంత శక్తిని మాత్రము గలుగజేయును గాని ఇతర ధర్మములను (అనగా ఎక్కువ గట్టిదనము, లేక మెత్తదనము) కలుగజేయజాలదు. ఈవిధముగా ప్రత్యేకమైన ప్రతి ఔషధవస్తువు ఒకవిధమైన సంక్రమణము (Infection) మూలమున వేరొక ఔషధముయొక్క విచిత్ర స్వభావములో గాక పూర్తిగ స్వకీయమైన విచిత్ర స్వభావములో మనూవిక వ్యాధిగల బాలుని సామీప్యము, ఆరోగ్యమైన మరియొక బాలునకు మశూచికమే గలుగజేయును గాని పొంగును గలిగింపని విధముననే మానవుని ఆరోగ్యమును మార్పుజేయును. ఈఔషధములుపూర్తిగ మన ఆరోగ్యముపైసంక్రమణము Infection మూలమున యగునట్లు అగోచరశక్తిమూలముగ, పనిచేయును గాని ఔషధస్థూలపదార్థమును పంపజాలవు. అర్థశాస్త్ర పండిత శ్రేష్ఠులచే గూడ ఊహించి తెలిసికొనవలవిగాని స్థూల పదార్థము యొక్క అణుస్వరూపములో చలనవర్థితశక్తికరణముగావింపబడిన ఉత్తమౌషధము (Best dynanized medicine) యొక్క చిన్న మోతాదు విశేషముగు నివారణా శక్తిని జూపగలదు. సూక్ష్మమైన మోతాదు పరిశుద్ధమైన స్వేచ్ఛగా వృద్ధిబొందిన భావనాయుత ఔషధశక్తిని సంపూర్ణముగ గలిగియుండగలదుగాన యీసూక్ష్మమైన మోతాదు సూక్ష్మశక్తికరణముగ, (Dynamically) ప్రకృతి రూపములోనున్న ఔషధ వస్తువులను పెద్ద మోతాదులలో తీసికొనుటవలన నెన్నడును సంభవింపజాలని ఉత్తమ విశేష ఫలితములను కలుగజేయగలదు. ఉన్నత చలన వర్థిత శక్తికరణము (Highly dynamized) గావింపబడిన ఔషధములయొక్క సాకార పరమాణువుల (Corporeal atoms) యందుగాని భౌతిక రూపముల యందుగాని అర్థశాస్త్రయుక్తరూపములయందుగాని (చలన వర్థితశక్తికరణము గావింపబడిన ఔషధముల యొక్క ఉన్నత శక్తుల యందింకను తగినంత స్థూలపదార్థము గలదని కొందరిచే స్వర్గముగ తెలుపబడుచున్నది

అనగా అంతరంగిక అధ్యాత్మిక వ్యాధిగతమార్పును తెలుపుడు చేయుచున్నది. గోచరమగు బాహ్యరూపము వ్యాధినంతను తెలియజేయును. కాబట్టి యారోగ్యమైన స్థితినుండి మార్పు చెందియున్న వ్యాధిగత మార్పులన్నియు, వ్యాధిరూపమున

---

ఔషధశక్తిగానబడదు. ఔషధవస్తువులయందుగల బహిర్గతము గావింపబడి నిర్బంధ విమోచనము గావింపబడిన నిర్దిష్టౌషధశక్తి ఔషధముతో తడుప బడిన మాత్రములయందు లేక ఔషధద్రవణమునందును (solution) అగో చరమై యుండగలదు. ఈఔషధశక్తి సజీవజంతు తంతువుల (living animal fibres) సంబంధమున అగోచర శక్తికరణముగ శరీరమునం దంతటను (ఎంతటి చలన వర్ధిత శక్తి కరణము గావించినప్పటికి ఎట్టి స్థూల పదార్థమును సంపకుండగనే) పని జేయును. చలన వర్ధితశక్తికరణ (Dynamization) మూలమున నీశక్తి ఎంతవిశేషముగ నిర్బంధ విమోచ నమై అభౌతిక రూపము దాల్చునో అంత విశేష బలకరముగ పనిచేయును.

పరిశోధనాజ్ఞాన విశారదులతో భ్యావివహించిన నీకాలమున, మనము గాంచు అనుదినవృత్యముల శేవిశముగను వివరింప నసాధ్యమై యున్నంత మాత్రమున, డైనమిక్ శక్తిని, నిరాకారశక్తియని భావించుటకంత అసా ధ్యవిషయమా? ఒకవ్యక్తి, వమనముగలుగజేయు నొకవస్తువును జూచి, వాంతులుజేయు స్థితిలోనికి వచ్చునప్పుడు, అట్టివాంతులను కలుగజేయు వాంతికరపదార్థమేమైన, నాతని జీర్ణకోశమున ప్రవేశించెనా? ఇది కేవలము ఆతని మనోభావమున, కలిగిన, వమనకరదృశ్యముయొక్క నిరాకార శక్తిగుణముగాదా? ఒకవ్యక్తి తన కరముచు పైకెత్తిన, నీకృత్యము, గోచర మగు, స్థూలపరికరము మూలమున జరుగుచున్నదా? కప్పిసహాయమున ఎత్త బడుచున్నదా? కేవలము తన మనశ్శక్తియొక్క భావనాయుత అగోచరశక్తి కాదా నీకృత్యము జేయించినది?

చికిత్సచేయబడి తొలగింపబడినప్పుడు యావచ్ఛరీర నిర్మాణము నకు ఆరోగ్యము చేకూర్చబడుచున్నది. ♦1.

## 13.

శస్త్రచికిత్సకిక్రింద దానివ్యాధి, అల్లోపతీవైద్యులచే, అంతరంగమందు దాగియున్న చైతన్యశక్తికి, సజీవశరీర నిర్మాణమునకు, భిన్నమైనవస్తువుగా పరిగణింపబడుచున్నది. ఇదెంత నేర్పుగల విశేషభావమైనప్పటికి చాల అసంగతము. ఈ విషయము అనాత్మవాదుల బుద్ధిచేమాత్రమిట్లు ఊహింపబడ గలదు. మరియు వేలకొలది సంవత్సరములనుండి వ్యాపించి యున్న వైద్యవిధానమీ హానికరమగు ప్రేరేపణలతో నిజముగా దుర్మార్గమైన ( స్వప్తపరుపజాలని ) శాస్త్రముగా తయారుచేయబడియున్నది.

## 14.

వ్యాధిచిహ్నాల మూలముననను లక్షణములమూలముననను సరిగా బరిశీలనచేయు వైద్యులకు తెలియని అగోచరమగు

---

♦1 జీవశక్తి శరీరనిర్మాణముచే వ్యాధిరూపము నెట్లుకనుబరచు చున్నదో, అనగా జీవశక్తి ఎట్లువ్యాధిని కలుగజేయుచున్నదో, యావిషయ మును వైద్యుడు తెలిసికొనదగినంత అవుసరములేదు. అది ఎల్లప్పుడు గూఢమైయేయుండును. వైద్యుడు వ్యాధినిగూర్చి ఎంతవరకు తెలిసికొన వలయునో దానిని నివారణ జేయుటకు పూర్తిగా నేది అవసరమో యది యంతయు తెలిసికొనుటకు జీవేశ్వరుడు బుద్ధివివేకజ్ఞానములనిచ్చి యుండెను

వ్యాధిగతమైన మార్పుగాని, నివారణకాని వ్యాధిస్థితిగాని, మానవశరీరాంతర్భాగమున నుండజాలదు. సర్వజ్ఞుడైన మానవ జీవసంరక్షకుని అనంతమైన దయాస్పదముతో నెంతయు సక్రి యాంగీకార యుక్తమగు నిదియొక ఏర్పాటు.

## 15.

అంతరంగమునగల అగోచరమగు, మన శరీరమునకు చైతన్యముగలిగించు జీవశక్తియొక్క రోగసంబంధమైనమార్పు, ప్రస్తుతవ్యాధిని తెలియజేయు శరీరమున బాహ్యముగ యగుపడు లక్షణసముదాయ సమస్తము, యీ రెండును ఒక్కటిగనే ఏర్పడుచున్నవి. ఈ రెంటికిని భేదములేదు. శరీరము జీవము యొక్క స్థూలరూపపరికరము. కాని శరీరనిర్మాణము లేకుండ జీవశక్తిని భావింప నెట్లుఅశక్యమో అట్లే సహజమైన గ్రహణ శక్తిగలిగి సక్రమపద్ధతులపై నడపించు జీవశక్తిచే కలుగజేయ బడు చైతన్యములేనిదే నీస్థూలశరీరమును భావింప నశక్యము. గాన యీ రెండు అభేదముగ (అవినాభావసంబంధము) ఏర్పడి యున్నవి. మనబుద్ధికిగల యాలోచనకు యీ ఐక్యత రెండు ప్రత్యేకభావనలుగా సులభముగా తెలిసికొనుటకు గోచరించు నప్పటికి యీరెండును ఐక్యతనొందుచున్నవి.

## 16.

మన జీవశక్తి, నిరాకారసూక్ష్మశక్తి వలెనే, సూక్ష్మశక్తికరముగ (Dynamically ) వ్యాధిగ్రస్తము కావింపబడును ాని జీవితసామరస్యగతిని కలతపెట్టు బాహ్యశత్రుకర శక్తుల ూలమున, ఆరోగ్యశరీరమున కలుగజేయబడు హానికర ాబల్యములచే నెదుర్కొనబడి వ్యాధిగ్రస్తము గావింపబడ ులదు. ఈ విధముగనే శరీరమునందంతటనుగల నరముల ందలి సచేతనశక్తిమూలమున గాంచబడు మన నిరాకార శక్తిపై పనిచేయు, ఉపయుక్తమగు మందులయందుగల ూక్ష్మశక్తిరూపములోనున్న వివిధములైన శక్తులమూలమున ు వేరువిధముగా వ్యాధి తొలగింపబడజాలదు. వ్యాధిని ారణచేయుటకు పూర్తిగా నవుసరమైనంతవరకు కడుజాగ కతతో పరిశీలనజేసి పరిశోధించు వైద్యుని బుద్ధికి గోచర న ఆరోగ్యమునందలి మార్పులు ( లక్షణసముదాయ త్రము) వ్యాధిని గోచరింపజేసి యున్నప్పుడు జీవశక్తిపై ందులు గావించు సూక్ష్మశక్తికరగుణము (Dynamic-on) వలననే తిరిగి వాస్తవముగా ఆరోగ్యము జీవసామ ్యము చేకూర్చబడుచున్నది.

## 17.

వ్యాధికారణమైన జీవశక్తియొక్క ఆంతరంగిక మార్పు వ్యాధియొక్క గోచరమగు పూవత్సు చిహ్నాలను లక్షణ

ములనుతొలగించి నివారణ కొనసాగించినంతనే వ్యాధియావత్తు తొలగింప బడుచున్నది. 1* వ్యాధిగతమైన జీవశక్తి అనగా ఆంతరంగిక మార్పును పారద్రోలి నిర్మూలముచేయుటకు వైద్యుడు యావత్తు లక్షణములను వరుసక్రమముగా ఒక్క కాలములోనే తొలగింప వలసియున్నదని తెలుచున్నది. అనగా వ్యాధి, వ్యాధియొక్క సమస్తము ‡2 నిర్మూలము చేయబడిన పుడారోగ్యము చేకూర్పబడుచున్నది. విజ్ఞానయుక్త పరికల్పముల తో గాక రోగుల సహాయముకొరకు తనయదార్థమైన కర్తవ్యో ద్దేశమును తెలిసికొనిన వైద్యునియొక్క మహోన్నత ప్రథా నాశయమిదియేయైయున్నది.

---

*1 ఒకానొక దినమున ఒకానొకగంటలో మరణము సంభవించు నను ముందుజాగ్రత్తను సూచించు కల, మూఢవిశ్వాసభావన, భయావహ మగు భవిష్యత్సూచకఫలితము, వ్యాధిచిహ్నములను గలుగజేసి వ్యాధిని వృద్ధిపొందించి ఆగంటలో మరణమును తరుచు సంభవింపజేయుచున్నవి. ఇది బాహ్యముగ గోచరించు స్థితికి సమానమగు ఆంతరంగికమార్పు జరుగనిదే జరుగజాలకున్నది. గాని యిట్టి అన్ని సందర్భములయందు రానున్న మరణ మును సూచించు వ్యాధిచిహ్నములను రోగికి బోధించుయుక్తితో కూడిన మాయబోధనలమూలమునను రోగికి కలుగజేయు వ్యతిరేకనమ్మకముల మూల మునను ధర్మయుతమైన ఔషధముల మూలమునగాని నివారణకాని మరణ ము గావించుటకు భయపెట్టు యిట్టి బాహ్యఅంతరంగిక మార్పు వెంటనే పారద్రోలబడి తక్షణమే ఆరోగ్యము చేకూర్పబడు చున్నది.

‡2 వ్యాధులకు లోనగు మానవుని వ్యాధినివారణజేయ, వ్యాధిని నిర్మూలము గావించి తిరిగి ఆరోగ్యము చేకూర్చుటకు వ్యాధులయందేమి తొలగింపవలయునో వైద్యునకు చూపుటమూలమున మానవ సంరక్షకుడగు

## 18.

ఈనిస్సందేహమైన సత్యముననుసరించి వ్యాధులలో తమకవసరమగు సహాయమును తెలియజేయగలిగినట్టి లక్షణ సముదాయ సమస్తమునుబట్టి తప్ప యితరవిధముగా వ్యాధి కనుగొనబడజాలదు. దీనిని బట్టియే ప్రతివ్యక్తిగతమైన వ్యాధిలోను లక్షణసముదాయ మొత్తమే మందును నిర్ణయించుటకు దారిచూపు ప్రధానమైన మార్గదర్శి యగుచున్నది.

## 19.

వ్యాధియనునది వ్యాధిలక్షణములమూలమున తెలుపుడు చేయబడు ఆరోగ్యమైన వ్యక్తియొక్క ఆరోగ్యస్థితియొక్క మార్పులు మాత్రమే యగుటనుబట్టియు వ్యాధిగ్రస్తుడైనవ్యక్తియొక్క స్థితి ఆరోగ్యమైన స్థితిలోనికి మార్పుజెందుట మూలముననే నివారణ సాధ్యమగును గాన దీనినిబట్టియు జ్ఞానేంద్రియ కార్యాచరణ శక్తులపై ఆధారపడియుండు మానవుని ఆరోగ్యస్థితిని మార్పుజెందింపజాలని మందులు వ్యాధులను ఎప్పుడును

---

భగవంతుడు తన దయావిజ్ఞానము లీవిధముగా తెలుపుడు జేసియుండెను. గాని భగవంతుడు వ్యాధులలో నేది నివారణ చేయవలయునో దానిని రహస్యముగా మరుగుపరచి యంతరంగమున దాచి యుంచి యీ విధముగా వ్యాధిని సరిగా తెలిసికొనుట అశక్యముగావించి నివారణ చేయుట అసాధ్యమగునట్లు జేసిన పక్షమున అతని దయావిజ్ఞానమునకు మనమేమని యాలోచింపవలయును?

నివారణ చేయజాలవని స్పష్టపడుచున్నది. ఈఔషధములు గ
గియున్న మానవుని ఆరోగ్యస్థితిని మార్పుజెందించు యీశ
మీదనే కేవలము యీఔషధములయొక్క నివారణాశ
వాస్తవముగా యుండవలయును.

## 20.

మానవుని ఆరోగ్యమును మార్పుజెందించగల (యీ
కారణమున నివారణచేయుటకు) ఔషధాంతర్భాగమున దా
యున్న జీవరూపశక్తి నట్టివాదములమూలమున గాంచబ
జాలదు. మానవుని ఆరోగ్యపరిస్థితిపై నయ్యది పనిచేయ
నప్పుడు యగుపరచు అనుభవదృశ్యమునుబట్టియే మనము
దానిని స్పష్టముగా తెలిసికొనగలుగుదుము.

## 21.

మందులలోగల నివారణాపద్ధతి (curative principle)
గోచరముగాదను విషయమిప్పుడు అంగీకరింపవలసినదై యుండ
టచేతను, బహుజాగరూకులగు పరిశోధకులచే ఔషధములతో
కావింపబడిన యదార్థమైన పరిశోధనలలోవలెనే ఈమందులు
లేకనివారణాసాధనములు నిర్దిష్టమైన వివిధవ్యాధిలక్షణో్రేకము
కలుగజేయుటయు, ముఖ్యముగా ఆరోగ్యస్థితి యందుగల
వ్యక్తియొక్క శరీరమునందు స్పష్టమైన ఆరోగ్యపరిస్థితియందు

మార్పుగలుగజేయగల శక్తి గలిగియుండుటయు, తప్పు నీసిని మందులుగను నివారణా సాధనములుగను నిర్మాణము (constitute) జేయగల్గిన నెయ్యేదియో గోచరింపకుండుటచే నీమందులు నివారణసాధనముగా పనిచేయునపుడు విచిత్రలక్షణములచే మానవుని ఆరోగ్యస్థితి మార్పుజేయుటకు వానియందు గల శక్తిమూలముననుమాత్రమే నివారణాగుణము గలుగజేయుచున్నవను విషయము తేలుచున్నది. కాబట్టి వ్యాధిని నుద్భవింపజేయగలట్టియు, దీనికి తోడుగ, వ్యాధిని నివారణచేయగలట్టియు యెట్టిశక్తిని ప్రతివ్యక్తి గతయౌషధము గలిగియున్నదో దెలిసికొనుటకు వానియందలి ఆంతరంగిక నివారణాశక్తిని ముఖ్యముగా సాధ్యమైనంతవరకు గోచరింపజేయు విధముగా ఆరోగ్యమైన శరీరమున జనింపజేయు వ్యాధిదృశ్యము మీాదనే మనము ఆధారపడవలసి యున్నది.

## 22

వ్యాధినితొలగించి ఆరోగ్యము చేకూర్చుటకు వ్యాధులయందు వానిచిహ్నాలు లక్షణములసముదాయము తప్ప వేరొండెట్లు కనుగొనబడదో అట్లే మందులు ఆరోగ్యమైన శరీరములో వ్యాధిలక్షణములను గలుగజేయునట్టియు వ్యాధిగ్రస్తులగు మనుజులలోనాలక్షణములనుతొలగించునట్టియు గుణము (..nd...) దప్ప నివారణ జేయునది (curative) వేరొండు కనుగొనబడజాలదు. ఔషధసంబంధమైన పదార్థములు కొన్నిగుణములను

లక్షణములను, ఉద్రేకింపజేయుటచేతనే అనగా ఒకానొక కృత్రిమ వ్యాధిస్థితిని కలుగజేయుట మూలముననే మనము నివారణ చేయగోరు స్వాభావిక వ్యాధి స్థితిని నిర్మూలము చేయ సమర్థములగుచున్నవని తెలుచున్నది. నివారణ చేయవలసిన వ్యాధియొక్క లక్షణ సముదాయమునకు సారూప్యమగు లేక వ్యతిరేకమగు లక్షణములను కలుగ జేయు మందునే వెదకుకొన వలయునని గూడ తెలుచున్నది. పై సారూప్యలక్షణములుగల ఔషధముల వలన వ్యాధిలక్షణములు వెంటనే నిశ్చయముగా శాశ్వతముగా తొలగింపబడి ఆరోగ్యము చేకూర్పబడునా? లేక వ్యతిరేక లక్షణములు గలుగజేయగల ఔషధముల వలన వ్యాధి లక్షణములు వెంటనే నిశ్చయముగా శాశ్వతముగా తొలగింపబడి ఆరోగ్యము చేకూర్పబడునా? †1 యను విషయము అనుభవమును బట్టియే

1† ఈ రెండునుగాక వ్యాధులకు ఔషధప్రయోగము గావించుటకుసాధ్యమగు నితరపద్ధతి వైరూప్యౌషధపద్ధతి (ఆలోపతి). ఈపద్ధతియందు వ్యాధిస్థితికి సారూప్యముగగాని, లేక వైరూప్యముగాని సరియగుసంబంధములేనివ్యాధి లక్షణములకు నానావిధభిన్నలక్షణములుగల ఔషధములు ప్రయోగింపబడు చుండెను. సూరియొకచోనెందువిసరించినవిధముగా నీచికిత్సాపద్ధతి పట్టిఊహల మీద నిర్ణయింపబడి వైద్యులచే ఔషధములయొక్క వివిధగుణములు తెలిసికొనబడకుండ ప్రమాదకరమగుతీవ్రములగు ఔషధములమూలమునతరుచుగా సంగ్రబడు పెద్దమోతాదులలో రోగులయొక్క ప్రాణములతో బాధ్యతలేని ప్రాణాంతకమగు విలాసక్రీడ గావింపబడుచున్నది. మరియు వ్యాధిస్థానమును శరీరమునందలి వేరొక భాగములకు మార్పనుద్దేశింపబడి గావింపబడు బాధాకరమగు శస్త్రచికిత్సల మూలమునను పరిపాటుగ గావింపబడు చికిత్సాపద్ధతిగ విరేచనములు గావించుట, వమనములు వెడలించుట, చెమటపట్టించుట,

రుజువు కావలసియున్నది.

లాలాజలము వృద్ధిగావించుట, ముఖ్యముగ రక్తమును దుర్వ్యయముగ దీసివైచుట మొదలగు కృత్యములచే రోగియొక్క బలమును జీవద్రవములను హరింప చేయుటమూలమునను సర్వసాధారణముగ వివేకహీనముగను, నిర్దాక్షిణ్యముగను, ప్రకృతిస్వయం సహాయము నిమిత్తము గావించుకొను ప్రయత్నములకు సహాయభూతముగా నలయునను ఉద్దేశ్యముతో నీపనులు గావింపబడుచుండెను. శరీరము ఆరోగ్యముగనున్నంతకాలము జీవితమును సామరస్యమున వృద్ధిబొందించుటకు ప్రసాదింపబడిన (వ్యాధులయందు స్వయముగ నివారణజేసికొనుటకు గాదు) విజ్ఞానరహిత సహజ జీవశక్తియొక్క మిక్కిలి అక్రమములైన యీ అననుకూల కృత్యములను అనుకరించుటయు, వృద్ధిజేయుటయు నెంత వరకుయుక్తమో యోచింపకయే అవలంబింపబడుచుండెను. ఆదర్శనీయమగు నిట్టి శక్తియే జీవశక్తికియున్న పక్షమున శరీరమున వ్యాధి ప్రవేశింపకుండగనే జేసికొనును. హానికర ప్రతినిధుల మూలమున శరీరము వ్యాధిగ్రస్తమైనప్పుడు మనజీవపద్ధతి, అస్వస్థతను లక్షణముల మూలమున యగుపరచుట తప్ప వేరొండు జేయజాలదు. ఈలక్షణములను బట్టియే, వ్యాధి వైద్యుని సహాయ మపేక్షించును. ఈవైద్యసహాయ మొసగనిపక్షమున బాధలను వృద్ధిచేయుట మూలమున ముఖ్యముగా తీవ్రమైన విరేచనములద్వారా సంరక్షించుకొనుటకు యత్నించును. ఇట్టి యత్నములలోనే విపత్తు సంభవించునదియు గూడ లక్ష్యము చేయబడదు. తరుచుగా విశేషమగు త్యాగము గావింపబడును. లేదా ప్రాణహాని గలుగ జేయబడును.

జీవశక్తి వ్యాధిగ్రస్తమై యున్నప్పుడు జనింపజేయుమార్పులు, లక్షణములు అన్నియు, కలిసి వ్యాధిరూపమేయై యుండుటచే, నివారణ కొరకు వ్యాధిగ్రస్తమైన జీవశక్తిని అనుకరింపదగిన విషయమేమియు నుండదు.

రోగిని త్యాగము జేయకుండ వివేకముగల నేవైద్యుడు నివారణ యొనర్పుటకో నీపద్ధతిని అనుకరింపజాలును ?

## 23.

పట్టివిడువక బాధించుచున్న వ్యాధిలక్షణములు వ్యతిరేక లక్షణములు గల మందుల మూలమున (వ్యతిరేకచికిత్సా పద్ధతి, లేక ఉపశమన చికిత్సా పద్ధతి) తొలగింపబడి నిర్మూలము చేయబడజాలవని యదార్థమైన సమస్త అనుభవము, సరియైన సమస్త పరిశోధనలు మనలను విశ్వసింపజేయుచున్నవి. వ్యాధితొలగింపబడి నిర్మూలముచేయబడుటకు మారుగా నీమందుల మూలమున తాత్కాలికముగ గోచరమగు ఉపశమనము గాన్పించిపిమ్మట నావ్యాధి పూర్వముకంటె నెక్కుడు తీవ్రముగా యగుపించి ప్రత్యక్షముగా ఉద్రేకము జెందగలదు. (59 మొదలు 62 వరకు, 60 చూడుము)

## 24.

గాన వ్యాధి చికిత్సకొరకు వ్యాధియొక్క లక్షణ సముదాయము నపేక్షించు సారూప్య పద్ధతికంటె యితర విధమగు ఔషధప్రయోగ ముపయుక్తము కాజాలదని స్థిరమగుచున్నది. ఆరోగ్యమగు వ్యక్తులపై పరీక్షింపబడి ఔషధగుణము తెలిసికొనబడిన యీసారూప్యౌషధము వ్యాధి స్థితికి సమానమగు కృత్రిమ వ్యాధిని గలిగింపగల గుణము, శక్తి గలిగియున్నది.

## 25.

జాగరూకతతో గూడిన సమస్త ప్రయత్నములలోను నివారణాశాస్త్రము యొక్క ప్రధానమైనట్టియు, అమోఘము

నట్టియు, ప్రమాణమైన యదార్థమగు అనుభవము ♦1 చికిత్సచేయబడు వ్యాధులలో గాంచగలిగిన నెక్కువసంఖ్యగల లక్షణములకు సరిసమానమగు లక్షణములను, ఆరోగ్యమగు శరీరమున నిరూపించగల మందులు, ఉపయుక్తమైన శక్తి (Potency) లో సూక్ష్మరూపములలో గల మోతాదుల మూలమున చురుకుగా సమూలము శాశ్వతముగా, వ్యాధిస్థితి

---

♦1 జాగ్రత్తగా పరిశోధనచేయకుండ తమవిధానమునందు విశ్వాసముంచి, అంతరంగమందు విపరీతమైన పరస్థితిగలదని తలంచి, వ్యాధినిర్ణయశాస్త్రమున వివరింపబడినదని భావించి, యనేకములైన వ్యాధులపై విశేషముగా నానావిధములైన మందుల సంపుటీకరణప్రయోగములతో సంవత్సరములకొలది కృషిజేసితిమని ప్రగల్భములు బల్కు సాధారణ ప్రాచీనవిధాన వైద్యుల అనుభవమువంటిదిగాదీయనుభవమని నాయుద్దేశ్యము. వ్యాధులలో కొంత వ్యాధికరపదార్థము కనుగొనగలమని యీ ప్రాచీనవిధానవైద్యులు భావింతురు. లేదా యీవ్యాధి, యితరమైన యేదోయొక అంతరంగ వైపరీత్యమని ఊహించి ఆరోపింతురు. ఈవైద్యులు వ్యాధులలో నెల్లపుడు నేదియో (something) గాంచియుండిరి. గాని ఆగాంచినదేదియో వారికే తెలియదు. భగవంతునికితప్ప మనుష్యమాత్రునకు తెలియనివిషయముపై పనిచేయు నానావిధశక్తులచే (complex forces) పర్యవసానములను పొందియుండిరి. ఈ పర్యవసానములనుండి, నేర్చుకొనిన విషయముగాని, పొందిన అనుభవముగాని, ఏమియునులేదు. ఈవిధమగు ఏబది సంవత్సరములు యనుభవమువలన తెలియని రంగులవస్తువులతో గుండ్రముగా తిరుగు చిత్రవిచిత్రమైన రూపములు మారిమారి కనబడెడు గొట్టమువలెనుండు యంత్రములో (Kaleidoscope) ఏబది సంవత్సరములు జూచుటవలన నెట్టి సార్థకముగలదో అట్టిసార్థకము గలదు. ఎప్పుడు మారుచుండు, లెక్కలేనివేలకొలది సంఖ్యలవంటిది.

యొక్క లక్షణసముదాయము నంతను, తొలగించి అనగా (6 నుండి 16వరకు) నిలచియున్న యావత్తువ్యాధిని తొలగించి, ఆరోగ్యము చేకూర్పగలవని మనకు బోధచేయుచున్నది. అన్ని మందులు తమలక్షణములకు చాలవరకు మిక్కిలి సారూప్యముగనున్న సమస్తమైన వ్యాధులను ఒక్కటియైన విడిచిపెట్టక నివారణచేయగలవు.

## 26.

ఇంతవరకు పూర్తిగా గుర్తింపబడక, కొన్నిసమయముల యందు, ముఖ్యావముగానుండి, నిజముగా నింతవరకు జరిగియుండని ప్రతియదార్థమైన నివారణకు కారణభూతమగు సృష్టి యొక్క యీక్రింది సారూప్యసిద్ధాంతముపై నియ్యది యాధారపడుచున్నది.

సజీవశరీరనిర్మాణమునందలి యొక దుర్బలవ్యాధి శక్తి, మరియొక బలమైన శక్తిచే, రెండవది మొదటిదాని దృశ్యములకు (జాతియందు విభేదమైయుండి) మిక్కిలి సారూప్యముగానున్నపుడు, ‡1 శాశ్వతముగా నిర్మూలము చేయబడుచున్నది.

‡1 ఈవిధముగా భౌతిక నైతిక వ్యాధులు నివారణ చేయబడుచున్నవి. సూర్యుడుదయించినంతనే తెల్లవారు ఝామున ప్రకాశించు బృహస్పతి నక్షత్రమెట్లు అగోచరమగుచున్నది? అనక్షత్రకాంతికంటె, అట్టి విధమగు విశేషకాంతి నేత్రేంద్రియములపై ప్రసరించుటవలన నది అగోచరమగుచున్నది. దుర్గంధయుతమగు వాయువులతో నింపబడియున్న ఘ్రాణేంద్రియములకు నెయ్యది సహజముగ ఉపశమనము గావింపగలదు? ఈకీతినే

## 27.

మందులయొక్క నివారణాశక్తి వ్యాధియొక్క లక్షణములకంటె నెక్కుడు శక్తిగల సారూప్యమగు నౌషధములకు గల లక్షణములమీదనే ఆధారపడియున్నది. (12 మొదలు 26) కాబట్టి ప్రతివ్యక్తిగతమైనవ్యాధియు, మానవశరీరమున, వ్యాధి లక్షణములకంటె నెక్కుడు శక్తిగల మిక్కిలి (సమర్థములైన) సారూప్యమగులక్షణములను గలిగింపగల సమర్థములైన మందులమూలమున నిశ్చయముగ పూర్తిగా, త్వరితముగ, శాశ్వతముగ తొలగింపబడి నిర్మూలము చేయబడగలదు.

---

విశేషముగ ఘ్రాణేంద్రియముల కుద్రేకము కలుగజేయు నస్యము మూలమున కాదా? ఘ్రాణేంద్రియములకు గలిగిన యీఅసహ్యత, యితర యింద్రియములపై పనిచేయు, గానము, తియ్యని రొట్టె, నివారింపజాలవు. హస్తకవచము ధరించు సైనికుడు, దయాళులగు సన్నిహితుల కర్ణములనుండి, వ్యసనకరమైన రోదనముల నెట్లు నశ్రుతము గావింపగలడు? ఢంకానాదములతో మిశ్రితమైన పిల్లనగ్రోవి వలెనుండు గాన పరికరముయొక్క గింగురు నాదములతోను భయావహముగొల్పు శత్రువులయొక్క ఫిరంగిధ్వనులతోను పెద్దధ్వనిగల దుందుభి నాదములతో నయ్యవి నశ్రుతమగుచున్నవి. ఆకర్షణీయమగు దుస్తులు గాని సైనికులకు గలుగజేయు హెచ్చరికగాని నీకార్యము చేయజాలవు. ఈవిధముగానే విచారము దుఃఖము మరియొకరి యుద్బోధనల వలన (యీఉద్బోధనలు కట్టి కల్పనా విషయములతోకూడి యున్నప్పటికి) మనస్సునుండి పారద్రోలబడుచున్నవి. మితిమీరిన సంతోషముయొక్క హానికరమగు ఫలితములు మనస్సుకు మితిమీరిన సంతోషస్థితి గలుగజేయు కాఫీ త్రాగుట మూలమున తొలగింపబడగలవు. అనేక శతాబ్దములనుండి క్రమక్రమముగా నిర్జీవోదాశీనతలో నవమానకరమైన దాస్యత్వ

## 28.

ఈ నివారణా ప్రకృతిసూత్రము, యథార్థమైన యనుభవముతోను, ప్రపంచమునందలి నిజమైన పరిశీలనతోను స్పష్టపరుపబడి ఆరీత్యా యీవిషయము నిర్ధారణ జేయబడినది. ఇదిఎట్లుజరుగుచున్నదోయను విషయమునుగూర్చిన శాస్త్రీయ సమాధానమేమైనప్పటికి దానితో మనకు అవుసరములేదు. దీనినిగూర్చి తెలియజెప్పుటకు చేయుప్రయత్నములకు నేనెంతయు ప్రాముఖ్యమొసగను. అనుభవమును బట్టి పొందబడి నమ్మదగిన యీక్రింది అభిప్రాయము శ్లాఘనీయముగ యగుపడుచున్నది.

## 29.

శస్త్రచికిత్సక్రిందరాని ప్రతివ్యాధియు, నింద్రియజ్ఞానచలనములయందు, గోచరింపజేయబడు, మన జీవశక్తియొక్క (జీవపద్ధతి) ప్రత్యేకవ్యాధిగ్రస్త నిరాకారశక్తియుత పరివర్తనము మాత్రమే యైయుండగలదు. గాన, ప్రతి సారూప్య నివారణయందును, సహజముగజనించిన వ్యాధిచే నిరాకార

---

మున అగాధములోనికి క్రుంగుచున్న జర్మనీ వంటి సామ్రాజ్యములు పశ్చిమ దేశచక్రవర్తులచే సహింప నశక్యమగు స్థితి వచ్చునరకు మొదట ధూళిలోనికి అణగద్రొక్క బడుటచే అందుపై వారిలో వారికి గల నీచభావములు తొలగి మానవులకు గల గౌరవ ప్రపత్తులను పొందుటకు హెచ్చరికగలిగి జర్మనులని తిరిగి తలయెత్తియున్నారు.

శక్తిపరముగ మార్పుచేయబడిన నిజీవపద్ధతి, అంతకంటె బల తరమైన, సారూప్యకల్పిత, వ్యాధిస్థితిచే లక్షణసారూప్యమును బట్టి సరిగనిర్ణయము గావించిన, ఔషధపొటెన్సీని ప్రయోగించుట మూలమున వశ్యము చేసికొనబడుచున్నది. ఇందుమూలమున సహజముగ జనించిన (బలహీనమగు) నిరాకారశక్తియుత వ్యాధిలక్షణములు తగ్గి అదృశ్యమగును. జీవపద్ధతి, యిప్పుడు, బలతరమైన కల్పితవ్యాధిలక్షణములతో, కేవలము, ఆక్రమింపబడి లోబడియుంచుటచే సహజముగజనించిన వ్యాధిలక్షణములు తొలగిపోవును. ఈ కల్పితవ్యాధి వెంటనే తన శక్తిని గోల్పోయి (వ్యయపరచి) రోగిని వ్యాధినుండి విముక్తి గావించి వ్యాధిని నివారణజేయును. ఈ విధముగ స్వేచ్ఛ గలుగజేయబడిన నిరాకారశక్తి యిప్పుడు ఆరోగ్యజీవితమును గడపుటకు, సాగించగలదు. ఈ నిస్సందేహమగు సంభవ విధానము ఈక్రింది సిద్ధాంతములపై ఆధారపడియున్నది.

## 30.

ప్రకృతిసిద్ధమైన వ్యాధులు అందుల కనుగుణ్యమగు మందులచే తొలగింపబడి నివారణ చేయబడుచుండుటచే మానవశరీరము, ప్రకృతిసిద్ధవ్యాధుల మూలమునకంటె మందులచే (మనశక్తి కనుగుణ్యమగు మోతాదు నిర్ణయించుకొను శక్తి మనకుకలదుగాన) ఆరోగ్యమున విశేషశక్తితో మార్పు

చెందింపబడగలదు. ‡1 (విశేషముగ వ్యాధిగ్రస్తము కావింపబడగలదు).

## 31

మనఐహికజీవనములోనగు హానికరమగు వ్యాధిప్రతినిధులని మనచేపిలువబడు, కొంత మానసిక సంబంధమైనట్టియు,

---

‡1 మనచే నాశకరణ మొసగబడిన మందుల యొక్క కల్పితవ్యాధి శక్తులు, కొలదికాలము మాత్రము పనిచేయుశక్తి గలిగియుండుటచేతను స్వాభావిక వ్యాధికంటె బలతరమైనశక్తితో నుండుటచేతను దుర్బలతరమైన స్వాభావిక వ్యాధికంటె జీవశక్తిచే సులభముగ తొలగింప జేయబడుట కవకాశ మొసగడుచున్నది. ఈ స్వాభావిక దుర్బలతర వ్యాధి ఔషధము కంటె నెక్కువ కాలము సాధారణముగా జీవితాంతమువరకు బాధించుచుండుచుగాన (సోరా — చిడుము, సిఫిలిస్ — సవాయి, సైకోసిస్ — సెగ) వైద్యుడు, సారూప్యౌషధమును ప్రయోగించి యిందుమూలమున సారూప్యము బలతరమైన వ్యాధిని ఉద్భవింపజేసి జీవశక్తికి మార్పుగలుగ జేయవలయును. గాని యీ స్వాభావిక దుర్బల (ఔషధముకంటె) వ్యాధి దానంతటది తొలగి నిర్మూలము కాజాలదు. ఈ సారూప్యౌషధమును తీసికొనప్పుడు (లేకవాసన చూసినపుడు) పూర్వపు స్వాభావిక వ్యాధిస్థితికి బదులుగా, బలతరమగు యీ ఔషధశక్తి ప్రవేశపెట్టబడుటచే జీవశక్తి ఔషధముచే కల్పింపబడిన వ్యాధితో కొలదికాలము మాత్రమే యుండగలదు. ఏలనన మందుగుణము (మందుచే ఉద్రేకింపబడిన ఔషధ కల్పిత వ్యాధిగుణము) కొలదికాలము మాత్రమే యుండగలదు. [illegible] సంభవించుటమూలమున (ఈ రెండును కొలదికాలము మాత్రమేయుండును) దీర్ఘకాలమునుండిగల (46) వ్యాధులు నివారణయగుట [illegible] పద్ధతిమూలముననే జరుగుచున్నది.

మరికొంతస్థూలశరీరసంబంధమైనట్టియు, విరోధశక్తులు, మానవుని ఆరోగ్యమును నియమములేకుండ †1 వ్యాధిగ్రస్తముగావించు శక్తి గలిగియుండలేదు. ఇంద్రియజ్ఞాన కార్యాచరణములయందు విపరీతమైనస్థితిని కలుగజేసి యారోగ్యమును మార్పు జెందించు, మనలోగల వ్యాధికారణమునకు, మనతత్వము తగినంతవరకు, వశీకరణమై లోబడి †1 నపుడుమాత్రమే (Susceptible) యీ వ్యాధులచే మనమువ్యాధిగ్రస్తము కాబడుచున్నాము. కాబట్టి హానికరమగు వ్యాధి ప్రతినిధు లెల్లపుడు ప్రతివ్యక్తియందు వ్యాధిని జనింపజేయజాలవు.

## 32.

మనము మందులని పేర్కొను కల్పితవ్యాధి ప్రతినిధుల విషయములో నియ్యది వేరువిధముగనున్నది. యదార్థమైన ప్రతియౌషధము ఎల్లపుడు అన్నిపరిస్థితులయందు ప్రతిమాన

---

†1 వ్యాధియనునది మానవుని ఆరోగ్యము యొక్క మార్పుఅని నేను తెల్పునపుడు సాధారణమైన ఆంతరంగిక వ్యాధి యొక్క గాని లేక ఒక ప్రత్యేక వ్యాధియొక్కగాని పద్ధతిని గూర్చి బహుసూక్ష్మమైన భౌతిక సమాధాన మీయదలచియుండలేదు. ఈవ్యాధియనునది శరీరము యొక్క స్థూలపదార్థయాంత్రిక లేక రసాయన పరివర్తనము (mechanical or chemical alterations)కాజాలదనియు మరియు నిది వ్యాధిగత స్థూల పదార్థముపై ఆధారపడజాలదనియు అయ్యది ప్రాణియొక్క ఆధ్యాత్మిక సూక్ష్మ పరివర్తనమే గాని వేరొండు గాదని రుజువు చేయబడగలదనియు యీభావము మూలమును తెలుపుడు చేయుటకే యుద్దేశింపబడినది.

వునియందు పనిజేసి, తనవిచిత్ర లక్షణములను వానియందు, (సరియైన పెద్దమోతాదులయినదో స్పష్టముగగాంచబడగలవు) జనింపజేయగలదు. సజీవమైన ప్రతిమానవ శరీరము స్వభావికముగజనించిన వ్యాధులవలెగాక మందులు ప్రయోగించుట మూలమున ప్రవేశపెట్టబడిన ఔషధజనితవ్యాధిచే నెల్లపుడు, నిరంకుశముగా మార్పుజెందింపబడుచున్నది.

## 33.

ఈవిషయమునుబట్టి సజీవమానవశరీరము హానికరమైన వ్యాధి ప్రతినిధులమూలమున కంటెను, అంటురోగసంబంధమైన వ్యాధులమూలమునకంటెను, మందులశక్తులమూలమున విశేషముగమార్పు జెందింపబడుటకును, (వ్యాధిగ్రస్తము గావింపబడుటకు) వానిగుణమును కలుగజేయబడుటకును, (సజీవమానవశరీరము) విశేషముగ పాత్రమైయుండి మిక్కిలి సుముఖమైయున్నదని, సమస్తఅనుభవమును ‡1 బట్టి నిస్సందేహముగ జూపబడుచున్నది. అనగాహానికరమగువ్యాధి ప్రతినిధులు, సనియమమైనట్టియు (తరుచు మిక్కిలి నియమ బద్ధమైయుండును) తనకంటె తక్కువస్థితిలో నుండునట్టియు, మానవశరీరారోగ్యమును

‡1 1801 సంవత్సరమునకు పూర్వము సిడెన్ హామ్ పట్టణములో స్కార్లెటీనా యను అంటువ్యాధి అంతసర్వము వ్యాపించినపుడు వ్యాధిసోకని పిల్లలందరికి ఒక్కరినివిడువక సోకియుండెను. కానిగ్లిస్లట్ర

వ్యాధిగ్రస్తము గావించు శక్తి గలిగియున్నవి. గాన ఔషధములు వ్యాధులయొక్క శక్తికంటెను మిక్కిలి యధికమైన నిరంకుశమగు స్వతంత్రశక్తులు గలిగియున్నవి.

# 34.

మందులచే గలుగజేయబడు కల్పితవ్యాధుల యొక్క బలతరమైన శక్తిమాత్రమే ప్రకృతిసిద్ధ వ్యాధులను నివారణజేయుటకు ప్రధాన కారణ భూతముగాదు. ఈమందులు వ్యాధిని నివారణజేయుటకు మానవ శరీరములో సాధ్యమైనంతవరకు నీవ్యాధికి సారూప్యమగు కల్పితవ్యాధిని (artificial disease) కలుగజేయ సమర్థములై యుండవలెను. ఎక్కువశక్తి గల యిట్టిసారూప్యగుణములుప్రకృతిసిద్ధమైనవ్యాధులకు బదులుగా జీవశక్తియందు ప్రవేశపెట్టబడుటచే ప్రకృతిసిద్ధ వ్యాధికి జీవశక్తిపై గలబలము బోగొట్టబడుచుండెను. శరీరమునగల యొకవ్యాధి నూతనముగ ప్రవేశించిన విభేదమగు మరియొక క్రొత్త వ్యాధిచే (ఏంతటిబలమైన వ్యాధియైనప్పటికి) ప్రకృతి మూలమున గూడ నివారణ గావింప బడజాలదు అను విషయమునందెట్టి

---

అనుపట్టణములో ఈవిధమగు అంటువ్యాధి వ్యాపించినపుడు సకాలములో బెల్లడోనాఅను మందును అతిసూక్ష్మమైన మోతాదులలో తీసుకొన్న పిల్లలందరు యీ యంటువ్యాధిచే బాధింపబడక సురక్షితముగనుండిరి. మనచుట్టు వ్యాపించియున్న వ్యాధులదరిజేరకుండ మందులుకాపాడ గలిగినప్పుడు మనజీవశక్తిని విశేషముగా హెచ్చుశక్తిలో మార్పుచెందింప గలశక్తి యీమందు లతప్పక గలిగియుండవలెను.

సత్యముగలదో, ఆరోగ్యమైన శరీరమున, వ్యాధిలక్షణములకు సారూప్యమగువ్యాధి • పరిస్థితిగలుగజేయజాలని ఔషధముల మూలమున గావించు చికిత్సవలన వ్యాధులుకొంచమైనను ని వారణగావింప బడజాలవను విషయమునందెట్టి సత్యముగలదో పైనతెల్పబడిన విషయమునందట్టి సత్యముగలదు.

## 35

ఈవిషయమును దృష్టాంతముగ జూపుటకొక వ్యక్తి యందు రెండువ్యతిరేకమైన ప్రకృతిశిద్ధముగజనించిన వ్యాధు లుకలియునపుడు తత్వమున నేమిసంభవించునో, మఱియు, వ్యాధికి సారూప్యమగు లక్షణములుగల కల్పితవ్యాధిస్థితి కలు గజేయజాలనిఅననుకూలమైన వైరూప్యౌషధముల(Allopathic drugs ) మూలమున సాధారణ వైద్యచికిత్సాఫలితమున నేమిసంభవించునో మూడువిభేదమైన సందర్భములయందు పరిశీలింతము. అందుపై యిట్టివైరూప్యౌషధప్రయోగ చికిత్స యందెంతటి బలమైన ఔషధమునైనను, సారూప్యమునకు విరు ద్ధముగా ప్రయోగించినప్పుడే వ్యాధినిగూడ నాఔషధము నివారణజేయ సమర్థమై యుండదనియు, ప్రకృతిగూడ సారూ ప్యమునకు విరుద్ధముగానున్న వ్యతిరేకలక్షణములుగల వ్యాధిని తొలగింపజేయజాలదనియు, యగుపడగలదు.

## 36.

1 సమానమైన శక్తిగల రెండువ్యతిరేక లక్షణములుగల వ్యాధులు మానవశరీరమున కలసినపక్షమున అసలువ్యాధిచే క్రొత్తవ్యాధి ఎదిరింపబడి ( అసలువ్యాధి బలమైనవ్యాధియైన క్రొత్తవ్యాధి యింకను విశేషముగ నెదిరింపబడును) శరీరమున జేరకుండ జేయబడగలదు. దీర్ఘవ్యాధిచే బాధబడుచుండు ఒక రోగిశరత్కాల గ్రహణిచేగాని, యితరఅంటువ్యాధిచేగాని సోకబడదు. స్కర్వీఅను శీతాదవ్యాధి ప్రబలముగా వ్యాపించి యున్న ప్రదేశమునందు తూర్పుదేశపు ప్లేగువ్యాధి బయలుదేర దనియు, ఎజ్మాయను మంత్రిసంబంధమైన చర్మవ్యాధిచే బాధ పడు మనుష్యులుగూడ నీవ్యాధికిలోనుగారనియు లారీయనునా తడు తెల్పియుండెను. రేకైటిస్ అనువ్యాధిగల పిల్లలకు టీకాలు వేయబడినపుడు, టీకాలగుణముగలుగచేయకుండ నా పిల్లలకుగల రేకైటిస్అనువ్యాధి నిరోధించునని జన్నరుయొక్క అభిప్రాయము. రక్తక్షయవ్యాధినుండి బాధపడురోగులకు తీవ్రమైన సమకాలికజ్వరములు(Epidemic fevers)తగులజాల వని వాన్ హిల్డెన్ బ్రాండ్‌యొక్క అభిప్రాయము.

## 37.

ఒకప్రాతదీర్ఘవ్యాధిని, ఆరోగ్యమైన వ్యక్తులయందు వ్యాధికి సరిసమానమగు లక్షణములు జనింపజేయజాలని

మందు మూలమున వైరూప్యౌషధపద్ధతి (Allopathic method) ననుసరించి యేవ్యాధిమిక్కిలి ఉగ్రమైనస్థితిలో లే నప్పుడు, ఎన్నిసంవత్సరములుచికిత్స జేసినప్పటికి ఆవ్యాధిమార్పు జెందక నివారణగాకయే యుండగలదు. ఈవిషయము అనుది నము గాంచబడుచునేయున్నది. గానయిందులగూర్చి దృష్టాంత మేమియు నీయనవసరములేదు.

## 38

II వెనుకటివ్యాధికంటె వైరూప్యమగు క్రొత్త వ్యాధి, శక్తివంతమై యున్నప్పుడు జరుగువిషయమును పరిశీలింతము. ఈవిషయములో రోగి ప్రథమముననుండియు బాధపడుచు వ్యాధియీక్రొత్తవ్యాధికంటె దుర్బలతరమై యుండుటచే బలతరమైన క్రొత్తవ్యాధిమూలమున, యీక్రొత్త వ్యాధిగమ నము పూర్తియగువరకు ప్రథమవ్యాధి వెనుకనుంచబడి కొంతకాలము నిలుపుజేయబడును, అటుపిమ్మట ప్రథమ వ్యాధి నివారణగానిస్థిలోతిరిగి యగుపడును. మూర్ఛవ్యాధిచే బాధపడు యిద్దరుపిల్లలకు తామరయను చర్మవ్యాధి వచ్చిన పిమ్మట మూర్ఛవ్యాధి అదృశ్యమై సుఖముగనుండిరి. కాని తలపైగల యీచర్మవ్యాధి అంతరించినవెంటనే తిరిగి మూర్ఛ వ్యాధి వచ్చియుండెను. ఈవిషయమును టూల్పియస్ అను నతడు గాంచియుండెను. ఒకరోగికిగలచిడుము, స్కర్వీఅను

వ్యాధి వచ్చినవేంటనే అంతరించి, యీవ్యాధి తగ్గిన వేంటనేతిరిగి చిడుమువచ్చియుండెనని స్కాఫ్ అనునాతడు తెల్పియుండెను. ఈవిధముగనే ఒకరోగికి గల రక్తక్షయవ్యాధి, టైఫస్ జ్వరము తగిలిన పిమ్మట ఆవ్యాధినిలచిపోయి యీజ్వరము యొక్క గమనిక పూర్తియై తగ్గిపోయిన పిమ్మట తిరిగి రక్తక్షయ వచ్చి యుండెను. క్షయరోగికి ఉన్మాదము వచ్చిన పక్షమున నీవ్యాధిచే క్షయవ్యాధి లక్షణములన్నియు అదృశ్యము గావింప బడుచున్నవి. కాని యున్మాదము తగ్గిన తక్షణమే క్షయవ్యాధి తిరిగి యగుపించి ప్రాణోపద్రవము గలుగజేయగలదు. పొంగు మసూచికము ఒకేకాలములో వ్యాపించియుండి ఈ రెండును ఒకశిశువునకంకురించిన సందర్భములో ప్రథమమున ప్రవేశించిన పొంగుపిమ్మట ప్రవేశించిన మశూచికము చే సాధారణముగా నిరోధింపబడుచున్నది. మశూచికము తగ్గిపోవు వరకు పొంగుతిరిగి తన గమనికను నడుపజాలదు. మసూచికము తగిలిన పిమ్మట వచ్చిన పొంగు మూలమున నాలుగు రోజుల వరకు మశూచికము నిరోధింపబడి పొంగు తగ్గిపోయిన పిమ్మట మశూచికము యొక్కగతి పూర్తి కాబడునని మాంగెటు అనునాతడు గమనించియుండెను. ఆరుదినముల క్రిందట మశూచిక టీకాలు వేయబడి అటుపిమ్మట పొంగు వచ్చిన పక్షమున పొంగు యొక్క గమనమేడురోజులు బూర్తియగువరకు మశూచిక టీకాల యొక్క ఉద్రేకము నిలుపుజేయబడి వృద్ధిజెందకుండ జేయబడును. పొంగు వ్యాపించు దినములలో మశూచిక

టీకాలువేయబడిన నాల్గుగవ లేక అయిదవ దినముననే యనేక మంది వ్యక్తులకు పొంగుపోకి యీపొంగుయొక్క గమనిక పూర్తియగువరకు మశూచకము నిరోధింపబడి యటు పిమ్మట మశూచికము యగుపించి పూర్తిగ తగ్గిపోవువరకు వ్యాధి గమనము నడచుచున్నది. సిడెన్‌హామ్‌నందు పొక్కురూపమున కంఠమునందు బాధతో యుండు స్కార్ లెటినాయను వ్యాధి టీకాల (Cowpox) చే నిరోధింపబడి యీవ్యాధియొక్క గమనిక పూర్తిగ నడచి తగ్గిపోయిన పిమ్మట గాని స్కార్ లెటినా యను వ్యాధి తిరిగి యగుపించి యుండలేదు. మరియొక సందర్భమునందు, రెండు వ్యాధులు సమానబలముతో నున్నప్పుడు సరియైన సిడెన్‌ హామ్ స్కార్ లెటియానా యను వ్యాధి సంభవించుటచే నెనిమిదవ దినమున టీకాలు ( cowpox ) నిరోధింపబడి స్కార్ లెటినా తగ్గిపోయిన పిమ్మట తిరిగి వెంటనే టీకాలు (cowpox) బయటకువచ్చి తగ్గిపోయియుండెను. పొంగుటీకాల (cowpox)ను నిరోధించియుండెను ఎనిమిదవదినమునcowpox గతి పూర్తియై తగ్గిపోవు స్థితిలోనికి వచ్చినపుడు పొంగు పోకెను. ఇప్పుడు టీకాలు (cowpox) గమనిక నిలిచిపోయి పొంగు తగ్గిపోవువరకు తిరిగి దాని గమనము వచ్చి యుండక పదవ దినముననే తగ్గిపోవలసిన cowpox టీకాలు పదునారవ దినమున బయటకు వచ్చి యుండెనని కర్టమ్ అను సతడు గమనించియుండెను.

38

పొంగుసోకినపిమ్మట వేయబడినటీకాలు (cowpox) గూడపోక్కయుండెను. పొంగుతగ్గిపోయినపిమ్మటగాని టీకాలువేయబడినపిమ్మట కలుగు అవస్థయొక్క గమనము పూర్తియైయుండలేదని కర్టమ్ తెల్పియుండెను.

టీకాలువేయబడి వీని ఉద్రేకస్థితి పూర్తిగాహెచ్చు స్థితిలోనున్న సందర్భములో గదములు (mumps) వెంటనే మాయమగుటను నేను స్వయముగా గాంచితిని. టీకాలయొక్క ఉద్రేక గమనము పూర్తియై, ఎరగిటి పుండ్లుపడి మాయమైనపిమ్మటగాని, విచిత్రతత్వ సంబంధమైన యీగదములు, తత్సంబంధమైన జ్వరము తిర్గియగుపించి యీగదములజబ్బు యొక్క ఏడు దినముల గమనికనడచియుండలేదు. రెండువిభేదమగు వ్యాధులలో యీవిధముగా జరుగుచున్నది. బలతరమైనవ్యాధి దుర్బలమైనదానిని నిరోధించును, (ఒకదానితో నొకటికి క్లిష్టముగ నేర్పడనపుడే యిట్లు జరుగును. తరుణ వ్యాధులలో నట్లసాధారణముగ ఏర్పడదు) గాని ఒక దా ని నొ క టి యెప్పుడును నివారణజేయదు.

39

సాధారణ వైద్య విధానానువర్తనులు (అల్లోపతివైద్యులు) ఈవిషయమును అనేక శతాబ్దములు గాంచియుండిరి. శరీరమున

గలవ్యాధికి వ్యతిరేకలక్షణములుగల ఎంతటిబలమైన క్రొత్త వ్యాధిని ప్రవేశపెట్టినను ప్రకృతి తనంతతానేవ్యాధిని నివారణ చేయజాలదని గాంచియున్నారు. ఇట్లుగాంచియు నివారణచేయు వ్యాధిలక్షణములకు వ్యతిరేకమైన లక్షణములను కలుగజేయు, ఔషధప్రయోగముల మూలమున, (యిందు మూలమునెట్టి వ్యాధిస్థితి కలుగునో భగవంతునకే తెలియును) అనగావైరూప్యౌషధములమూలమున చికిత్సచేయుటకు గడంగు వైద్యులగూర్చి మనము ఏమని భావించవలసి యున్నది. ఈవైద్యులు యిదివరకు ప్రకృతిని జాగరూకతతోగమనించనప్పటికి తామనుకూలమగు తప్పుదోవనుబోవుచుంటిమని వారి చికిత్సాపర్యవసానవిచారగ్రస్థఫలితార్థములు బోధ జేయ కలవు. ఈవైద్యుల పద్ధతిననుసరించి దీర్ఘవ్యాధులలో వైరుధ్యమునకవకాశ మొసగు వైరూప్యౌషధమును ప్రయోగించునప్పుడు, అసలువ్యాధికివ్యతిరేక లక్షణములుగల కల్పిత వ్యాధిని జనింపజేయుచుంటిమనియు, వారు తెలిసికొనియుండ లేదా? ఈకల్పితవ్యాధి యున్నంతకాలము, అసలువ్యాధి అణచిపెట్టబడి, నిలుపచేయబడి అటుపిమ్మట, రోగియొక్క శక్తి తగ్గినకొలది జీవశక్తి వైరూప్యౌషధ గుణమును, నిలుపుకొనలేక విడిచినతక్షణము వ్యాధితిరిగి ఎల్లప్పుడురాగలదు; తప్పకవచ్చితీరును. గానతరుచు తీవ్రమైన భేదిమందులు యిచ్చుటవలన శరీరమునగల చిడుముపొక్కులు తక్షణమే చర్మమునుండి తప్పక అంతరించిపోవును. ఇట్లు కల్పింపబడిన

మలకోశముల వ్యాధి (వ్యతిరేక లక్షణములుగల) తో రోగి ఎంతమాత్రము నిలువలేక, భేదిమందులు తీసికొనలేనిస్థితిలో నున్నప్పుడు, తిరిగి చిడుముపూర్వమువలె వచ్చివేయును లేదా ఆంతరంగిక చిడుము తత్వము (psora) మరియొక దుర్గుణ లక్షణముల నగుపరచును. రోగి బాధపడుచున్న పూర్వపు వ్యాధికితోడు, బాధతోగూడిన అజీర్ణవ్యాధికిలోనై దానిని దొలగించుకొనుటకు అశక్తుడై యుండును. ఈవిధముగనే ఒక దీర్ఘవ్యాధిని నిర్మూలముచేయుటకు సాధారణవైద్యుడు శరీరముయొక్క పైభాగమున చర్మముమీద పుండ్లు చేయుట వాతపెట్టుట మూలమున వారిఉద్దేశ్యము సఫలీకృతము కాజాలదు. ఈవిధముగా చేయబడినపుండ్లు ఆంతరంగికవ్యాధికి అన్యమగు వైరూప్యమగుటచే, యీపద్ధతిననుసరించి దీర్ఘవ్యాధులు ఎంతమాత్రము నివారణజేయబడజాలవు. ఇందుమూలమున విస్తారమైనకండరములచే జనింపజేయబడిన ఉద్రేకము అంతర్గతమునగల వ్యాధికంటె బలతరమై ఒక్కొక్కప్పుడుండుటచే అందుమూలమున ఒక్కొక్కపుడు వ్యాధి శాంతింపబడి ఒకటిరెండు వారములవరకు నిలుపుచేయబడుచున్నది. వ్యాధి కొలదికాలము మాత్రమే నిలుపుచేయబడి యుండును. ఈలోగా రోగియొక్కశక్తులు క్రమముగా కృశించిపోవును. చాలాసంవత్సరములు వాతల మూలమున అణచిపెట్టబడిన మూర్ఛవ్యాధి వాతలు మానిన వెంటనే పూర్వముకంటె నెక్కువ తీవ్రముగా నావ్యాధిసంభవించి

యుండెనని "ప్లేగ్" అనునాతడు ధృవపరచి యుండెను. చిడుముకు భేదిమందులు, మూర్ఛకు వాతలు, అసంఖ్యాకములైన యితరవ్యాధి స్వరూపములకొరకు అనుదినము వాడుకలో తెలియనివస్తువులతో సంప్రాంటీకరణముచేయబడిన, ప్రయోగములు మొదలగు విభేదమగు నీవ్యాధి ప్రతినిధులతోగావించు యీవైరూప్యపద్ధతి ఎక్కువబాధకరమగు చికిత్సా పద్ధతియగుచున్నది. ఈయౌషధములు, యీచికిత్సా పద్ధతులు, కొలదికాలము వ్యాధిని అణచిపెట్టుట లేక నిలుపుచేయుట తప్ప నివారణ చేయజాలవు. కాని దీర్ఘకాలము యీ వైరూప్యౌషధముల నుపయోగించిన పక్షమున వెనుకటి వ్యాధికితోడు క్రొత్తవ్యాధిస్థితిని కలుగజేయగలవు.

## 40

III క్రొత్తవ్యాధి శరీరమున చాలకాలము బాధించిన పిమ్మట దీనికి విభేదమైన ప్రాతవ్యాధితో కలిసి క్లిష్టమైన (complex) వ్యాధిక్రిందపరిణమించి వ్యాధిగతశరీరమునందలి తమకనుగుణ్యమైన ఒక్కొక్క ప్రత్యేకస్థానము నాక్రమించి, (ఆయాస్థానములు ప్రత్యేకముగ తమకుచెంది యుండుటచే) తక్కిన భాగము విభేదమైన యితరవ్యాధికి వదలియుంచును. గాన ఒక సవాయిరోగి చిడుము (psoric సోరిక్) రోగి కావచ్చును. సోరిక్ (చిడుము) రోగి సవాయిరోగికావచ్చును. రెండువ్యాధులు ఒకదానికొకటి విభేదమైయుండుటచే ఒకదాని

నొకటి తొలగించి నివారణ చేయజాలవు. చిడుము (psoric) పొక్కుయగుపించుట ప్రారంభించినంతనే మొదట సుఖసంబంధమైన (venerial) లక్షణములు వెనుకనుంచబడి నిలుపుచేయబడును. కొంతకాలమునకు (సవాయిగూడ చిడుము వ్యాధి (psora) యంతబలమైన దగుటచే) రెండును కలసి ‡1 దేనికి అనుకూలమైన అవయవములనది లోబరచుకొని, వ్యాధిని వృద్ధిజేసి నివారణ కష్టతరము గావించును.

రెండు విభేదమైన తరుణ అంటువ్యాధులు అనగా పొంగు, మశూచికము, కలసినప్పుడు లోగడ తెల్పబడిన విధముగా ఒకదానినొకటి నిలుపుజేయును. అరుదుగా రెండు విభేదమైన వ్యాధులు ఒకేపర్యాయము ఒక్కవ్యక్తికేసోకి కొంతకాలము ఒకదానితోనొకటి కలసియున్నట్లు యుండిన యీవిధమగు తీవ్రమైన అంటువ్యాధులుగూడవ్యాపించియుండెను. ఒకేకాలములో ఒకప్రదేశమున వ్యాపించియున్న పొంగు, మశూచికములయొక్క

1‡ జాగరుకతతో కూడిన పరిశోధనలను బట్టియు, యీవిధమగు సంశ్లిష్టమైన వ్యాధుల నివారణానుభవమును బట్టియు రెండువ్యాధులు ఎప్పుడును యదార్థముగా కలసికొనిపోయి యుండజాలవని నేను సంపూర్ణముగా విశ్వసించియున్నాను. ఇట్టి సందర్భములలో ఒకదానిప్రక్కనొకటి తనకు సంబంధించిన భాగములలో నుండును. పాదరసముతో చేయబడిన ఉత్తమౌషధమును సోరాకు సంబంధించిన ప్రత్యేకౌషధమును అనుగుణ్యమైన మోతాదులలోను రూపములలోను నేర్పుగా మార్చుచుయిచ్చిన ఆవ్యాధులు సంపూర్ణముగ నివారణ యగును.

ఈరెండు సమకాలిక వ్యాధులయందు ఈవ్యాధులకులో నైన మూడువందలమంది రోగులను పరీక్షింప నేరియొక్కరిలో గూడ ఈరెండువిభేదవ్యాధులు ఒకేకాలమున ఒకవ్యక్తిలోనుం డుట గాంచియుండలేదని 'పి. రసిల్' తెల్పియుండెను. (ఈమూడు వందల రోగులలోను ఒకవ్యాధి రెండవవ్యాధిని నిలుపుచేసి యుండెను. మశూచికము సోకిన యిరువది దినముల పిమ్మట పొంగు సోకియుండెను. పొంగుయగుపించిన పదిహేడు లేక పదు నెనిమిది దినములకు మొదటివ్యాధి గమనికి పూర్తియైనపిమ్మట మశూచికము యగుపించియుండెను) రైసీ యనునాతడు యిద్ద రు బాలికలలో మశూచికము, పొంగు ఒక్కకాలములోనే సోకియుండుట గాంచెను. 'జె. హారిస్' అనునాతడు తనవైద్య వృత్తికాలము నంతలోను యిట్టివిషయము రెండుసందర్భముల యందు మాత్రిమే గాంచియుంటినని తెల్పెను. ఇట్టి సందర్భ ములు 'విట్టుముల్లర్' వ్రాసినగ్రింథములోను, కొలదిగ యిత రులు వ్రాసిన గ్రంథములలోను గాంచనగును.

'జింకర్' అనునాతడు పొంగుతోను 'పూర్పూరా' యనువ్యాధితోను కలసి టీకాలు (cowpox) క్రమగతి నడచు టను గాంచియుండెను.

'జన్నరు' అనునాతడు సవాయికి పాదరసముచే చికిత్స జేయుచున్నప్పుడు టీకాల (cowpox) గమనిక చలనము గావిం పబడక సాగియుండుటను గాంచెను.

# 41.

సాధారణవైద్యులచే అనుచితమైన చికిత్సాపద్ధతిని (వైరూప్యౌషధ పద్ధతి ( allopathic method) అయుక్తమైన ( unsuitable) మందులను దీర్ఘకాలము ప్రయోగించుట మూలమున స్వభావ సిద్ధముగజనించిన వ్యాధితో యీఔషధ జనితలక్షణములుకలసి ఒకదానితో నొకటి క్లిష్టముగ చేర్పబడి, వ్యాధిక్లిష్టపరిస్థితులు తరుచుకలుగ జేయబడుచున్నవి. నివారణ చేయదలచిన ప్రకృతి సిద్ధవ్యాధి (natural disease ) కొరకు విరామములేకయిచ్చు అయుక్తమైన మందులవలన యీఔషధములకుగల విశేషశక్తులనుండి(peculiar power) తరుచుఅతిదీర్ఘమైన వ్యాధి పరిస్థితులు సంభవించుట గాంచ గలము. ఈఔషధములకు విభేదమగు ( dissimilar) దీర్ఘ వ్యాధితో నివి క్రమముగ నేకీభవించుటచే, వెనుకటి వ్యాధికే, దీర్ఘ స్వభావమైనకొత్త విభేదకల్పిత వ్యాధికలుపబడి ఒక్కవ్యాధితో నున్నరోగికి రెండువ్యాధులు గలుగజేయుబడిరోగియొక్క వ్యాధి స్థితి, తరుచుగ, నివారణ కష్టతరమగు దుస్థితిలోనికిని తీసికొని రాబడుచున్నది. వైద్యపత్రికలలో సలహాచేయబడువ్యాధులు, వైద్యగ్రంథములలో వ్యాధులనుగూర్చి వ్రాయబడిన ప్రమాణములు యిందలియదార్థమును ధృవపరచగలవు. ఈరీతినే సుఖసంబధమైన పుండు (సవాయి) తోకూడిన వ్యాధిముఖ్యముగా సోరా (చిడుముసంబధమైన) తోగాని లేక సెగసంబంధమైన ఆసన గండమాలయొక్క విపరీత స్థితితోగాని క్లిష్టముగ

పర్పడియున్నప్పుడు ( complicated ) పాదరసముతో (mercury) తయారుకాబడి తరుచుగా దీర్ఘకాలము నీయబడు అయుక్తమగు పెద్దమోతాదులతో నివారింపబడక శరీరము నక్రమముగా రసగుణము, వృద్ధిపొంది అసలువ్యాధితో తరుచు, క్లిష్టమైన భయంకర పిశాచవ్యాధి రూపముదాల్చి, ఆరోగ్యముచే కూర్చుటకు దుస్సాధ్యమైన స్థితిలోనికితీసికొని రాబడును ‡1.

## 42.

ఇదివరకు జెప్పబడిన విధముగా ఒక్క శరీరములో రెండువ్యాధులు (మూడుగూడ) ఏకకాలములో సంభవించుటకు ప్రకృతి ఒప్పుచున్నది. కాని యీక్లిష్టసమ్మిశ్రమము ( complication ) ప్రకృతియొక్క శాశ్వత సిద్ధాంతముల ప్రకారము, రెండు విభేదవ్యాధులు, ఒకదానినొకటినిర్మూలముల లేక నివారణచేయజాలక, నీరెండును (లేకమూడు) శరీరమున ఒకదానికొకటి సంబంధములేక ప్రత్యేకముగనే యుండినట్లుండి విశేషలక్షణములతో తమ కనుకూలమైన శరీరభాగములను

1‡ వ్యాధిలక్షణములకు సరిసమానమగు లక్షణములను గలిగియుండుట చేతనే సవాయి సంబంధమైన పుండు సారూప్యౌషధ పద్ధతిని పాదరసముచే నివారణ చేయబడును. ఇదిగాక సవాయివ్యాధితో పోలికలేని అనేక యితర లక్షణములుకూడ పాదరసమునకు గలవు. గాన యీఔషధమును పెద్దమోతాదులలో ప్రయోగించిన పక్షమున అదిముఖ్యముగా సోరాతో కలిసియున్నప్పుడు (తరచు అట్లుండును) క్రొత్త వ్యాధులను జనింపజేసి శరీరమున విశేషమైన సంక్షోభము కలుగజేయును.

(యీవ్యాధులలో ఒకదానికొకటి పోలికలేకుండుటచే) ఆక్ర మించుకొని జీవితసామరస్యమునకు, భంగముకలుగజేయకుండ, సంభవింపగలవు.

# 43.

రెండుసారూప్యమైన వ్యాధులు, ( similar ) శరీర మునకలసినపుడు అనగా యిదివరలోనేగల వ్యాధికి, బలతర మగు సారూప్యమైన (similar ) మరియొక వ్యాధిని చేర్చు టవలన, పర్యవసానము పూర్తిగవేరు విధమైయుండగలదు. ఇట్టిసందర్భములయందు ప్రకృతి విధానమున స్వతస్సిద్ధముగనెట్లు నివారణగలుగుచున్నదో మనము గాంచి, మానవునకేవిధ ముగచికిత్స చేయవలయునో, ఒకపాఠమును మనము నేర్చు కొనగలము.

# 44.

సారూప్యమైన రెండువ్యాధులు ఒక్కశరీరమున ఒక దానిప్రక్కనునొకటి (40)యుండుటగాని లేకరెండునుకలసి ద్విగుణీకృతముగక్లిష్టమైన వ్యాధిక్రింద ఏర్పడుటగాని యెట్లుజ రుగదోయట్లే యిండొంటికి సరూప్యమైన రెండువ్యాధులు,ఒక దానినొకటి అడ్డగించుటగాని లేక ఎదిరించుటగాని (36లోవలె) లేక నూతనమైన వ్యాధియొక్క గమనిక పూర్తియగునరకు రెండవదానిని నిలుపుచేయుటగాని (38) చేయజాలవు.

## 45

ఒకేవిధమైన రెండు వ్యాధులు ఒకశరీరమునకలసి, యీరెండు వ్యాధులు ఒకదానికొకటి రూపమునందు, కలుగజేయు లక్షణములయందు, గుణములయందు, బాధలయందు మిక్కిలిసారూప్యమై యున్నపుడు (Similar) ఒకదానినొకటి తప్పక నిర్మూలముజేయును. అనగా బలతరమైనది దుర్బలతరమైన దానిని నిర్మూలముచేయును. ఈకారణమును బట్టియే, బలతరమైనవ్యాధి శక్తి శరీరతత్వమునెదుర్కొనునపుడు సారూప్యగుణముగలిగి యుండుటచే యింతకుపూర్వము దుర్బలవ్యాధియొక్క ఉద్రేకముచే నావహింపబడియున్న (affected)శరీరభాగములనే సరిగా ఆక్రమించుకొనును గాన నాదుర్బలవ్యాధి యీభాగములపై నెంతమాత్రము తనశక్తినిజూపజాలక పూర్తిగతొలగిపోవుచున్నది. ‡1 అనగా మొదటి వ్యాధిచే వ్యాధిగ్రస్తముకావింపబడిన జీవశక్తి (Vital force) మిక్కిలి సారూప్యమై బలతరమైన సూక్ష్మవ్యాధి కరశక్తిగలిగిన (Dynamic worbife power) నూతనమైనవ్యాధిచే మిక్కిలిబలతరముగా నెదుర్కొనబడినప్పుడు, జీవశక్తి యీనూతనమైనశక్తితో మాత్రమే ఆవహింపబడియుండుటచే (Affected) సారూప్యమగు దుర్బలతరమైన అంతకుపూర్వమే జీవశక్తిని నంటి

---

1 ‡ తీక్ష్ణమైన సూర్యకిరణములచే దీపపుకాంతి, ఎట్లు కాంతివిహీనమై మననేత్రములకగోచరమగుచున్నదో ఆవిధముగనే అంతరించును

యున్న అసలు వ్యాధి స్థూలాధారములేని సూక్ష్మశక్తిలో నుండుటమూలమున జీవశక్తిపై నట్టివ్యాధి ప్రాబల్యము జూపింపజాలక, తప్పక అంతరించును.

## 46.

సారూప్యమగు లక్షణములుగల యితరవ్యాధులచే ప్రకృతిసిద్ధముగనే సారూప్యముగ నివారణచేయబడుచున్న వ్యాధులయొక్క అనేక ఉదాహరణములను జూపవచ్చును. ఒకవిషయమును నిశ్చయముగను, నిస్సందేహముగను, మాట్లాడుట మన ఉద్దేశ్యమై యుండుటచే, మనదృష్టిని ముఖ్యముగా, ఏవిధమగు వ్యత్యాసము లేక ఒక్కటిగానుండి, ఒక స్థిరమైన వ్యాధి తత్వమునుండుద్భవించి (Fixed maism) స్పష్టమగునామార్గమైనకొలది వ్యాధులకుమాత్రమే కేంద్రీకరించవలసియున్నది. ఇట్టి వ్యాధులయందు, అనేకములగు ప్రమాదకర లక్షణములతో మిక్కిలి భయముగొల్పు మశూచికవ్యాధి ప్రధానమైనస్థానము నాక్రమించియున్నది. ఈవ్యాధి సారూప్యమగు లక్షణములుగల అనేకవ్యాధులను తొలగించి నివారణ జేసి యుండెను. తరుచుగా మశూచిక మెుల్లు విపరీతమైన కండ్లవ్యాధిని జనింపజేసి, అంధత్వము గలుగజేయుచున్నది! చూడుము! డెజోటిక్సు అనునాతడు మశూచిక టీకాలువేసి దీర్ఘమైన కండ్ల వ్యాధిని శాశ్వతముగా

నివారణ జేసియుండెను. ఇట్లు లీరాయిఅనునాతడు మరియొక నివారణజేసియుండెను.

రెండుసంవత్సరములనుండిగల అంధత్వము తలపైగల చర్మవ్యాధి అణచిపెట్టబడినవిమ్మట ఆకారణమున నవ్వ్యాధి పూర్తిగానివారణ జేయబడెనని క్లెయిన్ అనునాతడు తెల్పియుండెను.

మశూచికము, శ్వాసనుబంధించు వగర్పును, చెముడును కలుగజేయుచున్నది. చెముడు వగర్పు యీ రెండు వ్యాధులు గూడ, మశూచికము ముమ్మరముగా సోకుటమూలమున నివారణచేయబడియుండెనని, జె. యల్. క్లాస్ అనునాతడు తెల్పియుండెను.

మశూచకము సోకినప్పుడుతరుచు అండములు మిక్కిలి బాధకరముగ గూడ వాచుట, ఆవ్యాధియందొక తరుచుగ సంభవించు లక్షణము. దెబ్బ తగులుటచే ఎడమఅండము పెద్దదై గట్టిపడి వాచియుండ, సారూప్యలక్షణ స్వభావమును బట్టి యీ మ శూ చి క ము ఆవాపును తగ్గించి యుండుటను క్లీయిన్ అనునాతడుగాంచియుండెను. ఇట్టివిధమగు అండముల వాపునే, మశూచికము తగ్గించియుండుటను మరియొక పరిశోధకుడుగూడ గాంచియుండెను.

మశూచికములో బాధించు లక్షణములలో గ్రహణి బాధయొకటి. గ్రహణిబాధ మశూచికము సోకుటమూలమున

తగ్గిపోయిన దృష్టాంతరమును వెండిట్ అనునాతడు గాంచి యుండెను.

టీకాలు వేసినవెంటనే సోకిన మశూచికము, మిక్కిలి సారూప్యముగల అధికమైనశక్తి నిబట్టి టీకాలనువృద్ధిజెంద నీయక నిరోధించి సారూప్య పద్ధతిని పూర్తిగా తొలగించు చున్నది. మరియు, టీకాలువృద్ధిజెంది, తగ్గిపోవుచున్న సమయములో వానికి సారూప్యమైన లక్షణములుగల అంటుపై సోకిన మశూచికము యొక్క తీవ్రతను తగ్గించి, సాధారణమైన స్థితిలోనికి తీసికొని వచ్చియుండెనని †1 ముర్రె అను నాతడు, తదితరులు ధృవపరచియుండిరి.

టీకాలమందులో, మశూచికవ్యాధిసోకకుండ కాపాడు పదార్థమునకుతోడు, మరియొకవిధమైన సాధారణ చర్మసంబధమైన పొక్కును గలుగజేయు అంటురోగ సంబంధ

†1 నల్భైయాభై సంవత్సరములకు పూర్వము ఒకపట్టణమున ఊభయంకరమైన మశూచిక వ్యాధి సంభవించినప్పుడు ఆపట్టణమునందలి పిల్లలలో అర్ధము సగము లేక మూడువంతులవరకు ఈవ్యాధిచే మృతినొందుచుండిరి. జెన్నరుయొక్క (cowpox) (టీకాలమందు) టీకాలు విరివిగా వేయబడి యాటీకాల పద్ధతి వ్యాప్తి జేయబడిన పిమ్మట యీమశూచిక వ్యాధి అంత తీవ్రముగను, సకాలిక వ్యాధిగను (Epidemically) యున్నదును అగుపించి యుండలేదు ఇందులకు కారణము, టీకాల కుపయోగించు మందు మశూచికమునకు సారూప్యమై యుండుటవలననే యగుచున్నది. పైన తెల్పబడిన టీకాలు వృద్ధిజెంది తగ్గిపోవుచున్న సమయములో సోకిన మశూచికము తీవ్రత తగ్గి సాధారణ స్థితిలోనుండుటవలన కారణముగూడ నిదియే.

మగు పదార్థముగలదు. ఈపొక్కులు సాధారణముగా చిన్న ఎఱ్ఱని గుండ్రనిమచ్చపై రెండుచిన్న మొటిమలవలె (అరుదు పెద్దపొక్కులుండును) నుండి, ఎఱ్ఱటి గుండ్రని చర్మసంబంధమైన మచ్చలతో కలసి, విపరీతమైనదురదతో కూడియుండును. ఈవిధమగుఁడ దేశ్రకము, అనేకమందిపిల్లలకు టీకాల యొక్క ఎఱ్ఱటిపుండ్లు, కొలది దినములలో మాని చర్మముపై చిన్న గట్టిమచ్చ వదలిన కొలది దినములకు పిమ్మటగాని అందుకు ముందుగాని యగుపించగలదు. టీకాలువేసినపిమ్మట, పిల్లలలో చాలకాలమునుండి మిక్కిలి బాధించుచున్న, టీకాలపొక్కుల పోలికగలిగినట్టి చర్మసంబధమైన పొక్కులు, సహచరవ్యాధి లక్షణములతో సరిపోలియుండుటచే, సారూప్యపద్ధతిని సక్రమముగాను, శాశ్వతముగాను నివారణచేయబడుచున్నవని నేను చెల్పుటయేగాక అనేకులు యీవిషయమును అంగీకరించి యుండిరి.

టీకాలు వేసిన పిమ్మట చెయ్యవాచుట ఒకవిచిత్రమైన లక్షణమగుటచే కొంతవరకు పక్షవాతముతో వాచియున్న చెయ్యి టీకాలువేసినపిమ్మట నివారింపబడెను.

ఇద్దరువ్యక్తులకుగల విడుపుజ్వరము (intermittant fever) టీకాలువేసినపిమ్మట యఱ్ఱటిపుండ్లు పడుటకుముందు వచ్చుజ్వరము తగిలినపిమ్మట, సారూప్యపద్ధతిగనివారింపబడెను. ఈవిషయమును హార్డిజి అనునాతడువెల్లడించి, జె. హంటర్

అనునాతడు, ఒకేశరీరములో *1 రెండుజ్వరములు (సారూప్య మగువ్యాధులు) ఏకకాలమందుండజాలవని తెలిపినవిషయము ధృవపరచియుండెను.

కోరింతదగ్గు (whooping cough) యొక్క జ్వరమునకు, దగ్గునకును, పొంగులోవచ్చు జ్వరమునకు, దగ్గునకు విశేషమైన పోలికయుండుటచే, ఈరెండువ్యాధులు (కోరింత దగ్గు, పొంగు) వ్యాపించియున్న ప్రదేశములయందు, పొంగు

---

* 1 ఇచట చూపబడిన ఉదాహరణలు అర్గనాన్ యొక్క వెనుకటి, ప్రచురణములయందు చిడుముచే దీర్ఘవ్యాధులు నివారింపబడిన విధము నాచే పరిశోధింపబడి విశదీకరింపబడి నాచే వ్రాయబడిన దీర్ఘవ్యాధులు అను గ్రంథమునందలి మొదటిభాగమున వివరింపబడిన విషయమునుబట్టి యీ నివారణ కొంతవరకు సారూప్యవిధాన నివారణయని గాంచవచ్చును. చిడుము సంభవించుటమూలమున నశించిన క్షయ మొదలగు పెద్దవ్యాధులు, ప్రప్రథమమున సొరకు (చిడుము) తత్వమునుండియే ఉద్భవించును. ప్రాణమునకు భంగము గలిగించు ప్రాచీన సోరాలక్షణములు, అంతరంగ తత్వమున పూర్తిగా వృద్ధిపొంది క్రొత్తగా సోకిన చిడుము మూలమున సాధారణమైన చిడుము వ్యాప్తిలోనికి మార్పుజెందుటచే పూర్వపు వ్యాధి (క్షయ మొదలగు వ్యాధులు) ప్రమాదకరలక్షణములతో సహితము అదృశ్యమగుచుండెను. మిక్కిలి వృద్ధిజెంది విశేషమైన లక్షణములతోనున్న ప్రాచీన సోరా నూతనముగ సోకిన చిడుము మూలమున వ్యాధి ఉత్పత్తి స్థితిలోనికి మార్పుచెందింపబడుటచే సారూప్యవిధనివారణ సంభవించెనని తలంపవలసి యున్నది. ఈక్రొత్తవ్యాధి లక్షణములను ప్రాచీన వ్యాధిలక్షణములను కలుగుటచే వెనుకటివ్యాధి నివారణయగుచున్నది గాన, సోరా శాంతికరౌషధము మూలమున రోగియొక్క వ్యాధి నివారణ జేయుటకు రోగియొక్క పరిస్థితి మిక్కిలి అనుకూలమైన పరిస్థితులలో నుంచవగలము.

సోకియున్న పిల్లలనేకులు కోరింతదగ్గుచే బాధపడకుండ సుఖముగా నుండుట "బోస్క్వెల్క్" గాంచియుండెను.

కోరింతదగ్గు పొంగుతో కొంతవరకుమాత్రమే సారూప్యమైన లక్షణములుగలిగియుండుటచే అనగా పొంగులోవలెనే, కోరింతదగ్గుయందుగూడ అట్టిచర్మసంబంధమైన పొక్కులున్న పక్షమున, పొంగువ్యాపించియున్నట్టి, యికముందువ్యాపించునట్టిదినములలోనుగూడ పొంగుమూలమున, కోరింతదగ్గు సోకకుండ అందరునుకాపాడబడి యుండగలరు. అంటువ్యాధులు వ్యాపించియున్న దినములలో సారూప్యపద్ధతిననుసరించి అనేకులు పొంగుమూలమున కోరింతదగ్గుసోకకుండ రక్షింపబడుట జరుగుచున్నది. పొంగుతో పోలికగలిగినటువంటి పొక్కుసంబంధమైన ప్రధానలక్షణములతో సరిపోలినవ్యాధితో, పొంగు సంక్రమించినపక్షమున, ఆవ్యాధిని పొంగుసారూప్య నివారణా పద్ధతిని, తప్పకతొలగింపగలము. పొంగుసోకినపిమ్మట దీర్ఘమైన చర్మవ్యాధిపూర్తిగా శాశ్వతముగానశించుటను కర్టమ్ అనునాతడు గాంచియుండెను. ఆరుసంవత్సరములనుండి ముఖముపైనను, మెడపైనను, చేతులపైనను, మిక్కిలి మంటతోకూడి ప్రతికాలమూనమార్పుయందు, ఉద్రేకించుచర్మవ్యాధి, పొంగు సోకినపిమ్మట, చర్మమంతయునాచి, పొంగుతగ్గిపోయినపిమ్మట నివారణమై తిరిగి ఎన్నడునుయగుపడకుండనశించెను.

47

ప్రకృతియందుజరుగు పద్ధతికనుగుణ్యముగ, నిశ్చయముగను, త్వరితముగను శాశ్వతముగను నివారణజేయుటకు వైద్యుడుపతరగతి కల్పిత వ్యాధిప్రతినిధిని (అనగామందు) రోగిశరీరమున ప్రవేశపెట్టుటకు నిర్ణయించు కొనవలయునో యింతకంటెనెక్కుడు తేటతెల్లముగను, విశ్వసనీయముగను వైద్యునకుపై విషయముకంటె వేరొకటిబోధింపజాలదు.

48.

ఇంతవరకు గుర్తింపబడని శాశ్వతమైనతిరుగులేని ప్రకృతి శాసనముల ననుసరెంచి. వ్యాధిలక్షణములకు సారూప్యమైన లక్షణములుగలిగి అంతకంటె బలతరమైన శక్తిగలిగిన ఔషధముమూలమున తప్ప, పై ఉదాహరణల నన్నిటిని బట్టియు ప్రకృతిసిద్ధముగగాని, వైద్యునియొక్క నేర్పువల్లగాని, ఏఒక్క సందర్భమునందునుగూడ ఎంత బలమైనదైనప్పటికి వ్యతిరేక లక్షణములు గల మందుమూలమున వ్యాధి తొలగింపబడజాలదు.

49

పరిశోధకులెక్కుడు శ్రద్ధతో గమనించుచున్నను సహాయభూతమగు ప్రకృతిసిద్ధమైన సారూప్యవ్యాధులు అనేకములుండియున్నను యీవిధమగు స్వభావసిద్ధమైన సారూప్యపద్ధతిని జరుగు నివారణలనేకములును మనము గాంచియుండగలము.

**50**

బలమైన ప్రకృతియొక్క ఆజ్ఞానుసరణమున పొంగు మశూచికము (చిడుము) స్థిరస్వభావముగల తత్వసంబంధమగు వ్యాధులై యుండుటకు తోడు యీ వ్యాధి ప్రతినిధు (morbific agents) లై సారూప్య చికిత్సా పరికరముగా కొంతవరకు ఏర్పడియున్నప్పటికి యివ్వి నివారణాసాధనములుగా (remedies) ఎంచుటకు వీలులేదు. ఏలనన యీవ్యాధులు నివారణ చేయదలంచిన వ్యాధికంటె భయంకరమైయుండుటయే గాక మిక్కిలి ప్రాణోపద్రవకరములై యుండుటచే వ్యాధి నివారణజేసినపిమ్మట వీనిని తిర్గి వరుసక్రమమున నివారణ జేయవలసిన అవుసరము గలదు. గాన యీపరిస్థితులయందు వీనిని సారూప్యౌషధములుగా ప్రయోగించుట సంశయాత్మకమగుటయేగాక కష్టతరము ప్రమాదకరముగూడ యగుచున్నది. మరియు చిడుము పొంగు లేక మశూచికము వీనితో సారూప్యమైన లక్షణములుగల మానవుడు పాత్రుడగు నెన్నియో వ్యాధులుగలవు గాన 1♦ ప్రకృతిసిద్ధముగ యిట్టి సంశయాత్మకమైన అపాయకరమగు సారూప్యనివారణా సాధనముల మూలమున కొలదివ్యాధులు మాత్రమే నివారణ చేయబడగలవు. మరియు నిట్టినివారణా సాధనముల మూలమున గావించు నివారణ మిక్కిలి ప్రమాదముతో కూడియుండగలదు. మరియు మందు మోతాదువలె అవుసరమునుబట్టి యీరోగకర శక్తులను

1† టీకాలమందునందలి పొక్కురూపమైన అంటురోగపద్ధతి.

తగ్గించుకొన వీలులేకుండుటచే నివారణ మిక్కిలి కష్టతరము ప్రమాదముతో కూడియుండును. దీర్ఘకాలపు వ్యాధిచే బాధపడురోగి తన వ్యాధికి సారూప్యమగు పొంగు లేక మశూచికముచే సోకబడినప్పుడు విసుగుజెందించు ప్రమాదకరమైన నీవ్యాధులయొక్క అన్నియవస్థలకు తప్పకలోనుగావలసి యుండును. (ఈవ్యాధియందు తన దీర్ఘకాలవ్యాధి నివారణమైనప్పటికి) మరియు వరుస క్రమమున తిరిగి యీవ్యాధులను నివారణ చేయవలసి యుండును. అదృష్ట వశాత్తు సంభవించు యుట్టి సమ్మేళనము (Concurrence) మూలమున సారూప్య పద్ధతిని సంభవించు అద్భుతనివారణలను కొన్ని ఎత్తి చూపించవచ్చును. మరియు ప్రధానమైన ప్రకృతి చికిత్సా శాసనముల ననుసరించి నిరాక్షేపణీయమైన అనేక దృష్టాంతము లిందు లభింపగలవు. ఎట్టివన: లక్షణ సారూప్య మూలమున నివారణ.

## 51.

ఈదృష్టాంతమును బట్టి విజ్ఞానులకు యీచికిత్సా సూత్రము తేటతెల్లము కావింపబడుచున్నది. మరియు ప్రకృతి తన సృష్టివిధాన కాలచక్రములో మానవునకెట్టి అనుకూలము లేర్పరచియుండెనో గాంచనగును. వ్యాధి బాధితులగు తోడి మానవుల సహాయార్థము ప్రపంచక సృష్టియందంతటను విస్తరించి ఎన్నివేల సారూప్యరోగకర ప్రతినిధులు (ఔషధములు) మానవుని అధీనమున గలవు! సమస్తమైన గోచర, అగోచర,

స్వాభావిక వ్యాధులకు స్వారూప్య సహాయమొనర్చుగల సర్వ విధముల, వివిధరకముల గుణములుగల వ్యాధులను ఉద్భవింప జేయగలశక్తి వీనియందు గలదు. ఈకల్పిత రోగకరప్రతినిధులు అనగా ఔషధములు అతిసూక్ష్మ రూపములోనికి కంటికగు పడని అతిసూక్ష్మరూపములోనికి గూడ విభజింపబడి మరియు నివారణ చేయదలచిన సారూప్యమగు స్వాభావిక వ్యాధికంటె కొలదిగ బలమగు స్థితిలో నుండునంత సూక్ష్మరూపములోనికి దీసికొనివచ్చి ప్రయోగింపబడుటచే నీఔషధములు గావించు నివారణా కార్యము పూర్తియైన పిమ్మట (చిహ్నమునకువలె) వేరుచికిత్సచే తొలగింప నవసరము లేకుండ జీవశక్తిచే జయింప బడి తక్షణమే అదృశ్యమగుచున్నవి.గాన యీనిరుపమానమైన చికిత్సాపద్ధతియందు దీర్ఘకాలమునుండి నిలచియున్న వ్యాధిని నిర్మూలము చేయుటకు గూడ శరీర నిర్మాణమును తీవ్రముగా నెదుర్కొన నవసరములేదు. ఈ పద్ధతి ననుసరించి నివారణ కంటికగుపడక సౌమ్యముగ జరిగి, బాధించుచున్న వ్యాధిస్థితి యాశించు శాశ్వతమైన ఆరోగ్యస్థితిలోనికి త్వరితముగ మార్పు చెందుచున్నది.

## 52.

ప్రధాన చికిత్సా పద్ధతులు రెండు మాత్రమే గలవు అందొకటి ప్రకృతి యొక్క సక్రమ పరిశీలనమీదను జాగరూకతతో గూడిన పరిశోధన మీదను, యదార్థమైన అనుభవము

మీాదను కేవలము ఆధారపడియున్న సారూప్యౌషధ పద్ధతి. రెండవది వైరూప్య పద్ధతి (అల్లోపతి). ఈ రెండు పద్ధతులు ఒకదానినొకటి ప్రతిఘటించును. ఈ రెండు పద్ధతుల యందును పరిచయములేని వ్యక్తిమాత్ర మీా రెండింటికిని సుముఖభావముగలదనియు లేక నీ రెండును కలిపి నడపింపబడగలవనియు, లేక రోగి యొక్క అభిలాషను బట్టి ఒకసారి హోమియోపతీ చికిత్స వేరొకసారి అల్లోపతీ చికిత్స గావించవచ్చుననియు, తప్పు అభిప్రాయము గలిగియుండ వచ్చును. ఇట్టివిధముగ అవలంభించు వైద్యవృత్తి భగవదంశా సంభూతమగు సారూప్యౌషధ పద్ధతి యెడల గావించు ద్రోహ వృత్తియని పిలువబడును.

## 53.

అనుభవమునుబట్టియు ప్రత్యేక ప్రమాణ సారాంశము లను బట్టియు మనము తెలిసికొనిన విధముగా (7–25) యదార్థమైన సౌమ్యమగు నివారణలు సారూప్యౌషధ చికిత్సాపద్ధతిని మాత్రమే సంభవింపగలవు. ఈనివారణా సూత్రము అనంత మైన అమోఘమగు ప్రకృతి శాసనములపై ఆధారపడి యుండుటచే యీాచికిత్సా విధానమున అతిశీఘ్రముగ మిక్కిలి నిశ్చయముగ శాశ్వతమైన నివారణములు లభింపగలవు.

యదార్థమైన ఒక్కసారూప్యౌషధ చికిత్సావిధానము మాత్రమేమానవవిజ్ఞానమునకు సాధ్యమగు సరియైన పద్ధతి. రెండు అంశములమధ్య ఒక నిడివిగీటు గీయుటయెట్లో అట్లే యీానివారణా సూత్రము నివారణకు సూటియైనమార్గము.

## 54

వైరూప్యౌషధ చికిత్సాపద్ధతి (అల్లోపతి) వ్యాధుల యందు సర్వసామాన్యముగ అననుకూలమైన అనేకవస్తువులను ఉపయోగించుచు విధానములని (Systems) పిలువబడు వివిధ పద్ధతులలో అనేక సంవత్సరములు వ్యాప్తిజెందెను. (పాలించి యుండెను). ఈవిధానములు కాలానుగుణ్యముగ ఒకదానినొకటి యనుసరించి ఒకదానికొకటి మిక్కిలి విభేదమగుచు శాస్త్రీయ వైద్యమని పేరుతో గౌరవింపబడియుండెను. ♦1

ఇట్టివిధానములను నిర్మించిన ప్రతినిర్మాణకర్తయు తాను ఆరోగ్య జీవితమునందలి అంతరంగ స్వభావమును, వ్యాధిగ్రస్త శరీరమునందలి అంతరంగ స్వభావమును స్పష్టముగ తెలిసికొనుటకును, రోగినుండి యేహానికర పదార్థమును వెడలగొట్టవలయునో రోగికి ఆరోగ్యము చేకూర్చుటకు నీహానికర పదార్థమును ‡2 నెట్లు వెడలగొట్టవలయునో తెలిసికొని తదనుగుణ్య

---

♦1 ప్రకృతి పరిశీలన మీదను, యదార్థమైన పరిశోధ నానుభవముల మీదను ఆధారపడిన శాస్త్రనిర్మాణమునందు వ్యర్థమగు ఊహలకు పాండిత్య ప్రకర్షణా ప్రగల్భములకు స్థానముండినట్లు!

‡2 శరీరము నందలి ప్రాణముమీద ఔషధములు పనిచేయునట్లు వ్యాధులకు కారణభూతములు వ్యాధికర ప్రతినిధుల యొక్క నిరాకారశక్తి యొక్క గుణములని (11 నోటు) యింతవరకు నెవ్వరును తెలిసికొనజాలక పోవుటచే వ్యాధులయందు నివారణ జేయవలసినదొక తొలగింపవలసిన స్థూల పదార్థమని భావింపబడు చుండెను.

ముగ ఔషధనిర్ణయము గావించితినని భావించియుండెను. అనుభవజ్ఞుల ఉపదేశములను నిష్పక్షపాతబుద్ధితో ఆకర్ణింపక నిష్కపటముగ ప్రకృతిని గమనింపక వ్యర్థమగు ఊహాలనుబట్టి, నిరంకుశభావములనుబట్టి యిదియంతయు గావించి వ్యాధిపరిస్థితిని లోతుగ పరిశీలనజేయగలిగితినని గర్వించియుండెను. వ్యాధులు ఒకేవిధముగ తిరిగి సంభవించు నియమమునకు లోబడియుండగలవని వీరిచేతలంపబడెను. గాన యీవిధాన నిర్మాణకర్తయగు ప్రతివ్యక్తియు తాను ఊహించినవ్యాధి చిత్రములకు నామకరణములేర్పరచుటచే ఒక్కొక్క విధానము ఒక్కొక్కవిధముగ ఒకదానికొకటి విభేదముగ నీవ్యాధుల నామములను తరగతులుగ నేర్పరచియుండెను. ఈవిపరీత పరిస్థితులను (వ్యాధులను) నివారణ జేయగలవని యనుకొనిన గుణములు వీరిచే ఔషధములకారోపణజేయబడెను. (గనుకనే ఔషధపదార్థతత్వశాస్త్రమును (Materia medica) గూర్చి అసంఖ్యాకములైన గ్రంథములు వెలువడెను) *3

*3 ఈ యాశయమీడేరుటకు తరుచుగ పెద్దమోతాదులలో ప్రయోగించుటకు పలువిధములైన ఔషధములను నిరంతరము విశేషముగ ఔషధ సంపుటీకరణము నామమున మిశ్రమము గావించి ప్రయోగించి అందుపై అమూల్యమైన మానవ ప్రాణి, అక్రమ మార్గప్రవర్తకులగు నీవైద్యుల చేతులలో అపాయస్థితిలోనికి దీసికొని రాబడుచుండెను. ముఖ్యముగా కల్పిత రక్తస్రావములు (Venesections) వమనకరౌషధములు Emetics భేదిమందులు (Purgatives) పట్టీలు (Plasters) వాతలు మొదలగు సాధనములు రోగి ప్రాణమునుమిక్కిలి అపాయ స్థితిలోనికి డీసుకొని వచ్చెను.

## 55

ఇట్లు ప్రవేశపెట్టబడిన నీపత్రితివిధానమును, యీప్రతిపద్ధతిని సరిగ అనుసరెంచిన పక్షమున, రోగులయొక్క బాధలు హెచ్చి విపరీతస్థితిలోనికి దీసికొనివచ్చుచుండెనని శీఘ్రకాలములోనే ప్రజలు విశ్వసింపగలిగిరి. అశాస్త్రీయముగ తెలిసికొనబడిన ఔషధములనుండి అప్పుడప్పుడు, లభించు, ఉపశమనకరమగు బాధ విమోచనమే లేనిపక్షమున నీఅల్లోపతీవైద్యులను చాలకాలము క్రిందటనే ప్రజలువిడిచిపెట్టియుందురు. ఈఔషధముల యొక్క తాత్కాలికగుణము రోగులకు స్పష్టమైనది. ఈతాత్కాలిక బాధ విమోచనమే కొంతవరకు అల్లోపతీ వైద్యుల పరపతి నిలుపుచున్నది.

## 56

'వ్యాధిలక్షణములకు వైరూప్యలక్షణములను కలుగ జేయు ఔషధములచే వ్యాధులు నివారణ యగును' యని గేలెక్ యొక్క ఉపదేశముల ననుసరించి ప్రవేశ పెట్టబడిన యీఉపశమనకర పద్ధతిమూలమున (వైరూప్యపద్ధతి) పది హేడు శతాబ్దముల వరకు శీఘ్రముగ ఉపశమనము గావించు చికిత్సతో నీవైద్యులు ప్రజలను వంచించుచు ప్రజా విశ్వాసము సంపాదింప నాశించి యుండిరి. ఈచికిత్సావిధానము మూలసిద్ధాంతమున నెంతనిరుపయోగమై హానికరమైయున్నదో (త్వరితగతిని వృద్ధిపొందని వ్యాధులలో అనగా దీర్ఘవ్యాధు

లలో) అనంతర ఫలితములనుబట్టి మనము గాంచగలము. స్వభావసిద్ధముగ జనించిన వ్యాధిచే కలుగజేయబడు బాధలలో కొంతభాగము మాత్రము అల్లోపతీవైద్యులచే అవలంబింపబడు చికిత్సయందు నిశ్చయముగ కొంత ప్రత్యక్షసంబంధము గలదు. గాని ఎట్టివిధమగు సంబంధము? దీర్ఘవ్యాధికి లోనైన రోగిని మోసగించి పరిహాసాస్పదము గావింప దలంచిన పక్షమున సత్యదూరమైన (న్యాయమైన చికిత్సకు ప్రతిపక్షమైన) యీచికిత్స నెల్లరు పరిత్యజింపవలసి యున్నది. ♦ 1

---

♦ 1 "ఐసోపతీ" అని పిలువబడు పద్ధతిమూలమున, మూడవపద్ధతిని వ్యాధులకు ఔషధప్రయోగము నిర్మాణము జేయుటకు ప్రయత్నింపబడెను. అనగా, వ్యాధి దేనిమూలమున, ఉద్భవింపజేయ బడుచున్నదో ఆసంపర్క పద్ధతిమూలముననే (contagious principal) వ్యాధిని నివారణజేయు పద్ధతి ఐసోపతీ. ఇట్లు వ్యాధినివారణ జరుగగలదని అంగీకరించినప్పటికి, ఉన్నత చలనవర్ధిత శక్తికరణము (సూక్ష్మశక్తి) గావించుట మూలమున (potentized) మార్పుజెందింపబడినస్థితిలో నీరసి(Virus) ఔషధరూపముగా ప్రయోగింపబడినప్పుడు, సారూప్యమును సారూప్యము నెదుర్కొనుటవలన నివారణ కలుగుచున్నది. ఒకవ్యాధిని ఆవ్యాధిసంబంధమైన పదార్థముతో గూడినపాటెన్సీమూలమున నివారణజేయయత్నించుట, సర్వసామాన్య మానవ వివేకమునకు అనుభవమునకు, విరుద్ధముగ యగుపడగలదు. ప్రథమముననీ ఐసోపతీవిధానమును దీసికొనివచ్చిన ప్రముఖులు, టీకాలు వేయుటమూలమున, అట్టిటీకాలు వేయబడిన వ్యక్తులకు ముందు మశూచికము సోకకుండ రక్షింపబడి యీవిధముగ నీటీకాలు ముందుగనే వ్యాధినివారణ జేసియుండెనని తలంచి యీపద్ధతిని మానవజాతికి ఉపయోగము కలుగజేయవచ్చునని బహుశః తలంచి యుండవచ్చును. ఆవులయొక్క మశూచికము విధమైనవ్యాధి (cowpox) మనుష్యులకు సంభవించు మశూచికము ఒకరీతిగా నున్నప్ప

## 57

ఈవైరూప్యౌషధ చికిత్సాపద్ధతి (అల్లోపతీ) ననుసరించి చికిత్సజేయు సాధారణ వైద్యుడు వ్యాధియందుగల అనేకలక్షణములలో తక్కినలక్షణములపై లక్ష్యముంచక బాధించు ఒక్క లక్షణమునందు లక్ష్యముంచి ఆలక్షణమునకు వ్యతిరేకలక్షణము కలుగజేసి అణచిపెట్టగల మందును పదిహేను శతాబ్దముల ప్రాచీనమైన వైరూప్యవైద్య శిద్ధాంతము ననుసరించి ప్రయోగించుటచే సత్వర బాధోపశమనము కలుగజేయగలదు. ఈ అల్లోపతీ వైద్యుడు సమస్తవిధములగు పోట్లకు నల్లమందును

---

టికి ఒకేవ్యాధిమాత్రముగాదు. అనేకవిషయములలో నీరెండింటికి భేదము గలదు. కౌపాక్స్ సౌమ్యమైన త్వరితగమనముతో నుండును. మరియు సామీప్యమునుబట్టి (దగ్గరతిరుగుటనుబట్టి) మనుష్యులకు వ్యాపింపదు. ఈ భయంకర మశూచికవ్యాధిని యావన్మంది ప్రజలకు టీకాలువేయుటమూలమున రూపుమాపుటచే దీనిని గూర్చి ఆధునికులు విస్పష్టమైన భావములు కలిగియుండుట కవకాశము లేదు.

మరియు ఈవిధముగనే నిస్సందేహముగ జంతువులకు సంభవించు విచిత్రమైన కొన్నివ్యాధులు మనుష్యులకు సంభవించు సారూప్యమైన అట్టి ముఖ్యమైనవ్యాధులకు ఔషధములను లభింపజేసి యీవిధముగా సారూప్యౌషధములయొక్క సంఖ్యను వృద్ధిజేయగలవు.

గాని మనుష్యుని శరీరమునుండి వ్యాధి పదార్థమును దీసికొని (మనుష్యునియొక్క చిదుముపొక్కునుండి రసిదీసికొని) అట్టి చిదుమువ్యాధికిగాని అందుపైజనించిన లక్షణములకుగాని ఉపయోగించుట.——?

ఇందుమూలమున వ్యాధి ఉద్రేకించుట, బాధకలుగుటతప్ప వేరేమియు సంభవింపదు.

పెద్దమోతాదులలో నిచ్చును. ఏలనన యీమందు స్పర్శజ్ఞాన మును మొద్దుబారజేయును. విరేచనములను కట్టుటకుగూడ దీనినే ఉపయోగించును. ఏలనన యీమందు మలకోశముల యొక్క ఉద్రేకమును మొద్దుబారజేసి ఉద్రేకమును తగ్గించి వెంటనే విరేచనములను ఆపుజేయును. నల్లమందు త్వరలో మగతతోగూడిన నిద్రమత్తుకలుగజేయ గలిగియుండుటచే నిద్ర లేమికి అనగా నిద్రపట్టించుటకు కూడ యీమందునే అల్లోపతీ వైద్యులు ఉపయోగింతురు. దీర్ఘకాలమునుండి మలబద్ధముచే బాధబడుచున్న రోగికి యీవైద్యుడు భేదిమందులిచ్చును. కాలినచేతిని యిందద్రిజాలమువలె తక్షణమే మంటతగ్గినట్లగపడు తక్కువ ఉష్ణములోనున్న చన్నీటియందు బెట్టించును. శరీరము నందలి ఉష్ణముతగ్గి చలిచేబాధపడు రోగికివెంటనే వెచ్చదనము కలుగజేయు ఉపచారములు గావించును. దీర్ఘకాలమునుండి నీరసముచే బాధపడురోగికి వెంటనే బలముకలిగి శక్తిగలుగ జేయు సారాయిని యిప్పించును. ఈవిధముగనే వైరూప్యమైన యితర నివారణసాధనము లుపయోగించును. పైనజెప్పిన వాని కంటె ఏకొలదిసాధనములు మాత్రమోగాని అంతకంటెవేరొండు లేవు. సామాన్య (అల్లోపతీ) వైద్యునకు కొలదివస్తువులను గూర్చిమాత్రమే విశేషగుణము తెలిసియుండుటచే నీవైద్యుల యథీనమున నింతకంటెవేరొండు సాధనములులేవు.

## 58

ఇట్టివిధముగా మందులను ప్రయోగించు పద్ధతి యొక్క విలువను అంచనావేయుటలో యీపద్ధతి చాలతప్పులక్షణ సంబంధచికిత్సాపద్ధతి, (7 వ్యాఖ్యానము) యనిమనము వదలి వేయవచ్చును. ఈచికిత్సాపద్ధతియందు వైద్యుడుఒక్కలక్షణ మునుబట్టి ప్రత్యేకము ఒక్కప్రత్యేక పక్షముగ, తనదృష్టిని కేంద్రీకరించుట మూలమున సంపూర్ణవ్యాధియందలి కొంతభాగమునకు మాత్రమే వైద్యుని యొక్క లక్ష్యముంచ బడుటను బట్టి, రోగికోరుయావత్తు లక్షణములకు విమోచనము, నిస్సంశయముగ లభింపజాలదు. విశేషముగ భాధించు దీర్ఘవ్యాధి యందిట్టి వైరూప్యౌషధములను ప్రయోగించుటచే రోగోపశమనము గలిగినపిమ్మట తిర్గి యావత్తువ్యాధియు దోకము జెందకుండ యుండగలదా! యని మనము అనుభవమునుబట్టి యడుగ వచ్చును. జాగరూకుడైన ప్రతిశోధకుడును యిట్టివైరూప్యౌషధ చికిత్సా ఫలితమైన కొలదికాలోపశమనమునకు పిమ్మట ప్రతివ్యాధియందును (ఒక్కటియు విడువకుండ) రోగోద్రేకము కలుగగలదని అంగీకరించును. గాని పిమ్మటవచ్చు యిట్టిరోగోద్రేకమును యీసాధారణవైద్యుడు (అల్లోపతీ) అసలువ్యాధి యొక్క దుష్టగుణమనియే ఆరోపించును. 1♦ లేదా క్రొత్త వ్యాధి సంభవించినదని తెల్పును.

♦1 ఇట్టి ఉపశమనచికిత్సానంతరము నిశ్చయముగా సంభవించు ఉద్రేకమును ఇదివరలో వైద్యులు సక్రమముగా గమనించు నలవాటుపడి

## 59

విడువక బాధించు వ్యాధియొక్క ముఖ్యలక్షణములు యిట్టి ఉపశమనకర వైద్యౌషధముల మూలమున చికిత్స చేయబడినప్పుడు తాత్కాలికముగ కొంతరోగోపశమనము గలిగినను పిమ్మట కొలది గంటలలో తిరిగి స్పష్టమైన రోగోద్రేకము కలుగకుండ నెప్పుడును చికిత్సజేయబడి యుండలేదు. పగటియందు విడువకుండ బాధించు నిద్రమత్తునకు వైద్యుడు చురుకుదనము కలుగజేయు కాఫీనిప్పించును. కాని యీకాఫీ యొక్క శక్తి తగ్గినవెంటనే పగటిపూట నిద్రమత్తు ఎక్కువగును. రాత్రి తరుచు నిద్రమెలుకువ వచ్చుచుండు స్థితియందు యితర లక్షణములయందు లక్ష్యముంచక సాయంత్రమున నల్లమందు నిచ్చివేయును. అందుచే నల్లమందుయొక్క ప్రథమ గుణమునుబట్టి సబబైన మొద్దునిద్రపట్టి అటుపిమ్మట రాత్రులయందు అంతకుపూర్వముకంటె నెక్కుడుగ నిద్రలేకుండ పోవును. దీర్ఘ

---

యుండనప్పటికి, యిట్టి ఉపశాంతకర చికిత్సానంతరము నిశ్చయముగా సంభవించు రోగోద్రేకము వారిదృష్టినుండి పూర్తిగ తొలగియుండలేదు. "సారాయి మొదలగు మత్తుపదార్థములను, నీరసము తగ్గించుటకిచ్చునప్పుడు, సరియైనబలము కలుగజేయుటకుమారు, యిచ్చినవెంటనే ఎంతశక్తి గలుగ జేయునో అటుపిమ్మట అందుకుతగినంత నీరసము లోనికి దింపివేయును. గాన యిందుమూలమున ఏవిధమగు లాభము లేకపోవుటయేగాక, ఎక్కువ నష్టము కలుగగలదని జె. హంటరు అను వైద్యుడు సుఖసంబంధ వ్యాధులను గురించి గ్రంథములో 13వ పేజీయందు తెల్పియుండెను.

కాలమునుండి వెడలుచున్న విరేచనములకు యితరవ్యాధి లక్షణములయందు లక్ష్యముంచక మలకోశమున మలబద్ధము గలుగజేయు ప్రథమ గుణముగలిగిన నల్లమందును ప్రయోగించినంతనే విరేచనములు నిలుపుచేయబడి తాత్కాలికముగ మార్పుజెందినప్పటికి పిమ్మట అంతకంటె దుస్థితి సంభవించగలదు. తరుచు నచ్చుచుండు విపరీతమైన సమస్తవిధములగుపోట్లను యీప్రాచీన విధానవైద్యుడు నల్లమందుచే కొలదికాలము మాత్రము అణచిపెట్టగలడు. కాని కొలదికాలములోనే తిర్గి ఆబాధలు పూర్వముకంటె ఉద్భృతముగ భరింపజాలని తీవ్రముతో రాగలవు లేక వానిస్థానే అంతకంటె విశేషమైన దుష్టవ్యాధి సంభవించగలదు. దీర్ఘకాలమునుండియు రాత్రియుద్రేకించు దగ్గుయొక్క ఉద్రేకము నణచిపెట్టవలయుననిన నల్లమందును ప్రయోగించుట తప్ప వేరొండీ అల్లోపతీ వైద్యునకు తెలియదు. మొదటిరాత్రి బహుశ దగ్గుతగ్గవచ్చును. గాని అటుపిమ్మట రాత్రులయందు అంతకంటె దుస్థితిలో నాదగ్గు రాగలదు. ఉపశాంతికరమగు యిట్టిమందును మోతాదులు హెచ్చించి తిరిగితిరిగి ప్రయోగించి అణచిపెట్టుటచే జ్వరము, రాత్రిచమటపట్టుట మొదలగు క్రొత్తలక్షణములుగూడ వ్యాధికి చేర్చబడును. మూత్రకోశము యొక్క బలహీనత అందుపై సంభవించు మూత్రము బంధింపబడుట మొదలగుస్థితిని వ్యతిరేక గుణము కలుగజేయు కేంథారైడ్సు ప్రయోగించుటచే మూత్రద్వారమునకు ఉద్రేకము కలిగి ప్రథమమున మూత్రముతప్పక జారీయగును. గాని

త్రిగ్గి మూత్రము బంధింపబడినప్పుడు యీఔషధము నొసగిన మూత్రకోశము కొలదిగామాత్రమే ఉద్రేకింపబడును. అటు పిమ్మట అంతకంటె తక్కువగామాత్రమే ఉద్రేకింపబడి క్రమముగా ముడుచుకొనుటకు శక్తి లేక కడకు మూత్రకోశమునకు పక్షవాతము తప్పక వచ్చితీరును. తరిచు విరేచనములను కలుగజేయు పెద్దమోతాదులతో గూడిన భేదిమందుల మూలమున దీర్ఘకాలమునుండి గల మలబద్ధమును తొలగింప యత్నించుచున్నప్పుడు యీభేదిమందులవలన తాత్కాలికోపశమనము కలిగినప్పటికి ఔషధద్వితీయ గుణమునందు (secondary action) మలబద్ధము మిక్కిలి అధికమగును. సాధారణఅల్లోపతీపై ద్యుడు దీర్ఘకాలమునుండిగల నీరసమును సారాయివలన పోగొట్టుటకు యత్నించును. ప్రథమగుణమునందు( primary action )యీ సారాయి ఉత్సాహము కలిగించినప్పటికి ద్వితీయగుణమునందు (secondary action) అంతకంటె నీరసస్థితిలోనికి శక్తి తగ్గిపోవును ఈవైద్యుడు దీర్ఘకాలమునుండి నీరసస్థితిలోనికివచ్చి జలుబుతోనున్న జీర్ణకోశమును చేదుపదార్థములను, వేడిచేయు వస్తువులను యిచ్చుటమూలమున బలము కలుగజేసి వేడిచేయుటకు ప్రయత్నించును గాని యిట్టి ఉపశమనకర వస్తువుల నుపయోగించుటమూలమున ద్వితీయగుణమునందు అంతకుపూర్వము కంటె జీర్ణకోశమునకు చురుకుతగ్గగలదు. దీర్ఘకాలమునుండి తగ్గియున్న శరీరఉష్ణమును, శీతల తత్వమును, ఉష్ణోపచారముల మూలమున వేడిచేయప్రయత్నింప పిమ్మట అంతకంటె నీరసము

నకు, చలికి, శీతలమునకు లోనగును. తీవ్రముగాకాలిన భాగ ములను చన్నీళ్ళతో తడుపుటమూలమున తక్షణమే బాధకు ఉపశమనము కలిగినప్పటికి అటుపిమ్మట మంట, బాధ విపరీత మును ఎక్కువై విశేషముగ వాపువృద్ధిజెంది వ్యాపించును. దీర్ఘకాలమునుండి యున్న రొంపచే ముక్కులు బిగబట్టియున్న ప్పుడు తుమ్ములు గలుగజేయు మందులచే స్రావము కలుగ జేసి తొలగింప ప్రయత్నింప నిట్టివ్యతిరేకలక్షణములను కలుగ జేయు మందులచే వ్యాధి ఉద్రేకించునని ప్రథమమున గమనింప బడదు. గాని ద్వితీయగుణమునందు అంతకుపూర్వముకంటె ముక్కులు బిగబట్టును. దీర్ఘకాలమునుండి చాలనీరసస్థితితో దాదాపు పక్షవాత స్థితిలోనున్న అవయవములకు విద్యుచ్ఛక్తి వలన ప్రథమగుణమునందు కండరములకు బలముగలుగజేసి అవయవములు చురుకుగా కదలునట్లు ఉద్రేకము కలుగజేయబడి నప్పటికి ద్వితీయగుణమున కండరములు పూర్తిగాచైతన్య విహీనమై మొద్దుబారి ఆభాగమునకు పూర్తియైన పక్షవాతము సంభవించును దీర్ఘకాలమునుండిగల శిరస్సునకుకలుగు ఎక్కువ రక్తప్రసారమువలన సంభవించు రక్తపుపోటునకు రక్తనాళమున రంధ్రముజేసి నీవ్యాధిని తొలగింప ప్రయత్నించినప్పుడు అందు మూలమున తాత్కాలికోపశమనము కలిగినప్పటికి అటుపిమ్మట అంతకంటె నెక్కుడుబాధ కలుగగలదు. సన్నిపాతము మొద లైన అనేకములైన వ్యాధులయందు సంభవించు స్మృతితప్పుట తోగూడిన అవయవ సంబంధమైనట్టియు మెదడు సంబంధమై

స్ట్రీయు పక్షవాత సంబంధమైన మాంద్యమును సంధి మొదలగు వ్యాధిస్థితులను చికిత్సజేయుటకు సాధారణ అల్లోపతీ వైద్యునకు జటామాంసియను ఓషధిని (valerian) పెద్దమోతాదులలో నిచ్చుటకంటె వేరొండు తెలియదు. ఈమందు చైతన్యశక్తి కలుగచేసి చలనశక్తి కలుగజేయుటలో చాలశక్తివంతమైన ఔషధమగుటచే దీనిని ప్రయోగించెదరు. వారి అజ్ఞానములో యీయౌషధము ప్రథమగుణమున కొంచెము సుగుణమగుపరచి నప్పటికి అది గతించిన పిమ్మట ద్వితీయగుణమున యింకను నెక్కువ మగతతో స్మృతితప్పించి అవయవములకు మనస్సునకు పూర్తిగ పక్షవాతము సంభవింపజేసి మరణమునకు కారణభూతము కాగలదని తెలిసికొనజాలరు.

ఇట్టివ్యాధులలో విస్తారము నీవైరూప్యౌషధముల్ను ప్రయోగించుటచేతనే నిశ్చయముగా రోగిప్రాణముతీయుటతో నీఔషధగుణ మంతయొందునని వారుగాంచియుండరు. ఇతర వస్తువులతో మిశ్రముగావింపక పర్ పుల్ ఫాక్స్ గ్లోవ్ అను మందును ప్రయోగించి అతిసున్నితముగాను వేగముగానుకొట్టుకొను నాడియొక్క వేగమును చాల గంటలవరకు తగ్గింపగలిగితినని అల్లోపతీ సాధారణ వైద్యుడు సంతోషించును. గాని ప్రథమగుణమునందీవేగము తగ్గినప్పటికి ద్వితీయగుణమునందు నాడి తిరిగి యథారీతి వేగమునకు రాగలదు. అటుపై మోతాదులను హెచ్చించి తరుచుతరుచు యిచ్చుచున్నకొలది నాడియొక్క వేగము క్రమముగ తగ్గుటయగుపించక అందుకుమారుగ ద్వితీయ

గుణమునందు లెక్కింప నశక్యమగు వేగమునకు నాడివచ్చి వేయును. ఇందుకు ఫలితముగ నిద్రలేమి, అగ్నిమాంద్యము, నీరసము సంభవించి రోగిసత్వర మరణమున కాసన్నమగును. లేదా ఉన్మాదము సంభవించును. ఇట్టిపై రూప్యౌషధముల మూలమున ద్వితీయగుణమునందు తరుచువ్యాధి యెట్లు ఉద్రేకముచెందుచున్నదో మరియు పూర్వముకంటె నెట్లు వ్యాధిదుస్థితిలోనికి వచ్చుచున్నదో ప్రాచీనవైద్యులు (అల్లోపతీ) తమ అప్రమాణమైన సిద్ధాంతములతో నీవిషయమును గాంచలేరు. గాని యీవిధానము మిక్కిలి ఘోరమైన విధానమని అనుభవము తెలుపుడు చేయుచున్నది.

వైరూప్యౌషధములను ప్రయోగించుటచే స్వాభావసిద్ధముగ జనించు యిట్టిదుర్గుణములు సంభవించిన పక్షమున సాధారణ అల్లోపతీవైద్యుడు వ్యాధితిరిగి ఉద్రేకము జెందిన సమయమున పూర్వముకంటె బలతరమైన మోతాదులనిచ్చి యీ పరిస్థితిని సులభముగ తొలగించగలనని తలంచును. గాని యిందుమూలమున వ్యాధి నిర్మూలమగుటకు బదులు అందుకు సరిసమానముగనే అణచిపెట్టబడును. ♦1 తిరిగి యిట్లే ప్రతిసారియు

---

♦1 రోగుల కొసగబడు సర్వసాధారణ సమస్త ఉపశమనకరౌషధములు (యిచ్చట వివరింపబడినవిధముగా) వానియొక్క అనంతరఫలితములయందు, వ్యాధిని వృద్ధిజేయును. దీనిని ప్రతిఘటించుటకు ప్రాచీనవిధానవైద్యులు యింకను బలమైన మోతాదులను తిరిగితిరిగి ప్రయోగింపవలసివచ్చును. గాని యిందుమూలమున తిర్గి వ్యాధి సంభవింపకుండుటగాని,

నీఉపశమనకర ఔషధమోతాదులను వ్యాధి ఉద్రేకించిన కొలదియు హెచ్చుజేయుచు నీయవలసిన అవసరము విశేష

---

వృద్ధిజెందకుండుటగాని జరిగియుండలేదు. ఇరువదియైదు సంవత్సరములకు పూర్వము, బ్రౌసీయా యను నాతడు ఔషధసంపుటీకరణమునందు (Prescriptions) పలువిధములైన మందులను అవివేకముగ మిశ్రమము గావించు పద్ధతిని రూపుమాపి (యిందులకీతనియెడ మానవజాతియెంతయు కృతజ్ఞులు) శరీరధర్మసంబంధపద్ధతి (Physiological system) యను యొక చికిత్సాపద్ధతిని (అంతకు పూర్వమే నిర్మాణము చేయబడిన హోమియో పతీపద్ధతిని గుర్తింపక) ప్రవేశపెట్టియుండెను. ఆకాలమున ప్రచారములో నున్న ఉపశమనకరౌషధములమూలమున నిట్టిచికిత్స గావింపబడజాలకుండెను.

సౌమ్యమైన ఔషధములతో, వ్యాధిని నివారణజేసి ఆరోగ్యము చేకూర్పజాలక రోగులబాధలను శాంతింపజేయుటకు బదులు ప్రాణోపద్రవము కలుగజేసి, కడకు ప్రాణహానిగూడ కలుగజేయు, సులభమైనమార్గము బ్రౌసీ కనిపెట్టియుండెను. ఈచికిత్సాపద్ధతి అతని సమకాలికులకు తృప్తికరముగనుండెను. ఎంతవరకు రోగి తనబలము నిలుపుకొనియుండునో, అంత హెచ్చుగ ఆతనిబాధలు స్పష్టముగ యగుపించి, అంతవిశేషముగ బాధల ననుభవించుచుండును. రోగి మూల్గుచుండును, నిట్టూర్పు విడుచుచుండును, బిగ్గరగా నేడ్చుచుండును. సహాయముకొరకు కేకలిడును. వైద్యుడు త్వరితముగ వచ్చి బాధ తగ్గించుటకు గట్టిగా కేకలిడును. బాధనుతగ్గించుటకీ బ్రౌసీ పద్ధతియందు జీవశక్తి బలహీనము గావింపబడును. బాధను తగ్గింపవలసినకొలదియు రోగి అంత హెచ్చుగ బలహీనము గావింపబడును. అనగా అంత తరుచుగా, జలగలమూలమునను, రక్తము స్రవింపజేయు పరికరములమూలమునను రక్తస్రావము గావింపబడి జీవరసములు హరింపజేయబడును. (యీబాధలకన్నిటికిని రక్తమే కారణభూతమని యాతనియుద్దేశ్యము) ఎంతవరకు రోగియొక్క జీవద్రవములు హరింపజేయబడునో, తన బాధలను వెల్లడిజేయుటకు రోగి అంతటి బలహీనతలో

ముగలిగి యిందుమూలమున క్రమక్రమముగా నింతకంటె వే
పమాదకరమైన వ్యాధిలోనికి దిగుటయు, జీవితమునకే తరు
నుండును. రోగి నీరసించినకొలదియు, శాంతిగలిగియున్నట్లగుపడును
అందుపై ఆతనియొక్క వ్యాధి సుగుణముగానున్నదని, సన్నిహితులానంది
తురు. గాని యీదృశ్యరోగమో, శ్వాసబాధో, భయమో, బాధో
యేదికానిండు, తిరిగి సంభవించి, ఆతనిస్థితి పూర్వపుస్థితికే తిరిగి జేరసంభవి
పై యుండగలదు.

దీర్ఘవ్యాధులలో, రోగి కొంతబలము కలిగియున్న స్థితియందు
ప్రాణిని బలహీనము గావించుటయును, అస్థిరితస్థితిని తొలగించుటకును
లంకణములు (Hunger diet) గట్టుదురు. రక్తస్రావములు గావించుట
జలగలపట్టించుట ఉష్ణోపచారములు గావించుట మొదలగు చికిత్సలచే రో
వీనిని తిరస్కరించుటకుగూడ నవకాశములేనంత మిక్కిలి బలహీనమై
స్థితిలోనుండును. తరుచుగ గావించు నిట్టికృత్యములచే సంభవించునీరసము
జీవశక్తికికలుగు శోషసుగుర్తింపబడకయేమృత్యువు సంభవింపగలదు. ఈ ర
స్రావముల మూలమునను ఉష్ణోపచారముల మూలమునను యగుపడిన సుగు
ణమును రోగియొక్క బంధువులర్థముజేసికొనజాలక, రోగి నెమ్మదిగ జా
పోయినప్పుడు ఆశ్చర్యమునొందుదురు.

దైవసాక్షిగా రోగికి బాధకలుగజేయు చికిత్సయేమియు గావింపబ
యుండలేదనియు, శస్త్రముచేయు కత్తికోత అంత బాధకలుగజేసియుం
లేదనియు, అరబిక్ ద్రావకము (బ్రౌనే యీ ఒక్క ద్రావకము
యుపయోగించెడివాడు) రుచికి సౌమ్యముగనే యుండుననియు, జలగల
రక్తముపీల్చుటలో అంత బాధకలుగజేయవనియు, శరీరమునుండి రక్తమ
బాధలేకుండ తీయబడెననియు, గోరువెచ్చని జలస్నానములు, చాలసుఖ
ముగ నుండుననియు, పరిశ్రమమునుండియు వ్యాధిచాల ప్రమాదకరముగ
నుండుటచే వైద్యునిచేగావింపబడిన ఈసమస్త చికిత్సలను వ్యాధిలొంగక
రోగి మృతినొందెననియు, యీవిధముగ రోగియొక్క బంధువులు ముఖ్య
ముగా రోగియొక్క ఆత్మీయబంధువులు దుఃఖోపశమనము గావించుకొందురు

ప్రమాదము కలిగి మరణము సంభవించుటయు తప్ప, దీర్ఘ కాలమునుండియున్న వ్యాధికి యీవైరూప్యౌషధముల మూలమున నివారణ యెప్పుడును సంభవింపజాలదు.

## 61.

వైరూప్యౌషధముల మూలమున కలుగు విచారకరమగు ఫలితములనుగూర్చి చింతింప అల్లోపతీ వైద్యులు సమర్థ

---

ఈవిధానము, చికిత్స కొరకు గ్రహించవలసి, మానసిక పరిశ్రమను తప్పించియుండుటచే (మానసిక పరిశ్రమ ఎండలో నిలబడి జేయు పనికంటెను కష్టమైనది) యూరప్ ప్రదేశమునందలి వైద్యులు తదితర దేశములయందలి వైద్యులు సమస్త వ్యాధులకు సులువైన ఈచికిత్సాపద్ధతిని చేపట్టి యుండిరి. ఈవిధానమును తాము నిర్మాణము చేసియుండలేదనియు వేలకొలది వైద్యులీవిధముగనే చికిత్స గావించుచుండిరనియు, తమగురువుబోధించినవిధముగా మరణముతో సమస్తము అంతమొందగలదనియు, నీవిధముగా, యీవిధాన యనువర్తనులు తమలో తాము తృప్తిపరచుకొని, మనస్సాక్షియొక్క బాధను, శాంతింపజేసికొందురు. నిర్దాక్షిణ్యముగ అనేక వేలవైద్యులు యీ బ్రౌసీ పద్ధతిని, నివారణజేయవీలగు రోగులయొక్క రక్తమును దీసివేసి, నెపోలియన్ చే గావింపబడిన యుద్ధమునందు మరణించిన వ్యక్తులకంటె, అధికముగ లక్షలకొలది మానవులప్రాణముల దీయుచుండిరి. యుక్తాయుక్త విమర్శనా పరిజ్ఞానముతో, ఎట్టివిషమగు శ్రమలకైననుఓర్చి, మనస్సాక్షితో ప్రవర్తించు, హోమోపతీవైద్యునిచే కృషి చేయబడు, సమస్తశాస్త్రములలో కెల్లను మిక్కిలి కష్టతరమైన, నివారణజేయవీలగు రోగులెల్లరికి స్వస్థత చేకూర్చి నూతనజీవితమును పొందజేయు, నీయథార్థమైన శాస్త్రీయ హోమోపతీపద్ధతి ఉద్భవించుటకు మునుపు, నివారణజేయవీలగు రోగుల ప్రాణములను చికిత్సచే నిర్మూలముగావించు బ్రౌసీ పద్ధతిమూలమున ప్రపంచము కండ్లు తెరువవలసియున్నదని భగవంతుని యుద్దేశ్యముగాబోలు!

లై యున్నచో "యదార్థమైన చికిత్సాశాస్త్రము, వ్యాధిలక్ష ణములకుఁ గావించు వ్యతిరేకచికిత్సాపద్ధతికి, సరియైన, ప్రతి కూలపద్ధతియందే గాంచనగును." అను మహోత్తమమైన సత్యమును చాలకాలముక్రిందటనే కనిపెట్టియుందురు: మరియు వ్యాధిలక్షణములకు వ్యతిరేకముగ ప్రయోగింపబడిన ఔషధ ములయొక్క గుణము తాత్కాలికోపశమనము మాత్రమే కలుగజేయగలదనియు, యిది గతించినపిమ్మట, తప్పక రోగో ద్రేకము కలుగగలదనియు, యీపద్ధతికి వ్యతిరేకపద్ధతియగు, సారూప్యపద్ధతి ననుసరించి లక్షణసారూప్యమునుబట్టి అల్లోపతీ వైద్యుల పెద్దమోతాదులకు బదులు, అతిసూక్ష్మమైన చిన్న మోతాదులలో ఔషధమును ప్రయోగించిన, శాశ్వతమైన సంపూర్ణమగు, నివారణకలిగి తీరుననియు నావైద్యులు విశ్వ సించియుందురు. ఈ వైరూప్యౌషధ చికిత్సవలన ప్రత్యక్ష ముగ యగుపించు ఉద్రేకముతప్ప వేరొండుయుండజాలదనియు, కాకతాళన్యాయముగా, ఔషధసంపుటీకరణమున, సారూ ప్యౌషధము పడుట సంభవించినప్పుడును, ప్రకృతిసిద్ధముగ (46లో చూపబడినవిధమున) అసలువ్యాధికి సరిసమానమైన లక్షణములుగల మరియొకవ్యాధి సంభవించి, వ్యాధియొక్క సత్వరనిర్మూలమునకు అనువగు పరిస్థితులు సంభవించినప్పుడును తప్ప యీవైరూప్యౌషధచికిత్సకు ఎన్నడును వ్యాధికి శాశ్వత మైన నివారణగావించి యుండలేదనియు యీ విషయముల యందలి సత్యమును యిన్ని శతాబ్దములలోను వారుగూఢ

(అల్లోపతీవైద్యులు) గ్రహింపజాలకున్నారు. ఈ సత్యము నందలి పరిజ్ఞానమొక్కటిమాత్రమే, రోగపీడితులకు లాభ దాయకమై ఉపయోగించగలదు.

62

వైరూప్యౌషధ చికిత్సయగు ఉపశమనచికిత్సవలన, నెట్టిహానికరమగు ఫలితములు పొందబడునో, యిందుకు వ్యతి రేకమైన సారూప్యౌషధ చికిత్సవలన నెట్టిప్రయోజనముగలదో నాకంటె పూర్వమెవ్వరునుకనుగొనని అనేకములైన పరిశోధనా సారాంశములపై యాధారపడియున్న యీక్రింది విషయముల వలన విశదీకరింపబడినది. ఈ పరిశోధనా సారాంశములు మిక్కిలి విస్పష్టములై ప్రత్యక్షములై నివారణాశాస్త్రమున అనంతమైన ప్రాముఖ్యము గలిగియున్నవి.

63

జీవశక్తిపై పనిచేయు ప్రతిఔషధము, కొలదిగనో, హెచ్చుగనో, జీవశక్తిని కలవరపరచి, స్వల్పకాలము, లేక దీర్ఘకాలము, వ్యక్తియొక్క ఆరోగ్యమున ఒకవిథమగుమార్పు చెందింపగలదు. ఇది ''ప్రథమగుణము'' (Primary action) అని పిలువబడును. ఇయ్యది, ఔషధ జీవశక్తులయొక్క సమిష్టిఫలితమైనప్పటికి, ముఖ్యముగా ఔషధశక్తి వలననే యీఫలితమేర్పడుచున్నది. ఈఔషధగుణమును తనబలముచే

ప్రతిఘటింప మనజీవశక్తి యత్నించును. ఈప్రతిఘటనా కార్యమే ఒకధర్మము. ఇది మనప్రాణమును భద్రపరచు శక్తియొక్క (life preserving power) స్వతశ్చలనగుణము (automatic action). ఇది "ద్వితీయగుణము లేక ప్రతికూల గుణము" (secondary or counteraction)అని పిలువబడును.

## 64

ఆరోగ్యమైన శరీరమున కల్పితవ్యాధి ప్రతినిధులయొక్క అనగా ఔషధములుయొక్క ప్రథమగుణమునందు, జీవశక్తి ఔషధగుణమునకు లోబడినపద్ధతిలో నడచుచునట్లగుపడగలదు అనగాపై నుండి పనిచేయుకల్పిత వ్యాధిశక్తి (ఔషధగుణము) యొక్కగుణములు తనలోప్రవేశింప నిర్బంధింపబడుటచే, అంద మూలమున జీవశక్తియొక్క ఆరోగ్యము మార్పుజెందగలదు అటుపిమ్మట జీవశక్తిపై కలిగింపబడిన యీగుణమునకు (ప్రథమగుణము) సరియైనవ్యతిరేకస్థితి (వ్యతిరేకలక్షణము. ద్వితీయ గుణము) కలుగజేయ (ఎ) విజృంభింపగలదు. ఇట్టివ్యతిరేకస్థి నెంతటిహెచ్చుస్థితిలో ఔషధగుణము జీవశక్తిపై కల్గించునో (ప్రథమగుణము) అందుకుతగిన శక్తిలోనే కలుగగలదు. లే (బి) ప్రకృతియందు ప్రథమగుణమునకు సరియైనవ్యతిరేకమై స్థితియేలేనిపక్షమున ప్రతికూలస్థితిలో నుండకుండుటకే ప్రయ త్నించునట్లగుపడగలదు. అనగా జీవశక్తి తనకుగలఉన్నత శక్తి

దనము కలుగగలదు (ప్రిథమగుణము.) గాని అటుపిమ్మట, బద్ధకము, మాంద్యముకలిగి (ప్రతీకారగుణము, ద్వియగుణము) మరల కాఫీ త్రాగి ఎల్లప్పుడు ఆమాంద్యమును తొలగింపని-చో (ఉపశమనకరము) దీర్ఘకాలముండగలవు. నల్లమందుచేగాఢమగు స్మృతిలేని నిద్రపట్టింపబడినపక్షమున (ప్రథమగుణము) తరువాత వచ్చురాత్రి అంతకుపూర్వముకంటె నిద్రలేకయుండుచు. (ప్రతీకారగుణము, ద్వితీయగుణము) నల్లమందువలన కలిగిన మలబద్ధమునకుపిమ్మట (ప్రిథమగుణము) విరేచనములు సంభవింపగలవు (ద్వితీయగుణము) మరియు, మలకోశములకు ఉద్రేకము కలుగజేయు మందుల మూలమున విరేచనములు కలుగజేసిన పక్షమున చాలదినములవరకు విరేచనముజరుగని విరేచనబద్ధము కలుగును. (ద్వితీయగుణము.) ఈవిధముగనే పెద్దమొతాదులలో నీయబడినమందుల మూలమున, కలిగినప్రిథమగుణమునకు పిమ్మట, పై నగమనించినవిధముగా, అందుకుసరియగు వ్యతిరేకమైన (యదార్థముగా అట్లుజరుగగలదు) గుణముజీవశక్తి చే ద్వితీయగుణమునందు కలుగజేయబడుచున్నది.

## 66

తక్షణమేగాంచబడు యీప్రిత్యక్షమైరుభ్య ద్వితీయగుణము, అతిసూక్ష్మమైన సారూప్యౌషధ మొతాదులగుణమున గాంచబడదు. ఆరోగ్యమైనశరీరమును మార్పుజెందించు ప్రతినిధులగు సారూప్యౌషధములయొక్క ప్రతిచిన్నమోతాదు తప్పక

దనము కలుగగలదు (ప్రథమగుణము.) గాని అటుపిమ్మట, బద్ధకము, మాంద్యముకలిగి (ప్రతీకారగుణము, ద్వియగుణము) మరల కాఫీత్రాగి ఎల్లప్పుడు ఆమాంద్యమును తొలగింపనిచో (ఉపశమనకరము) దీర్ఘకాలముండగలవు. నల్లమందు చేగాఢమగు స్మృతిలేని నిద్రపట్టింపబడినపక్షమున (ప్రథమగుణము) తరువాత నచ్చురాత్రి అంతకుపూర్వముకంటె నిద్రలేకయుండును. (ప్రతీకారగుణము, ద్వితీయగుణము) నల్లమందు వలన కలిగిన మలబద్ధమునకుపిమ్మట (ప్రథమగుణము) విరేచనములు సంభవింపగలవు (ద్వితీయగుణము) మరియు, మలకోశములకు ఉద్రేకము కలుగజేయు మందుల మూలమున విరేచనములు కలుగజేసిన పక్షమున చాలదినములవరకు విరేచనముజరుగని విరేచనబద్ధము కలుగును. (ద్వితీయగుణము.) ఈవిధముగనే పెద్దమొతాదుల లో *సీయబడినమందుల మూలమున, కలిగినప్రథమగుణమునకు పిమ్మట, పై నగమనించినవిధముగా, అందుకుసరియగు వ్యతిరేకమైన (యదార్థముగా అప్పుడుజరుగగలదు) గుణముజీవశక్తిచే ద్వితీయగుణమునందు కలుగజేయబడుచున్నది.

## 66

తక్షణమేగాంచబడు యీప్రత్యక్షమైరుధ్య ద్వితీయగుణము, అతిసూక్ష్మమైన సాదృశ్యౌషధ మొతాదులగుణమున గాంచబడదు. ఆరోగ్యమైనశరీరమును మార్పుజెందించు ప్రతినిధులగు సాదృశ్యౌషధములయొక్క ప్రతిచిన్నమోతాదు తప్పక

మూలమున గావింపబడు, వైరూప్యఉపశమనకర చికిత్స యొక్క హానికరగుణమును రుజువుపరుపగలవు.

శక్తి అణచిపెట్టబడి నిర్బంధింపబడి యుండుటచేతను పైనజెప్పిన యిట్టి ఉద్రేకములు కలుగజేయుటమూలమున శరీరావయవములన్నియు, పూర్వపు ఆరోగ్యస్థితిలోనే తిరిగి పనిజేయగలవు. (గాన యిట్టి ప్రారంభచికిత్స అంగీకారయోగ్యము న్యాయసమ్మతమునైయున్నది.) ఆకస్మికవిషప్రయోగమునకు ప్రయోగించు విరుగుళ్ళు యీవర్గమునకే చెందగలవు. ఖనిజ ద్రావకములకు (mineral acids) క్షారములు (alkalies) లోహ విషములకు (metallic poisons) హెపార్ సల్ఫ్, నల్లమందు విష ప్రయోగమునకు, కాఫీ, కేంఫరు, ఇపెకాక్ మొదలగునవి విరుగుళ్లు.

ఒకవ్యాధికి సారూప్యౌషధమును నిర్ణయించునప్పుడు, ఔషధలక్షణములలో కొన్నిలక్షణములు ముఖ్యముగాని, సామాన్యమైన వ్యాధిలక్షణములతో వ్యతిరేకమైయున్నవను కారణముచే, సారూప్యౌషధము సరిగా ఎంచబడలేదని భావించరాదు. బలతరమై ముఖ్యముగ గుర్తింపబడు సహజ (characteristic) విచిత్ర (peculiar) వ్యాధిలక్షణములతో ఔషధ లక్షణములు, సారూప్యముగ నున్నప్పుడు అట్టి ఔషధముచే, వ్యాధి జయింపబడి, నిర్మూలము గావింపబడి తొలగింపబడును. మిగిలినకొలది ప్రతిపక్ష లక్షణములుగూడ ఔషధగుణకాలపరిమితి గతించినపిమ్మట నివారణకెంతమాత్రమును అభ్యంతరము కలుగజేయక, తమంతటతామే అదృశ్యమగును.

ఈరెండు వైద్యవిధానములను కలిపి కృషిచేయు కొందరు నవీన వైద్యులు, వ్యాధులయందు గమనింపబడు సర్వసామాన్యసూత్రమునకు వ్యతిరేకముగ నడచునప్పుడు తగుసమాధానమొసగుటకు అవకాశముకలిగి యుండుటకును, ప్రతివ్యాధికి అనుకూలించు సారూప్యౌషధమును పరిశీలన చేయుటకు తీసికొనవలసిన శ్రమను ముఖ్యముగా తప్పించుకొనుటకును, అతిసులభముగ ప్రయోగమున కనుగుణ్యమైన వైరూప్య ఉపశమనకరముల

68

సారూప్యౌషధనివారణలయందు, లక్షణసారూప్యమును బట్టి, సారూప్యమైన ప్రకృతిసిద్ధవ్యాధిని, జయించి తొలగించుటకు యీచికిత్సాపద్ధతియందు, అసాధారణమైన చిన్నమోతాదులు (275–287) అవసరమైయుండుటచే, వ్యాధినిర్మూలనము గావింపబడిన పిమ్మట, శరీరమున మొదట తప్పక కొంత ఔషధ సంబంధమైన వ్యాధిమాత్రమే యుండగలదు. కానిమోతాదు మిక్కిలి అణుస్వరూపములో నుండుటచే, నిదిమిక్కిలిక్షణభంగురమై, అత్యల్పముగానుండి అతివేగముగా దానంతట నదియే అంతరింపగలదు. జీవశక్తియందుగలిగిన యీస్వల్పమైన కల్పిత వ్యాధి మార్పుపై, ప్రస్తుతపరిస్థితినుండి, సరియైన ఆరోగ్యపరిస్థితికిమార్పు చెందించుటకంటె నెక్కుడు ప్రతీకారగుణము కలుగజేయ జీవశక్తికి అవసరములేదు. అనగా పూర్వపువ్యాధిస్థితిని తొలగించినపిమ్మట సంపూర్ణారోగ్యముచేకూర్చుటకు కొలదిశక్తి మాత్రమే చాలును. (64 బి)

69

వైరూప్యౌషధవిధాన చికిత్సయందు పై పద్ధతికి సరియగు వ్యతిరేకమైన పరిస్థితి సంభవింపగలదు. వైద్యునిచేవ్యాధి లక్షు

తోను, యితర హానికరవైరూప్యౌషధములతోను గావించు చికిత్సను సమర్థించుకొనుటయును, నిరుపయోగమైనయీవిషయమునే విజ్ఞాపనము జేయుచుందురు. వీరు అనుకరించు వైద్యవిధానము ననుసరించియే శిరికృత్యములన్నియు యుండగలవు. వీనినిగూర్చి ప్రగల్భములు పల్కనవసరము లేదు.

ణమునకు ప్రతికూలము కలిగించు ఔషధలక్షణము (ఉదాహ
ణము:— తీవ్రమైనబాధను నల్లమందుచే ప్రథమగుణామునంది
కలిగింపబడు, దిమ్ము; తిమ్మిరి.) వ్యాధికిపూర్తిగనైరూప్యమై
దియు, నిశ్చయముగ అన్యమైనదియుగాదు. వ్యాధిలక్షణమునకు
ఔషధలక్షణమునకు ప్రత్యక్షమైన సంబంధమున్నది. కానిఎట్టి
సంబంధముండవలయునో అందుకు వ్యతిరేకమైన సంబంధ
మిచ్చుటగలదు. ఈసందర్భమునందు, వ్యాధినిర్మూలనము, వ్యతి
రేకమైన లక్షణములుగల ఔషధముచే యత్నింపబడుచుండెను
ఇదిఅసంభవము. సారూప్యౌషధము సారూప్యమగు గుణమున
కలుగజేయుటమూలమున సరిగా శరీరమునందలి వ్యాధియొక్క
స్థానమును బట్టుకొనును. ఈవిధముగనే వ్యాధిలక్షణములకు
వైరూప్యముగ నెంచబడినఔషధముగూడ సరిగ వ్యాధియొక్క
స్థానమును బట్టుకొనును. ఇందుకుసందేహములేదు. కానివైరూ
ప్యౌషధము వ్యాధియొక్కలక్షణములను వ్యతిరేకముగనే ఆక్రమించి, కొలదికాలము మాత్రమే, యగుపడకుండ జేయును.
వైరూప్యఉపశమనకర ఔషధగుణము, మొదటికాలములో,
వ్యాధిలక్షణము నుండిగాని, ఔషధలక్షణమునుండిగాని, జీవశక్తి
ఎట్టి అనుకూలమునుగాంచదు. ఆ రెండును( ఔషధలక్షణము,
వ్యాధిలక్షణము) అన్యోన్యము నొకదానినొకటి తొలగించి,
సూక్ష్మశక్తికరఉభయశక్తిశూన్యకరణము(Dynamic Neutralisation) కావింపగలవు. (ఉదాహరణ :— నల్లమందుకు
గల తిమ్మిరిగుణము బాధనునొప్పిపోగొట్టగలదో యట్లే) మొద

టినిమిషములలో జీవశక్తి మంచిస్థితిలో నుండగలదు. నల్లమందు యొక్కదిమ్ముగానివ్యాధియొక్కబాధగానియగుపించదుకాని. శరీరమునగల వ్యాధిస్థానమును వైరూప్యౌషధగుణములు (సారూప్యౌషధచికిత్సలోవలె) సారూప్యమగు బలకరమైన వ్యాధివలె ఆక్రమింపజాలక ప్రకృతిసిద్ధ వ్యాధిస్థానము లోనికిబోవుటకు సారూప్యౌషధమువలె జీవశక్తియందు సమానమైన కల్పితవ్యాధిని కల్గింపజాలవు. వ్యాధికి వ్యతిరేకమైనదియు, పూర్తిగా విభేదమైనదియు, అగుఉపశమనకర ఔషధము వ్యాధినితొలగింపక తప్పక విడిచిపెట్టగలదు. ఈవైరూప్యౌషధము ప్రథమమున జీవశక్తిచే తెలిసికొనబడని, సూక్ష్మశక్తికరముగ అన్యోన్యము దొలగింపబడుఅవస్థ 1♦ (Dynamic neutralisation) కలుగ

---

♦ 1 రసాయనశాలలయందు గావించు పరిశోధనలయందు వ్యతిరేకగుణములుగల వస్తువులయందు గాంచనగు విధముననే సజీవమైన మానవ శరీరమున వ్యతిరేకతత్వమునకు శాశ్వతమైన ఉభశక్తి శూన్యకరణత్వము (Neutralisation) గాని ప్రతిపక్షమైన భావనగాని సంభవింపజాలదు. సల్ఫ్యూరిక్ యాసిడ్, పొటాష్ సమీకరణము గావింపబడినప్పుడు మరియొక విభేదమైన వస్తువగును. ఈ లవణమిప్పుడు, ఆమ్లము (acid) క్షారము (alkali) గాక వేడివలననుగూడ పృథక్కరణము (Decomposition) (మూలపదార్థమును వేరుపరచుట) కావింపబడజాలదు. స్థిరమైన ఉభయశక్తి శూన్యకరణము విభేదము కాబడుటకు అట్టిమిశ్రమము, సంపూర్ణసంయోగము (Thorough combination) యింద్రియజ్ఞానయుక్తపరకరమగు మనశరీరమునందు ప్రకృతివైరుధ్యమైనటువంటి, సూక్ష్మభావనమున, సంభవింపజాలదు. దుఃఖితునియొక్క కన్నీళ్ళు, నవ్వుపుట్టించు మాటలమూలమున కొలదికాలము పోగొట్టవచ్చును. గాని యిట్టి పరిహాసమువలన కలిగిన మరపు వెంటనే గతించినపిమ్మట, అంతకుపూర్వము కంటె నెక్కుడు కన్నీళ్ళు స్రవింపగలవు.

జేసి, యీస్థితి వెంటనే ప్రతిఔషధ గుణమువలెనే అదృశ్య మగుటచే పూర్వముండు స్థితిలోనే వ్యాధి వదలివేయ బడుటయేగాక, (పెద్దమోతాదులలో వ్యాధిని తొలగించుట కీయబడు ఉపశమనకర ఔషధములవలె) యీ ఉపశమనకర ఔషధమునకు వ్యతిరేకస్థితిని కలుగజేయుటకు (63, 64) జీవశక్తి నిర్భంధింపబడున్నది. ఈవ్యతిరేకమైన ఔషధగుణము, జీవశక్తిచే అధికముగ బలకరము గావింపబడి ‡2 (ఉపశమనకరముపై ప్రతీకారము) ప్రకృతిసిద్ధమైన వ్యాధి నిర్మూలము గావింపబడక అన్నిలక్షణములతోను నిలచియుండ నిర్భంధింపబడుచున్నది. ఉపశమనకర ఔషధముయొక్క గుణ కాలపరిమితి గతించినపిమ్మట వ్యాధిలక్షణము (వ్యాధియొక్క యీప్రత్యేకభాగము) యింకనుదుస్థితి చెందగలదు. ఉపశమ

‡2 ఇంత విస్పష్టముగానున్న విషయమునకు కొందరు అపార్థము కావించుకొని, ఇందుకు ప్రతికూలముగ "ఉపశమనకరఔషధము, ద్వితీయ గుణమునందు, నిలచియున్న వ్యాధికి సారూప్యమైయుండుటచే, సారూ ప్యౌషధము ప్రథమగుణములో కావించురీతి నేవ్యాధినివారణచేయసమర్థ మై యుండగల"దని తెల్పి తమవాదమును బలపరచుకొనుచుండిరి. కాని వీరు యీద్వితీయగుణము ఔషధజనితగుణము కాదనియు, శరీరతత్త్వమునకు ప్రతికూలముగ పనిచేయుచున్న జీవశక్తియొక్క గుణముమాత్రమేయనియు గ్రహించియుండలేదు. మరియు ఉపశమనకరఔషధము ప్రయోగింపబడిన పిమ్మట, జీవశక్తినుండి సంభవించిన యీద్వితీయగుణము, ఉపశమనకర ఔషధముచే తొలగింపబడక వదలివేయబడి జీవశక్తియొక్క ప్రతీకారము మూలమున యింకను మిక్కిలి వృద్ధిపొందింపబడిన, యీస్థితి వ్యాధిలక్షణ ములకు సమానమైనస్థితియని గ్రహించి యుండలేదు.

మనమువ్యాధియనిపిలుచు, ఆరోగ్యస్థితియొక్క మార్పు, ఆరోగ్యమైన శరీరమున పరీక్షించి, స్పష్టముగా వానిపరిశుద్ధత్వ మును తెలిసికొనిన, విచిత్రమైన వ్యాధిలక్షణములను కలుగజేసి ఆరోగ్యమును మార్పుచేయగలమందుల మూలమున, ఆరోగ్య స్థితి లోనికి తిరిగి మార్పుజెందింప బడగలదు.

సమస్తమైన అనుభవమునుబట్టి, నివారణచేయదలచిన వ్యాధిలక్షణములకు వ్యతిరేకమైన లక్షణములను ఆరోగ్యమైన శరీరమున కలుగజేయగల మందులమూలమున ప్రకృతిశిద్ధమైన వ్యాధి ఎన్నడును నివారణచేయబడజాలదని తెలియుచున్నది. కాబట్టి వైరూప్యౌషధ చికిత్సవలన (అల్లోపతీచికిత్స) వ్యాధు లెన్నడును నివారణచేయబడజాలవు. ప్రకృతిశిద్ధముగనైనను గూడ ఏవ్యాధియు దానంతట అదిమరియొకవ్యాధిచే అనగా ఆక్రొత్తవ్యాధి ఎంతటి బలకరమైనదైనప్పటికి వ్యతిరేకమైన లక్షణములను కలిగియున్న పక్షమున వెనుకటివ్యాధిని నివారణ ఎన్నడును చేయజాలదు.

మరియు ఆరోగ్యమైన శరీరమున నివారణ చేయదలచిన వ్యాధియొక్క ప్రత్యేకలక్షణములకు విరుద్ధమైన కల్పితవ్యాధి లక్షణములను కలుగజేయగల మందులమూలమున శాశ్వతమైన నివారణ ఎన్నడును కలుగజాలదని మన అనుభవమంతయు రుజువు పరచుచున్నది. ఇట్టిమందులవలన తాత్కాలికోపశమ నము మాత్రమే సంభవించి పిమ్మట రోగోద్రేకము కలుగగలదు

అనగా తీవ్రమైన దీర్ఘవ్యాధులలో యీవైరూప్యౌషధ చికిత్స లేక ఉపశమనకర చికిత్స ఎంతమాత్రము పనిచేయజాలదు.

వ్యాధిలక్షణములకు సారూప్యమగు లక్షణములను ఆరోగ్యమైన శరీరమున జనింపజేయగల ఔషధములను అనుకూలమగు మోతాదులలో ప్రయోగించి చికిత్సగావించు ఒక్క సారూప్యౌషధ చికిత్సాపద్ధతి మాత్రమే సమర్థమైన నివారణాపద్ధతి. ఈఔషధచికిత్సా విధానమున, జీవశక్తికి కలుగజేయబడిన కేవలము సూక్ష్మఉద్రేకకర మార్పులగు వ్యాధులు యీఔషధములచే శక్తివిహీనముగావింపబడి యీవిధముగా, సులభముగా, దోషరహితముగా, స్థిరముగా నిర్మూలము గావింపబడును గాన తప్పక నశించగలవు. ఒక ప్రాతవ్యాధితో సారూప్యమగు మరియొక క్రొత్తవ్యాధికలసినచో క్రొత్తవ్యాధి త్వరలో శాశ్వతముగా హరింపజేయబడి నివారణచేయబడునను ఉదాహరణ ఈపద్ధతి కనుగుణముగ మనకు ప్రకృతియందే కలదు.

## 71

మానవులయొక్క వ్యాధులు కొన్నిలక్షణ సముదాయములై యున్నననియు యీవ్యాధులు ఆరోగ్యమగు శరీరమున సారూప్యమగు వ్యాధిలక్షణములను కలుగజేయగల మందుల మూలమున నిర్మూలముచేయబడి ఆరోగ్యముజేకూరగలదనియు యిప్పుడు నిస్సందేహమైన విషయమై యున్నది. (సరియైన

సమస్త నివారణీయము నిదియే పద్ధతి) గాన యీ క్రింద మూడు విషయములలోను నివారణావిధాన మిమిడియున్నది.

1. వ్యాధినిని హరణము చేయుటకేమి తెలిసికొన వలయునో వైద్యుడెట్లు గ్రహించవలయును?

2. ప్రకృతిసిద్ధమైన వ్యాధిని నివారణజేయుటకుపకరించు ఔషధములయొక్క వ్యాధి నిర్మూలనాశక్తి నిగూర్చి గ్రహింపవలసిన విజ్ఞానమును వైద్యుడెట్లు సంపాదింపవలయును?

3. వ్యాధిని నివారణజేయుటకు కల్పితవ్యాధికర ప్రతినిధులను (ఔషధములు) ప్రయోగించుటకు మిక్కిలి అనుకూలమైన పద్ధతి ఏది?

## 72

ప్రథమ విషయమునకు యీ క్రింది విషయములు సర్వసామాన్య ప్రారంభాభిప్రాయము కలిగింపగలవు. త్వరితగతిని విశేషముగ జీవశక్తిని మార్పుచెందించి చురుకుగా మితమైన కాలములో గమనమును పూర్తిజేయు సూచనగలిగియుండు వ్యాధులు 'తరుణవ్యాధుల' (acute diseases) నిపిలువబడును. తెలిసికొనుట కవకాశములేనంతటి స్వల్పముగా ప్రారంభించి సజీవశరీర తత్వమును తనకనుగుణ్యమైన విచిత్ర పద్ధతిలో (ఆరోగ్యమైన స్థితినుండి) ఆరోగ్యమును కాపాడుటకు ఏర్పడియున్న జీవశక్తియని పిలువబడు, ప్రాణముయొక్క బలమీపరిస్థితిని,

ప్రారంభమునను వృద్ధిజెందుచున్నప్పుడును ఎదిరించుచున్నప్పటికి నయ్యది, అనుపయోగము, అననుకూలము, అననుగుణ్యముగ పరిణమింప జీవశక్తి తానంతటతాను తొలగించుకొన శక్తిలేక పోవుటచే, శరీరతత్వమంతయు, నిర్మూలమగువరకు, విశేషముగ వృద్ధిబొందుచు, అందుమూలముననిస్సహాయతను బాధపడ వలసియుండును యీవిధమగువ్యాధులు "దీర్ఘవ్యాధు" లనిపిలువబడును. ఈవ్యాధులు దీర్ఘవ్యాధియొక్క (chronic Miasm) అంకురమున (infection) సంభవించుచున్నవి.

## 73

తరుణవ్యాధులు మానవులను వ్యక్తిగతముగా నెదుర్కొనునట్టి తరగతికి జేరియున్నవి. వ్యక్తులు ప్రత్యేకముగ పొల్పడు హానికరప్రాబల్యములే యీవ్యాధులయొక్క ఉద్రేక కారణము. అమితభోజనము, తగుభోజనలోపము, తీవ్రమైన శరీరవ్యాయామము, చలి, ఉష్ణాధిక్యము, అపమార్గప్రవర్తనము అతివ్యాయామము మొదలగునవి శరీరోద్రేకము, మానసోద్రేకము, మొదలగునవి తరుణజ్వర సంబంధమైన వ్యాదులకు ఉద్రేకకారణములు. వాస్తవముగ నీవ్యాధులు అంతర్హితమైన సోరాయొక్క తాత్కాలిక విజృంభణము గాన యీతరుణ వ్యాధులు తీవ్రస్వభావముగలవి గాని సందర్భములలో వెంటనే నివారణ చేయబడినప్పుడు యీసోరా తనప్రచ్ఛన్న స్థానములోనికి మరలిపోవును. మరియు స్థానిక వాతావరణ ప్రాబల్య

సంబంధమునను, హానికరకారణము మూలమునను అక్కడక్కడ అరుదుఅరుదుగా (sporadically) అనేకులకు సంభవించు వ్యాధిరూపముగానుండు వ్యాధులుగూడ తరుణవ్యాధులు. ఒకేకారణమున ఒకేకాలములో ఒకేవిధమగు బాధలతో (Epidemically) అనేకులకు సంభవించెడు రోగములకు సంబంధించిగూడ నీతరుణవ్యాధు లుండగలవు. ఈవ్యాధులు జనసమ్మర్థము విశేషముగాయున్న ప్రదేశములలో అంటురోగము లై వ్యాపింపగలవు. గాన ప్రతిసందర్భమునందును విచిత్రస్వభావములో నీజ్వరములు 1♦ బయలుదేరి యివియన్నియు ఒకే మూలాధారమునుండుద్భవించుటచే ఒకేవిధమగు పద్ధతిగలిగి యుండును. మరియు నీవ్యాధులకు చికిత్సజేయక నిస్సహాయముగ వదలివేసినపక్షమున మితమైన కాలములో నీవ్యాధులంకురించిన రోగికి స్వస్థతచేకూరుట లేక రోగి మృత్యువాతబడుట సంభవింపగలదు. సంగ్రామవిపత్తులు, వరదల ఉపద్రవములు, క్షామములు, తరుచునిట్టివ్యాధులను ఉద్భవింపజేయగలవు. మరియు

---

1♦ ప్రాచీన విధానవైద్యులచే (అల్లోపతి) నిట్టిజ్వరములకు కొన్ని నామములు నిర్ణయింపబడి స్థిరముగనిర్మింపబడిన యొకపద్ధతిమూలమున చికిత్స జేయుపద్ధతిని కల్పింపబడిన అనాలోచిత సారాంశముల నెంతమాత్రము గ్రహింపని హోమోపతివైద్యుడు, జైలుజ్వరము, పైత్యజ్వరము, సన్నిపాతజ్వరము, విషజ్వరము, నరములసంబంధమైన జ్వరము, గ్రహణిజ్వరము, మొదలగు నామములబట్టి, చికిత్సజేయక, ప్రతివ్యాధియందు విస్తారముగనుండు ప్రత్యేకవిచిత్ర లక్షణములనుబట్టి, రోగినిబట్టివ్యక్తిగతముగ చికిత్స చేయును.

నివి యీవ్యాధులనుద్భవింపజేయుటకు ముఖ్యోద్రేకకారణములు. ఒక్కొక్కప్పుడు విచిత్రమైన స్వభావముగలిగి మానవుని జీవితమందు ఒక్కపర్యాయము మాత్రమే సంభవించుటేక అట్టివిధముననే ఆరూపముననే తిరిగితిరిగి వచ్చుచుండు స్వభావముగల వ్యాధులగు మశూచికము, పొంగు, కోరింత దగ్గు, సిడెన్‌హామ్ ప్రాచీనస్కార్లెటీజ్వరము, ‡2 గదవలవ్యాధి మొదలగునవి ఒకేవిధముగ తరుచు సంభవించు ప్లేగు, సముద్ర తీరపు యెల్లోజ్వరము, ఏషియాదేశపు కలరా మొదలగువ్యాధులు, నివియన్నియు తరుణవ్యాధులు:

## 74

మనముగాంచు దీర్ఘవ్యాధులు, తరుచుగనైరూపౌషధ చికిత్సలలో, తరుచుతరుచువృద్ధిచేయబడుచుండు పెద్దమోతాదు

2‡ 1801 వ సం॥ రమునకుపిమ్మట, పశ్చిమ దేశమునుండివచ్చిన ఒక విధమైన పూర్‌పూరామిలియారిస్ అనువ్యాధి, వైద్యులను, స్కార్లెట్ జ్వరమని భ్రమపరచియుండెను. ఈరెండింటికి విభేదమైన లక్షణములున్నప్పటికి, మొదటివ్యాధికి ఎకోనైటు, రెండవవ్యాధికి బెల్లడోనా, నివారణౌషధములైనప్పటికి, మొదటిది అచ్చటచ్చట సంభవించువ్యాధి, రెండవది విపులవ్యాప్తిజెందు అంటురోగ సంబంధమైన వ్యాధియైనప్పటికి ఒకదానినుండి వేరొకటి తెలిసికొనుటకు, విభ్రమముగొల్పి యుండెను. కొంతకాలము క్రిందట, యీరెండువ్యాధులు ఏకమైనట్లు అచ్చటచ్చట ఒకవిచిత్రమైన పొక్కుతో జ్వరరూపమున యగుపించి యీరెండు మందులు గూడ సార్థక్యముగ అనుకూలింపని విధముగ గానుపించెను.

లలో ప్రయోగింపబడు తీవ్రమైనమందులగు, రసకర్పూరము (Calomel) ఖాండకర్పూరము, (Corrosive sublimate) రజితనత్రితము (Silver nitrate) అదము (Iodine) దీనితో తయారు జేయబడిన తైలములు (Ointments) నల్లమందు, జటామాంసి, (Valerian) చింకోనాపట్ట (cinchona bark) క్వైనా, ఫాక్సుగ్లోవ్ అనువిషవృక్షము (Fox glove or digi tatis) గంధకము, గంధకామ్లము (Sulphuric acid) నిరంతరము లభ్యమగు భేదిమందులు రక్తనాళవిచ్ఛేదనలు (Venesections) జలగలు, శస్త్రపరికర ప్రయోగకల్పిత వ్రణములు (Issues Seton) మొదలగు చికిత్సలవలన సర్వసాధారణముగా మనముగాంచు దీర్ఘవ్యాధులు జనించుచున్నవి. పైనుదహరింబబడిన ఔషధములమూలమునను సాధనములమూలమునను కావింపబడు చికిత్సలవలన, ఒకొక్కప్పుడు జీవశక్తి, మిక్కిలి బలహీనము గావింపబడి, అంతరించగలదు. (రోగులుమృతి నొందగలరు). అట్లుఅంతరించని పక్షమున ప్రయోగింపబడిన ప్రతివస్తువు మూలమునను విచిత్రమైనవిధముగా, విశేషముగా, రోగులువ్యాధి గ్రస్తము కావింపబడి యిట్టి శత్రుయుతమైన, నాశకరమగు ఔషధకరవ్యాఘాతముల నెదుర్కొని జీవితము నిర్వహించుటకు, తిరిగితిరిగి ప్రయోగింపబడు హానికరఔషధముల యొక్క వ్యాఘాతముల మూలమున స్థూలశరీరము నందలి ప్రాణిసంపూర్ణముగ నశించకుండ కాపాడుటకు, జీవశక్తి శరీరతత్వమున, తీవ్రసంక్షోభమునైన జనింప జేయునులేదా,

తనకుగలచలన స్పర్శజ్ఞానములనైన బోగొట్టుకొనునులేదా, అమితముగనీచలన స్పర్శజ్ఞానముల నుద్రేకింపజేసి, ఉబ్బుట ముడుచుకొనిపోవుట, సడలిపోవుట, వాచుట మొదలగు లక్షణములను జనింపజేయునులేదా, కొన్నిఅవయవములను పూర్తిగ నాశనముచెందించి, అంతరంగమునగాని బహిరంగమునగాని, †1 అచ్చటచ్చట అక్రమమైన తత్వమార్పులను బొందించి అంగవైకల్యముగావించును, ♦2

---

†1 ఆరోగ్యమైన స్త్రీయందు సంభవించు రక్తాధిక్యత (plethora) ఋతుకాలమునకు కొన్నిదినములకు ముందుగ గర్భమునందును స్తనముల యందును వాపులేకుండు ఒకవిధముగ బరువుగానుండుభావనలో యగుపించును

♦2 వ్యాధినివారణకొరకు గావించు యోచనాయుతమైన సమస్తపద్ధతులలోను ప్రపంచమున చాలవరకు అనేకసంవత్సరములనుండి వ్యాప్తిజెంది రక్తస్రావముల మూలమునను, లంఘనముల మూలమునను బలహీనముగావించు యీబ్రౌసీ చికిత్సకంటె ఘనతరయశాస్త్రీయ యననుకూల చికిత్స తలంపబడజాలదు. వివేకముగల నేవ్యక్తియు నీపద్ధతియందు చికిత్సకు ఔషధము తీరున సహకారియగునదియు ఔషధమువలె నుపయోగపడునదియు నేదియు గాంచలేదు. మరియు యదార్థమైన ఔషధముల నెట్టియోచన జేయకుండగనే నిర్ణయించి రోగికి ప్రయోగించినప్పటికి కాకతాళ న్యాయముగ నామందు లొక్కొక్కప్పుడు వ్యాధికి సాహాయ్యమై లాభదాయకముగ వర్తించగలవు. ఈబ్రౌసీచికిత్సయందు అట్టివిధమగు నుపయోగమైనను లేదు. కల్పితరక్తస్రావముల మూలమున జీవితమును హ్రస్వముగావించుటకప్ప వేరెయ్యదియును లేదని వివేకముగల ప్రతిబుద్ధికి గోచరింపగలదు. స్థానిక అధికరక్తకూటముపై (local inflammation) సమస్త వ్యాధులు ఆధారపడి యుండునని తలంచుట నిరాధారమైన వట్టిభ్రాంతి. యదార్థమగు స్థానికమైన అధికరక్తకూటమిని గూడ యీఅధికరక్తకూటమికి ఆధారభూతమగు రక్తనాళోద్రేక

# 75

## నివారణాశూన్య వైరూప్యౌషధ చికిత్సవలన (ముఖ్యముగా నవీనకాలములో) మానవశరీర ఆరోగ్యమున కలుగు వ్యాఘా

మును, నిరాకారశక్తికరముగ తొలగింప సమర్థమైన ఔషధముల మూలమున రోగియొక్క బలమును రక్తాది ద్రవములను హరింపనవసరము లేకుండ మిక్కిలి నిశ్చయముగ, సత్వరముగ నివారణ జేయవచ్చును. వ్యాధిగ్రస్తమైన భాగములయందు శస్త్రప్రకికర సాధనమున రక్తస్రావము కలుగజేసినప్పటికి నీకృత్యము యీభాగములయందు క్రొత్త రక్తకూటమిని వృద్ధిజేయును. ఉద్రేకజ్వరములయందు (Inflammatory fever) అట్టి జ్వరముల కనుకూలమగు కొలది ఔషధములు ఉద్రేకించిన నీనాడీమండలస్థితిని వ్యాధితోగూడ రోగి యొక్కబలమును, రక్తాదిద్రవములను హరింప నవసరములేకుండ కొలది గంటలలో తొలగించుచుండ సర్వసాధారణముగ నిట్టిజ్వరములలో పౌనుల కొలది రక్తమును దీసివేయుట, అయుక్తమే గాక హత్యాకరము. ఇట్లుగావించుటచే గలిగిన విశేషరక్తలోపము జీవితశేషమున తిరిగి చేకూర్పబడజాలదు. ఏలనన భగవంతునిచే నిర్మాణము చేయబడిన రక్తమును తయారుజేయు అవయవములు యిందుమూలమున బలహీనముగావింపబడి యుండుటచే పూర్వపు పరిమాణములోనే రక్తము తయారు కావచ్చును, గాని పూర్వమంతటి శ్రేష్టతరముగ తిరిగి తయారుచేయబడదు. ఒకగంటకు పూర్వము అనగా చలిస్థితికి ఒకగంట పూర్వమీ రోగి యొక్క నాడిశాంతముగనుండ యీభావనాయుత రక్తాధిక్యత యింతలోనింతటి అధికమైన వేగములో రక్తస్రావముల మూలమున రక్తమును దీసివేయవలసిన పరిస్థితిని కలుగజేయుట ఎంత అసంభవము. ఏవ్యక్తియు, నేరోగియు అవసరమైనదానికంటె అధికమైన రక్తముగాని, అధికమైనబలమునుగాని యెప్పుడును కలిగి యుండడు. అందుకు మారుగ ప్రతిరోగియు బలహీనముతోనే యుండును. శరీరమున సరియైన బలమున్నపక్షమున జీవశక్తి వ్యాధిని వృద్ధిబొందకుండ

తములు సమస్త దీర్ఘ వ్యాధులకంటెను మిక్కిలి దుఃఖకరమైన ట్టియు, నివారణకసాధ్యమగునట్టియు, దీర్ఘ వ్యాధులగుచున్నవి. ఇవితగినంత హెచ్చుస్థితిలోనికి మారినప్పుడు వీనికితగినఔషధ మును కనుగొని,నివారణచేయుటకష్టసాధ్యమనిగూడ తెల్పుటకు విచారించుచున్నాను.

## 76

వ్యాధివిమోచనముగావించుపద్ధతి సారూప్యౌషధ విధా నముతో స్వభావసిద్ధ వ్యాధులకు మాత్రమే భగవంతుడనుగ్ర హించి యుండెను. హానికరమగు ఔషధములతో కావింపబడిన చికిత్సమూలమున సంవత్సరముల తరుబడి బహిరంగముననను, అంతరంగముననను మానవ శరీరమున కావింపబడిన ధ్వంసము, అంగవికలత్వము, వలన జీవశక్తి 1† మిక్కిలి బలహీనము కావింపబడకయున్న పక్షముననను నీఘనకార్యము నిమిత్తము కొన్ని సంవత్సరములు కలతజెందక ఓర్మివహించి యుండగలిగిన

---

నిరోధించియే యుండును. గాన రోగియొక్క బలహీనతకు తోడు యీవిధ ముగ అధికమైన బలహీనము కలుగజేయుట అయుక్తము, క్రూరము.

నిరాకారమైన వ్యాధిని నిరాకారశక్తుల మూలమున తొలగించుటకు మారుగ నిరాధారమైన అసంగతమగు అభిప్రాయములపై నాధారపడిన నీ విధానమును అవలంబించుట అయుక్తము, క్రూరము, హత్యాకరము, దుర్మార్గము.

1† ఈచికిత్సయందు కడపురోగి మరణించిన పక్షమున, యిట్టిచికిత్స గావించు అల్లోపతీవైదుడు మృతినొందిన రోగియొక్క శరీరము విచ్ఛేదము

పక్షమునను,జీవశక్తి మూలముననే నివారణ చేయబడవలెను. (వెనుకదాగియున్న దీర్ఘవ్యాధి దోషమేమైనయున్నచో నద్దానిని తొలగించుటకు జీవశక్తికి తగుసహాయము కలుగజేయ వలయును). నివారణాశూన్య వైరూప్యౌషధ చికిత్సామూలమున తరుచుజనించు, అనంతరములైన, తీవ్రవ్యాధిస్థితులనుంచి యదార్థస్థితికి తీసుకొనివచ్చుట కింతకంటె వేరొండుసాధనములేదు. ఉండజాలదు.

## 77

తప్పించుకొన నవకాశముగల అనారోగ్య ప్రాబల్యములలో(Avoidable noxious influences) తరుచుమెలగుచుండుట, హానికరమగు సారాయములకు, మత్తుపదార్థములకు, అలవాటుపడుట ఆరోగ్యమునకు అంతరాయముకల్పించు దుష్ప్ర

---

గావించి,జేయుశవపరీక్ష యందు,తనయొక్క దుర్మార్గమైనచికిత్సయందుసంభవించన అంగవైకల్యములు, నివారణ కావింపబడజాలని అసలువ్యాధియందే జనించియుండెనని తెల్పి మిక్కిలినేర్పుగ, తనగౌరవమును నిల్పుకొనును, ప్రకృత చిత్రములతో ప్రచురింపబడిన వ్యాధివిచక్షణా శాస్త్రమునందలి (Pathology) శరీరశాస్త్రమునందలి (Anatomy) మోసకరలేఖ్యములు, యిట్టివిచారకరమగు కార్యపర్యవసానములే యైయున్నవి. ఇట్టివిధమగు హానికరచికిత్సలమూలమున మృతి నొందని పల్లెటూరి ప్రజలు, పట్టణముల యందలి బీదలు యిట్టి శవపరీక్ష గావింపబడుచుండుటలేదు. ఈ రోగులశవముల యందట్టి అంగవైకల్యములు కల్గిన అవయవభాగములు యగుపించవు. ఈవిషయమునుబట్టియే యీఉదాహరణయందలి విలువయు, యీగ్రంథకర్తలయొక్క నిష్కాపట్యతము పరిశీలింపనగును.

వర్తనకు లోబడుట, జీవితాధారమున కవసరమగు వస్తువులను దీర్ఘకాలము విడచియుండుట, అనారోగ్యప్రదేశములలో నివశించుట, బహిరంగమైనగాలిలో వ్యాయామము లేకుండుట, శరీరమునకు మనస్సునకు ఎక్కువవ్యాయామము గలుగజేసి, ఆరోగ్యముభగ్న పరచుకొనుట, ఎల్లప్పుడు విశ్రామములేని శరీరమానసిక, పరిస్థితులలో జీవితముగడుపుట, మొదలగువాని మూలమున, సంభవించువ్యాధులు, అసంగతముగ దీర్ఘవ్యాధులని పిలువబడుచున్నవి. మానవులు తమంతటదాము తెచ్చికొనుయిట్టివ్యాధులు, వీరియందు దీర్ఘవ్యాధిదోషము అంతరంగమున దాగియుండనిచో, ఉత్తమమైన మార్గమున జీవితమును సాగించినపక్షమున, తమంతటదామే శీఘ్రకాలములో అదృశ్యముకాగలవు. ఈవ్యాధులు దీర్ఘవ్యాధులని పిలువబడజాలవు.

## 78

నిజమైనదీర్ఘవ్యాధులు, దీర్ఘవ్యాధి దోషమునుండుద్భవించి (Chronic miasm)అందుకునిర్దిష్టముకాబడిన ఔషధము మూలముననిరోధింపనిచో, ఎంతటిబలమైన మనస్సును శరీరమునుకలిగి యున్నప్పటికి, ఎల్లపుడువృద్ధిజెందుచు, శరీరస్థితిని దుస్థితిలోనికి దీసుకొనివచ్చి, జీతతాంతమువరకు నిత్యముఉద్రేకించు బాధలతో రోగిని పీడించుచుండును. అనంతములైన యీవ్యాధులు మానవజాతికి విశేషపీడాకరములు. మంచిబలమైన శరీరము, సరియగునియమ బద్ధజీవితము, మంచిచురుకుదనము శక్తి

గలిగిన జీవశక్తి, యివియన్నియుగూడ నీదీర్ఘవ్యాధులను నిర్మూ లము జేయుటకు అసమర్థములు.

## 79

ఇంతకుపూర్వము సవాయివ్యాధి ఒక్కటిమాత్రమే, దీర్ఘదోషసంబంధమైన వ్యాధియనియు, నివారణజేయని పక్షమున జీవితాంతముతోనేఅంతరింపగలదనియు, కొంతవరకు తెలియును. సెగవ్యాధిగూడ నిక్లేసరియగు ఔషధచికిత్సగావింపనిదే జీవశక్తి మూలమున తొలగింపబడ జాలదు. కానియిదిగూడ విచిత్రస్వాభావముగల దీర్ఘవ్యాధి దోషసంబంధమైనవ్యాధియని తెలిసికొనబడియుండలేదు. ఇదినిస్సందేహముగ దీర్ఘవ్యాధి తత్వసంబంధమైన వ్యాధి (Chronic miasmatic disease). చర్మములపై జనించు మొటిమలను నిర్మూలముచేసినంతమాత్రమున నీవ్యాధి నివారణ చేసియుంటిమని వైద్యులుతలంచిరిగాని యీవ్యాధివలనగలిగిన విషువకబాధించు విషదోషము వీరిపరిశీలనకు దూరమయ్యెను.

## 80

ఇప్పుడు తెల్పబడిన యీరెండు దీర్ఘవ్యాధి సంబంధమైన వ్యాధులకంటెను ముఖ్యమైనది చిడుము (Psora సొరా) సంబంధమైన దీర్ఘవ్యాధి: పై రెండు వ్యాధులును, సవాయి

వ్యాధి, పుండురూపమునను శగవ్యాధి పిలకలమూలమునను, బహిర్గతము కాగలవు. వ్యాధిదోషము అంతరంగమునందంటను వ్యాపించినపిమ్మట, చర్మముపై విచిత్రమైన పొక్కులు బయలుదేరి ఒక్కొక్కప్పుడు కొలదిపొక్కులతో మాత్రమేయుండి తీరనిదురదతోను చురుకుతోనువిచిత్రమైన దుర్గంధము వెడలించుచు అంతరంగ సోరా దోషము బహిర్గతమగును. లెక్కలేని వ్యాధులగు, నరముల నిస్సత్తువ, అపస్మారమను హిస్టీరియా, మనోవ్యాధి, ఉన్మాదము, బుద్ధిమాంద్యము, మూర్ఛ, అన్ని రకముల ధనుర్వాతములు, రాకైటిస్ అనువ్యాధి, గూను, ఎముకలువాచుట, ఎముకలలో వ్రణములు బయలుదేరుట, వ్రణములు, రక్తముస్రవించు కంతులు, కంతులు, మేహవాత రోగము, మూలశంఖ, కామెర్లు, రక్తదోషమువలన చర్మము నలుపువర్ణముగమారుట, ఉబ్బు, బహిష్టు నిలిచిపోవుట, జీర్ణకోశము, ముక్కు, ఊపిరితిత్తులు, మూత్రకోశము, గర్భకోశము వీనినుండి రక్తస్రావము, క్షయ, రక్తక్షయ, ఊపిరితిత్తులు పుండగుట, నపుంసకత్వము, వంధ్యాత్వము, పార్శ్వపునొప్పి, చెముడు, అంతరకుసుమ, అంధత్వము, మూత్రమునరాళ్ళు, పక్షవాతము, స్పర్శజ్ఞానము నశించుట, వేనకువేలు రకముల వివిధబాధలు, వ్యాధివిచక్షణా శాస్త్రమునందు విశేషముగ చూపింపబడు వివిధప్రత్యేకవ్యాధులు మొదలగు అనంతములైన సమస్తవ్యాధులను జనింపజేయుటకు ఘోరమైన అంతరంగ, దీర్ఘవ్యాధి తత్సంబంధమైన సోరాయే కేవలము

యదార్థమైన మూలకారణము. ♦1

# 81

మిక్కిలి ప్రాచీనమైన యీఅంటువ్యాధి (సోరా) క్రమముగా కొన్నివందల తరములనుండి కొన్నికోట్ల మానవశరీరముల ద్వారా వ్యాప్తిజెంది అత్యాశ్చర్యకరముగ వృద్ధిజెందిన విష

1♦ ఇదివరలో నితరులకెవ్వరికిని తెలియని, యీ అనంతములైన దీర్ఘవ్యాధుల మూలాధారముగూర్చి పరిశీలనజేసి అందులగూర్చి కొన్ని నిర్ధారణలు రుజువుపరచి తేలిసికొనుటకును, యీసహస్రతలల వ్యాధియగు సోరాయొక్క సమస్త సంపూర్ణావస్థలతోగూడిన వివిధరూపములయందును సమానముగా తూగు ప్రధానఔషధములను (సోరా శాంతికరౌషధములు) కనుగొనుటకును పన్నెండు సంవత్సరములు వ్యయపరచియుంటిని. ఈవిషయమునుగూర్చి నాచే రచియింపబడిన దీర్ఘవ్యాధులు అను గ్రంథములో నా అభిప్రాయములను వ్రాసియుంటిని. ఈపరిజ్ఞానమును నేను సంపాదించుటకు ముందు, దీర్ఘవ్యాధులనన్నిటిని ఆరోగ్యమైన శరీరములమీద పరీక్షింపబడిన, పరిశుద్ధమైన గుణములుగల ఔషధములమూలమున, వ్యక్తిగతముగా ప్రత్యేకించి ఎట్లు చికిత్స జేయవలయునో బోధించగలిగియుంటిని. ప్రతిదీర్ఘవ్యాధిని నాశిష్యులు వ్యాధియగుపరచు లక్షణసముదాయమునుబట్టి, చికిత్స జేసి, వ్యాధులచే బాధపడు మానవులీ చికిత్సావిధానమునందలి అమూల్యములైన నివారణాసాధనములగూర్చి పరిపూర్ణానందము పొందు నంతటి నివారణలుగావించియుండిరి. ఔషధమును తయారుచేయువిధము ప్రయోగించుపద్ధతి మొదలగు వివరములతో నూతనముగా కనిపెట్టబడిన సోరా శాంతికరనిర్దిష్ట సారూప్యౌషధములమూలమున, సోరానుండుద్భవించు దీర్ఘవ్యాధులను నిర్మూలముగావించు యాశయము నెరవేరుచుండుటచే సింతకంటె ఆనందము పొందతగినకారణము మరియొకటి యుండజాలదు.

సము మానవప్రపంచమున నిప్పుడు లెక్కలేని వ్యాధులు నేకవ్యాధిరూపముల నెట్లు పరిణమించుచున్నవో, మరియు ట్టి అనేకరకముల దీర్ఘవ్యాధులు (సోరాయొక్క ద్వితీయ ణము) జనించుటకు లెక్కింపజాలని యెన్నిపరిస్థితులు 1♦ హేయభూతమగుచున్నవో యవియన్నియు గోచరము కావింప లవు. ఇందులకుతోడు పురుషశరీరములయందుగల వర్ణింప లవిగాని విచిత్రభేదములు ఆశ్చర్యమునకెంతమాత్రము సందే ము లేకుండ యిట్టిహానికర కారకత్వములు మరియొక విభేద న. సోరాతోగూడిన యితర శరీరములతో (స్త్రీలతో) లయినపుడు లెక్కింపనలవిగాని అనేకరకముల లోపములు పద్రవములు, బాధలు, మార్పులు కలుగగలవు. ఈవిధమగు ్యాదులన్నియు అల్లోపతీవిధానవ్యాధి విచక్షణా శాస్త్రము

---

సోరా శాంతికరౌషధములనుండి, నివారణచేయనలసిన దీర్ఘవ్యాధిలక్షణ లకు మిక్కిలిసారూప్యమగు ఔషధమును వైద్యులు ఎంచుకొనవలయును. వ్యాధికనుకూలించు ఔషధమును (సోరా శాంతికరఔషధములు) ప్రయోగించుటవలన, వైద్యుడు రోగికి, ముఖ్యమైన సేవగావించి నిశ్చయ న వ్యాధినిర్మూలము శాశ్వతముగ గావించగలుగును.

♦1 శరీరారోగ్యము, దీర్ఘవ్యాధులలోనికి మారుటకు, ప్రాబల్యము హించు, పైనచెప్పబడిన కొన్నికారణములపైనను, శీతోష్ణపరిస్థితులపై ను, నివశించుగృహముయొక్క, స్థానికవిచిత్రములపైనను, బాలురకు కపు, శరీరమానసికశిక్షణలపైనను, యిట్టి క్రమశిక్షణ గరపుటయందలి శ్రద్ధమీదను, జీవిత అమిత ఆక్రమవ్యాపారములపైనను, భోజనపద్ధతుల నను, అలవాటుపరివర్తన, వాంఛలు, మొదలగు సమస్త నడవడికలపై ను, ఒక్కొక్కపుడు సోరా ఆధారపడియుండును.

నందు *2 ప్రత్యేక నామములతో స్వతంత్రవ్యాధులక్రింద చూపబడుచున్నవి.

*2 ఈవ్యాధి విచక్షణాశాస్త్రమునందు, అనేక భేదమైనవ్యాధి లక్షణములుగల ఒక్కొక్కవ్యాధికి సందేహార్థముగల అనుచితములైన నామములు ప్రకటింపబడెను. ఇట్లు నామకరణము గావింపబడిన, విడుపు జ్వరము, కామెర్లు, ఉబ్బు, క్షయ, కుసుమ, మూలశంఖ, మహావాతము బాలపాపచిన్నె, ధనుర్వాతము, అపస్మారము, ఉన్మాదము, మొదలగు వ్యాధులు ఒక్కొక్క ప్రత్యేకలక్షణములో తప్ప తక్కినవిషయముల యందు ఒకదానితోనొకటి పోలియున్నప్పటికి యీవ్యాధులుమార్పు జెందని నిర్దిష్టమైన వ్యాధులక్రింద పరిగణింపబడి, వాని నామములనుబట్టి, నిర్దిష్ట మైన పద్ధతిననుసరించి చికిత్సజేయబడుచున్నవి. నామకరణము కావింప బడిన పేరునుబట్టి ఒకేవిధమగు చికిత్సగావించుట, ఎట్టిన్యాయసమ్మతము కాగలదు? ఒకేవిధమగు చికిత్సగావించనిపక్షమున అట్టితరగతివ్యాధుల కుంచబడిన నామమునుబట్టి నిర్ధారణచేయబడిన ఒకేవిధమగు చికిత్సచేయబడు చుండుటకు కారణమేమి? "ముఖ్యముగ భేదమైన వ్యాధులుగూడ ఒకే పేరున పిలువబడుచున్న" వని ఫ్రిట్జి అనునాతడు విచారకరముగ దెల్పియుం డెను. మనకు తెలియని ఒకప్రత్యేకపద్ధతిలో, ఒక్కొక్కసమయములలో విడిగా వ్యాపించు అంటువ్యాధులుగూడ, యిదివరలో నిరూపణజేయబడిన, నామముతోనే, యీతరహావ్యాధులన్నియు, ఒకేవిధమైనవ్యాధులని భావింప బడి ప్రాచీనవిధాన వైద్యములో చికిత్స చేయబడును. జైలుజ్వరము, ప్రయాణజ్వరము, విషజ్వరము, పైత్యజ్వరము, మొదలగు జ్వరములు, ఏతరగతి కాతరగతి ప్రత్యేకమైన వ్యాధియనియు, నివి ఎల్లప్పుడు ఒకే విధముగా సంభవించుననియు, వారిఅభిప్రాయము. ఈజ్వరములు వ్యాపించు నప్పుడు ఒక్కొక్కకాలములో ఒక్కొక్క క్రొత్తలక్షణములతోను, గమనికతోను, అనేకములైన ముఖ్య వివిధలక్షణములతోను, వ్యాపించునని వారు గ్రహింపరు. ఈజ్వరములలో అంతకుపూర్వమగుపడని క్రొత్త

# 82

దీర్ఘవ్యాధులయొక్క మూలకారణమును కనిపెట్టుట మూలమునను సోరాదోషమును నివారణజేయుటకు ప్రత్యేకమైన సారూప్యౌషధములను కనిపెట్టుటమూలమునను నివారణచేయవలసిన వ్యాధుల స్వభావమునుగూర్చి తెలిసికొనవలసిన పరిజ్ఞానమునందు వైద్యవిధానము ముందడుగువైచియున్నది.

---

లక్షణములగుపడినను నివియన్నియు నావ్యాధియనియే తలంచుడు. వెనుక వ్యాపించియున్న అంటువ్యాధికిని, అటుపిమ్మట వ్యాపించిన అంటువ్యాధికిని, భేదమున్న సందర్భములలోగూడ, వ్యాధివిచక్షణాశాస్త్రములో నిట్టివ్యాధినిగూర్చి తెలుపబడియున్నంతమాత్రమున ఆపేరునుబట్టి యీభేదమైన లక్షణములుగల వ్యాధికిగూడ ఆనామమునుబట్టి అందు నిర్ధారణచేయబడిన చికిత్సనే గావించుట న్యాయవిరుద్ధము. నిష్కపటియగు సిడెన్హామ్ అనునాతడొక్కడు మాత్రమే యీవిషయమును గ్రహించి వెనుకవచ్చిన అంటువ్యాధికిని, ముందుకలుగబోవు అంటువ్యాధికిని నెట్టివిధమగుసంబంధము ఉండజాలదనియు, ప్రతివ్యాధికిని ప్రత్యేకించి చికిత్సజేయవలయుననియు, ప్రతిపర్యాయమువచ్చు వ్యాధియు వెనుకటివ్యాధికంటె భేదమైయుండగలదనియు తెల్పియుండెను.

గాన నిట్టి యనుపయోగమైనవియు, అసంగతములైనవియు, అగు నామములనుబట్టి సరియైన వైద్యుడెన్నడును చికిత్సకు గడంగరాదు. వ్యాధికిగల అనేకలక్షణములలో ఒక్కలక్షణముయొక్క పోలికనుబట్టి ఉంచబడిన జబ్బుపేరునుబట్టి చికిత్సకు గడంగక, రోగియొక్క వ్యక్తిగత వ్యాధిలక్షణములను కడుజాగరూకతతో గ్రహించి, చికిత్సకు గడంగవలయును. కాని వ్యాధిసందర్భమును ఊహించి యెన్నడును చికిత్స చేయరాదు.

నివారణ చేయవలసిన ప్రతిదీర్ఘవ్యాధి (సోరాసంబంధ) యొక్క-చిహ్నములను నిర్ణయించుటలో ఆవ్యాధియందు అవకాశేషము స్వాంతవరకు లభ్యమగు లక్షణములను వానియొక్క సహజ గుణములను గ్రహించుట ముఖ్యావసరము. ఈవిషయములను తెలిసికొని వ్యక్తిగతముగ ప్రత్యేక చికిత్స గావింపకుండ నేవ్యాధి యుండినను యథార్థముగ నివారణ కలుగజాలదు. కాని యిట్టి సందర్భములయందు త్వరితముగ వృద్ధిజెందు తరుణవ్యాధికిని, దీర్ఘ వ్యాధికిని కొంతవ్యత్యాసముంచవలయును. తరుణవ్యాధులలో ముఖ్యలక్షణములు వెంటనే గోచరించి మనస్సునకు వెంటనే తట్టగలవు. గాన వ్యాధిరూపమును కనుగొనుటకు విశేషకాల మవసరముండదు. తరుణవ్యాధిలో ప్రతివిషయము ప్రత్యక్ష ముగ నగుపడుచుండుటచే విశేషముగ ప్రశ్నల నడుగవలసిన అవసరములేదు. ♦1 కాని దీర్ఘవ్యాధి క్రమక్రమముగా సంవ

---

కాని ఒక్కొక్కప్పుడు ఒకరోగినిగూర్చి సామాన్యమనుష్యులకు తెలియునట్లు తెలుపుటకు వ్యాధి నామములుపయోగింపవలసి వచ్చును. అట్టి సందర్భములయందు సాధారణముగా, ఒకవిధమైనఉబ్బు, ఒకవిధమైన సన్నిపాతజ్వరము, ఒకవిధమైన విడుపుజ్వరము, అని అనిర్దిష్టనామములు, మాత్రమే ఉపయోగింపవలెను. వ్యాధినామములు కలుగచేయు దురభిప్రాయముల కెడమియ్యనట్లు ఉబ్బు, సన్నిపాతము, విడుపుజ్వరము అని ఎంతమాత్రము తెల్పరాదు. ఏలనన, యీవ్యాధులెల్లపుడు మార్పుజెందని ఒకే స్వభావముగల లక్షణములతో నుండజాలవు.

♦1 గాన యీక్రిందవివరింపబడిన సూచనలు, తరుణవ్యాధుల లక్షణములను తెలిసికొనుటకు కొంతవరకుపయోగింపగలవు.

త్వరముల తరుబడి వృద్ధిజెందును గాన తరుణవ్యాధియందుకంటె దీర్ఘవ్యాధియందు లక్షణములను గ్రహించుట మిగులకష్టము.

## 83

వ్యాధినిగూర్చి వ్యక్తిగతమైన పరీక్షగావించు విషయమున నిచ్చట వివరింపబడిన సర్వసామాన్య సూచనలు వ్యక్తిగతమైన ప్రతివ్యాధికి ఎంతవరకు వర్తించునో వైద్యుడు జ్ఞప్తియందుంచుకొనవలయును. ఇట్టి పరీక్షయందు వైద్యుడు దుర్భ్రమములకు తావొసంగక స్వేచ్ఛగ మంచిపరిజ్ఞానముతో కడుజాగరూకతతో గమనించి వ్యాధిరూపమును కనుగొనుటకు శ్రద్ధవహింపవలెను.

## 84

తనకుగల బాధలయొక్క చరిత్రను రోగివివరించును. అతనికిగలబాధనుగూర్చి వినినవిషయములను, అతనెట్లు ప్రవర్తిం
చుచున్నది? అతనియందేవిషయములు గాంచబడుచున్నవి? ఆతనిసన్నిహితులు దెల్పుదురు. ఈవిషయములను వైద్యుడుచూచివిని, రోగియందు మార్పుజెందిన విశేషలక్షణమేమి గలదో తనసూక్ష్మబుద్ధిచే గ్రహించవలయును. రోగి, వాని సన్నిహితులు దెల్పిన విషయములను వారిచే తెల్పబడిన మాటలలోనే సరిగా వ్రాసికొనవలయును. వైద్యుడు మౌనముగానుండి మరియొక ధోరణిలోనికి వారు బోకుండునంతవరకు ఎట్టి ఆటంకము

నిరోధింపక ♦1 వారు చెప్పదలచినదంతయు చెప్పువరకు వేచి యుండవలయును. పరీక్షా ప్రారంభములో వారుచెప్పువిషయము ల యందలి ముఖ్యమైన భాగములను వ్రాసికొనుటకు నెమ్మదిగ చెప్పవలసినదిగా వైద్యుడు రోగికి సలహా నీయవలయును.

# 85

రోగిచేతను ఆతని స్నేహితులచేతను తెల్పబడు ప్రతి నూతన విషయమును ఒకలక్షణమునకు పిమ్మట వేరొకలక్షణము వరుసగా నుండునట్లు క్రొత్తపంక్తితో ప్రారంభించి వ్రాసికొన వలయును. అందుమూలమున మొదట అస్పష్టముగ తెలుప బడిన విషయములు పిమ్మట వివరముగ తెలిసికొని వ్రాసికొను టకు వీలుగానుండును.

# 86

లక్షణములను తెల్పువారు తమసహజధోరణిలో తెల్ప వలసిన విషయములన్నియు తెల్పి ముగించిన పిమ్మట ప్రతి ప్రత్యేక లక్షణమును గూర్చియు యీక్రింది పద్ధతిలో సరియైన సమాచారమును తెలిసికొనవలయును. తనకు తెల్పబడిన లక్షణ

---

♦1 విషయమును తెల్పునప్పుడు మధ్య ఆటంకపరచిన, వరుస క్రమముతప్పి ధోరణి ఆలోచనపోవును. అందుచే వారు మొదట తెల్ప దలచిన విషయమంతయు అదేవిధముగ చెప్పుటకు వారిమనస్సునకు తట్టదు. కాన మధ్య ఆటంకపరుపరాదు.

ములను ఒకటి తర్వాత నొకటి చదివి యింకను ప్రత్యేకవివర ములగూర్చి విచారించవలయును. అనగా:—ఏకాలములో ఈలక్షణము సంభవించినది? ఇదివరలో అత దుపయోగించి యున్న ఔషధము తీసికొనుటకు పూర్వమా? ఆమందు తీసికొనుచున్నప్పుడా? లేక ఆమందు మానివేసిన కొన్నిదినములకా? ఏవిధమైనబాధ? సరిగా: ఎట్టిభావన? యీభాగమునకలిగినదేనా? సరిగా ఆచోటు ఎచ్చట? బాధదానంతటది అనేకసార్లు ఆచిఆచి వచ్చినదా? లేక విరామములేకుండ ఒకేవిధముగా నున్నదా? ఎంతకాలమున్నది? పగలుగాని లేక రాత్రిగాని ఏసమయములో శరీరము ఏఅవస్థయందు (position) హెచ్చుగానుండును లేక పూర్తిగా తగ్గిపోవును? తెల్పబడిన యీసంగతి ఆసందర్భము యొక్క యదార్థ స్వభావమెట్టిది?

## 87

తనప్రశ్నలవలననే రోగికిసమాధానముతట్టి ♦1 'అవును కాదు' అని సమాధాన మీయవలసిన విధముగా గాకుండ యీవిధముగా ప్రతి ప్రత్యేకవివరముగూర్చి ఎక్కువసమాచా

---

♦1 వైద్యుడు రోగిని "నీస్థితియీవిధముగా నున్నదికాదా? ఆవిధ ముగానున్నదికాదా?" అని ఎప్పుడును అడుగరాదు. అట్టిసలహాలనిచ్చి అపచారము, నెప్పుడును కావింపరాదు. అట్టిసలహాలమూలమున తప్పు సమాధానములను చెప్పుటకును, తప్పుగా లక్షణములను తెలుపుటకును రోగి పురికొల్పబడును.

రమును సంపాదించవలయును. అట్లుజేయని పక్షమున సోవ రనము చేతను లేక ప్రశ్నించువారిని తృప్తిపరచుటకు, 'అవు కాదు' అను సమాధానములతో యదార్థముగాని సంగతుల నిశ్చయముగాని విషయములు, అర్థసత్యములు తెల్పబడును ఆరంభమూలమున వ్యాధియొక్క యదార్థరూపము గోచరింప అననుకూలమైన చికిత్స ప్రాప్తించును.

## 88

ఇట్టి స్వేచ్ఛాపూర్వకముగ నొసంగబడు వివరములలో వివిధాశయములను గూర్చిగాని, శరీర కార్యాచరణ పద్ధతి గూర్చిగాని, మానసిక పరిస్థితిని గూర్చిగాని ఏమియు తెల్పబడ పక్షమున యీవిషయములగూర్చి ♦1 యింకను ఏమి తెల్పబడ నో వివరముగ తెలిసికొనుటకు వైద్యుడు రోగిని ప్రశ్నింపవ యును. ఈహంశములను తెలిసికొనుటలో రోగి వానినిగూర్చి ప్రత్యేకవివరములను తెలుపుట కనువగునట్లు సర్వసామాన్య రీతినే వైద్యుడు రోగిని ప్రశ్నింపవలెను.

---

♦1 ఇందుల కుదాహరణ. విరోచనము ఏవిధము గానుండును మూత్రవిసర్జన మెట్లుగావించును? పగటినిద్రయందు రాత్రినిద్రయంద ఎట్లుండును? స్వభావము, రసజ్ఞత జ్ఞాపకశక్తి ఎట్లుండును? దాహ మెట్లుండును? నోటియందు ఏవిధమైన రుచియుండును? ఏవిషయమై ఆహారపానీయములయందు అభిరుచియుండును? కిట్టనివస్తువులేవి? ప్ర వస్తువు స్వభావమైనరుచితో రుచించునా లేక అస్వభావమైన రుచియుండు నా? భోజనమైనపిమ్మటను, పానీయములను త్రాగినపిమ్మటను ఏవిధముగ నుండును? తల, కాళ్ళు, చేతులు, కడుపు వీనినిగూర్చి చెప్పవలసి సంగతేదైనగలదా?

## 89

రోగిచే (వ్యాధికలదని రోగి కపటముగనటించు సందర్భములయందు తప్పలక్షణముల భావమును తెలిసికొనుటకు ముఖ్యముగా రోగిమీదనే ఆధారపడవలయును.) స్వయముగా నీవివరములన్నియు తెలుపబడి ప్రశ్నలకు సరియగు సమాధానములొసంగబడి వ్యాధియొక్క యదార్థచిత్రము గోచరించినపిమ్మట వైద్యుడు తనకు అవసరమైన వృత్తాంతమంతయు వచ్చియుండలేదని భావించిన పక్షమున యింకను ప్రత్యేకమైన సరియగు ప్రశ్నలను స్వతంత్రించి యడుగవచ్చును. ♦1

---

♦1 ఇందుల కుదాహరణము:— ఎన్నిసార్లు విరేచనమగును? విరేచనము సరిగా ఎట్లుండును? తెలుపువిరేచనములో చీముండునా లేక పట్టి మలమే వెడలునా? విరేచనమగునప్పుడు బాధఉండునా? ఉండదా? ఆబాధ సరిగా ఎట్లుండును? ఎచ్చటఉండును? రోగి ఏమివాంతిచేయును? నోటియందు అరుచి, చేదుగానుండునా? పుల్లగానుండునా లేక ఎట్లుండును? ఈఅరుచి భోజనమునకుపూర్వమా లేక పిమ్మటా? లేక భోజనము చేయుచున్నప్పుడా? దినమునందు ఎప్పుడుఎక్కువగానుండును? త్రేణుపులు ఏరుచిలోనుండును? మూత్రము వెడలి కొంతసేపు నిలచినపిమ్మట మడ్డిగానుండునా? లేక మొదట వెడలినవెంటనే మడ్డిగానుండునా? మూత్రము వెడలినవెంటనే ఏరంగులోనుండును? మూత్రముఅడుగున జేరు మడ్డి ఏరంగులోనుండును? నిద్రలోరోగి ఎట్లుండును? నిద్రలో పలువరించునా, మూల్గునా? మాట్లాడునా లేక ఏడ్చునా? నిద్రలోలేచునా? గుఱ్ఱుపెట్టుట, లోపలకు గాలిపీల్చునప్పుడా, పైకిగాలివదలునప్పుడా? వీపుపై వెల్లగిత్తుగ పరుండునా లేక ఏప్రక్కను పరుండును? కప్పుకొనిపరుండునా లేక పైన బట్టఉంచుకొనలేకయుండునా? త్వరగా మేల్కాంచునా లేక ఎక్కువ

# 90

## వైద్యుడీ వివరములను వ్రాయుట ముగించినపిమ్మ

గాఢముగా నిద్రపోవునా? నిద్రనుంచి మేల్కొంచిన వెంటనే ఎట్లుండు
ఆయాలక్షణము ఎంతవ్యవధిలోవచ్చుచుండును? అది ప్రతిపర్యాయ
వచ్చుటకు కారణమేమి? కూర్చున్నప్పుడువచ్చునా? పరుండునప్పుడు
నా? నిలచియున్నప్పుడు వచ్చునా లేక నడచుచున్నప్పుడు వచ్చు
ఉదయమున పరగడపునవచ్చునా? లేక సాయంత్రము భోజనమైనపిమ్మ
వచ్చునా? లేక సాధారణముగ ఎప్పుడువచ్చును? హెచ్చుగా ఎప్ప
వచ్చును? పట్టి చలిగాఉండుటేనా లేక నిజముగా శీతలముగూడయున్న
అట్లున్న ఏభాగములో? చలిగాఉన్నప్పుడు శరీరము ముట్టుకున్న వెచ్చ
నుండునా? వణుకులేని శీతలమేనా? ముఖముఎర్రబడక శరీరము వెచ్చ
నుండునా? స్పృశించిన శరీరములో ఏభాగము వేడిగానుండును? చలిఎ
కాలముండును? శరీరమున వెచ్చదనము ఎంతకాలముండును? దాహమె
డుకలుగును? చలిగానున్నప్పుడా? శరీరము వేడిగాయున్నప్పుడా?
యింతకుపూర్వమా? దాహము ఎంతవిస్తారముగానుండును? ఏపానీయము
త్రాగవలయుననియుండును? చెమటఎప్పుడుపట్టును? ఉష్ణమునకుముం
లేక వెనుకనా? లేక ఉష్ణముతగ్గిన ఎన్నిగంటలకు? నిద్రపోవుచున్నవు
లేక మెలుకువగాయున్నప్పుడా? చెమట ఎంతవిస్తారముగాయుండు
చల్లగానుండునా లేక వేడిగానుండునా? ఏభాగమందు చెమటపట్టు
ఎట్లువాసన కొట్టును? చలివచ్చుటకుముందు, చలిగాయున్నప్పుడు
బాధలు కలుగునని చెప్పును? ఉష్ణముగానున్నప్పుడు ఏబాధలుగల
దెల్పును? ఉష్ణముతగ్గినపిమ్మట ఏబాధలను దెల్పును? చెమటయున్నప్ప
గాని చెమట తగ్గినపిమ్మటగాని ఏబాధలను తెల్పును? మొదలగునవి, స్త్రీ
విషయములో, ఋతువివరములను, యితరస్రావముల వివరములను తె
కొనవలయును.

తాను రోగియందే *1 మి పరిశీలన చేయునో యావిషయములను వ్రాసికొని ఆరోగ్యమైన స్థితిలో యావిషయములెట్టి విచిత్రముగ నుండెనో తెలిసికొనవలయును.

## 91

పూర్వముగావించిన చికిత్సలోగల రోగియొక్క వ్యాధి లక్షణములు బాధలు యదార్థమైన వ్యాధిచిత్రమును తెలుప

---

*1 ఉదాహరణ:— వైద్యుడు రోగిని చూచినప్పుడు ఏస్థితిలో నుండెను? సోమరివలె బద్ధకముగా నుండెనా? కలహప్రియుడైయుండెనా? తొందరపాటుగానుండెనా? కన్నీళ్లువిడుచుచు విచారగ్రస్తముగానుండెనా? ఆతురతగానుండెనా? నిరాశతోను విచారముతోను నుండెనా? లేక ఆశాయుతుడై శాంతముగానుండెనా? బద్ధకస్థితిలో నుండెనా, లేక గ్రహణ శక్తిలేక స్తబ్ధుగా నుండెనా? బొంగురు కంఠముతో మాట్లాడెనా, లేక నీరసముగా మాట్లాడెనా? లేక అస్పష్టముగా మాట్లాడెనా? లేక ఎట్లుమాట్లాడెను? సాధారణముగా ముఖము, కళ్ళు, శరీరము యొక్క వర్చస్సు యెట్లున్నది? ఆతనిముఖవైఖరి యందును కండ్లయందును ఎట్టికళ గలదు? నాలిక ఎట్లునది? శ్వాసఎట్లున్నది? నోటియందు ఎట్టివాసనగలదు? శ్రోత్రజ్ఞానమెట్లున్నది? కంటిపాపలు విస్తరించియున్నవాలేక ముకుళించియున్నవా? చీకటిలోను వెలుతురులోను వాటిచలనత్వమెట్లున్నది? నాడియొక్కస్వాభావమెట్లున్నది? కడుపుయొక్క స్థితి ఎట్లున్నది? సాధారణముగా శరీర వివిధావయవములయందు చల్లదనముగాని వేడిగాని ఎట్లున్నది? తలవెనుకకు వ్రేలవైచి, నోరుసగము తెరచిగాని పూర్తిగా తెరచిగాని చేతులుతలపైగాని నడుముపైగాని ఉంచుకొని పరుండునా? లేకఏస్థితిలో బరుండును? లేచుటకు ఎట్టి ప్రయత్నము గావించును? మరియు వైద్యుని మనస్సునకుతట్టు ఏయితర ముఖ్యవిషయమైననుఉన్న వివరముగ తెలిసికొనవలయును.

జాలవు. మందుల నుపయోగించుటకు పూర్వముగల లక్షణ ములు బాధలు, మందుల నుపయోగించుటమానిన కొన్నిదిన ములకు గల లక్షణములు, బాధలు వ్యాధియొక్క ఆదిరూప మునుగూర్చి యదార్థమైన మూలాధారమును తెలియజేయ గలవు. వీనిని ముఖ్యముగ వైద్యుడు గుర్తించవలయును. వ్యాధి దీర్ఘవ్యాధియైయుండి రోగి ఔషధమును సేవించుచున్న పక్ష మున వైద్యుడతనికి ఔషధమొసగక (వెనుకసేవించుచున్న ఔ షధమునునిలుపుజేసి) కొన్ని దినములుంచుటమిక్కిలిలాభకరము. లేక యీమధ్యకాలములో ఔషధముకాని మరియొక వస్తువు నిచ్చి వ్యాధియొక్క భ్రష్టత్వము గావింపబడని నిజమైన స్థిరలక్ష ణములయొక్క పరిశుద్ధత్వమును తెలిసికొని వ్యాధియొక్క విశ్వాస నీయమైన చిత్రమును ఏర్పరచుకొనుటకు సరియగు వ్యాధి పరీక్షను కొంతకాలమువరకు నిలుపవలయును.

## 92

వ్యాధి త్వరితమైన గమనముతోనుండి తీవ్రమైన స్థితిలో వ్యవధిచేయుటకు వలనుపడని పరిస్థితులలోనున్న పక్షమునను ఇతర ఔషధసేవగానించుటకు పూర్వముగల లక్షణములను తెలిసికొనుటకు అవకాశములేని పక్షమునను వ్యాధి ఇతరఔష ధముల మూలమున మార్పుచెందియున్న స్థితియొక్క సంపూర్ణ రూపమును తెలిసికొని అంతటితోనే తృప్తిపడవలసి యున్నది. అసలువ్యాధికి అనుచితములైన మందులనుపయోగించుట మూ

లమున సర్వసాధారణముగా మిక్కిలి తీవ్రమగు ప్రమాదకరమైన స్థితిలోనికి మార్పుచెంద కలదు. గాన సకాలములో సమర్థమైన సహాయము చేయవలసియున్నది. ఈవిధముగా వ్యాధియొక్క సంపూర్ణరూపమును గుర్తించుటచే రోగిసేవించిన హానికరమగు మందులమూలమున రోగి త్యాగముచేయబడకుండ అనుకూలమగు సారూప్యౌషధములతో వ్యాధిని నెదుర్కొనవచ్చును.

93

వ్యాధి స్వల్పకాలము క్రిందటనే సంభవించియున్నపుడును లేక దీర్ఘవ్యాధుల విషయములో తేటతెల్లమైనకారణముల మూలమున కొంతకాలముక్రింద సంభవించినప్పుడును రోగినిగాని అతని బంధువులనుగాని రహస్యముగా ప్రశ్నించిన వ్యాధికారణమునుగూర్చి తక్షణము సమాధానము తెల్పుదురు లేక జాగరూకతతో ప్రశ్నించి తెలిసికొన వచ్చును. 1*

---

1* రోగికాని అతనిస్నేహితులుగాని సిగ్గుచే తమంతతాము దెల్పుటకు సందేహించు వ్యాధికారణమున్న పక్షమున, కడు చాకచక్యముతో గూడిన ప్రశ్నల మూలమునను రహస్యముగా వాకబుచేయుట మూలమునను ఆవ్యాధికారణమును తెలిసికొనుటకు వైద్యుడు ప్రయత్నింపవలెను. ఆత్మహత్యకొరకు గావించుకొనువిషప్రయోగము, ముష్టిమైథునము, అధికవ్యభిచారము, సారాయిమొదలగు మత్తుపదార్థములు, కాఫీ, హానికరమగు నొక ఆహారపదార్థమును ప్రత్యేకముగా విశేషించి భుజించుట, సుఖసంబంధమైనవ్యాధులు చిడుము అంటు సంబంధముగా సోకుట, ప్రేమభంగము, అసూయత, దురదృష్టసంసారము, కుటుంబమునందు సంభవించు విపత్తువలన కలుగు ఖేదము, తాపత్రయము, అగౌరవింపబడుట, పగదీర్చుకొనలేకపోవుట, గర్వభంగము, ఋణబాధ, మూఢనమ్మకములవలన భయము, ఆకలిబాధ, శరీర రహస్యభాగములు లోపించుట, విచ్ఛిన్నమగుట లేక దిగజారుట మొదలగునవి ఈ తరగతి చెందును.

## 94

దీర్ఘవ్యాధుల స్థితినిగూర్చి విచారించునప్పుడు రోగి యొక్క సాధారణవృత్తి, జీవితపద్ధతి, ఆహారనియమము, గృహ పరిస్థితులు మొదలగునవి వ్యాధిని కలుగ జేయుటకు సహాయ భూతమగుటయందు ఎంతవరకు కారణభూత మగుచున్నవో తెలిసికొని వానిని తొలగించుటచే ఆరోగ్యము పొందించు టకు ♦1 బాగుగ యోచించి పరిశీలన చేయవలసి యున్నది.

## 95

దీర్ఘవ్యాధులయందు పైన చెప్పిన వ్యాధిచిహ్నములను యితర సమస్త లక్షణములను అవకాశమున్నంతవరకు అతిజాగ

---

♦1 స్త్రీలదీర్ఘవ్యాధులలో, గర్భిణి, వంధ్యత్వము, సంయోగవాంఛ ప్రసవము, గర్భస్రావము, పాలిచ్చుట, ఋతుస్రావపరిస్థితులు వీనిని గూర్చి ప్రత్యేకయోచన గావించవలసియున్నది. ముఖ్యముగ ఋతుస్రావ విషయములలో, బహిష్టుసకాలమునకు ముందేజరుగుచున్నదా? సకాలములోగాక ఆలస్యముగా జరుగుచున్నదా? ఋతు స్రావము ఎన్నిదినములు జరుగ చున్నది? స్రావము తెంపులేక జరుగునా లేక ఆగిఆగి జరుగునా? ఎంత పరిమాణముగల స్రావముండును? ఎట్టివర్ణము గానుండును? బహిష్టుకుముందు గాని బహిష్టుస్రావము నిలచిపోయిన పిమ్మటగాని తెల్లకుసుమ యగుపించునా? ఎట్టి మానసిక శరీర బాధలు బహిష్టుకు ముందుగాని బహిష్టులోగాని, బహిష్టుక పిమ్మటగాని సంభవించును? కుసుమ ఉన్న పక్షమున, స్రావము ఎట్టిబాధతో గూడి యుండును? ఎంత పరిమాణముండును? ఎట్టి సమయములయందు ఎట్టి కారణములపై కలుగుచుండును? మొదలగు విషయములన్నియు సవిస్తరముగా తెలిసికొనవలయును.

రూకతతో పరిశోధించుటయేగాక అతిసూక్ష్మమైన విచిత్ర లక్షణములను తప్పక తెలిసికొనవలయును. ఏలనన యీవ్యాధుల యందు తరుణవ్యాధులయందు గాంచబడని యీలక్షణములే మిక్కిలి సహజలక్షణములు. (Characteristic symptoms). వ్యాధిని నివారణచేయ దలచినప్పుడు యీలక్షణములను సరిగా గుర్తించవలెను. మరియు యీరోగులు దీర్ఘకాలమునుండి యీవ్యాధిలక్షణముల ననుభవించుచు వాని కలవాటుపడియుండుటచే విశేషార్థముగలిగి మందును నిర్ధారణచేయుటకు మిక్కిలి ఉపయోగకరమగు యీస్వల్ప అనుచర లక్షణములయందు (Accessary symptoms) లక్ష్యముంచక అవిగూడ తమస్థితికి అవుసరమైన ఆరోగ్యలక్షణములే అని భావించి పదిహేను లేక యిరవై సంవత్సరములనుండి పడు బాధలలో యీస్వల్ప అనుచర లక్షణములను వ్యాధిలక్షణములుగా భావించక యీలక్షణములకు ప్రధానవ్యాధితో ఎట్టిసంబంధము ఉండజాలదని తలంతురు. గాన యీఅతిసూక్ష్మమైన సహచర లక్షణములను అతిజాగరూకతతో తెలిసికొనవలయును.

## 96

అదియునుగాక రోగులు స్వభావమునందు అనేక విధములుగా నుందురు. అందు ముఖ్యముగ రోగభీతి విశేషముగ గలరోగులు తమబాధనుగూర్చి అతి ఆతురతతోను, బాధను ఓర్చుకొనలేని సున్నితస్థితిలోను యుండి సత్వరముగ రోగోపశమ

నము గావించుటకు వైద్యుని పురిగొల్పుటకుగాను వ్యాధిలక్ష ణములను మిక్కిలి విస్ఫుటముగా వివరించుచు తమబాధలను గూర్చి అతిశయోక్తి భావములతో వర్ణింతురు. ‡1

## 97

ఇట్టి స్వభావమునకు వ్యతిరేకమైన స్వభావముగ యితరవ్యక్తులు కొంత సోమరితనముచేతను, కొంత సిగ్గుచేతను కొంత సాత్త్విక స్వభావముచేతను, లేక మనో దౌర్బల్యము చేతను, అనేక లక్షణములను తెల్పక వదలివేయుచుందురు లేదా సందిగ్ధముగా తెల్పుదురు. లేదా వ్యాధికి సందర్భ యుండలేదని కొన్ని లక్షణములను వదలివేయుదురు.

---

‡1 రోగభీతి విశేషముగగల రోగి ఎంతటి అత్యాతురుడై యున్న టికి వ్యాధిలక్షణములను బాధలనుకల్పించి ఎన్నడును తెల్పజాలడు. యిట్టిరోగికి ఔషధముగాని మరియొక వస్తువునిచ్చుచు, వివిధసమయ యందు అతడు తెల్పు వ్యాధిలక్షణ తారతమ్యమునుబట్టి యీవిషయమును ధ్రువపరుపవచ్చును. వ్యాధిలక్షణమును రోగి అతిశయోక్తిగా తెల్పు సందర్భ లయందు, యిట్టి అతిశయోక్తిగా తెల్పబడిన విషయమునందు కొంత తగ్గించి గ్రహించి, బాధనుఓర్చుకొనలేని భావముసహజలక్షణముగాను వ్యాధిరూపమును నిరూపించు ప్రధాన లక్షణములలో నిది ముఖ్యల ముగా ఎంచవలయును. ఉన్మాదరోగులలోను, దుర్మార్గ కపట రోగు ను యీవిషయము వేరువిధముగ నుండగలదు.

98

రోగియొక్క బాధలనుగూర్చియు, గుణములను గూర్చియు, ఆతనినుండియే ఆతనిస్వంతభావములోనే తెలిసికొనుట ఎంత ముఖ్యమో అట్లే అన్నివ్యాధుల యందును ముఖ్యముగా దీర్ఘవ్యాధులయందు వ్యాధియొక్క యదార్ధరూపమును పరిశీలన చేయుటకు ప్రత్యేకలక్ష్య ముంచవలసిన అందలి విచిత్రలక్షణములను ప్రత్యేక నిపుణతతోను అతి జాగరూకతతోను గ్రహించుట అంతముఖ్యము. రోగియొక్క స్నేహితులు, రోగికి ఉపచారము చేయువారు యీవిషయములను తెల్పునప్పుడు పొరబాటుగా ఒకదానికొకటిమార్చి తెల్పవచ్చును. లేదా తప్పుగా తెల్పవచ్చును.

99

స్వల్పకాలముండు వ్యాధులయొక్కయు, తరుణవ్యాధులయొక్కయు పరిశీలన వైద్యునకు మొత్తముమీద మిక్కిలి సులభము. స్వల్పకాలమునుండి కలిగిన ఆరోగ్యమునందలి మార్పులోగల అనగా వ్యాధిలోగల లక్షణములు పూర్తిగా జ్ఞప్తియందుండగలవు. ఈవ్యాధులయందుగూడ వైద్యులు సమస్త విషయములను తెలిసికొనవలసియుండును. కాని విచారణ జేసి తెలిసికొనవలసిన అవసరమంతగ నుండదు. వ్యాధిలక్షణములన్నియు చాలభాగము వైద్యునకు తక్షణమే తెలుపబడును.

100

లక్షణ సముదాయమును పరిశీలనజేయుటలో సమకాలిక వ్యాధులయందును (Epidemic diseases) క్వాచిత్క వ్యాధులయందును (Sporadic diseases) ఈవ్యాధినామమున లేక యితరనామమున యిట్టి పోలికగలిగిన వ్యాధి ఎప్పుడైనను ప్రపంచమునందు సంభవించినదాయని పరిశీలన చేయవలసిన అవసరములేదు. వ్యాధియొక్క నవీనతగాని, విచిత్రతగాని, వ్యాధిని పరిశీలన చేయుటకును, చికిత్సచేయుటకును ఎట్టి వ్యత్యాసమును గలిగింపజాలవు. సరియైన పద్ధతిలో చికిత్సచేయదలచినవైద్యుడు ప్రతివ్యాధినిగూర్చియు తనకు తెలియనిక్రొత్తవ్యాధిగా భావించి వ్యాధియొక్క యదార్థరూపమునే లక్ష్యమందుంచి వ్యక్తిగతమైన ఆవ్యాధినిగూర్చియే సంపూర్ణముగ పరిశీలన చేయవలయును. యదార్థ పరిశీలనకుమారు ఊహాలకును వ్యాధినిగూర్చి యింతకు పూర్వము తనకు పూర్తిగాగాని, కొంతవరకుగాని, తెలియునను భావములకును, ఎన్నడును తావొంగక ఎల్లప్పుడు వ్యాధిని సమస్తరూపములయందు కడు జాగరూకతతో పరీక్షింపవలయును. ఇట్టి వ్యాధులయందు యిట్టి పద్ధతితో గూడిన పరిశీలనయే మిక్కిలి అవసరము. ఇట్టి జాగరూకతతో గూడిన పరిశీలన మూలమున ప్రతివ్యాధియు అనేకవిషయముల యందు ప్రత్యేక స్వభావము గలిగియుండగలదనియు, యిట్టివ్యాధుల కుంచబడిన నామములు నిరాధారముగ నుంచబడెననియు తెలియ

గలదు. కాని అంటురోగ సంబంధమైన పద్ధతిపై వ్యాపించు వ్యాధులగు మశూచికము, ప్లేగు మొదలగు కొన్ని వ్యాధులను యీవిషయమున మినహాయించవలెను.

## 101

సమకాలిక వ్యాధులయందు (Epidemic diseases) ఒక్కరోగియందే వ్యాధియొక్క సంపూర్ణచిత్రము గోచరింపబడదు. ఇట్టి సమకాలిక వ్యాధులలో వైద్యుడు అనేకరోగులను అతిజాగరూకతతో పరిశీలనచేసిన పిమ్మటనే వ్యాధిలక్షణసారూప్యమును తెలిసికొనగలుగును. ఒకరిద్దరు రోగులను పరీక్షించు నప్పటికే వ్యాధియొక్క సహజచిత్రము చాలవరకు బుద్ధికి గోచరించి అందుల కనుకూలించు సారూప్యౌషధమును తెలిసికొన నవకాశము గల్గును

## 102

ఈతరగతికిజెందిన వ్యాధిననుభవించు అనేక రోగుల వ్యాధిలక్షణములను వ్రాయుటవలన వ్యాధిచిత్రము అనావశ్యక విషయములతో నింపబడక అంతకంతకు పరిపూర్ణతజెంది చాల విచిత్రలక్షణములతో మిక్కిలి ప్రత్యేకరూప (సహజ) మేర్పడియుండగలదు. ఇందు ఒకపక్షమున సర్వసామాన్య లక్షణములు (ఆకలిలేకపోవుట, నిద్రలేకపోవుట మొదలగునవి) విచిత్రములతో సరిగా నిర్ధారణచేయబడి యుండగలవు. రెండవపక్షమున

యీవర్గమునకు సంబంధించి అరుదుగా సంభవించు కొలది వ్యాధులలోగల ముఖ్యమైన ప్రత్యేకలక్షణములు ప్రాముఖ్యముగ యగుపడి వ్యాధియొక్క సహజస్థితియెట్టిదో ఏర్పరుపగలవు. *1 ఒక సమయములో వ్యాపించియున్న వ్యాధివలన వ్యాధిగ్రస్తము కాబడిన అందరు వ్యక్తులకు ఒకేమూలాధారమునుండి వ్యాధిసంక్రమించి యుండెను గాన వారనుభవించు బాధలన్నియు ఒకేవ్యాధికి చెందగలవు. ఇట్టిసమకాలికవ్యాధుల యొక్క సంపూర్ణవిషయము వానియొక్క లక్షణసముదాయము ఒక్కరోగినిబట్టి తెలిసికొనబడజాలదు. వివిధతత్వములుగల అనేకరోగులనుండిమాత్రమే గ్రహింపవలెను. (ఈలక్షణ సముదాయమున కనుగుణ్యమగు సారూప్యౌషధమును నిర్ణయించుట కవసరమగు పరిజ్ఞానము వ్యాధిచిత్రమును సంపూర్ణముగ విచారణచేయుటవలననే లభించగలదు.)

## 103

తరుణవ్యాధి స్వభావముగల సమకాలికవ్యాధులగూర్చి తెల్పబడిన విధముననే తత్వసంబంధమైన దీర్ఘవ్యాధులుగూడ ప్రధానస్వభావమునందు ఒకేవిధముగ నుండగలవు. ఈవ్యాధుల

*1 మొదటివ్యాధియందు నిర్ణయించిన సారూప్యౌషధము పిమ్మట చికిత్సచేయు వ్యాధులకనుకూలించునో అనుకూలించదో, లేక యీరెండవ వ్యాధికనుకూలించు వేరొక ఔషధమును నిర్ణయించు కొనవలసియుండునో తెలిసికొనుటకు అవకాశము కలుగజేయును.

యందలి సంపూర్ణవ్యాధిలక్షణములలో సోరానుగూర్చి అతి సూక్ష్మమైన పరిశీలనచేయ వలసియున్నది. ఏలనన ఒకరోగి యందు కొన్నిలక్షణములు మాత్రమే యగుపడును. రెండవ రోగియందు వేరొక కొన్నిలక్షణములును, మూడవ రోగి యందు వానికి భిన్నమైన వేరొక కొన్నిలక్షణములును ఈవిధ ముగానే వ్యాధియొక్క సంపూర్ణ లక్షణ సముదాయమునుండి కొన్నికొన్ని లక్షణములు మాత్రమే యగుపడును. గాన అట్టి తత్వసంబధమైన దీర్ఘవ్యాధియొక్క సంపూర్ణలక్షణములను తెలసికొనుటకు ముఖ్యముగా అందు సోరా లక్షణములను గూర్చి తెలిసికొనుటకు అట్టిదీర్ఘవ్యాధులతో బాధపడు అనేక రోగులను ఒక్కొక్కరినేపరీక్షించి తెలిసికొనవలయును. ఈవిధ ముగా వ్యాధిలక్షణములను సమూహముగా తెలిసికొనకుండ సంపూర్ణవ్యాధిని సారూప్య పద్ధతిని నివారణచేయ సమర్థము లగు ఔషధములను (సోరా శాంతికరౌషధములను) గుర్తించుటకు వలనుపడదు. అట్టి దీర్ఘవ్యాధులతో బాధపడు అనేక మైన రోగులకుగూడ నీఔషధములే సరియైన ఔషధములు.

## 104

వ్యాధిని నిరూపించు ప్రత్యేకప్రాముఖ్య లక్షణ సము దాయము లేక వ్యాధి వివరగకిచెందినను, వ్యాధిరూపముసరిగా నిరూపింపబడినపక్షమున, చేయవలసిన కార్యమునందలి కష్టమైన పని సరవేర్చబడుచున్నది. ఇప్పుడువైద్యునకు చికిత్సయందు

మార్గదర్శకమగుటకు, (ముఖ్యముగా దీర్ఘవ్యాధియైనపక్షమున) వ్యాధిచిత్రముగలదు. ‡1 మరియు వైద్యుడు ఈలక్షణములను వివిధభాగములుగా పరిశీలనచేసి, అందలి సహజలక్షణములను గమనించి, అట్టికల్పితవ్యాధిని, ఔషధగుణములు పరిశుద్ధముగ తెలిసికొనబడిన ఔషధములనుండి, వ్యాధికిసారూప్యముగనున్న ఔషధము మూలమునకలుగజేయుటకు సరియగుఔషధమును పరిశీలనజేయగలుగును. చికిత్సయందు, ఔషధమునుప్రయోగించిన

‡1 ఈవిషయమున ప్రాచీనవిధాన వైద్యులు తమచికిత్సా పద్ధతిలో అంతశ్రమపడిసికొనరు. రోగియొక్క వ్యాధిస్థితులయందలి సూక్ష్మవిషయములను వినవైనవినరు. యదార్థమైన ఔషధగుణములు తెలియని అనేకములైన వస్తువులసంప్రకీకరణముతో తయారు చేయబడు, ఔషధముగూర్చి సంపుటీకరణ సూచీపత్రమువ్రాయుటకు (Prescription) ఆలస్యమగునని రోగితన లక్షణములను వివరముగా తెలుపుటకు అవకాశమే యొసగరు. ఏఅల్లోపతీ వైద్యుడును రోగియొక్క సూక్ష్మమైన వ్యాధి పరిస్థితులను తెలిసికొనుటకు ప్రయత్నించి యుండెనని ఎచ్చటను వినియుండలేదు. మరియు వ్యాధిలక్షణములను వ్రాసికొనుట ఎన్నడును గాంచియుండలేదు. తిరిగికొన్నిదినములకు క్రమ్మరల రోగినిచూచి, తానుఅంతకు పూర్వము మొదటిసారి జూచినప్పుడు వినిన కొలది లక్షణములను జ్ఞప్తికి తెచ్చుకొనజాలడు. ఏలనన యీలోపుగ వివిధవ్యాధి లక్షణములతో బాధపడు అనేక రోగులను చూచివచ్చును. రోగి తెల్పిన విషయములను ఒకచెవితో విని రెండవచెవితో వదలివేయును. క్రమ్మరల రోగినిచూచు ప్రతిసమయమునందును సామాన్యప్రశ్నలను మాత్రమే ప్రశ్నించి, నాడిపరీక్ష, నాలికపరీక్ష మొదలగు తంతునడిపి, వేరొక

మోతాదు హెచ్చించి, యింకను ఎక్కువసార్లు యిచ్చుటకు నియోగించుట [illegible] సమస్కారము

పిమ్మట ఔషధగుణమెట్లున్నదో, రోగియొక్కస్థితి ఎట్లుమార్పు చెందినదో, తెలిసికొని పిమ్మట రెండవ సారిరోగిని పరీక్షించు నప్పుడు, మొదట వ్రాసికొనిన లక్షణములలో ఏయేలక్షణములు తగ్గినవో, ఇంకను ఏయేలక్షణములు మిగిలియున్నవో, యింకను ఏయేక్రొత్త లక్షణములు కలిగినవో తెలిసికొని, తగ్గిన లక్షణము లనుకొట్టివేసి క్రొత్తగ గలిగిన లక్షణము లేవైనయున్న పక్షమున నవిచేర్చు కొనవలయును.

## 105

నివారణచేయదలచిన సహజముగ జనించినవ్యాధియొక్క ముఖ్యలక్షణములకు సారూప్యమగు లక్షణములను జనింప జేయ గల ఔషధములనుండి వ్యాధికనుకూలించు ఒక్కఔషధమును గుర్తించుటకు,యిట్టిఔషధముల యొక్కవ్యాధినిర్మూలనాశక్తిని గూర్చి వలయు పరిజ్ఞానమును తెలిసికొనుట, యదార్థమైన వైద్యునియొక్క రెండవ కర్తవ్యమైయున్నది. అనగా సహజ

---

విసరి, యింకొకరోగిని, యింకొకరోగిని జూచుటకు అనాలోచితముగ తిరుగు చుండును. అతిజాగరూకతతో వ్యక్తిగతముగా రోగిని, పరిశీలనజేసి ప్రతి రోగికి ప్రత్యేకమైన చికిత్సచేసి, మనస్సాక్షిగా పనిచేయవలసిన యీవైద్య వృత్తియందు, చట్టసమ్మతమైన వైద్యులమని పిలిపించుకొను యీఅల్లోపతీ వైద్యులు యిట్టి విధముగ ప్రవర్తించు చున్నారు. ఇట్టిచికిత్సా ఫలితముగ సహజముగ గోచరమగు వికృత ఫలితముతప్ప వేరొండు గలుగజాలదు. గాని సరియగు వైద్యులు వేరొండు లభింపక పోవుటచేతను, షోకు నిమిత్తము (Fashion) అట్టివైద్యులవద్దకే వెళ్ళకతప్పకున్నది

ముగజనించిన వ్యాధులను నివారణజేయు (ఔషధ) సాధనముల యొక్క పరిజ్ఞానమును సంపాదించ వలసియున్నది.

## 106

వివిధమైన ఔషధములయొక్క వ్యాధి జన్యగుణములను పూర్తిగ తెలిసికొన వలసియున్నది. అనగా సహజముగజనించు వ్యాధులకు అనుకూలించు సారూప్యౌషధములను నిర్ణయించు కొనుటకు ముందు ఆఔషధములు ఆరోగ్యమైన శరీరముననే వ్యాధిలక్షణములను జనింపజేసి ఆరోగ్యమును మార్పుచెందించ సమర్థములై యున్నవో ప్రథమమున తెలిసికొనవలసియున్నది.

## 107

ఈవిషయమును తెలిసికొనుటకు యీఔషధములను రోగులకు ప్రత్యేకముగా ఒక్కొక్కటిగా ప్రయోగించినప్పటికి వ్యాధిలక్షణములతో యీ ఔషధలక్షణములు కలసిపోయి విస్పష్టముగ యగుపడవు. గాన యదార్థమైన గుణములు తెలసి కొనఁడజాలవు.

## 108

గాన ఔషధములయొక్కయదార్థగుణములను తెలిసికొను యాశయము సఫలీకృతమగుటకును, ఈవ్యక్తుల ఆరోగ్యము నందెట్టి విచిత్రలక్షణము లీఔషధములు గలుగజేయునో తెలిసి

కొనుటకును, ఆరోగ్యమైన శరీరమునందును మనస్సునందు ఎట్టి చిహ్నాలను లక్షణములను జనింపజేయునో తెలిసికొనుటకును, పరీక్షార్థము, మితమైన మోతాదులలో ఔషధములను ఆరోగ్యమైనవ్యక్తులపై, ప్రయోగించుటకంటె వేరొండు ప్రకృతి శిద్ధమైన మార్గములేదు. అనగా 24 మొదలు 27 వరకుగల పేరాలలో వివరింపబడిన విధముగ, నీఔషధములు ఏవ్యాధి లక్షణములను జనింపజేయగలవో, ♦1 అట్టివ్యాధులను నివారణజేయగల శక్తి గలిగియుండును. ఈవిషయము (ఔషధగుణము) పరిశీలన వలననే తెలియగలదు.

## 109

ఈమార్గమును జూపించుటకు నేనే ప్రథమపురుషుడను. మానవసౌభాగ్యము కొరకు ఆశీర్వాదయుక్తమైన యీగొప్ప సత్యముకొరకు పట్టుదలతో కృషిజేసి వ్యాధులు సారూప్యౌష

♦1 నాకు దెలిసినంత వరకు గతరెండువేల ఐదువందల సంవత్సరములలోను గొప్ప అవతారపురుషుడగు ఆల్ బ్రెక్ వాన్ హేలర్ తప్ప నితరులలో నేయొక్క వైద్యుడునుగూడ, ప్రతి ఔషధము ఎట్టివ్యాధిస్థితులను నివారణజేయ సమర్థమైయుండెనో తెలిసికొనుటకు, పరిశుద్ధమైనట్టియు, ప్రకృతి శిద్ధమైనట్టియు, అత్యావశ్యక మైనట్టియు, యీపద్ధతిని గూర్చి ఆలోచించి యుండలేదు. ఆతడొక్కడు మాత్రమే నావలెనే దీనియవసరమును గాంచి యుండెను. గానిఏఒక్క వైద్యుడునుగూడ యీఅమూల్యమైన సలహాను అనుకరించి యుండలేదు.

రోగముల ‡1 మూలమ్మున మాత్రమే నిశ్చయముగ నివారణ చేయ సాధ్యమగునని ♦2 తెలిసికొనగలిగితిని.

## 110

పొరబాటున పెద్దమోతాదులలో నిచ్చుటవలన గాని ప్రాణముదీయుట కిచ్చినప్పుడు లేక తీసికొనుటకు పుచ్చుకొని నప్పుడుగాని లేక తదితర సందర్భములయందుగాని, ఔషధ పదార్థములు ఆరోగ్యమైనవ్యక్తుల జీర్ణకోశములోనికి ప్రవేశించి నప్పుడు ఎట్టివిధమగు వ్యాధిలక్షణములు గాంచబడెనని వెనుకటి

---

‡1 రెండుచుక్కలమధ్య ఒక్కనిడివి గీటుతప్ప అనేకగీట్లు గీయుట యెట్లు అసాధ్యమో అట్లే శస్త్రచికిత్స అవసరము లేనివ్యాధులను చికిత్స చేయుట హోమోపతీ చికిత్సవలన తప్ప వేరొండు పద్ధతిని చికిత్స చేయుట అసాధ్యము. ఇంతకంటె యదార్థమైన వేరొక చికిత్స లేదు. సారూప్యౌషధ విధాన చికిత్సను, ఆదిసూత్రములనుబట్టి గ్రహింపజాలక, లేక తగుజాగరూకతతో కృషిసలుపక, మరియు సారూప్యౌషధచికిత్సా నివారణలను గాంచక, అట్టి విషయములను చదువక, హానికరమగు వైరూప్యౌషధ చికిత్సతో పాటు యదార్థమగు యీచికిత్సా విధానమునందుగూడ అట్టి విధమగు స్థానమేయుంచి, వ్యామోహములకు ఆస్కారమొసగు యితర పద్ధతులమూలముననగూడ వ్యాధులు నివారణ జేయబడగలవని తలంచువ్యక్తులుగూడ గలరు. మనస్సాక్షిగ ప్రవర్తించు నాయదార్థమైన శిష్యులగు హోమోపతీవైద్యులు తాముగావించు, ఆశాభంగమెప్పుడును కలుగజేయని జయప్రదమగు చికిత్సల మూలమున వీరికి తగుకీర్తిని చక్కగ బోధించగలరు.

♦2 ఈపరీక్షయొక్క ప్రథమ ఫలితములు, యితర భాషలలోగల గ్రంథములో ప్రకటించితిని.

గ్రంథకర్తలు తెలిపి యుండిరో యీ ఔషధ పదార్థములను నామీాదను యితర ఆరోగ్యమైన వ్యక్తులమీాదను ప్రయోగించి కొనినప్పుడు అట్టిలక్షణములనే గాంచియుంటిని. ఈప్రమాదకరమైన పదార్థములను యితరులుపయోగించకుండ హెచ్చరించుటకు యీతీవ్రమైన పదార్థములయొక్క ప్రమాదకరమగు గుణములను దృష్టాంతములరీతిగ విషప్రయోగ చరిత్రవివరములతో యీగ్రంథకర్తలు ముఖ్యముగా దెల్పియుండిరి. మరియు ప్రమాదవశమున యీతీవ్రమైన పదార్థములు ప్రయోగింపబడినప్పుడు వానినెదుర్కొనుటకు ప్రయోగింపబడిన ఔషధముల మూలమున తమ చాకచక్యము నుత్ప్రేక్షించుకొనుటకును, లేదా చికిత్సలో రోగి చనిపోయిన పక్షమున విషముయొక్క తీవ్రస్వభావ మిట్టిదని తమపక్షమును సమర్థించుకొనుటకును గూడ యీవివరములు తెల్పియుండిరి. గాని యీపరిశోధకులు వ్రాసియుంచిన యీపదార్థములయొక్క హానికర విషస్వభావ గుణములు యిట్టి లక్షణములుగల స్వభావసిద్ధమైన వ్యాధులను నివారణజేయగల శక్తిగలిగియుండెననియు, యీపదార్థములు కలుగజేయు వ్యాధిలక్షణ దృశ్యము సారూప్యనివారణా శక్తియొక్క అనుకరణరూపమనియు, వానియొక్క ఔషధ శక్తులను తెలిసికొనుటకు వానిని ఆరోగ్యమైన శరీరములపై ప్రయోగించిమాత్రమే తెలిసికొన వలయుననియు, యింతకు పూర్వమే పరిశోధకుడును కలలోనైన తలంచియుండలేదు. వ్యాధులను నివారణజేయుటకు ఔషధములయందుగల యదార్థ

మైన విచిత్రశక్తులు అపూర్వ ఆలోచనల మూలమునను లేక వాసనచూచుట, రుచిచూచుట మూలమునను లేక రూపము మూలమునను, రసాయన పరిశీలన మూలమునను లేక వివిధ వస్తు సంపుటీకరణముచే ఔషధముగ తయారుచేయుట మూల మునను తెలిసికొనబడ జాలవు. ఈఔషధజనిత వ్యాధులయొక్క చరిత్రలు కొంతకాలమునకు యదార్థమైన వస్తుగుణదీపికయొక్క నిజమైన ప్రథమ మూలసూత్రములను లభింపజేయునని యింతకు మున్నెన్నడును తలంపబడి యుండలేదు. వస్తుగుణదీపిక (అల్లో పతీ) ప్రాచీనకాలమునుండి యింతవరకు అసత్య ఆలోచనలతో గూడిన విషయములతోను, ఆలోచనలతో గూడిన కల్పనా విషయములతోను, అనగా ఎప్పుడు జరిగియుండని విషయముల తోను ముఖ్యముగా నింపబడెను,

## 111

నాచే పరిశీలనచేయబడిన ఔషథములయొక్క యదార్థ గుణములు పూర్వీకులచే కనుగొనబడిన యీఔషధముల యొక్క గుణములు (చికిత్సకొరకు అవి వారిచే లిఖింపబడ నప్పటికి) సమానముగ నుండుటచేతను, యితర గ్రంథకర్తల వ్రాతలతోగూడ నీవిషయ మేకీభవించుచుండుటచేతను ఔషధ వస్తువులు ఆరోగ్యమైన మానవశరీరమున వ్యాధిగతమైన మార్పులను ప్రకృతిసిద్ధ నిర్ణయసూత్రము ననుసరించి కలిగించు ననియు, ప్రతిఔషధము తనకుగల విచిత్ర స్వభావమునుబట్టి

నమ్మదగిన కొన్నివ్యాధిలక్షణములను కలుగజేయగలదనియు, మనము సులభముగ తప్పక విశ్వశించపగలము.

112

ప్రాచీనవైద్యులచేతరుచు ప్రమాదకరగుణములను గలిగియున్న పదార్థములతో సంపుటీకరణముచేయబడి విపరీతమైన పెద్ద మోతాదులలో ప్రయోగింపబడు ఔషధములచే గావింపబడుచికిత్సయందు ప్రారంభమునగాక విచారకరమగు పరిస్థితులు అంత్యమగునప్పుడు ప్రథమమున యగుపించినస్థితికి సరియగు వ్యతిరేకమైన స్థితిలోకలుగు కొన్ని అవస్థలను మనము గాంచగలము. ప్రథమగుణమునకు (63) వ్యతిరేకమైన యీలక్షణములు లేక ఔషధములు జీవశక్తిపై కలుగజేసిన గుణమునకు జీవశక్తి శరీరమున కలుగజేసిన యీప్రతీకార గుణములు (అనగా దానియొక్క యీద్వితీయగుణము) (62 మొదలు 67) మితమైన మోతాదులలో ఆరోగ్యమైన శరీరమున ప్రయోగించి పరీక్షించినప్పుడు ఎంతమాత్రము గాంచబడనేరవు. మరియు సూక్ష్మ మోతాదులలో ప్రయోగించినప్పుడు ఎంతమాత్రమైనను గాంచబడవు. సాదృశ్యౌషధ చికిత్సాపద్ధతియందు సజీవ మానవశరీరమున ఆరోగ్యస్థితి కలుగుటకు సహాయభూతమగు ప్రతీకారగుణము మాత్రమే యగుపించును. (67)

## 113

మత్తును కలుగజేయు ఔషధములీవిషయమున వేరువిధముగ నుండగలవు. ఈఔషధములు ప్రథమగుణమునందు ఉద్రేకము, చలనత్వము, స్పర్శజ్ఞానము ఒక్కొక్కప్పుడు నశింపుజేసినను ఆరోగ్యమైన శరీరములయందు పరీక్షార్థము మితమైన మోతాదులలో ప్రయోగింపబడినప్పుడు ద్వితీయగుణమునందు ఎక్కువ ఉద్రేకము, చలనత్వము, స్పర్శజ్ఞానము తరుచు గలుగజేయుచుండుట గాంచబడుచున్నది.

## 114

మత్తు గలుగజేయు యీఔషధములు పరీక్షార్థము ఆరోగ్యమైన శరీరములయందు ప్రయోగింపబడినప్పుడు తప్ప తదితర సందర్భములయందు ఔషధములయొక్క ప్రథమగుణమే అగుపడుచున్నది. అనగా ఔషధములు మానవుని ఆరోగ్యమును మార్పుచెందించి కొలదికాలముగాని, దీర్ఘకాలముగాని వ్యాధిస్థితిగలుగజేయు లక్షణములను యగుపరచుచున్నవి.

## 115

కొన్నిఔషధములయందు యీలక్షణములు కొన్ని పరిస్థితులయందు అంతకు పూర్వముగాని, అటుపిమ్మటగాని యగుపడిన లక్షణములకు వ్యతిరేకమైన లక్షణములుగ యగుపించుట

సంభవించుచున్నది. ఈలక్షణములను యద్ధార్ధముగ ద్వితీయగుణ
మనిగాని జీవశక్తియొక్క ప్రతీకార గుణమనిగాని ఎంచరాదు.
ఇవి ప్రథమగుణముయొక్క విడిచివిడిచివచ్చు వివిధ ప్రకోప
పరిస్ధితికి చెందియుండును. విడచివిడచివచ్చు గుణములని
(Alternating actions ) యివి పిలువబడును.

## 116

ఔషధములు కొందరియందు ఎక్కువ తరుచుగా కొన్ని
లక్షణములను జనింపజేయగలవు, అనగా ఔషధములను
ఆరోగ్యమైన శరీరములయందు ప్రయోగించినప్పుడు చాలమంది
వ్యక్తులయందు విశేషముగను కొందరియందు అరుదుగను
మిక్కిలి కొలదిమంది వ్యక్తులయందు చాలస్వల్పముగను లక్షణ
ములను జనింపజేయగలవు.

## 117

ఈఆఖరి వర్గమునను ప్రకృతిసిద్ధమైన విచిత్రశరీరతత్వము
గల వ్యక్తులని పిలువబడు వ్యక్తులు ( Idiosyncrasies) చెందు
దురు. అనగా యిట్టివ్యక్తులు సర్వవిధముల మంచిఆరోగ్యము
తోనుండి యితరులయందెట్టి మార్పులను కలిగింపజాలని కొన్ని
వస్తువులతో సమావేశము కలిగినప్పుడు కొంచమెచ్చుతగ్గుగా

వ్యాధిపరిస్థితికలుగు విచిత్రతత్వము కలిగియుందురు *1 ఈవస్తువులు ప్రతివ్యక్తియందు నిట్టి పరిస్థితిని కలుగజేయజాలకపోవుట తేటతెల్లమైన విషయమే. ఈపరిస్థితులను కలుగజేయుటకును, ఆరోగ్యమైన శరీరమున యితరవిధమైన వ్యాధిపరిస్థితులను కలుగజేయుటకును, వ్యాధిని ప్రేరేపించు వస్తువుయొక్క సహజమైనశక్తిచే శరీరమునకు చైతన్యము కలిగించు జీవశక్తి తన్మూలమున వశ్యమగుటకుగల సామర్థ్యము ఈరెండును కారణభూతమగును. ఈవిచిత్రశరీర ప్రకృతిగల వ్యక్తులయంద ప్రత్యక్షమైనయీవ్యాధి పరిస్థితులకు ఆవ్యక్తులయొక్క విచిత్రలితత్వముమాత్రమే ప్రధానకారణభూతమని తలంపరాదు. సమస్త మానవ శరీరములయందును అనగా ఆరోగ్యమైన శరీరముగల కొలదిమంది వ్యక్తులయందు యిట్టివ్యాధి లక్షణములను కలుగజేయగలిగియుండు విధముగా యీవస్తువులందట్టి శక్తిగూడ యుండవలెను. ఈవస్తువులుగూడ యిందుకు కారణభూతమని తలంపవలెను. ఈవస్తువులు యిచ్చటచూపింపబడిన విధముగ ప్రతిఆరోగ్యమైన శరీరమునందును తమగుణములను కలుగజేయగలిగి యుండుటచే శరీరప్రకృతినిబట్టి సంభవించు యిట్టి విచిత్ర

1* గులాబిపుష్పములను వాసనచూచుటవలన కొలదిమందివ్యక్తులు మాత్రమే మూర్ఛ, తదితర వ్యాధిలక్షణములకు లోనగుదురు. మరియు, మస్సెల్ యను సముద్రపు చేప, ఎండ్రకాయ, మొదలగునవి తినుటవలనను, కొన్నిజాతుల మొక్కలయొక్క ఆకులను స్పృశించుటవలనను ప్రమాదకరమైన పరిస్థితులు కొందరికి సంభవించును.

ప్రకృతి తత్వములుగల వ్యక్తులకుగల వ్యాదియొక్క వ్యాధి లక్షణములకు సారూప్యముగ నిట్టివస్తువులను ప్రయోగించిన అట్టివ్యాధిబాధితులందరకు అపారమైన సేవగావింపగలవు. ♦2

## 118

ప్రతిఔషధము మానవశరీరమున విచిత్రమైన గుణములను ప్రదర్శించును. ఇట్టి సరియగు గుణములను ఇట్టి సరియగు పద్ధతిలో వేరొక ఔషధవస్తువు కలుగజేయజాలదు.

## 119

ప్రతిజాతిమూలికయు బాహ్యాకారమునందు మొలచి జీవించుటయందు. రుచియందు, వాసనయందు యితరజాతి మూలికలతో ఎట్లు విబేధమైయుండగలదో సరిగా నట్లే ప్రతి ఖనిజము (లోహాది సంబంధమైన వస్తువులు) ప్రతిలవణము, బాహ్యరూపమునందును, భౌతికరసాయన వస్తుగుణమునందును (ఒకదానితో నొకటి కలువగూడదని తెలిసికొనుటకు నీ ఒక్క

♦2 ఫోర్ ఫిరోగ్నిటా యువరాణి, తనసోదరుడు ఎలిక్సెన్ చక్రవర్తి అపస్మారకముచే బాధపడుచున్నప్పుడు, గులాబిపుష్పములనీటిని అత పైజల్లి ఆతనివ్యాధిని నివారణజేసి ఆరోగ్యముచేకూర్చెను. మూర్ఛ వ్యాధులలో గులాబిపుష్పములతో తయారుచేయబడిన సారాయి మంచిసుగుణము కలిగించెనని హంస్టర్ అనునాతడు తెల్పియుండెను.

ఈవిషయమును ఎ. వి. హెల్లర్ అనునాతడుగూడ గాంచియుండెను

విషయమే చాలును), వ్యాధినిర్మూలనా గుణవిశేషమునందును విభేదమై యుండగలదు. *1 ప్రతివస్తువు మానవుని ఆరోగ్యమునందు విచిత్రమైన విభేదమైనపద్ధతితో ఒకదాని నుండొకటి గుర్తించుటకు అవకాశముండునట్లు మార్పు గలుగ జేయగలదు. ‡2

---

1* ప్రతిప్రత్యేకవస్తువు యితరవస్తు సముదాయముకంటె విభేదమైన ఎట్టి ప్రాముఖ్యమైన గుణములను మానవునియొక్క ఆరోగ్యమున కలుగజేయునో, ఆవిషయమునుగూర్చి పరిపూర్ణమైన పరిజ్ఞానమును సంపాదింపగలిగినచో ప్రతివస్తువు ఒకదానితోనొకటి పోలికగలిగి యుండజాలదని, వెంటనే తెలిసి కొనవచ్చును. వివిధములైన ఔషధములయొక్క యదార్థమైన గుణములను తెలియనివ్యక్తులు మాత్రము, ఒకఔషధమునకు బదులు వేరొక ఔషధముపయోగింప వచ్చుననియు, ఒకవ్యాధిలోనే ఒకఔషధమునకుబదులు. వేరొకటిగూడ అంతటి ఉపయోగకరముగనే ఉండగలదనియు, మనలకు విస్వాసము గలుగజేయ ప్రయత్నించునంతటి మూఢత్వము గలిగి యుందురు. అజ్ఞానులగుపిల్లలు, మిక్కిలి విభేదమైన వస్తువులయందుగూడ వానియందుగల భేదమును గ్రహింపలేరు. ఏలనన అజ్ఞానులగు యీపిల్లలు వానియొక్కబాహ్యఆకారమునందు వానియొక్కవిలువయందు, వానియొక్క యదార్థమైన ప్రాముఖ్య విశేషమునందు సహజముగగల విభేదమైన గుణములను తెలిసికొనజాలరు.

‡2 ఈవిషయమే యదార్థమైనచో (అందుకుసందేహములేదు) తన ఆత్మసాక్షికి వ్యతిరేకముగను, న్యాయమునకు విరుద్ధముగను, ప్రవర్తించని ప్రతివైద్యుడు, వ్యాధుల చికిత్సయందు, వస్తుగుణమునందు పరిపూర్ణమైన పరిజ్ఞానము గలిగియుండి, ఆరోగ్యమైన శరీరములయందట్టి వస్తువులు ఎట్టిగుణములను గలుగజేయగలవో పరీక్షించి తెలిసికొని, తానునివారణ చేయదలచినవ్యాధికి సరిసమానమగు వ్యాధిస్థితిని అట్టివస్తువుకలుగ జేయగలదో లేదో

గాన మానవునియొక్క జీవితము, మరణము, ఆరోగ్యము, వ్యాధి యివి నాలుగు ఔషధములపై అధారపడియున్నవి. గాన యీఔషధములయందు ఒకదానికొకదానికిగల విభేదమునుగూర్చి పూర్తిగ అతిజాగరూకతతో

---

తెలిసికొని, అందుపరిపూర్ణమైన పరిజ్ఞానముగలిగియుండి ప్రయోగించుము. ఏలనన పైనవివరింపబడిన విధముగ, బలమైన ప్రకృతిగాని ప్రపంచమునందలి ఏవ్యక్తిగాని సారూప్యౌషధముతో తప్ప వేరువిధముగా దోషరహితమైన సత్వర శాశ్వతరోగ నిర్మూలనము గావింపలేరు. గానవ్యాధిని నివారణ జేయుటకు ముఖ్యమైనట్టియు, మిక్కిలి అవసరమైనట్టియు, యీపరిజ్ఞానమును తెలిసికొనుటకు ఏవైద్యుడును వెనుదీయజాలడు. ఈవిషయమును తెలిసికొనుటకు కింతవరకు యనేక శతాబ్దములనుండి నిర్లక్ష్యము చేయబడియున్నది. పూర్వకాలమునందు వైద్యులు ఔషధపదార్థములయొక్క (ఔషధసంబంధమైన) విలువను గుర్తించక, ఆరోగ్యమైన శరీరమున ఆపదార్థములయొక్క ఉన్నతమైన ప్రధానవివిధయదార్థ సూక్ష్మగుణములను పరీక్షించి తెలిసికొనక, అజ్ఞానముతో ఔషధములను ప్రయోగించుచుండిరి. వస్తుగుణమును పూర్తిగా తెలిసికొనక ఒకదానికొకటి మిక్కిలి విభేదమైన యిట్టివస్తువులను ఒక్కప్రయోగముక్రింద సంపూటీకరణముగావించి, రోగులకు ప్రయోగించి ఆఔషధమేమిగుణము కలుగజేయునో ఘటనాఘటితమునకు వదలివేయుచుండిరి. ఈవిధముగు చికిత్సాప్రయత్నము, ఒకపిచ్చివాడు, వడ్రింగి కర్మాగారమునకుపోయి, ఉపయోగము తెలియని అచ్చటి పనిముట్లనుతీసి చుట్టునున్న వస్తువుల విధముగ వస్తువులను తయారుచేయుటకు ప్రయత్నించు విధముగ నుండగలదు. ఇట్టితెలివిహీన కృత్యములవలన తలంచినకార్యము పాడుచేయబడి, నాశము చేయబడునని వేరుగ తెల్పనవసరము లేదు.

తెలిసికొనవలసి యున్నది. మందులనుగూర్చి సరియగు పరిజ్ఞానమును సంపాదించుటకును, వ్యాధులచికిత్సయందు పొరబడకుండ వీనిని ప్రయోగించుటకును యీఔషధములను ఆరోగ్యమైన శరీరములపై ప్రయోగించి యదార్థమైన గుణములను తెలిసికొనవలయును. పరిశుద్ధమైన ఔషధమును ప్రయోగించి గుణములను తెలిసికొనుటమూలమున మాత్రమే వ్యాధిగ్రస్తమైన శరీరముయొక్కయు, మనస్సుయొక్కయు, ఆరోగ్యము సత్వరముగ శాశ్వతముగ చేకూర్చవచ్చును.

## 121

ఆరోగ్యమైన శరీరములయందు ఔషధగుణములను తెలిసికొనుటకు పరిశోధన సల్పునప్పుడు బలిష్టమైన శరీరములయందుగూడ గాఢమైన మందులు చిన్న మోతాదులలో గూడ మార్పుగలిగింపగలవని మనమునందుంచుకొనవలయును. సౌమ్యమైనవస్తువులను పరిశోధన చేయునప్పుడు కొంచమెక్కువ మోతాదులను ప్రయోగించి పరీక్షించవలెను. మిక్కిలి నిస్సారమైన ఔషధవస్తువులను (weakest) పరిశోధనచేయునప్పుడు ఏట్టివ్యాధియు గలిగియుండని సులభముగ ఉద్రేకముజెందు (irritable) మిక్కిలి అభిమానముగల (sensitive) సున్నితమైన వ్యక్తులపై పరీక్షించవలయును.

## 122

ఈపరిశోధనలమీాదనే వైద్యశాస్త్రమంతయు మానవ సంతతియొక్క ఆరోగ్యభావి భాగ్యమంతయు ఆ ధా ర ప డి యుండుటచే పరిపూర్ణమైన పరిచయముగల ఔషధములను మాత్రమే వానియొక్క పరిశుద్ధత్వము, బలము, మంచి కైనము స్థిరముగా తెలిసికొనినపిమ్మటనే పరిశోధనకొరకు ఉపయోగించ వ లె ను.

## 123

అట్టి ప్రతిఔషధమును మార్పుచెందని నిజరూపములో ప్రయోగింపవలెను. దేశీయమైన మూలికలనుండి అప్పటికప్పుడు తీసినరసములో చెడిపోకుండుటకుగాను కొంచము ఆల్కహాల్ (సారాయి) కలిపి పరిశోధన నిమిత్తముపయోగించవలెను. పర దేశములనుండి వచ్చు మూలికలను చూర్ణమురూపములో గాని లేక మూలికలను తీసినవెంటనే వడలనిస్థితిలో రసముదీసి ఆల్కహాలులో గలిపియుంచి అటుపిమ్మట కొంతభాగము నీరుగలిపి ఉపయోగించవలెను. లవణములను (salts) జిగురులను (gums) ఉపయోగించుటకుముందు నీటియందు కలిపి ఉపయోగించ వలెను. మూలికలు ఎండినస్థితిలోనేలభించి వానియొక్కశక్తి స్వతసిద్ధముగ బలహీనముగ నుండిన పక్షమున ఆమూలికలను ముక్కలుజేసి ఆవిరివచ్చుచున్న వేడినీరువానిపై పోసి కషాయ ముతీసి ఆకషాయమును (extract) ఉపయోగించవలెను. ఇట్టి

కషాయము తగువేడిగానుండగనే మ్రింగవలెను. మూలికారసములను నీటితో తీయబడిన యితరకషాయములను ఆల్కహాలుతో కలుపని పక్షమున త్వరలో పులిసి చెడిపోయి వానియొక్క ఔషధగుణమంతయు నశించిపోవును.

## 124

ఈపరిశోధనల నిమిత్తము ఉపయోగించు ప్రతిఔషధ వస్తువు మిశ్రమము గావింపబడని పరిశుద్ధమైన ఒక్కవస్తువు మాత్రమేయైయుండవలెను. ఇతరవస్తువులెవ్వియు మిశ్రమము గావింపక ప్రయోగింపవలెను. అట్లు ప్రయోగించిన దినమునను మరుసటి దినమునను మనము ఆవస్తుగుణములను తెలిసికొనదలచిన అన్నిదినములయందును ఔషధ సంబంధమైన ఏయితర వస్తువులను దీసికొనరాదు.

## 125

పరిశోధనగావించునంతకాలము పత్యముమిక్కిలి ఖచ్చితముగ జరిగించవలెను. మిరియము, ధనియము, ఏలకులు మొదలగు సుగంధ ద్రవ్యములను విసర్జింపవలెను. దుంపలను వర్జించి సులభముగ జీర్ణమగు పదార్థములను, ఆకు కూరలను సేవించవచ్చును. *1 పచ్చళ్ళను, పులుసులను ఎంత జాగరూ

---

1* లేతపచ్చ బటాణీగింజలు, పచ్చి ఫ్రెంచి చిక్కుడుగింజలు, ముల్లంగిదుంపలు ఉడకబెట్టబడిన బంగాళాదుంపలు వీనియందు ఔషధగుణమును భగ్నపరచు గుణములేదుగాన పత్యమునకుపనికివచ్చును.

కతతో తయారుచేసినప్పటికి ఔషధగుణమును భంగముచేయ గలవు గాన వర్జింపవలెను. సాధ్యమైనంతవరకు ఉద్రేకము గలుగజేయని పానీయములనే సేవించవలెను. 2♦

## 126

ఔషధమును పరీక్షించువ్యక్తి పరిశోధనాకాలమందు అమితమైన ఎట్టివిధమగు శరీరమానసిక పరిశ్రమలను గావించ రాదు. మనస్సును వ్యాకులపరచు వ్యర్థమగు ఎట్టి ఉద్రేకము లను కలిగియుండరాదు. దృష్టినిమరల్చు ఎట్టితొందర వ్యాపార ములను గలిగియుండరాదు. అతిజాగరూకతతో స్వకీయమైన ఔషధ పరిశీలనకే కాలము గడుపుచు అట్టి పరిశీలనయందు గూడ వ్యాకులము చెందరాదు. తనశరీర ఆరోగ్య పరిస్థితి ఎట్లుండవలయునో అట్టి ఆరోగ్యమునందుండి సరియైనపదములలో తనభావనలను, గుణములను వర్ణించి తెలుపగల విజ్ఞానము కలిగియుండవలెను.

## 127

మర్మావయవములందీ ఔషధములు కలుగజేయు (గుణ ములు) ఆరోగ్యమునందలి మార్పులను తెలిసికొనుటకు స్త్రీల యందును, పురుషులయందునుగూడ పరీక్షించవలెను.

---

2♦ సారాయి, బ్రాంది, కాఫీ, టీ, వీనియందు ఉద్రేకముకలిగించు గుణము, యితరఔషధ గుణముగలదు గాన, యీవస్తువులను విసర్జించుటయే గాక పరిశోధనకుపూర్వము కొంతకాలమునుండియు విసర్జించియుండవలెను

128

ఔషధవస్తువులయొక్క మిక్కిలి విచిత్రగుణములను పరీక్షించునిమిత్తము ప్రకృతిరూపములోనున్న ముడిపదార్థములను (crude substances) తీసికొనినప్పుడు వానియందిమిడియున్న సంపూర్ణమైన శక్తులన్నియు ప్రదర్శింపబడవు గనుక ఆవస్తువులను సక్రమముగా నూరుట, (Trituration) లేక ద్రవరూపమున సీసాలోనుంచి కుదుపి, (Succussion) హెచ్చు పొటెన్సీలో పెట్టుటమూలమున (ఎక్కువ శక్తిలోనికి తీసికొని వచ్చుట) ముడిరూపములో దాగి స్తంభించియున్న శక్తులు వర్ణనాతీతముగ విజృంభించగలవు గాన నిట్టి పరీక్షనిమిత్తము యీవస్తువుల నీరూపములో ప్రయోగించినప్పుడు పరిపూర్ణమైన గుణములను ప్రదర్శించుట నవీన పరిశోధనలు జూపుచుండెను. ఈపద్ధతి ప్రకారము బలహీనమైన పదార్థములను (week substances) గూడ పరీక్షింపవచ్చును. గాని యీక్రిందిపద్ధతి అనుకరింపవలెను. పరీక్షింపదలచిన ఔషధమును ముప్పదియవ పొటెన్సీలో నాల్గు లేక ఆరు చిన్నమాత్రలను కొంచము నీటిలో గలపి పరగడపున కొన్ని దినములు పుచ్చుకొన వలయును.

129

ఇట్టి మోతాదుల మూలమున కలిగిన గుణములు స్వల్పముగ మాత్రమే యగుపించినపక్షమున యీగుణములు మిక్కిలి విస్పష్టముగా యగుపించి ఆరోగ్యమునందలి మార్పు ప్రత్యక్ష

ముగ యగుపించుటకగాను అనుదినము ఇంకను ఎక్కువగ కొలది మాత్రలను పుచ్చుకొనవలయును. అందరు వ్యక్తులు ఒకఔషధమువలన సమానమైనతరహాలోగుణములనుపొందరు. ఈవిషయమున గొప్ప వ్యత్యాసము గలదు. ఒక్కొక్కప్పుడు బలహీనమైన వ్యక్తికి మితమైన మోతాదులో తీవ్రమైనస్వభావముగల ఔషధమును ప్రయోగించినప్పటికి ఎట్టిగుణములు గలుగక పోవుటయు, మంచిబలమైన వ్యక్తికి బలహీనమైన ఔషధమును ప్రయోగించినప్పుడు చాలగుణములుకలుగుటయు సంభవించవచ్చును. మరియు, బలిష్టమైన కొందరివ్యక్తులకు, బలహీనమైన ఔషధములమూలమున విశేషమైన వ్యాధిపరిస్థితి కలుగుటయు, తీవ్రమైన మందులమూలమున కొలది లక్షణములు మాత్రమే కలుగుటయు, గూడ కలదు. ఈవిషయమును ముందుగుర్తించుట కష్టతరముగాన, ప్రతిసందర్భమునందును, ఔషధమును చిన్నమోతాదులోనే ప్రయోగించి, అవుసరమునెంబడిని క్రమక్రమముగా దినదినము హెచ్చించుట యుక్తము.

## 130

ప్రారంభమున ప్రయోగింపబడిన మొదటి మోతాదే తగినంత బలతరమైనదై యున్న పక్షమున దానియొక్క ఉపయోగమును గుర్తించి, పరిశోధకుడు, లక్షణములను సక్రమవరుసను తెలిసికొని, ప్రతిలక్షణము ఏకాలములో నంభవించినదియు,

సికొనగలుగుదు ఔషధస్వభావముయొక్క పరిజ్ఞానము సికొనుటకును, సందేహాము జనించకుండునట్లు ప్రథమగుణలను విడచి విడచివచ్చు గుణములను వరుసక్రమముగ సికొనుటకును యీవిషయము మిక్కిలి ఉపయోగకరము. శోధకుడు తగినంత సున్నితమైన బాధలకుగూడ అతిసూక్ష్మగ లోనగు తత్వము గలిగియున్న పక్షమున సాధారణగా మిక్కిలి చిన్నదగు మితమైన మోతాదుమాత్రమే క్షనిమిత్తము ప్రయోగించిన సరిపోవును. ఔషధగుణలపరిమితి యిట్టివిధమగు అనేక పరిశోధనలనుబట్టిమాత్రమే సికొననగును.

## 131

ఒకవ్యక్తికి ఒక ఔషధమును కొన్నిదినములు వరుసగా మముగా మోతాదులను హెచ్చించి యిచ్చుట మూలమున స్వసాధారణమైన పద్ధతిలో యీఔషధము కలుగజేయు పలు నములైన వ్యాధి పరిస్థితులను తెలిసికొనగలము. గాని ఆలక్షములు ఒకటివెంబడి ఒకటి ఎట్లు వరుస క్రమముగ వచ్చునో త్రింపజాలము. ఏలనన ప్రథమమున నిచ్చిన మోతాదు కాలమున కలిగిన లక్షణములను అటు పిమ్మట యిచ్చిన తాదు ఆలక్షణములలో కొన్నిటిని తొలగించి నివారణ యుటయు లేక ఆవ్యాధి పరిస్థితికి బదులు వ్యతిరేకమయిన వ్యాధి పరిస్థితిని కలుగ జేయుటయు జరుగగలదు. గాన ఇట్టి

లక్షణములు తత్వము యొక్క ప్రతీకార్థగుణమయిన ద్వితీయ గుణమో లేక ఔషధమునుండి జనించిన విడచి విడచి వచ్చు లక్షణములో (Alternating actions) యని జనించు యీ సందేహస్థితిని పిమ్మటగావించు యదార్థమైన పరిశోధనలయందు జొగొట్టి నిర్ధారణగ తెలిసికొనుటకు యీలక్షణములను కుండ లాకృతి (బ్రాకెట్లు) యందుంచవలెను.

## 132

ఔషధము కలుగజేయు వ్యాధిరూపమును వరుస క్రమముగ తెలిసికొనుటకును, ఔషధగుణముయొక్క కాలపరిమితిని తెలిసికొనుటకును, ఉద్దేశింపక ఒక్క ఔషధ లక్షణములను మాత్రమే అందు ముఖ్యముగా బలహీనమైన ఔషధవస్తువు యొక్క గుణములనుమాత్రమే తెలిసికొనుట ఉద్దేశ్యమైయున్నప్పుడు అట్టి ఔషధమును దినదినము హెచ్చించు మోతాదులలో కొన్నిదినములు ప్రయోగించుట ఉత్తమమైన మార్గము. ఈపద్ధతి ననుసరించి సౌమ్యమైన స్వభావముగల పరిచయము లేని ఔషధములయొక్క (unknown medicine) గుణములు గూడ సున్నితమైన వ్యక్తులపై (Sensitive persons) ప్రయోగించి తెలిసికొన వచ్చును.

## 133

ఔషధమునుండి ఒకప్రత్యేకలక్షణమును గాంచినప్పుడు

ఆలక్షణముయొక్క స్థిరమైన స్వభావము నిర్ణయముచేయుటకు పలువిధములైన స్థితిలో శరీరమునుబెట్టి (various positions) బాధకలిగిన భాగమును కదల్చుచుండుటవలన, గదిలో నడచుటవలన లేక బహిరంగమైన గాలిలో తిరుగుటవలన, నిలుచుండుటవలన, కూర్చుండుటవలన లేక పరుండుటవలన, లక్షణము హెచ్చునా తగ్గునా లేక తొలగిపోవునా, మరియు తిరిగి మామూలు స్థానములో శరీరమున్నప్పుడు మొదటగాంచిన లక్షణము తిరిగి యగుపించునా, పానీయము త్రాగినప్పుడుగాని ఆహారము తినినప్పుడుగాని మార్పుచెందునా లేక మాట్లాడుట వలన, దగ్గుటవలన, తుమ్ముటవలన లేక ఏయితర కార్యాచరణము వలననైనను మార్పుచెందునా, మరియు పగటియందుగాని, రాత్రియందుగాని సాధారణముగా ఏకాలములో ప్రాముఖ్యముగా నుండును, అందుమూలమున ప్రతిలక్షణమునకు ఎట్టి విచిత్రమైన సహజగుణము యగుపడుచుండును? యను విషయములను గుర్తింపవలెను.

## 134

బాహ్యశక్తులన్నియు (external influences) అందు ముఖ్యముగా ఔషధములు సజీవమైన శరీరమునందు విచిత్రమైన తమకుగల ఒకవిధమైన మార్పు కలుగజేయు గుణము గలిగియుండెను. గాని ఔషధమునకుగల యీవిచిత్రమైన లక్షణములన్నియు ఒకేవ్యక్తియందు ఒకేకాలమునందు ఒక్క

మారుగా ఒక్క పరీక్షయందే యగుపింపజాలవు. ఒకవ్యక్తి యందు కొన్నిలక్షణములు ముఖ్యముగా ఒకేకాలములోనూ, మరికొందరియందు రెండవ లేక మూడవప్రయత్నమునందు ను నగుపించును. మరియొక వ్యక్తియందు మరికొన్ని వేరులక్షణ ములు నాలుగవ, ఎనిమిదవ లేక పదియవ వ్యక్తియందు లోగడ రెండవ, ఆరవ లేక తొమ్మిదవ వ్యక్తియందు యగుపించిన వ్యాధి దృశ్యమునందలి కొన్నిలక్షణములు యగుపించును. గాని ఒకేగంటలో సంభవింపకపోవచ్చును.

## 135

ఔషధముకలుగజేయు సమర్థమైన వ్యాధిస్వభావముగల లక్షణములన్నియు అనుకూలమైన పలువిధ తత్వములుగల స్త్రీ పురుషులపై అనేకములైన పరిశోధనలు గావించుట మూల మునమాత్రమే పరిపూర్తిగ తెలిసికొన గలవు. పిమ్మట పరిశోధన గావించు పరిశోధకులు అంతకుపూర్వము పరిశోధింపబడిన ఔష ధములను గూర్చి నూతనమైన ఏలక్షణములను గాంచనప్పుడును అనగా అంతకుపూర్వము యితరులచే కనుగొనబడిన లక్షణము లు మాత్రమే కనుగొనగలిగి అంతకంటె వేరొండు కనుగొన జాలనప్పుడు ఆఔషధము కలుగజేయగల వ్యాధిపరిస్థితులను గూర్చి అనగా మానవునియొక్క ఆరోగ్యమును మార్పుజేయ గల ఆఔషధమునందలి యదార్థమైన శక్తులనుగూర్చి ఆఔషధ ము పరిపూర్ణముగ రుజావుచేయబడి యుండెననివిశ్వశించగలము.

136

ఒకఔషధము ఆరోగ్యమైన వ్యక్తులయందు పరీక్షింపబడినప్పుడు ఒకేవ్యక్తియందు మాత్రమే ఆఔషధము కలుగజేయ సమర్థమైయున్న మార్పులన్నియు ఆఔషధము పొందింపజాలదనియు, శరీరమానసిక తత్వములయందు విభేధమైన అనేక వ్యక్తులయందు మాత్రమే ఆలక్షణములన్నియు గాంచనగుననియు పైన తెల్పబడి యున్నప్పటికి యీలక్షణములన్నియు ప్రతివ్యక్తియందు ఆరోగ్యమైన వ్యక్తియందు అరుదుగా గనిపించు లక్షణములు సహితము అనంతమైన నిర్వికల్పమగు సృష్టి శాసనముల ననుసరించి ఆవ్యక్తి ఔషధలక్షణములకు సమానమగు లక్షణములుగల వ్యాధి కలిగియున్నప్పుడు యీఔషధమును ప్రయోగించిన పక్షమున (ప్రతివ్యక్తియందును గూడ) యిట్టిలక్షణములను యీఔషధము కలుగజేయ గలదు. (117). వ్యాధికి సారూప్యముగ నిర్ణయింపబడిన చిన్నమోతాదుగూడ రోగియందు సౌమ్యముగ, సహజముగ జనించిన వ్యాధితో మిక్కిలి సరిపోలు కల్పితవ్యాధిస్థితిని కలుగజేసి సారూప్యౌషధ పద్ధతిని సహజముగ జనించిన వ్యాధిని సత్వరముగ, శాశ్వతముగ నివారణ చేయగలదు.

137

సత్యమునందు ప్రేమగలిగి సమస్తవిషయములయందు మితమైన వాంఛలుగలిగి, సున్నితమైన భావములు గలిగి,

వనలను అతిసూక్ష్మముగ గ్రహింపగల పరిశోధకుడు, షధపరిశోధన నిమిత్తము లభించిన పక్షమున, పరిశోధనలకు యోగించు ఔషధముయొక్క మితతరమైన మోతాదు త్రమే యిట్టి వ్యక్తియందు మిక్కిలి విస్ఫుటమైన ప్రథమ ణములను గలుగజేయ గలదు. ఈ ప్రథమగుణములు క్కిలి అమూల్యమై తెలిసికొనదగియుండి, జీవశక్తి యొక్క ప్రతీకారగుణములతోగాని, లేక ద్వితీయగుణములతో ని విశ్రమము గావింపబడి యుండవు. ఇట్టి వ్యక్తులయందు రీతమైన పెద్దమోతాదుల నుపయోగించిన పక్షమున, ద్వితీ గుణము లనేకముగ కలుగుటయేగాక, ప్రథమగుణములు డ తబ్బిబ్బై మిక్కిలి తారుమారుగా లక్షణములు సరిగా ర్తించుటకు అవకాశము లేకుండునట్లు సంభవించగలవు.

## 138

ఉత్తమమైన మంచి పరిశోధనల కవుసరమగు పై యమములను (124 మొదలు 127) పాటించిన సందర్భము లో, ఔషధము పనిచేయు కాలమునందు, పరిశోధకుని యొక్క సమస్తబాధలు, ఆకస్మికఉపద్రవములు (accidents) రోగ్యమునందలి మార్పులు, ఔషధము మూలముననే సంభ ంచుచున్నవి. అంతకు పూర్వము చాలకాలము క్రిందట తస్సిద్ధముగ సరిసమానమగు వ్యాధిలక్షణములను పొంది యున్నప్పటికి యిట్టి లక్షణములన్నియు ఔషధముయొక్క

లక్షణములు మాత్రమే యని పరిగణించి పుస్తకమునందు వ్రాసికొనవలయును. ఔషధపరీక్షయందీ లక్షణములు తిరిగి యగుపించుటకును యీలక్షణములు ఉద్రేకించుటకను తగు విచిత్రమైనతత్వము యీవ్యక్తి గలిగి యుండుటయే కారణమని గ్రహింపవలెను. ఈ విషయమున యీగుణములు, ఔషధ మునొక్క గుణములే యగుచున్నవి. తీసికొన్న ఔషధము శరీరమునందంతటను తన ప్రాబల్యమును యగుపరచి పనిచేయు చున్నప్పుడు మాత్రమే ఆలక్షణములు యగుపడును. గాని స్వతస్సిద్ధముగ యగుపడవు. గాన ఔషధమువూలమునసే యీలక్షణములు ఉద్భవింపగలవు.

## 139

వైద్యుడు ఔషధమును తనపై పరీక్షించుకొనక మరియొక వ్యక్తిపై ప్రయోగించి పరీక్షించునప్పుడు, ఆతని యందుకలుగు భావనలు (sensations) బాధలు, ఆరోగ్యము నందలి మార్పులు, ఔషధము ప్రయోగింపబడిన ఎంతకాల ముగో ఎప్పుడు, ఏవిధముగా, సంభవించినది, యీబాధలు దీర్ఘకాలముండిన, ఎంతకాలముండెను; అను విషయములను స్పష్టముగ, పరిశోధనచేయు ఆవ్యక్తి వ్రాయవలయును. పరిశోధన పూర్తియైనపిమ్మట పరిశోధకుని సమక్షమున నేవైద్యుడు అతనిచే వ్రాయబడిన వివరణపత్రికను (Report) పరిశీలించవలెను. పరిశోధన చాలదినములు జరుగవలసి

యున్నచో పరిశోధనయందలి విషయములు మరపునకు రాకుండ వెంటనే ప్రతివిషయమునందలి యదార్థస్వభావమును తెలిసికొనుటకు అవసరమగు ప్రశ్నలను ప్రశ్నించి అట్లు తెలిసికొనబడిన విశేషవివరములను విపులముగ వ్రాసికొనుటకును లేక పరిశోధకుడు సూచించు, అవసరమైన మార్పులను గావించుటకును అనుదినము వ్రాయబడిన లక్షణముల వివరములను పరిశోధకుని సమక్షమున వైద్యుడు పరిశీలింపవలెను. ‡1

## 140

పరిశోధకుడు పరిశోధనాఫలితములను వ్రాయజాలని పక్షమున, పరిశోధనయందెయ్యది యెట్లుజరిగినది వైద్యునకు తెలుపవలయును. వైద్యుడీవిషయములను వ్రాసికొనుటలో పరిశోధకుడు స్వయముగ చెప్పిన విషయములను మాత్రమే వ్రాసికొనవలయును. గాని మార్గదర్శకమగు ప్రశ్నలమూలమున వచ్చు సమాధానములకు ఊహలకు తావొసంగరాదు. 84 మొదలు 89వ పేరాలో సహజముగ జనించిన వ్యాధిరూపమును పరిశీలన చేయుటకు తీసుకొనివలసిన జాగ్రత్తను గూర్చి తెలుపబడిన విషయములే యిచ్చుటకూడ గమనించవలెను.

---

‡1 తనపరిశోధనా ఫలితములను ప్రపంచమునకు వెల్లడిచేయు పరిశోధకుడు తనచే వివరింపబడిన విషయముల యందలి సత్యమునకు బాధ్యత వహించి యుండవలెను. వ్యాధిగ్రస్తమగు మానవ ప్రపంచముయొక్క క్షేమ మంతయు యీవిషయములపై ఆధారపడి యీఉరిస్తంభమున కట్టబడి యున్నది.

141

నిష్పక్షపాతమైన బుద్ధి గలిగి సున్నితమైన తత్వమ
మంచిఆరోగ్యము గలిగి యున్న వైద్యుడు పైన నిరూపి
జాగరూకతలన్నియు దీసికొని తనపై స్వయముగ ఔషధ
ప్రయోగించుకొని ఆరోగ్యమైన వ్యక్తులయందు, క
వ్యాధులను కలుగజేయ సమర్థములై ఆరోగ్యమునందుమ
జేయగల అమిశ్రమైన ఔషధముల యొక్క పరిశుద్ధమైన
ములను తెలిసికొని గావించు పరిశోధనలే ఉత్తమమైన
శోధనలు. తాను స్వయముగ అనుభవించిన విషయమ
ఎట్టి సందేహము లేకుండ మిక్కిలి నిశ్చయముగ ఆతడు
కొనగలడు. †1

---

1† వైద్యుడుతాను స్వయముగ తనపైకావించుకొనిన ప్రయత్న
(పరిశోధనలు) తనకు ఇతరులకుగూడ అమూల్యమై మిక్కిలి ఉపయో
ములై యుండగలవు. సమస్తమైన ఔషధములయొక్క ఔషధగ
మీదను నివారణశక్తి ఆధారపడియున్నది. పరిశోధకుడు పొందిన
మునందలి యీమార్పులమీదనే యీఔషధగుణముండుటచేతను ఆ
ముహూర్తమునసే తానుఅనుభవించిన వ్యాధిస్థితి సంభవించియుండుట
అతి జాగరూకతతో నీపరిశోధనలు గావింపబడునుగాన,ఆకారణమ
యీవిషయములయందలి సత్యము నిరాక్షేపణీయము. మరియు, పా
మగు యిట్టి పరిశీలనల మూలమున (స్వయముగగావించు పరిశోధనప
ఆలోచనాపద్ధతిగ్రహణశక్తి(యదార్థమైన పరిజ్ఞానమునకు పునాది)
గుణము ఎట్లుండెనో తెలిసికొనగలుగును. మరియు ప్రతివైద్యుడును
మైన ఎట్టిపరిశోధకుడుగ నుండవలయునో అట్టివిధముగ నుండుటకుత
పొందగలడు.ఇతరులయందు మనముగావించు పరిశీలన స్వయముగ

## 142

### వ్యాధులయందు ముఖ్యముగా మార్పుచెందక నిలచి

కొను(పరిశోధనల)ప్రయత్నములంత సంతోషకరముగా నుండజాలదు. ఇతరులు ఔషధములను పరీక్షించునప్పుడు పరిశోధకుడు తానుచెప్పుచున్నదిసరిగా అనుభవించి యుండెనాలేదా, సరియైన భావనలతో తన బాధలను తెల్పి యుండెనా లేదా యని సందేహింపవలసి వచ్చును. ఔషధమును ప్రయోగించిన పిమ్మట యితరులయందు సంభవించు యాకల్పితవ్యాధి లక్షణములను పరిశీలన జేయుటయందు అసాధ్యమగు అనేక అడ్డంకులు కలుగును. ఈ అడ్డంకులు మనపై స్వయముగ ప్రయోగించుకొని పరీక్షించుకొనునప్పుడు మాత్రమే తొలగగలవు. వైద్యుడుతనపై ఔషధము ప్రయోగించుకొనునప్పుడు తాను ఏబాధలు ఎట్టివిధముగ అనుభవించెనో నిశ్చయముగ తెలిసికొనగలడు. మరియు, యిట్టి ప్రతి ప్రయత్నము, వేరొక ప్రయత్నము జేసి ఔషధ శక్తులను పరిశీలన చేయుటకు ప్రోత్సహించుచుండును. ఈవిధముగ విశేషమైన కృషి చేయుటకు వైద్యుడు అలవాటుపడి తనకు మిక్కిలి విశ్వాసముగ మోసగించని వేరొక వ్యక్తిపై పరిశీలన చేయుటకు అలవాటుపడును. మరియు, మనశాస్త్రమందు యింకను అపరిచయమైయున్న, నివారణాసాధనలయొక్క (ఔషధములు) ప్రాముఖ్యమును యదార్థమైన విలువను గూర్చి తెలిసికొనవలసిన పరిజ్ఞానమును యిట్టి పరిశోధన లభివృద్ధి జేయగలవు గాన యీకార్య మంతయు యింకను మిక్కిలి పూనికతో నిర్వహించును. పరిశోధనచేయు నిమిత్తము ఔషధములను సేవించుటవలన కలుగు కొలదిఅస్వస్థత పరిశోధకుని ఆరోగ్యమునకు ముఖ్యముగ హానికరమై యుండగలదని తలంపరాదు. పరిశోధకునియొక్క శరీరతత్వము, పరిశోధనల యందు ఔషధములచే తరుచు కలుగజేయబడు విఘాతములచే గట్టిపడి శరీర నిర్మాణమునకు శత్రుకరమగు హానికరమైన బాహ్య ప్రబల్య శక్తులను, దుష్టమైన సమస్త కల్పితవ్యాధులను, స్వతస్సిద్ధ వ్యాధులను ప్రతిఘటించుటకు ఎక్కువ సమర్థమైయుండి, హానికర స్వభావముగల సమస్తమును ఎదుర్కొనుటకు ధృఢపడి యుండగలదని అనుభవమునుబట్టి తెలియుచున్నది. మరియు పరిశోధకుని ఆరోగ్యము మార్పుచెందక మిక్కిలి దృఢపడి నుంచి బలిష్టుడగునని పూర్వానుభవము గోచరింపజేయుచున్నది.

యందు దీర్ఘవ్యాధులయందు నివారణ నిమిత్తము ప్రయో గించిన అమిశ్రమ ఔషధము యొక్క కొన్ని లక్షణము లను *1 అసలు వ్యాధిలక్షణములనుండి గుర్తించుకొట్లు యను విషయము ఉన్నత శాస్త్రజ్ఞులచేమాత్రమే తెలిసికొన నగును. గాన యీవిషయమును ప్రత్యేకము పరిశోధనా పండితులకు మాత్రమే వదలి వేయవలయును.

## 143

ఈవిధముగా ఆరోగ్యమైన వ్యక్తులపై అమిశ్రమైన (Simple) చాలామందులను పరీక్షించి యీఔషధములు కల్పితవ్యాధి ఉత్పత్తికరములై(artificial disease producers) ఆరోగ్యమైన వ్యక్తులయందు కలుగజేయ సమర్థమై యున్న లక్షణములను వ్యాధి మూలమును అతిజాగరూకతతో విశ్వాస నీయముగ వ్రాసియుంచిన పక్షమున అందుపై యదార్థమైన వస్తుగుణదీపిక పరిశుద్ధమగు విశ్వసింపదగిన సరియగు ‡1 అవి

---

1* వ్యాధిని చికిత్స చేయునప్పుడు ఔషధమును ప్రయోగించినపిమ్మట పూర్వమెప్పుడో యగుపించిన లక్షణములుగాని అంతకుపూర్వము లేని క్రొత్త లక్షణములుగాని యగుపించవచ్చును. ఈక్రొత్త లక్షణములు ఔషధమునకే చెందగలవు.

‡1 కొంతకాలమైనపిమ్మట యీపనినిమిత్తమై వేతనములిచ్చి దూర ప్రదేశమునందుండు అపరిచితులను వ్యక్తులకు ఔషధములను రుజువు చేయుపని నప్పగించుట అలవాటయ్యెను. ఇట్టివిధముగ పరిశోధనలయందు లక్షించిన విషయములు అచ్చువేయబడుచుండెను. యదార్థమైన చికిత్సాశాస్త్రమున

శ్రీమదౌషధ వస్తువుల యొక్క గుణముల సముదాయముతో లభింపగలదు. మరియు తీవ్రమైన ప్రతి ఔషధము ఆరోగ్యము నందు పరిశోధకుని దృష్టికి గోచరించునటుల కలుగజేయు విచిత్రమైన మార్పులు లక్షణములు యికముందు నివారణ చేయ దలచిన అనేకమైనసహజమగు వ్యాధులయొక్క వ్యాధమూలమునకు సారూప్య వివరములు అనగా యీసహజమైన వ్యాధులను నిశ్చయముగను శాశ్వతముగను నివారణ జేయుటకు నిర్దిష్టమైన చికిత్సా సాధనములగు స్వభావసిద్ధమైన సారూప్య వ్యాధిస్థితి లభింపజేయు కల్పిత వ్యాధిస్థితుల Artificial morbrid states) యొక్క వివరములు యిందు లిఖింపబడియుండును.

## 144

ఇట్టి వస్తుగుణదీపికయందు ఊహించి తెలిసికొని నట్టియు విని సంపాదించినట్టియు మనఃకల్పితమైనట్టియు సమస్త విషయములకు స్థాన మొసగక తొలగింపవలెను. ప్రతి విషయమును అతి జాగరూకతతో న్యాయముగ ప్రశ్నించి తెలిసికొనబడి పరిశుద్ధమగు ప్రకృతి సిద్ధమైన భాషలో నుండవలెను.

---

కంతసు మూలాధారమైన సమస్త కార్యములకంటెను ముఖ్యమైన యీపనియందు నిశ్చయమైన సత్ప్రవర్తన, నమ్మకము కావలసియుండుటచే యిట్టిపరిశోధనల మూలమున కార్యసాఫల్యమునందు సందేహము జనించి ఫలితముయందు కష్టమేను లేక ఎట్టి విధమగు విలువ యుండదు.

145

మానవుని యొక్క ఆరోగ్యమును మార్పు జేయుట యందు ఔషధములు కలుగజేయగల పరిశుద్ధమైన గుణముల యొక్క పద్ధతిని (modes of action) గూర్చి తెలిసికొనబడిన విస్తారమైన ఔషధసముదాయము లభించియున్నప్పుడే, సృష్టి యందు అనంతములైయున్న వ్యాధిపరిస్థితులకు అనగా ప్రపంచములోని ప్రతివ్యాధికి, *1 అనుకూలమగు సారూప్యౌషధము లభించు స్థితిలో నుండగలము. అట్లు విస్తారముగ ఔషధములు పరిశోధింపబడి వాని పరిశుద్ధలక్షణములు తెలిసికొనబడు లోపుగ ప్రస్తుతముగూడ (యింతవరకు పరిశోధింపబడియున్న ఔషధములయొక్క లక్షణములయందుగల యదార్థమైన స్వభావమునకు వందనములు) ఆరోగ్యమైన శరీరమునందు తీవ్రమైన మందులు యగుపరచిన, విస్తారమైన వ్యాధిలక్షణము

*1 ప్రథమములో నే నొక్కడనే ప్రధానమైన మందులయొక్క పరిశుద్ధమైన శక్తులనుగూర్చి పరిశోధన గావించియుంటిని. పిమ్మట కొందరు యువకులు సాహసహాయులై తమపై పరిశోధనలు గావించుకొని యుండిరి వారిచే పరిశీలింపబడిన విషయములను నేను మిక్కిలి విమర్శించి సరిచూచి యుంటిని. విశ్వాసనీయులగు సరియైన పరిశోధకులనేకులు తమపై గావించుకొను పరిశోధనల మూలమున యీవస్తుగుణ దీపికను వృద్ధిపరచుటకు సహాయభూతులగుచో అనంతమైన సమస్త వ్యాధిసమూహమును నిర్మూలముగావించి వ్యాధులను నివారణజేయుటకేల సమర్థులము కాజాలము? అప్పుడే చికిత్సా శాస్త్రముగూడ గణితశాస్త్రముల స్థానమునకు నిశ్చయముగ జేరగలదు.

లనుబట్టి, యింతవరకు యదార్థగుణములగూర్చి *2 రుజువు చేసియున్న ఔషధములలో వ్యాధికనుకూలమైన సారూప్యౌషధములు యేకొలది వ్యాధులకు మాత్రమో సరిపడియుండగలవు. ఈ ఔషధములు, ఎట్టితొందరపాటును గలుగజేయక, సౌమ్యముగ, నిశ్చయముగ, శాశ్వతమైన పద్ధతిలో ఆరోగ్యమును చేకూర్చగలవు. మరియు, తెలియని మిశ్రౌషధములచే దీర్ఘవ్యాధులను వేరువిధముగ మార్పుజెందించి ఉద్రేకింపజేయుటయు, తరుణవ్యాధులను నివారణచేయుటకు బదులు అణచిపెట్టుటయు, తప్ప వ్యాధిని నివారణచేయజాలని ప్రాచీన సర్వసామాన్యమైన ప్రత్యేకచికిత్సలయందు లభించు నివారణలకంటె, యీఔషధములు శాశ్వతమైన మిక్కిలి నిశ్చయమగు నివారణలు గావింపగలవు.

## 146

యదార్థమైన వైద్యుడు గుర్తించవలసిన మూడవవిషయము, సహజముగ జనించిన వ్యాధులను సారూప్యముగ నివారణజేయుటకు ఔషధములయొక్క పరిశుద్ధమైన గుణములను రుజువుచేయుటకుగాను ఆరోగ్యమైన వ్యక్తులపై ప్రయోగించి రుజువుచేయబడిన కల్పితవ్యాధి ప్రతినిధులగు ఔషధములను తెలివిగ ప్రయోగించుట.

---

* 109 వ్యాఖ్యానము జూడుము.

147

మానవుని ఆరోగ్యమును మార్పుచేయు ఔషధ
యందుగల శక్తులనుగూర్చి పరిశోధనచేయబడిన ఔషధ
నుండి పరిశీలనచేసి తెలిసికొనిన లక్షణములుగల ఏఔష
సహజముగ జనించిన వ్యాధిలక్షణసముదాయమునకు మిక్
సారూప్యమై యుండగలదో, ఆఔషధము వ్యాధికి మిక్
అనుకూలమైన నిశ్చయమగు సారూప్యౌషధమై యుండగ
మరియు ఉండితీరును. ఈవ్యాధికిదియే నిర్దిష్టమైన ఔష
యున్నది.

148

సహజముగ జనించినవ్యాధి, శరీరమున అంతరం
నందుగాని బాహ్యప్రదేశమునందుగాని, ఎచ్చటనో యొక
గలహానికరమైన స్థూలపదార్థమని ఎన్నడును తలంపర
వ్యాధి భావనాయుతమైన శత్రుకర నిరాకార శక్తిమూల
మాత్రమే జనించుచున్నదని తలంపవలెను. ఈ శత్రుకర
కారశక్తి శరీరమునందలి, భావనాయుత నిరాకారజీవప్ర
ఒకవిధమగు, సంక్రమణము (Infection) చే, (11 నో
వ్యాకులపరచి దుష్టపిశాచమువలె, హింసించి క్రమజీవిత
నందు, కొన్నిబాధలను అక్రమములను కలుగజేయుటకునిర్బ
చును. ఇట్లు కలుగుబాధలు అక్రమములు లక్షణము

(వ్యాధి) తెలిసికొనబడుచున్నవి. వైద్యుడు చిన్నఘోటా దులోగూడ సహజమైన వ్యాధికంటె శక్తివంతమైన (33, 279) మిక్కిలి సారూప్యమైన పద్ధతిలో (ఒక సారూప్యౌషధమును) జీవపద్ధతిని మార్పుజేయగల కల్పితశక్తిని(Artificial potency) ప్రయోగించినప్పుడు, యీబలతరమైన సారూప్యమగు కల్పిత వ్యాధిగుణము (action) చే జీవపద్ధతిపై సహజముగజనించిన వ్యాధికిగల శక్తితొలగిపోగలదు. ఈవిధముగా సారూప్యౌష ధముమూలమున శరీరమునకృత్రిమవ్యాధిని(artifcial disease) కలుగజేసి శరీరమున స్థానమేర్పరచుకొనుటకు యత్నించు శక్తికర వ్యాధిశక్తి తొలగింపబడినప్పుడు వ్యాధి క్షణికమైనను జీవశక్తికొరకు నిలచియుండదు. అనగా వ్యాధి నిర్మూలము చేయబడుచున్నది. లోగడ తెల్పబడిన విధముగా నిర్ణయించిన సారూప్యౌషధమును, సక్రమముగ ప్రయోగించిన పక్షమున తొలగింపవలసిన తరుణవ్యాధి కొలదికాలము క్రిందటనే సంభ వించియున్న పక్షమున గోచరము కాకుండగనే కొలదిగంటలలో అదృశ్యమగును.

ప్రాచీనమైన దీర్ఘవ్యాధి ఉన్నత శక్తీకరణము గావింప బడిన (Highly potentised) ఔషధముయొక్క కొన్ని మో తాదుల నుపయోగించుట మూలమునను లేక ఒకటి రెండు మిక్కిలి సారూప్యమైన ఔషధములను అతి జాగరూకతతో

నిర్ణయము గావించి ♦1 ప్రయోగించుటమూలమునను సమస్త
అస్వస్థతా చిహ్నములతోను కొంచమూలశ్యముగ నివారణ
యగును. తరుచుగ అగోచరముగు సత్వర పరివర్తనములలో

♦1 ప్రతివ్యాధిస్థితికి సమస్త విషయములయందును మిక్కిలి అను కూలమగు సారూప్యౌషధమును వెదకి శోధనచేయుట కష్టతరమైన (ఒకొక్కప్పుడు మిక్కిలి కష్టతరమైన) యీపని సులభముచేయుటకై అనేకములైన ఉత్తమగ్రంథములున్నప్పటికి, వ్యాధులయొక్క మూలాధార ములను గూర్చి పరిశీలించి, మిక్కిలి మెలకువతోను, తీవ్రమైన ఆలోచనల తోను స్వయముగ కృషిచేయవలసిన అవసరము గలదు. వైద్యుడు తన విద్యుక్తధర్మమును నెరవేర్చుటకు విశ్వాసముతో మనస్సాక్షిగా జేసిన కృషికి తగిన ఫలితము లభించకపోదు. మిక్కిలి ఉత్తమమైన మార్గమున వ్యాధిని నివారణజేయుటను, యీకష్టతరమగు కార్యభారమును జాగరూకతతో నిర్వహింపవలసియున్నది. ఇట్టి జాగరూకత వహించినప్పుడే వ్యాధినివారణ సాధ్యమగును. సారూప్యౌషధ చికిత్సకులమని గౌరవనామములు పెట్టుకొని, యీవిధానమునుబట్టి చికిత్సజేయుటకు నిశ్చయించుకొని అందుకు తగు కృషిజేయక, సారూప్యౌషధము విధముగను, ఆకారముగను నున్న ఔషధ ములను ప్రయోగించుచు, తాము ప్రయోగించిన ఔషధము వ్యాధికి సరిపడని కారణమున, వెంటనే సులువు యగుపడని పక్షమున, తాము గావింపవలసిన ప్రధానకార్యమునందలి అశ్రద్ధకు, శాస్త్రవిషయమునందు తమకుగల అజ్ఞానమునకు వగవక, సరియైన శాస్త్రముగాదని, యీ అప నిందను హోమోపతీశాస్త్రము మీదనే మోపు, (నిజముగ జెప్పవలసిన తమ కెట్టి శ్రమకలుగకుండ వ్యాధికనుకూలించు సరియైన సారూప్యౌషధము లభించకపోవుటచే, సరియైన శాస్త్రముగాదని వీరు యిట్టి అపవాదవేయు చుండిరి) యిట్టి నూతనసంకరవైద్యజాతి (వైరూప్యౌషధములను, సారూ ప్యౌషధములను రెండుకలిపి చికిత్స చేయువారు) పెద్దలు మిక్కిలి శ్రమ దీసికొని అతిజాగరూకతతో నిర్వహింపవలసిన సారూప్యౌషధ చికిత్సను

స్వస్థత ఆరోగ్యము సంభవింపగలదు. జీవపద్ధతి తిరిగి స్వేచ్ఛ నొంది పూర్వమువలె శరీరముయొక్క చురుకుదనమును పొం సమర్థమైయుండును. తిరిగి బలము చేకూరును.

---

నిర్ణయముచేయు కార్యభారము నెట్లువహింపగలరు! (ఈకార్యభారము అట్టి వైద్యులకు తృప్తికరముగనుండదు.) సరిగా శోధింపని సారూప్యౌధము ప్రయోగించుట మూలమున యగుపడు అసమర్థతను కప్పిపుచ్చుకొనుటకు, అతిశులభమైన వైరూప్యౌషధ చికిత్సాసాధనములగు, బాధగభాగమున ఒకటి లేక రెండు డజనుల జలగలను తగిలించుట, రక్తనాళము చిన్నరంధ్రము గావించి, సుమారు ఎనిమిదిఔన్సుల రక్తము తీసివేయుట మొదలగు ప్రక్రియలను జరిగించి తమ ప్రతిష్ట కాపాడుకొనుటకు ప్రయత్నింతురు. ఈ ప్రక్రియలతో, రోగికి ఆరోగ్యము చేకూరిన పక్షమున రక్తస్రావము గావించుట, జలగలు పట్టించుట మొదలగు ప్రక్రియలనగూర్చి మిక్కిలి స్తుతించుచు యిట్టి ప్రక్రియల మూలమున చికిత్స గావించని పక్షమున రోగి వ్యాధినుండి బయటబడజాలకపోయి యుండుననియు సందేహము జనింపని చక్కనిమాటలలో ఏవిధమగు ఆలోచన బుద్ధివిశేషము అవుసరములేని యీ హానికరమైన కృత్యములు అత్యుత్తమమైన యదార్థముగు నివారణకు సహాయభూతమయ్యెననియు శ్లాఘింతురు. ఈ చికిత్సయందు రోగిమరణించిన పక్షమున, (అట్లు తరుచు జరుగుచునేయుండును) “మీరు చూచుచునేయుండిరి. రోగికి జేయవలసిన సమస్తచికిత్సయు లోపములేకుండ జేయబడినద”ని మృతినొందిన రోగియొక్క స్నేహితులను ఓదార్చెదరు. ఇట్టి నీచమైన హానికరజాతిని, మిక్కిలిపాటుపడి తెలిసికొనవలసిన అనుకూలమైన శాస్త్రముయొక్క నామముతో గౌరవప్రదముగ హోమోపతీవైద్యులని పిలచుట కెవరంగీకరింతురు? ఈవైద్యులుగావించు యిట్టి దుష్కృత్యముల పాపఫలితముగ, వారికి వ్యాధిసంభవించినప్పుడీవిధముగు చికిత్సయేవారికి లభించుగాక?

149

దీర్ఘకాలమునుండిగల వ్యాధులను (ముఖ్యముగా క్లిష్టమైన స్వభావముగల వ్యాధులను) నివారణజేయుటకు సరిసమానముగ దీర్ఘకాలము పట్టును. అందు ముఖ్యముగా ప్రకృతిసిద్ధమైన వ్యాధితోకలసి వైరూప్యౌషధ (అల్లోపతీ) వివిధప్రయోగముల మూలమున కలుగు దీర్ఘ ఔషధజనిత రక్తదోష విపరీత పరిస్థితులు అట్టివైరూప్యౌషధముల మూలమున నివారణ జేయబడక వదలివేయబడినప్పుడు అట్టిస్థితిని తొలగించి స్వస్థత చేకూర్చుటకు ఎక్కువ దీర్ఘకాలము పట్టును. వ్యర్థమగు తప్పు సూత్రములనాధారము జేసికొని తీవ్రముగ పనిజేయు పెద్దమోతాదులను దీర్ఘకాలముపయోగించి రోగియొక్క బలమును, సారమును (భేదిమందులు, రక్తస్రావములు, మొదలగువాని మూలమున) హరించివేయుటచేతను, యీచికిత్సా పద్ధతియందు అల్లోపతీవైద్యులచే గావింపబడు ప్రధాన ఘనకార్యమగు లోహాది సంబంధమైన అననుకూల స్నానములు (unsuitable mineral baths) మొదలగునవి నియోగించుటచేతను, తరుచుగ నిట్టివ్యాధులను నివారణజేయుట అసాధ్యమగుచుండెను.

150

రోగి పూర్వము కొలదికాలముక్రిందట అనుభవించిన ఒకటిలేక అంతకంటె నెక్కువయైన అముఖ్యమగు లక్షణములు సంభవించెనని రోగితెల్పినప్పుడు తీవ్రమైన వైద్యసహాయము

కోరు వ్యాధిపూర్తిగా వృద్ధిజెందెనని వైద్యుడు తలంపరాదు. ఇట్టి అనారోగ్యమును తొలగించుటకు ఆహారమునందు కొలది మార్పుగావించి ఆహార నియమముగావించిన పక్షమున సర్వ సాధారణముగ సరిపోవును.

## 151

కాని రోగి తనకు కొలదిగా తీవ్రమైన బాధలు గలవని తెల్పిన సందర్భములో వైద్యుడు పరిశీలనజేయ సర్వసాధారణ ముగ మరికొన్ని సౌమ్యస్వభావమైన యితరలక్షణములు గూడ అందులకుతోడు గాంచగలడు. ఈలక్షణములన్నియు గలిసి వ్యాధియొక్క సంపూర్ణరూపమును గోచరింపజేయగలవు.

## 152

తరుణ వ్యాధి ఎంతదుస్థితిలో నుండునో అంతవిశేష ముగ మనస్సునకు తట్టునట్లు ఆవ్యాధికి సంబంధించిన లక్షణము లుండగలవు గాన వానినుండి వ్యాధికి అనుకూలమగు మందును శోధించుటకు సవ్యమైన గుణములు తెలిసికొనబడిన అవసరమై నన్ని ఔషధములున్నపక్షమున మిక్కిలి నిశ్చయముగ వ్యాధి కనుకూలించు ఔషధమును కనుగొనవచ్చును. అనేకములైన ఔషధములయొక్క జాబితానుండి సహజముగ జనించిన వ్యాధియొక్క లక్షణ సముదాయముతో మిక్కిలి సారూప్య మగు ఔషధలక్షణములను గుర్తించుట కష్టతరమైన పనికాదు.

ఇట్లు కనుగొనబడిన ఔషధమే వ్యాధిని నివారణ జేయుటకు కావలసిన ఔషధము.

## 153

నిర్దిష్టమైన సారూప్యౌషధము కొరకు గావించు యీ శోధనయందు అనగా నివారణ చేయదలచిన వ్యాధికి సరిమానముగ సరిపోలు, కల్పిత వ్యాధి ప్రతినిధియగు ఔషధమును కనుగొనుటకు పరిశోధించి తెలిసికొనబడిన ఔషధలక్షణముల జాపితాతో సహజముగ జనించిన వ్యాధిలక్షణసముదాయమును సరిపోల్చునప్పుడు మిక్కిలి ప్రత్యక్షమైనట్టియు (Striking) ద్వందముకానట్టియు (Singuler) అసాధారణమైనట్టియు అసామాన్యమైనట్టియు(Uncommon)విచిత్రమైనట్టియు (peculiar) (సహజమైన) వ్యాధియొక్క చిహ్నలను లక్షణములను 1‡

‡1 సారూప్యౌషధముల యొక్క సహజ లక్షణములను గూర్చి గ్రంధము రచించియు సాముదాయమంజరి (Repertory) రచించియు డాక్టరు- వాన్, బోనింగిహాసన్ హోమోపతి పట్ల గొప్పసేవ గావించెను. జి. జార్ యను నాతడు గూడ నిట్లే ఔషధ ప్రధాన లక్షణముల గూర్చి గ్రంథములు రచించెను.

ఈక్రొత్త ఔషధ విధానమును గూర్చి మిక్కిలిశ్రమ దీసికొని పాటుపడి సేవగావించిన డాక్టరు వాన్ బోనింగు హాసన్ సోరా శాంతికరౌషధముల యొక్కయు సైకోసిస్ శాంతికరౌషణములయొక్కయు, సిఫిలిస్ శాంతికరౌషధములయొక్కయు సహజలక్షణవివరములతో ప్రధానమైనచిన్న పుస్తకమును (యితరభాషలలో) ప్రచురించియుండెను.

ముఖ్యముగా ప్రధానముగా దృష్టియందుంచుకొనవలెను. ఇట్లు శోధించిన ఔషధము నివారణ జేయుటకు అనుకూలించు ఔషధమై యుండుటకు మిక్కిలి ముఖ్యముగా ఔషధముయొక్క యీలక్షణ జాబితాయందలి లక్షణములకు వ్యాధి లక్షణములు సరిపడియుండవలెను. మిక్కిలి సర్వసాధారణమైన అస్పష్టమగు లక్షణములైన ఆకలిలేకపోవుట, తలనొప్పి, నీరసము, అస్థిమితమైననిద్ర, అసౌఖ్యము మొదలగునవి, అనిశ్చయమైన సంధిగ్ధమగు స్వభావముగలిగి సరిగా వివరింపబడజాలనప్పుడు యిట్టి సర్వసాధారణమైన స్వభావముగల లక్షణములు ప్రతివ్యాధియందును ప్రతిఔషధమునుండియు గాంచబడును గాన వానియందు అంతలక్ష్య ముంచవలసిన అవుసరము లేదు.

## 154

వ్యాధికనుకూలించు ఔషధము యొక్క విచిత్ర అసాధారణ అసామాన్య, విశద (Distingwishing) సహజ లక్షణములు నివారణ చేయదలచిన వ్యాధి యొక్క లక్షణములయందు ఎక్కువ సంఖ్యగా మిక్కిలి సారూప్యముగా కలిగి యున్నప్పుడు యీ ఔషధము యీవ్యాధిస్థితికి మిక్కిలి సరిపడు నిర్దిష్టమైన సాహూప్యౌషధమగుచున్నది. వ్యాధి దీర్ఘకాలమునుండియు యుండని పక్షమున తగినంత ఎట్టి కలతయు (disturbance) కలుగజేయకుండగనే మొదటి మోతాదుతోనే వ్యాధి సాధారణముగా తొలగింపబడి నిర్మూలము కావింపబడును.

155

తగినంత ఎట్టికలతయు కలుగజేయకుండగనే యని తెల్పి యుంటిని. ఏలనన మిక్కిలి అనుకూలమైన సారూప్యౌషధము ప్రయోగింపబడినప్పుడు ఔషధము యొక్క లక్షణములు మాత్రమే వ్యాధియొక్క లక్షణములకు అనుగుణముగానుండు టచే ఔషధలక్షణములు శరీరతత్వములో వ్యాధిలక్షణముల (బలహీనమైన) స్థానమును ఆక్రమించి వానిని తొలగించి నిర్మూలముచేయును. గాని సారూప్యౌషధముయొక్క మిక్కిలి అసంఖ్యాకములైన యితరలక్షణములు వ్యాధికి సంబంధించి యుండకపోవుటచే ఎట్టిగుణమును కలుగజేయవు. రోగి ఔష ధముయొక్క ఇతరలక్షణముల నేమియును అనుభవించక గంటల ప్రకారము స్వస్థతజెందగలడు. ఏలనన సారూప్యచికిత్సకొరకు ఉపయోగింపబడు ఔషధము మిక్కిలి సూక్ష్మమైన మోతాదు లలో నుండుటచే వ్యాధిగ్రస్తముగాని శరీరమునందలి యితర భాగములయందు ఔషధముయొక్క వ్యాధికి సారూప్యముగాని యితరలక్షణములను కలుగజేయుటకు మిక్కిలి బలహీనమై యుండి తగినంత ఎట్టికలతలు కలుగజేయజాలదు. తత్ఫలితముగ సారూప్యమగు వ్యాధిలక్షణములతో ఉద్రేకము చెందియున్న భాగములపై పనిచేయుటచే వ్యాధిగ్రస్తమైయున్న జీవశక్తికి బలకరమైన ఔషధజనిత వ్యాధికలుగజేయబడి అందుమూలాల మున అసలువ్యాధి నిర్మూలము చేయబడుచున్నది.

156

ఏసారూప్యౌషధముగూడ ఎంతవ్యాధి కనుకూలించు నట్లు శోధించినను ముఖ్యముగా చాలని చిన్నమోతాదులలో ప్రయోగించినప్పుడు మిక్కిలి ఉద్రేకస్వభావము అభిమానము గలరోగులయందు ఆఔషధగుణమున్నంతకాలము అథమము అసాధారణమైన కొద్దికలతనైనను స్వల్పమైన ఒక్కక్రొత్త లక్షణమునైననుకలుగజేయదు. ఏలనన సమకోణములుసమభుజములుగల రెండుత్రికోణములు ఒకదానినొకటి వ్యత్యాసము లేక ప్రచ్ఛన్నము గావించునట్లు వ్యాధి, ఔషధలక్షణములు, యీరెండును ఒకదానినొకటి కనుబడకుండ మరుగు పరచుట అసంభవము. కాని సాధారణ పరిస్థితులయందు యీస్వల్పమైన విభేదము సజీవశరీరతత్వమునందుగల శక్తిచే సులభముగ తొలగింపబడ గలదు. మిక్కిలి సున్నితమైన తత్వముగాని (మోటు తత్వముగల) రోగులయంది గోచరింపఁ డదు. వైరూప్యౌషధ ప్రతిబంధకములచేతను ఆహారనియమ వికల్పములచేతను, కామ క్రోధాది గుణముల ఉద్రేకముల మూలమునను అవరోధము కల్గింపబడని పక్షమున సరియైన స్వస్తత చేకూరు గమ్యస్థానము చేరువరకు సుగుణము ముందుకు నడచిపోవును.

157

సారూప్య పద్ధతిని శోధింపబడిన ఔషధము వ్యాధికను కూలమైయున్న కారణమునుబట్టియు మిక్కిలి సూక్ష్మమైన

మోతాదులో ప్రయోగింపబడు ఔషధమైయుండుటనుబట్టియు యీఔషధము సారూప్యముగాని యితరలక్షణములను కలుగ జేయకుండగనే అనగా విపరీతమైన యితరక్రొత్తకలతలను కలుగ జేయకుండగనే సారూప్యమగు వ్యాధిని సౌమ్యముగ తొలగించి నిర్మూలముచేయుట నిశ్చయము; గాని సర్వసాధారణముగా ఔషధమునుప్రయోగించినవెంటనే మొదటిగంటలో లేక కొలది గంటలకు (మోతాదు మిక్కిలి పెద్దదైనపక్షమున చాలగంట లకు) అసలువ్యాధికిమిక్కిలి పోలికగలిగినటువంటి తనవ్యాధి ఉద్రేకించెనని రోగికి యగుపించువిధమున ఒకవిధమైన కొద్ది ఉద్రేకమునుఔషధముకలుగజేయును. యదార్థముగనిది అసలు వ్యాధికంటె మించినబలముగల సారూప్యమైన ఔషధజనిత వ్యాధిగాని వేరొండుగాదు.

## 158

మొదటి గంటలోనే సంభవించు యీకొద్ది సారూప్యౌ షధ ఉద్రేకము సర్వసాధారణముగా మొదటి మోతాదుకే తరుణవ్యాధిలొంగగలదని తెలిసికొనుటకు శుభసూచకము. ఈసారూప్యౌషధఉద్రేకము ఔషధము ప్రయోగించిన మొదటి గంటలలో యగుపించి తీరవలెను. ఏలనన సహజముగ జనించిన బలమైనవ్యాధి తనకు సారూప్యముగనున్న మరియొక బలహీన మగు వ్యాధిని (43–48) ఎట్లుతొలగించి నిర్మూలముచేయునో

అల్లే వ్యాధినిర్మూలము చేయబడుటకు నివారణచేయదలచిన వ్యాధికంటె ఔషధజనితవ్యాధి బలతరమై యుండవలెను.

## 159

సారూప్యౌషధము యొక్క మోతాదు ఎంతచిన్నదిగ నుండునో అంతస్వల్పముగను, అంతకొలదికాలమును ఔషధము ప్రయోగించిన మొదటిగంటలలో గోచరమగు యీవ్యాధి ఉద్రేకముండగలదు.

## 160

స్వల్పకాలమునుండి మాత్రమేగల క్లిష్టముగాని స్వభావ సిద్ధమైన సారూప్యమగు వ్యాధిని సంపూర్ణముగ నివారణజేసి నిర్మూలము చేయజాలనంత అతిసూక్ష్మమైన మోతాదులో సారూప్యౌషధ మోతాదును తయారుచేయరాదను విషయ మునుబట్టి (249 వ్యాఖ్యానము) అనుకూలమైన సారూప్యౌషధము యొక్క మోతాదును మిక్కిలి సూక్ష్మముగాని మోతాదులలో ప్రయోగించిన పక్షమున మొదటి గంటలలో ప్రత్యేకముగ గోచరమగునట్లు ఆవిధమైన సారూప్యౌషధ ఉద్రేకము నెట్లు కలుగ జేయునో తెలిసికొనగలము *1

---

1* ఉద్రేకమువలెగనుపడు, వ్యాధిలక్షణములకు సరిపోలికగల ఔషధ లక్షణముల యొక్క యీ హెచ్చుస్థితి, అప్రియత్నముగ యితరవిధాన వైద్యుల చేగూడ సారూప్యము ఔషధము ప్రయోగింప బడినప్పుడు గాంచబడెను.

సారూప్యౌషధోద్రేక (Homoeopathic aggravation) మని పిలువబడు యీయుద్రేకము లేక అసలు వ్యాధి యొక్క లక్షణములు కొంతవరకు ఉద్రేకముజెందినట్లు యగుపడు యీ సారూప్యౌషధముయొక్క ప్రథమగుణముయొక్క కాలపరిమితి మొదటి ఒకటి లేక కొలది గంటలు మాత్రమే యుండగలదని

---

చిడుముచే బాధపడు రోగికి యితరవిధాన వైద్యుడు గంధకమును ప్రయోగించినప్పుడు, చిడుముపొక్కులు వృద్ధియైన సందర్భములలో అందులకు కారణమావైద్యుడు గమనింపజాలక, నివారణజేయబడుటకుముందు మొదట సరిగా చిడుము అంతయు బైటకు రావలయునని సమాధానము చెప్పును. చిడుము వృద్ధియైనట్లగుపడు రూపముతోనున్నవి, గంధకపు పొక్కులని ఆతనికి తెలియదు.

"నెమోలాంట్రికలర్ అను మూలికచే నివారణకాబడిన ముఖముపై పొక్కులు యీఔషధము ప్రయోగింపబడిన ప్రారంభమున మిక్కిలి ఉద్రేకము జెందించి యుండె" నని వీరాయ్ అనునాతడు తెల్పియుండెను గాని, యీవ్యాధికి కొంతవరకు సారూప్యమగు యీమూలికను ఎక్కువ మోతాదులలో ప్రయోగించుట మూలముననే యిట్టి ఉద్రేకము సంభవించి యుండెనని ఆతనికి తెలియదు. "ఎలమ్ అను చెట్టుయొక్క పట్ట, యీపట్టను సేవించినప్పుడు ప్రారంభమునందు వృద్ధిజెందించు సమస్త చర్మ వ్యాధులను నిశ్చయముగ నివారణజేయ" గలదని లైసల్ అనునాతడు తెల్పియుండెను. సైరూప్యౌషధ విధానములో నిచ్చు రాక్షసి మోతాదులలో వలెగాక, ఔషధ లక్షణములకు వ్యాధినిసమానమైన లక్షణములను యగుపరచునప్పుడు, అనగా ఔషధము వ్యాధికి సారూప్యమై యున్నప్పుడు, ఔషధమును అవసరమైన చిన్న మోతాదులలో ప్రయోగించిన యెడల; యిట్టి ప్రత్యక్షమగు వ్యాధి ఉద్రేకము, అగుపడకుండగనే నివారణ కాగలదు.

పరిమితి ఏర్పరచి యుంటిని. కొలది కాలము *1 క్రిందటనే సంభవించిన తరుణ వ్యాధి స్వభావముగల వ్యాధులలో నీవిషయము నిశ్చయముగ యదార్థమై యున్నది. కాని దీర్ఘకాలము నుండిగల వ్యాధుల నెదుర్కొనుటకు దీర్ఘకాలము పనిచేయు ఔషధములను ప్రయోగించి నప్పుడు చికిత్సయందు అసలు వ్యాధి ప్రత్యక్షముగ వృద్ధిజెందినట్లుగ పడనక్కరలేని సందర్భమునందు వ్యాధికి సారూప్యముగ సరిగా నిర్ణయము జేసిన ఔషధమును అనుకూలమైన చిన్నమోతాదులలో ఔషధశక్తిని క్రమముగా వృద్ధి జేయుచు (Renewed Dynamization) (247 పేరా) క్రమముగా హెచ్చు మోతాదులలో (Gradually higher doses) ప్రయోగించిన పక్షమున అసలు వ్యాధి ఉద్రేకించుట యగుపడదు. దీర్ఘవ్యాధి యొక్క మొదటి లక్షణములు వృద్ధియగుట చికిత్స యొక్క ఆఖరి దశయందు నివారణ చాలవరకు పూర్తియైనప్పుడు లేక పూర్తియైనప్పుడు మాత్రమే యగుపడును.

---

1* ఔషధములు గలిగియున్న సక్రమమైన దీర్ఘకాలగుణము (Longest duration of action) తరుచు వ్యాధులలో సత్వరము గను, అంతకంటె తీవ్రమైన వ్యాధులలో యింకను సత్వరముగను ముగియు గలదు. ఈగుణము సోరాతత్వమునుండి జనించు దీర్ఘవ్యాధులలో అందుకు సరిసమానముగనే దీర్ఘకాలముండగలదు. గాన, సోరాతత్వశాంతక ఔషధము ప్రయోగింపబడిన కొలదిగంటలలో సారూప్యౌషధ ఉద్రేకము యగుపడక మొదటి ఎనిమిది లేక పదిదినములలో, వేర్వేరు గంటలలో (various hours) అట్టి ఉద్రేకము యగుపడుట సంభవించు చున్నది.

(ఆర్గనాన్ 5వ పరిష్కరణమునందలి ఫుట్‌నోటు)

162

యదార్థమైన పరిశుద్ధమగు గుణములను తెలిసికొనబడిన ఔషధములు కొలదిగమాత్రమే యుండుటచే చికిత్సచేయు వ్యాధియొక్క లక్షణములయందు కొంతభాగమునకు మాత్రమే అనగా కొన్నిలక్షణములకు మాత్రమే అనుకూలమైన ఔషధముయొక్క లక్షణముల జాపితాయందు సారూప్యలక్షణములు లభింపగలవు. గాన అంతకంటె సరియైన ఔషధము లభింపకుండుటచే లోపభూయిష్టమైన (inperfect) ఔషధమునే ఒక్కొక్కప్పుడు ప్రయోగింపవలసి వచ్చును.

163

ఇట్టి సందర్భములయందిట్టి ఔషధిమువలన క్రమగలుగజేయని సంపూర్ణమైన నివారణాలభింపజాలదు. ఈఔషధమును ఉపయోగించునప్పుడు వ్యాధియంధు అంతకుపూర్వము గోచరముగాని కొన్నిలక్షణములు సరిగా అనుకూలించని ఔషధముయొక్క సహచర లక్షణములు (accessory symptoms) యగుపడగలవు. గాని యిట్లగుపడుట మూలమున వ్యాధియందు చాలభాగము (ఔషధ లక్షణములకు పోలికగల వ్యాధిలక్షణములు) ఔషధముమూలమున తొలగింపబడుటకు ఎట్టి అవరోధము కలుగక అందుమూలమున నివారణకు మంచిప్రారంభముగానింపబడును. మరియు ఔషధము అవసరమైనంత చిన్న

మోతాదులో నుండుటచే మితముగానుండు యీసహచరలక్ష
ణములు లేకుండ నివారణకు యిట్టి ఉత్తమప్రారంభము గావింప
బడదు.

164

అత్యుత్తమముగ శోధింపబడిన ఔషధమునందుగల
సారూప్యలక్షణములు కొలదిగ యున్నంతమాత్రమున నివారణ
కెట్టి అవరోధము కలుగజాలదు. ఈకొలది లక్షణములు ఔష
ధముయొక్క అసాధారణమైన లక్షణములై యుండి వ్యాధి
యొక్క విచిత్రవిస్ఫుట సహజలక్షణములతో సారూప్యమై
యున్న పక్షమున నివారణ కవరోధము కలుగజాలదు. ఇట్టి పరి
స్థితులయందు ఎట్టికలతయులేక నివారణ సంభవింపగలదు.

165

శోధింపబడిన ఔషధ లక్షణములయందు సరిగా సరి
పోలు వ్యాధియందుగల విస్ఫుటమైన (సహజ) విచిత్ర అసా
ధారణ లక్షణములు లేక సందిగ్ధముగను, అనిశ్చయముగను,
(వికారము నీరసము, తలనొప్పి మొదలగునవి) తెల్పబడిన
వ్యాధిలక్షణములతో ఔషధము సంబంధించియుండి పరిశోధన
చేయబడి తెలిసికొనబడిన ఔషధములలో అంతకంటె సారూప్య
ముగ అనుకూలమగు ఔషధము లభింపని పక్షమున యిట్టి

సారూప్యముగాని ఔషధమును ప్రయోగించి వైద్యుడు సత్వర అనుకూల ఫలితములు పొందజాలడు.

## 166

పరిశుద్ధగుణములు తెలిసికొనబడిన ఔషధములిప్పుడు విశేషముగ నుండుటచే అట్టిస్థితి అరుదుగ సంభవింపగలదు. అట్టి అననుకూలమైన ఔషధమును ప్రయోగించుట మూలమున సంభవించిన దుష్ఫలితములు యింకను సారూప్యమగు మరియొక ఔషధము పిమ్మట శోధించి ప్రయోగింపబడినప్పుడు తగ్గి పోగలవు.

## 167

ఇట్టి అననుకూలమైన ఔషధమును ప్రథమమున ప్రయోగించినప్పుడు ముఖ్యమైన కొన్ని సహచరలక్షణములు సంభవించిన పక్షమున తరుణవ్యాధులలో ప్రథమమోతాదుయొక్క పని పూర్తిగానీయక అనగా ఔషధగుణము పూర్తియగువరకు రోగిని విడచియుండక యీమార్పుజెందిన స్థితిలోనున్న నూతన వ్యాధి పరిస్థితిని పరిశీలించి వ్యాధియొక్క నూతనరూపమును కనుగొనుటకు క్రొత్తగా వృద్ధిజెందిన లక్షణములకు అసలు వ్యాధికి మిగిలియున్న లక్షణములను కలుపవలయును.

## 168

అప్పుడు మనము పరిశోధింపబడిన ఔషధములనుండి

వెంటనే యీవ్యాధిపరిస్థితికి అనుకూలించు ఔషధమును కనుగొనుటకు సమర్థులమై యుండగలము. అట్లు కనుగొనబడిన ఔషధముయొక్క ఒక్కమోతాదు వ్యాధిని పూర్తిగానిర్మూలము గావించనప్పటికి వ్యాధిని నివారణజేయు మార్గమునకు చాలదూరము తీసికొని రాగలదు. ఈఔషధముగూడ వ్యాధిని నివారణజేసి ఆరోగ్యము చేకూర్పజాలని పక్షమున రోగిని సరియైన ఆరోగ్యములోపెట్టు మన ఆశయము నెరవేరువరకు యీ విధముగా మిగిలియున్న వ్యాదిపరిస్థితిని తిరిగితిరిగి పరీక్షించి సాధ్యమగునంతవరకు అనుకూలించు సారూప్యౌషధమును ప్రయోగించుచుండ వలయును.

## 169

వ్యాధిని పరీక్షించి ప్రథమమున ఔషధమును శోధించునప్పుడు పరిశోధనచేయబడిన ఔషధములు వలసినన్ని లేనందున వ్యాధియొక్క లక్షణ సముదాయమంతయు ఒక్క ఔషధము ఆమోఘముగ గలిగియుండనందున వ్యాధికనుకూలించు రెండు ఔషధములు గుర్తింపబడి ఒక ఔషధము వ్యాధియొక్కకొంత భాగమునకు రెండవఔషధము వ్యాధియొక్క తక్కిన భాగమునకు సారూప్యమై అనుకూలించి యున్నప్పుడు యీరెండు ఔషధములలోను మిక్కిలి అనుకూలమైన ఔషధమును ప్రయోగించి అటుపిమ్మట గలిగిన మార్పును నూతనముగా పరిశోధించి యీలోపున జరిగిన మార్పునుబట్టి అప్పటికి మిగిలి

యున్న లక్షణములకు అనుకూలించు ఔషధములను ప్రయో గించుటకు మారు పై రెండవ ఔషధమును ప్రయోగించుట ఉచితముగాదు. ఈసందర్భము నందు పై రెండవ ఔషధము ప్రయోగించుటకు బదులు నూతనపరీక్షయందు కనుగొనబడిన లక్షణ సముదాయమునకు అనుకూలించు సారూప్యౌషధమును శోధించి ప్రయోగింపవలయును.

## 170

గాన వ్యాదిలక్షణములు మార్పు చెందిన ప్రతిసందర్భము నందును యీవిధముగనే వ్యాదియందు మిగిలియున్న ప్రస్తుత లక్షణ సముదాయమును విచారణజేసి ప్రారంభమునందుగల లక్షణసముదాయమునకు అనుకూలముగ యగుపించిన రెండవ ఔషధమునందులక్ష్యముంచక ప్రత్యక్షముగ మనముందు యగుపడు నూతన పరిస్థితికి సాధ్యమగునంతవరకు అనుకూలమగు మరియొక సారూప్యౌషధమును శోధించవలసి యున్నది. మొదట శోధింపబడిన ఔషధమే మిగిలియున్న వ్యాదిలక్షణములకు అనుకూలమైన ఔషధమైయుండుట తటస్థించిన పక్షమున (అట్లు తరుచుగ జరుగదు) మరియొక ఔషధమునకు బదులు యీ ఔషధమునే ప్రయోగింపదగును.

## 171

సుఖసంబంధమైన దీర్ఘ వ్యాధులుగాక సోరా (చిడుము తత్వము) నుండి జనించిన వ్యాధులను నివారణజేయుటకు కొన్ని సోరా శాంతికరౌషధములను ఒకదానివెంబడి ఒకటి ఒకఔషధ గుణము పూర్తియైనపిమ్మట వేరొక ఔషధమును ప్రయోగించు విధముగా మిగిలియున్న వ్యాధిలక్షణములకు అనుకూలించు ఔషధమును శోధించుచు ప్రయోగించవలసియున్నది.

## 172

వ్యాధిలక్షణములు కొలదిగానున్నప్పుడుగూడ నివారణ యందు యిట్టివిధమగు యిబ్బందియే సంభవింపగలదు. సాధ్య మగు సమస్త చికిత్సలకంటెను మిక్కిలి పరిపూర్ణతచెందియున్న యీచికిత్సాపద్ధతియందు సమస్తమైన లోపములను (విశేష ముగ పరిశోధింపబడిన ఔషధములులేని లోపములుతప్ప) తొల గించుటకు మనము జాగరూకతతో గమనింపవలసియున్నది.

## 173

కొలది లక్షణములు మాత్రమే గలిగి అందుమూలమున నివారణ సులభసాధ్యముగాక యుండు వ్యాధులు ముఖ్యమైన ఒకటి లేక రెండు లక్షణములను మాత్రమే కనుబరచి తన్మూ లమున యితరలక్షణములు మరుగుపరుపబడి యుండుటచే అట్టి

వ్యాధులను ఏకపక్షములని (one sided maladies) పిలుః వచ్చును. ఈవ్యాధులు ముఖ్యముగా దీర్ఘవ్యాధుల తరగతి: చెందగలవు.

174

ఈదీర్ఘవ్యాధులయొక్క ప్రధానలక్షణము అంతరంగ మునకు చెందినబాధగాని (అనేక సంవత్సరములనుండిగల తల నొప్పి, దీర్ఘకాలమునుండిగల విరేచనములు, ప్రాచీనమునుండి గల గుండెనొప్పి, మొదలగునవి) లేక బహిరంగ సంబంధమగు బాధకాని కావచ్చును. ఈ రెండవ సందర్భమగు స్వభావముగల (శరీరబాహ్య ప్రదేశమునగల) వ్యాధులు స్థానికరోగములను (local madalies) నామమున సర్వసాధారణముగా గుర్తింప బడును.

175

మొదటి తరగతికి చెందిన ఏకపక్ష వ్యాధులయందు (one sided diseases) వ్యాధి చిత్రమును పూర్తి చేయుటకు అవకాశముగలుగ జేయు లక్షణములను ఔషధపరిశోధకుడు పూర్తిగా కనుగొనజాలకుండెనను విషయము తరుచుగ ఔషధ పరిశోధకుని విజ్ఞానలోపము మూలమున నేయని ఆరోపణ చేయు బడుచున్నది.

## 176

మిక్కిలి జాగరూకతతో గూడిన ప్రారంభ విచారణ యందు (84—98) ఒకటి రెండు కఠినమైన తీవ్రలక్షణములు యగుపించి యితరలక్షణములన్నియు అస్పష్టముగ గోచరమగు వ్యాధులు గూడ యింకను స్వల్పముగ గలవు.

## 177

అరుదుగా సంభవించు యిట్టివిధమగు సందర్భలయందు చికిత్స జయప్రిదముగ కొనసాగించుటకు యీకొలది లక్షణ ములనే ఆధారము జేసికొని మన అభిప్రాయమునకు మిక్కిలి సారూప్యమై అనుకూలించి యున్న ఔషధమును నిర్ణయించ వలయును.

## 178

సారూప్యౌషధ సూత్రముల ననుసరించి సరిగా పరిశీలన జేసి నిర్ణయింపబడిన యీఔషధము ప్రస్తుత వ్యాధిని నిర్మూల ము చేయుట కనుకూలించు సరిసమానమగు కల్పితవ్యాధి లక్ష ణములను గలిగియుండు ఔషధమై యుండుటఒక్కొక్కప్పుడు మాత్రమే సంభవింపగలదుగాని వ్యాధికిగల కొలదిలక్షణములు మనస్సునకు నాటునట్లు, నిశ్చయమై,అసాధారణమై విచిత్రముగ విస్పష్టమై (సహజ) యున్న పక్షమున అట్టి సరియైన ఔష ధము లభించుటకు మిక్కిలి సావకాశము గలదు.

179

ఇట్టి పరిస్థితియందు మొదట నిర్ణయము చేసిన ఔషధము సరియైన శోధన గావించుటకు మార్గదర్శకమగు వలసినన్ని లక్షణములు వ్యాధియందు లభించకుండుటచే చాలాతరుచుగా కొంతవరకు మాత్రమే వ్యాధికి అనుకూలించి యుండగలదు. అనగా పూర్తిగ అనుకూలమై యుండదు.

180

ఈసందర్భమునందు పైన నుదహరింపబడిన కారణములను బట్టి సాధ్యమగు నంతవరకు అనుకూలముగ నిర్ణయింపబడిన ఔషధము సారూప్యలోపము గలిగి యుండుటచే ఔషధముతో కొంతవరకు మాత్రమే సంబంధముగల యీవ్యాధిపై (కొలది సంఖ్యగల సారూప్యౌషధములు అననుకూల నిర్ణయము కెడమిచ్చునని పైన తెల్పబడిన విధముగా 162) పనిచేయు నప్పుడు అట్టి ఔషధము తనకుగల సహాజచర లక్షణములను (accessory symptoms) జనింపజేసి పలువిధములైన పరిస్థితులను కలుగజేయగలదు. మరియు ఈసహచర లక్షణములు ఈ పలువిధములైన పరిస్థితులు రోగి యొక్క ఆరోగ్య స్థితితో మిశ్రమ మగుచున్నవి. ఈలక్షణము లిదివరకెప్పుడును గాంచబడక పోయినను లేక మిక్కిలి అరుదుగా అంతకు పూర్వము గాంచబడియున్న వ్యాధియొక్క లక్షణములే యగుచున్నవి.

అంతకుపూర్వమెన్నడును రోగి యనుభవించని కొన్ని లక్షణములు యగుపించగలవు. లేక తాను అస్పష్టముగ తెలిసికొనిన యితర లక్షణములు మిక్కిలి విస్పష్టముకాగలవు.

## 181

ఇప్పుడు యగుపించిన సహచరదృశ్యము, క్రొత్త లక్షణములు, యిప్పుడు ప్రయోగించిన ఔషధము మూలముననే సంభవించెననియనుట కభ్యంతరపెట్టరాదు. నిశ్చయముగ వాని ఉత్పత్తికి యీఔషధమే ‡1 బాధ్యస్థమైయున్నది. గాని యీ లక్షణములు యీశరీరతత్వమున యీవ్యాధి తనంతతానుజనింపజేయ సమర్థమైన స్వభావముగల లక్షణములుమాత్రమే ఎల్లప్పుడుయైయుండి సాదృశ్యలక్షములను గలుగజేయు శక్తి ఔషధము కలిగియుండుటచే ఆఔషధము ప్రయోగించుట మూలమున సహచరదృశ్యము క్రొత్త లక్షణములు ముందుకువచ్చి బహిర్గతమగుటకు ప్రేరేపింపబడుచున్నవి. అనగా యిప్పుడు గోచరమగు సంపూర్ణ లక్షణ సముదాయమంతయు ఉన్నప్రస్తుత యదార్థస్థితినిబట్టి తదనుగుణ్యముగ ముందుచికిత్సకు దోవజూపుటకు వ్యాధికే చెందియున్నదని పాటించవలెను.

---

‡1 ఈలక్షణములు యీసహచర దృశ్యము ఋతుమతియగుట, బహిష్టునిలచిపోవుట, గర్భిణీ సంభవించుట, సంతానముకలుగుట మొదలగునవి పథ్యనియమముల యందలి క్రమపద్ధతి తప్పిన గొప్పపొరబాటుమూలముచను, విపరీతమైన మానసోద్రేక మూలమునను, శరీరతత్వమున వైపరీత్యము కలుగుట మూలమునను సంభవింపనప్పుడు.

## 182

వ్యాధియందుగల లక్షణములు స్వల్పముగమాత్రమే యున్న సందర్భమునందు తప్పనిసరియైన లోపభూయిష్టమగు ఔషధనిర్ణయము వ్యాధిలక్షణములను పూర్తిగ యగుబరచుటకుపయోగించి యీవిధముగా యింకను సరిగా అనుకూలమగు రెండవ సారూప్యౌషధమును కనుగొనుటకు సదుపాయము కలుగచేయుచున్నది.

## 183

గాన మొదటి ఔషధముయొక్క మోతాదు లాభకరమైన గుణమేమియు కలుగజేయక నిలచిపోయినప్పుడు (క్రొత్తగా వృద్ధిగావింపబడిన లక్షణములు, వానితీవ్రతనుబట్టి అంత సత్వర సహాయ మపేక్షించని పక్షమున: సారూప్యౌషధము యొక్క మోతాదు అతిసూక్ష్మముగా నుండుటచే మిక్కిలి దీర్ఘవ్యాధులలో సత్వర సహాయముయొక్క అవుసరము చాల అరుదుగ నుండును) వ్యాధినిగూర్చి క్రొత్త పరీక్షగావించి ప్రస్తుత పరిస్థితి వ్రాసికొని వ్యాధిలక్షణములింకను వృద్ధిజెంది యింకను సంపూర్ణముగ. నుండుటచే అట్టి లక్షణములకు మిక్కిలి అనుకూలమైన వ్యాధిపరిస్థితికి సరిగా అనుకూలించు రెండవ సారూప్యౌషధమును శోధింపవలసి యున్నది. *2

*2 రోగివిస్తారమైన జబ్బుస్థితి యనుభవించునప్పుడు, (దీర్ఘవ్యాధులలో యిట్టిస్థితి మిక్కిలి అరుదుగా నుండును గాని, తరుణవ్యాధులలో

## 184

ఈ విధముగనే, ప్రతి క్రొత్త ఔషధము యొక్క మోతాదు గుణము ముగిసినపిమ్మట, మిగిలిన లక్షణములను బట్టి మిగిలియున్న వ్యాధిపరిస్థితిని క్రొత్తగా వ్రాసికొని, యిప్పుడు గాంచియున్న వ్యాధిలక్షణసముదాయమునకు సాధ్యమగునంతవరకు అనుకూలమగు మరియొక సారూప్యౌషధమును, వెదకి యిల్లె సంపూర్ణముగ ఆరోగ్యము చేకూరువరకు చికిత్సగావింపవలయును.

## 185

ఏకపక్ష వ్యాధులయందు ( one sided diseases ) స్థానికవ్యాధులు (Local maladies) ప్రాముఖ్యమైన స్థానము నాక్రమించుచున్నవి. స్థానికవ్యాధులను పేరునుబట్టియే శరీరమునందలి వెలుపలిభాగమున యగుపడు బాధలు మార్పులు అని సూచింపబడుచుండెను. ఇట్టి వ్యాధులనుగూర్చి యింతవరకు యితరవైద్య విధానములలో శరీరమునందలి యీభాగములే

తరుచు గాంచబడును) లక్షణములు అస్పష్టములైనస్థితిలో నుండగలవు. ఈస్థితినరములు తిమ్మిరెక్కి మొద్దుబారుటమూలమున సంభవించి, రోగి యొక్క బాధలు, స్పష్టముగ గోచరమగుటకు అవకాశ మొసగవు. అట్టి అంతరంగ స్పర్శజ్ఞానముయొక్క తిమ్మిరి నల్లమందుమూలమున తొలగించినపక్షమున, దీనియొక్క ద్వితీయగుణమునందు వ్యాధిలక్షణములు స్పష్టగ ప్రత్యక్షము కాగలవు.

వ్యాధిగ్రస్తమైయున్నవనియు, శరీరమునందలి తక్కినభాగము వ్యాధియందు పాల్గొని యుండలేదనియు యను భావము వ్యాపించి యున్నది. ఇది మిక్కిలి హానికరమైన ఔషధ చికిత్సకు మార్గదర్శకమైన, ఊహింపబడి నిర్థారణ చేయబడిన అసంగతమగు సిద్ధాంతము.

## 186

కొలది కాలముక్రిందటనే కేవలము బాహ్యావయవ వికల్పము మూలమున జనించిన యీపిలువబడు స్థానికవ్యాధిలక్షణములు ప్రథమదృష్టికి స్థానికవ్యాధులను నామకరణమునకు యోగ్యముగనే యగుపించగలవు అట్టి వికల్పము స్వల్పమై యున్న పక్షమున చాలకాలముండదు. శరీరమున పైభాగమున కలిగినగాయముల విషయములో యీగాయములు మిక్కిలి తీవ్రముగా తగిలియున్నచో సజీవమైయున్న శరీరతత్వమంతయు సానుభూతి చూపగలదు. జ్వరము మొదలగునవి సంభవింప గలవు. ఇట్టి వ్యాధుల చికిత్స శస్త్రచికిత్సకు సంబంధించియున్నద గాని దెబ్బతగిలిన భాగములకు శస్త్రపరికరసహాయము అవసరమై జీవశక్తిమూలమున మాత్రమే కలుగజేయబడు నివారణకు బహిరంగ అవరోధములను తొలగింపవలసిన అవసరము కలిగినపుడు అట్టి పరికరముల మూలమున తొలగించి అట్టిచికిత్సకు గడంగుట న్యాయము.

అనగా గాయములయందు తెగివిడిపోయిన భాగములను దగ్గరకుజేర్చికట్టుట, సజీవమైన శరీరభాగములలో దూరిన యితర అన్యవస్తువులను (foreign bodies) బైటకుతీసివేయుట లోపల బాధ కలుగజేయు పదార్థయును (irritating substance) బైటకు తీసివేయుటకు రంధ్రముచేయుట, విరిగిపోయిన ఎముకవద్ద చేరిన అనవసర ద్రవపదార్థములను (effusions) బైటకు పోవునట్లుచేసి విరిగిన ఎముకను దగ్గరకుజేర్చి యథాస్థానములోనుండునట్లు కట్టుకట్టుట మొదలగు సాధనములను గావించి బాహ్యవరోధములను తొలగింపవలసినప్పుడు అట్టి చికిత్సకు గడంగుట న్యాయము. గాని అట్టిగాయములయందు గాయమును మాన్పవలసిన కార్యము నెరవేర్చు స్థితిలోనుండుటకు సజీవమైన శరీర తత్వమునకు ఆధ్యాత్మిక సూక్ష్మసహాయమెల్లప్పుడు అవసరమైయున్నది. అనగా తీవ్రమైన దెబ్బవలన కండరములు మొదలగునవి నలిగిపోవుటచేతను కండరములు, నరములు, రక్తనాళములు తెగిపోవుటచేతను సంభవించు తీవ్రమైన జ్వరమును లోపలకు ఔషధమిచ్చి తొలగింపవలసిన అవుసరము కలుగును. మరియు కాలిన లేక కాలిపొక్కిన భాగముపై గల బాధను సారూప్యముగ శాంతింప జేయవలసి వచ్చినప్పుడు సూక్ష్మశక్తి సిద్ధాంతములననుసరించు హోమోపతీ వైద్యునకు సహాయభూతమగు సారూప్యౌషధములయొక్క అవుసరమువచ్చును. (అనగా కాలిన భాగమునందలి బాధను సారూప్యౌషధమును లోపలికిచ్చి తగ్గింపవచ్చును)

187

పైన తగిలిన దెబ్బల మూలముననగాక, సత్వర ఉదే
కారణమున చర్మముపై సంభవించు పుండుమూలమున య
పడు మార్పులు, బాధలు, మొదలగునవి మరియొక పద్ధ
కలుగజేయబడుచున్నవి. వీనికి మూలాధారము ఏదియో దె
అంతరంగ వ్యాధినుండి యుండగలదు. వీనిని గూడవట్టి స్థా
మైన వ్యాధులుగ తలంచి ప్రాచీన కాలమునుండియు ప్రా
విధాన వైద్యులు చికిత్సగావించునట్లు ( అల్లోపతీ ) కేవల
శస్త్రచికిత్స గావించి చికిత్స చేయుటయు లేక ఆయా స్థానమ
యందు వేయు పట్టీలు పట్లు మొదలగువానిచే చికి
జేయుటయు మిక్కిలి అసంగతము. ఇట్టి చికిత్స ఎంత అసం
మో ఫలితములుగూడ అంతహానికరమై యుండగలవు.

188

ప్రాచీనవైద్యులచే యీవ్యాధులు కేవలము స్థా
మైన వ్యాధులుగ అనగా, శరీరతత్వమునకు సంబంధములే
ప్రత్యేకము ఆయాభాగములకే సంబంధించిన వ్యాధులు
లేక శరీరయితరభాగమునకు తెలియని గోచరమగు యీప్రత్యే
భాగముయొక్క వ్యాధులుగ పరిగణింపబడి, స్థానికవ్యాధు
పిలువబడుచున్నవి. ♦1

♦1 ప్రాచీనవిధానవైద్యులు గావించు హానికరమగు గొప్ప పొ
టులలో నిదియొకటి.

189

శరీరముయొక్క పై భాగమున ఏవ్యాధియు ఏదోవిధమగు అంతరంగ కారణము లేకుండ, శరీరతత్వము వ్యాధిస్థితిలోనికి మారి అట్టితత్వముయొక్క సహకారములేనిదే జనించుటగాని, పట్టి విడువకుండుటగాని, దుస్థితిలోనికి వృద్ధిజెందుటగాని, జరుగజాలదని విశ్వశించుటకు, అంతపర్యాలోచన జేయవలసిన అవుసరములేదు. శరీరమునందలి తక్కిన ఆరోగ్యభాగమంతయు, సుముఖమైయుండనిదే, మరియు, సజీవశరీరతత్వమునందలి, యితరభాగమంతయుగూడ, అనుభవించనిదే, (స్పర్శజ్ఞానము, ఉద్రేకము, గల యితర భాగములయందు వ్యాపించియున్న జీవశక్తియంతయు) యిప్పైటకు తనరూపము నెంతమాత్రము నగుపరుపజాలదు. అదియునుగాక, ప్రాణియంతయు (life) (వ్యాధిగ్రస్తమైన) కారణభూతముగాకుండ యిది జనించగలదని తలంచుట అసాధ్యము. శరీరతత్వమునందలి అన్నిభాగములు, స్పర్శజ్ఞానభావనలయందు కార్యాచరణ ధర్మములయందు విభాగము గావింప నలవిగానంత సంబంధము గలిగియున్నవి. అంతకు పూర్వము అంతరంగమున అనారోగ్యము సంభవింపనిదే సమకాలికముగ (simultaneously) పెదవులపై పొక్కుగాని, వ్రేలుపై గోరుచుట్టుగాని నేదియుగూడ సంభవింపజాలదు.

190

గాన దెబ్బలమూలమున సంభవించినవిగాక తదితరమైన శరీరముయొక్క పైభాగమునందలి వ్యాధులయొక్క యదార్థమైన చికిత్సయంతయు శరీరతత్వముంత మీదనే లక్ష్యముంచి గావింపవలెను. ఈవ్యాధులచికిత్స న్యాయానుసారముగను నిశ్చయముగను, సమర్థముగను, తిరుగు లేకుండగను జరుగవలయునని యభిలషించిన లోపల కిచ్చు ఔషధముల మూలమున శరీరమందలి సర్వసామాన్యవ్యాధియొక్క(General malady) నిర్మూలనము నివారణ జరుగ నలయును.

191

ఈవిషయము సందేహము లేని పద్ధతిలో అనుభవమును బట్టి రూఢిజేయబడినది. లోపలికి ప్రయోగించు తీవ్రమైన ప్రతి ఔషధము, ప్రయోగించిన తక్షణము ఆరోగ్యమున మొత్తము మీద ముఖ్యమైన మార్పులను (ప్రాచీన విధానవైద్యులు సంబంధములేని ప్రత్యేక భాగమని పాటించు) ప్రధానముగా వ్యాధితో యున్నశరీరమునందలి వెలుపలి భాగముల యందు అన్ని సందర్భములయందు కలుగజేయునని యీ అనుభవము జూపుచున్నది. శరీరబాహ్యభాగములయొక్క యీపిలువబడు స్థానిక వ్యాధులయందు గూడ యిట్టిమార్పును గలుగజేయును. అంతరంగవ్యాధియొక్క సంపూర్ణస్థితికి సారూప్య పద్ధతిలో

అనుకూలమగు ఔషధమును నిర్ణయము చేసి ప్రయోగించిన పక్షమున శరీరముయొక్క పై భాగమున యగుపించు వ్యాధి అదృశ్యమై (పైకి ఉపయోగించు ఎట్టి ఔషధము యొక్క సహాయము లేకుండగనే) శరీరమంతటను ఆరోగ్యము చేకూరు మిక్కిలి అనుకూలమైన మార్పును ఈప్రయోగించిన ఔషధము కలుగజేయును. అనగా ఈఔషధము వలన శరీరము నందంతటను ఆరోగ్యము చేకూరుచు అందుతో బాహ్య శరీరమున గల స్థానిక లక్షణము గూడ అదృశ్యమగును.

## 192

ఔషధములకుగల విచిత్రమైన వ్యాధినివారణాగుణములు తెలిసికొనబడిన ఔషధములనుండి వ్యాధిలక్షణ సముదాయమునకు సాదృశ్యమైన ఔషధమును మిక్కిలి సారూప్యముగశోధించి నిర్ణయించుటకుముందు వ్యాధిని పరీక్షించుటలో స్థానికమైన బాధలయొక్క సరియైన స్వభావమును, ఔషధముపయోగించక పూర్వము గాంచబడిన లక్షణములలో గాంచనవకాశముగల లక్షణములను సమస్తమైన మార్పులను బాధలను వీనినన్నిటిని, వ్యాధియొక్క సంపూర్ణచిత్రమును నిరూపణ జేయుటకు చేర్చి పరిశీలనజేసిన మంచిగుణము కలుగగలదు.

## 193

ఇట్లు శోధించిన యీఔషధమును, లోపలకు ప్రయో

గించినపక్షమున, (స్వల్పకాలముక్రింద సంభవించిన వ్యాధియైన పక్షమున మొదటిమోతాదుతోనే) స్థానికమైన వ్యాధితో శరీరమునందలి మొత్తము వ్యాధిపరిస్థితియంతయు, (general morbrid state) తొలగింపబడి, అంతరంగమునగల వ్యాధితో శరీర పై భాగమున యగుపడు వ్యాధిగూడ, నివారణజేయబడు చున్నది. ఇందుమూలమున స్థానికమైనవ్యాధి శరీరమున తక్కిన భాగములోగల వ్యాధిమీదనే ఆధారపడియుండగలద నియు, యీస్థానికమైనవ్యాధి, పూర్ణమైన వ్యాధియొక్క ప్రత్యేకింపబడని భాగమని పాటింపవలయుననియు, సంపూర్ణ వ్యాధియొక్క యోచింపదగిన, విస్పష్టమైన లక్షణమనియు రుజువగుచున్నది.

## 194

స్వల్పకాలముక్రిందనే సంభవించిన స్థానికమైన తరుణ వ్యాధులలోగాని, దీర్ఘకాలమునుండిగల దీర్ఘవ్యాధులలోగాని శరీరముపైగల మచ్చకు పైకి ఉపయోగించుమందు, ఎంత సిద్ధౌషధమైనప్పటికీ, నాఔషధమును మర్దనాచేయుట, లేక పైన పట్టించుటవలన ఉపయోగములేదు. మరియు నీఔష ధము వ్యాధికి సారూప్యమైయున్న కారణమున లోపలకు ప్రయోగించినప్పుడుగాని, లోపలకు ప్రయోగించవలసినప్పుడు గాని, యీఔషధమును పైనమర్దనాచేయుట, పట్టించుటవలన గూడ నెట్టిఉపయోగములేదు. ఆయాభాగములయందు తీవ్ర

మైన దెబ్బలవలనగాక సూక్ష్మశక్తి కారణము లేక అంతరంగ కారణము మూలమున జనించు తరుణ వ్యాధులు (అనగా ప్రత్యేక భాగములు వాచుట, ఒకతరహా దద్దురుతోను జ్వరముతోను గూడిన చర్మరోగము మొదలగునవి) ఇతరసహాయ మెయ్యదియు నవసరము లేకుండగనే పరిశోధనచేయఁబడిన ఔషధముల నుండి నిర్ణయింపబడిన ♦1 వ్యాధియొక్క అంతరంగ బహిరంగ స్థితియందు గోచరమగు లక్షణముల కనుగుణ్యమగు సారూప్యౌషధములచే నిశ్చయముగ లొంగగలవు. ఈఔషధములకు వ్యాధి సంపూర్ణముగ లొంగక, క్రమ పద్ధతిని పత్యము జరిగించుచున్నప్పటికీ, వ్యాధి సంబంధమైన మచ్చయందు, వ్యాధిపరిస్థితి మొత్తమునందు, వ్యాధిశేషమింకను మిగిలియుండి జీవశక్తి సరియగు ఆరోగ్యస్థితి కలుగజేయ నసమర్థమైయున్నప్పుడు, యీవ్యాధి ఉత్పత్తికి కారణభూతమై (తరుచుగా సంభవించుచుండును) శరీరఅంతర్భాగమున యింతవరకు దాగియున్న సోరా, యిప్పుడు బహిర్గతమై, ప్రత్యక్షమైన దీర్ఘ వ్యాధి లోనికి వృద్ధిజెందు స్థితిలోనికి వచ్చుచున్నదని తెలిసికొనవలెను.

## 195

విస్తారముగ గల యిట్టి వ్యాధులను సమూలము నిర్మూలము చేయుటకు వ్యాధియొక్క తీవ్రమైన స్థితి బాగుగా తగ్గిన

♦1 ఇందులకుదాహరణ ఎక్రొన్సైటు, ఝాన్, బెల్లడోనా, మెర్క్యూరీ మొదలగునవి.

పిమ్మట మిగిలియున్న వ్యాధి లక్షణములకును పూర్వమురోగిలో బడియున్న వ్యాధిపరిస్థితికిని అనుకూలమైన సోరా శాంతికర చికిత్స (నాచే వ్రాయబడిన "దీర్ఘవ్యాధులు" అను గ్రంథములో బోధించిన విధముగా) కావింపవలెను. సుఖసంబంధము గాక తదితర సంబంధమగు స్థానికమైన దీర్ఘవ్యాధులలో లోపలకు పుచ్చుకొను ఔషధములచే గావించు సోరా శాంతికర చికిత్స మాత్రమే చాలును.

## 196

అట్టి వ్యాధులను నివారణ జేయుటకు, వ్యాధిలక్షణ సముదాయమునకు సరిగ, సారూప్యమగు ఔషధమును, లోపలకు ప్రయోగించుటయేగాక, స్థానికమైన వ్యాధికి పైన ఉపయోగించుమందు మిక్కిలి సత్వరమైన మార్పు కలుగజేయవచ్చును, గాన లోపలకుపయోగించు ఔషధమునే పైకిగూడ ఉపయోగించిన అట్టివ్యాధులుసత్వరముగ నివారణయగునట్లుగు పడనచ్చును.

## 197

గాని యిట్టిచికిత్స ఎంతమాత్రము అంగీకరింప వీలులేదు ఏలనన, సోరా వ్యాధి తత్వమునుండి ఉద్భవించు స్థానిక లక్షణములకును, ముఖ్యముగా సిఫ్లిస్ లేక సైకోసిస్ వ్యాధితత్వము నుండి ఉద్భవించులక్షణములకును మరియ ఎల్లపుడు స్థానికమైన

లక్షణములుగల వ్యాధులకును, లోపలకు పైకి ఒక్కమారుగా ఔషధమునుపయోగించిన పక్షమున ఈక్రింద వివరింపబడిన నష్టముగలదు. ఆయాస్థలములయందు వేయబడు పట్లుమూలమునను, లేపనములమూలమునను స్థానికమైనముఖ్యలక్షణము 1‡ (చర్మముమీద యగుపించు పుండు, మచ్చ మొదలగునవి) అంతరంగమునగల వ్యాధికంటె ముందుగ నిర్మూలము చేయబడును గాన సంపూర్ణముగ వ్యాధి నివారణ గావింపబడినది లేనిది తెలిసికొనుటకు మోసపోదుము. ముందుగనే స్థానిక వ్యాధిలక్షణము అదృశ్యమగుటచే ఒకపర్యాయము మాత్రమే లోపలకు ప్రయోగించిన ఔషధముచే మొత్తము వ్యాధియంతయు నిర్మూలముచెందినది లేనిది నిర్ణయించుట కష్టమగును. ఈవిషయమును నిర్ణయించుట కొన్ని సందర్భములయందు అసాధ్యముకూడ నగును.

## 198

దీర్ఘవ్యాధి తత్సంబంధమైన వ్యాధులయొక్క స్థానిక లక్షణములకు లోపలకు ప్రయోగించినప్పుడు నివారణజేయుటకు మంచిశక్తిగల ఔషధములను కేవలము పైకి ఉపయోగించుట కూడ పైనచెప్పబడిన యీకారణమునుబట్టియే ఎంతమాత్రము అంగీకరింప వీలులేదు. ఏలనన ఒకపక్షముగా దీర్ఘవ్యాధియొక్క

1‡ నవీనమైన చిడుము, పొక్కు, నవాయిపుండు, సెగసంబంధమైన ఆసనగండమాల.

స్థానికలక్షణము స్థానికముగనే తొలగింపబడినయెడల సంపూర్ణారోగ్యము చేకూర్చుటకు అత్యావశ్యకమైన అంతరంగ చికిత్స గావించుటకు దోవయగుపింపక సందేహాస్పదమై యుండును. వ్యాధియందలి ప్రధాలమైన ముఖ్యలక్షణము (స్థానికలక్షణము) పోయి అంతకంటె అస్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, తరుచుగా తగినంత విచిత్రముగానట్టియు, మిక్కిలి స్వల్పముగ సహజమైనట్టియు, ఇతర లక్షణములు మాత్రము స్పష్టమైన విచిత్రరూపములో వ్యాధిచిత్రమును యగుపరచుటకు నిలచి యుండగలవు.

## 199

బాహ్యలక్షణములను కరగించు లేక హరింపజేయు పై మందుల మూలమునగాని, శస్త్రముజేసిగాని, స్థానికలక్షణములను నిర్మూలముజేయు సమయమున, వ్యాధికి అనుకూలించు సరియైన సారూప్యౌషధమును తెలిసికొననిపక్షమున ♦1 అటుపై మిగులు లక్షణములు మిక్కిలి అస్పష్టముగను, (అసహజముగను) అస్థిరముగనుండును గాన, వ్యాధిచికిత్స యింకను మిక్కిలి కష్టతరముకాగలదు. ఏలనన, మిక్కిలి అనుకూలమగు సారూప్యౌషధమును నిర్ణయముచేయుటకు

♦1 ఆసనగండమాల సంబంధమగు వ్యాధికి నాచేకనుగొనబడిన ఔషధములు (మరియు సోరా శాంతికరౌషధములు) లేని క్రితము జరుగుచున్న దినమున,

అప్రధాన లక్షణము సహాయభూతముకాగలదో, అప్రధానలక్షణమునుబట్టి ఔషధమును కనుగొని లోపలకు ప్రయోగించి వ్యాధి సంపూర్ణముగ నిర్మూలము చేయబడునో ఆలక్షణము, అనగా ప్రధానమైన బాహ్యలక్షణము, మనదృష్టినుండి తొలగింపబడుచున్నది,

## 200

ఈ ప్రధానబాహ్య లక్షణము, అంతరంగ చికిత్సకు మార్గదర్శకమగుటకు నిలచియున్నపక్షమున, వ్యాధి మొత్తమునకు సామ్యౌషధమును కనుగొనుట కవకాశముండును. ఈ ఔషధమును లోపలకు ప్రయోగించినపిమ్మట స్థానికప్రధాన లక్షణమింకను నిలచియున్న పక్షమున, నివారణ యింకను సంపూర్ణముగ. గావింపబడి యుండలేదని యగుపరచగలదు. గాని లోపలకు ప్రయోగించిన ఔషధముచే నీ స్థానికప్రధాన లక్షణము నివారణగావింపబడిన పక్షముననిది, వ్యాధిసంపూర్ణముగ తొలగింపబడి, సంపూర్ణవ్యాధియొక్క ఆశించునివారణ పూర్తిగ సాఫల్యమైనదని, విశ్వశించదగిన నిదర్శనమగును. ఇది అమూల్యమైన, విసర్జింపజాలని సదుపాయము.

## 201

మానవునియొక్క జీవశక్తి దీర్ఘవ్యాధిచే నావహింపబడి స్వశక్తిచే తొలగింప నసమర్థమై యున్నపుడు బాహ్యావయవ

ముల యందు స్థానికవ్యాధిని వృద్ధిపొందించు పద్ధతి ముఖ్యముగా యీ క్రింది ఉద్దేశ్యముతో అవలంబించును. మానవ జీవితమునకు పరిత్యజింప నవకాశముగల యీభాగమును జీవశక్తి వ్యాధిగ్రస్తముగావించి యుండుటమూలమున జీవాశయములను(vital organs)నిర్మూలముగావింప భయపెట్టు (మరియు ప్రాణముదీయు) అంతరంగవ్యాధిని సద్దుపరచుచున్నది. అనగా అందుమూలమున ఆవ్యాధి యిచ్చుటకు చేర్పబడిన విధముగ అంతరంగవ్యాధి, స్థానికవ్యాధిక్రింద మార్పుజేయబడుచున్నది. ఈవిధముగా స్థానికవ్యాధి అంతరంగవ్యాధిని నివారణజేయుటగాని, స్థూలముగ తగ్గించుటగాని 1♦ చేయజాలక కొంతకాలమువరకు సద్దుపరచుచున్నది. ఈస్థానికవ్యాధి సర్వసామాన్యవ్యాధిలో (General disease) ఒకభాగముగాని వేరొండుగాదు. ఈసర్వసామాన్య వ్యాధి అంగవిసిష్టమైన జీవశక్తిచే ఒక్కపైపుగా వృద్ధిజెందింపబడి అంతరంగమందలి బాధను శాంతిపరచుటకు తక్కువ ప్రమాదకరమగు (బాహ్య) భాగములకు మార్పు చెందింపబడుచున్నది. కాన (పైనచెప్పబడినట్లు) వ్యాధితగ్గుట

♦1 ప్రాచీనవిధాన వైద్యులయొక్క క్రియా సారాంశముయీవిధముగ కొంతవరకు నుండగలవు. బాహ్యావయములయందు పుండుచేసి అంతరంగ దీర్ఘవ్యాధులను నివారణచేయుటకు బదులు స్వల్పముగ కొంతకాలము మాత్రమే శాంతింపజేయుదురు. అదియునుగాక స్వతేచ్ఛలన జీవశక్తి (instinctive vttal force) యితర వ్యాధిగతమార్పులనుండి పొందు నీరసము (metastases) అనారోగ్యము కంటెను ఇట్టిచికిత్స విస్తారమైన నీరసము కలుగజేసి ఆరోగ్యమును సర్వత్ర నాశనముజేయును.

లేక వ్యాధియంతయు నివారణయగుట మొదలగు ఎట్టివిధమగు లాభమును జీవశక్తికి పొందజేయని అంతరంగవ్యాధిని సద్దు పరచు స్థానిక లక్షణము బాహ్యశరీరమున యున్నప్పటికి అంత రంగ వ్యాధి క్రమక్రమముగా వృద్ధిజెందుచుండును. మరియు వృద్ధిజెందిన అంతరంగవ్యాధికి ప్రత్యామ్నాయముగ నుండు టకును దానిని అంతరంగముననే యింకను ఉంచుటకును తగి యుండుటకు యీస్థానిక లక్షణము నింకను మిక్కిలి వృద్ధిజెం దించి ఉద్రేకింపజేయుటకు ప్రకృతి నిర్బంధింపబడు చున్నది. కాలమతిక్రమించినకొలది అంతరంగవ్యాధి ఎట్లు వృద్ధిజెందు చుండునో అట్లే అంతరంగమునందలి సోరాదోషము నివారణ కాక యున్నంతకాలము కాళ్ళపైగల ప్రాతరణములు దుస్థితి లోనికి వచ్చుచుండును. అంతరంగమునందలి సవాయిదోషము నివారణకాక యున్నంతవరకు సవాయిపుండు పెరుగుచుండును

## 202

ప్రాచీనవిధానవైద్యుడు స్థానికలక్షణమునకు, పైకి ఉప యోగించు ఔషధములతో గావించు బాహ్యచికిత్సలవలన వ్యాధియంతయు నివారణ గావింపబడునను నమ్మకముతో బాహ్యలక్షణమును నిర్మూలముగావించిన పక్షమున, యీ స్థానికలక్షణము పోయినకారణమున ప్రకృతి, అంతకుపూర్వము యీస్థానికలక్షణములతో ఒకదానిప్రక్క నొకటి అంతరంగము నందు అంతర్హితమైయున్న వ్యాధిని, యితరలక్షణములను

యీనష్టమునుకూడ దీయుటకు ఉద్రేకింపజేయును. అనగా, అంతరంగమునందలి వ్యాధిని ప్రకృతి వృద్ధిజేయును ఇట్లు సంభవించినప్పుడు, స్థానికమైనవ్యాధి, బాహ్య చికిత్సల మూలమున వెనుకకు మరలింపబడినది లేక నరములనుపట్టినదని (ఇది సరికాకపోయినను) తెల్పుట వాడుకయైనది.

## 203

పలువిధములైన శైలముల మూలమున చిడుము పొక్కును పోగొట్టుట, పుండుజేయు స్వభావముగల మందులతో సవాయిపుండును కాల్చివేయుట ఆసనగండమూలను కత్తితో శస్త్రముచేసిగాని వాతబెట్టిగాని స్థానమునుండి నిర్మూలముచేయుట మొదలగు చికిత్సలమూలమున, అట్టి స్థానికలక్షణములకు గావించు ప్రతిబాహ్యచికిత్సయందునుగల ఉద్దేశ్యము శరీరభాగములనుండి ఆ యా లక్షణములను తొలగించుట మాత్రమే యైయుండుటచే యిట్టిచికిత్సలమూలమున అంతరంగ తత్వసంబంధమైన వ్యాధి (internal miasmatic disease) నివారణగాక అట్లే విడువబడుచున్నది. సర్వత్రగావింపబడు యీహానికరమైన బాహ్యచికిత్సాపద్ధతి మానవజాతి అనుభవించుచున్న, నామకరణము గావించిన, లేక నామకరణము గావింపని యీఅసంఖ్యాకములైన సమస్తదీర్ఘవ్యాధులను జనింపజేయుటకు మూలాధారమగుచున్నది. ఈపద్ధతి వైద్య ప్రపంచమున మిక్కిలి శోచనీయమైన నేరస్థమగుపద్ధతులలో

నొకటియై యున్నప్పటికి, యిదివరకు యీపద్ధతియొక్కటియే సర్వసామాన్యముగా అనుకరింపబడుచు పండితపీఠములనుండి యింతకంటె వేరొండుపద్ధతి లేనట్లు బోధింపబడుచున్నది. ♦1

## 204

నిరంతరము అనారోగ్యపద్ధతిలో జీవితము గడపుటచే జనించు సమస్తదీర్ఘవ్యాధులను, ప్రాచీనవిధాన వైద్యులచే స్వల్పమైన వ్యాధులకు తరుచు కావింపబడు పశుప్రాయమగు విడువకుండ పీడించు హానికరమైన చికిత్సలమూలమున సంభవించు అసంఖ్యాకములైన సమస్త ఔషధజనిత వ్యాధులను, (74) దీర్ఘవ్యాధులసంఖ్యనుండి మినహాయించినపక్షమున మిగిలిన సమస్తవ్యాధులు ఒక్కటియైనను తేడాలేకుండ యీమూడు దీర్ఘవ్యాధి తత్వములగు (chronic miasms) అంతరంగ సిఫిలిస్ అంతరంగ సైకోసిస్, మరియు ప్రధానమైన హద్దులేనంతటి హెచ్చుభాగములోనుండు సోరాయు వృద్ధిజెందుటమూలమున సంభవించుచున్నవి. ఇందు ప్రతితత్వము నింతకుపూర్వమే పూర్తిగా శరీరము నందంతటనుయుండి ఒక్కొక్క దీర్ఘవ్యాధి

---

♦1 ఏలనన, ఏకకాలమున బాహ్యచికిత్సకు తోడుగ ఏమందును లోపలకిచ్చినను, యీమందులు వ్యాధినంతను నివారణజేయ నిర్దిష్టమైన శక్తిగలిగి యుండకపోవుటచే, శరీరతత్వము నెదుర్కొని నీరసముకలుగజేసి అందుకుతోడుగ, యితరదీర్ఘ ఔషధజనిత వ్యాధులను కలుగజేసి, వ్యాధిని ఉద్రేకింపజేయుచుండెను.

తత్వముయొక్క ప్రథమ ప్రత్యామ్నాయ స్థానికలక్షణము (primary vicurious local symptom) యగుపడుటకుముందు (సోరాయాదు పక్కుతో కూడిన పొక్కు, సిఫిలిస్‌నందు పుండు లేక బిళ్ళ సైకోసిస్‌నందు ఆసనగండమాల) శరీరములో అన్ని వై పులకును ప్రసరించి యుండగలదు. ఈదీర్ఘ తత్వ సంబంధమైన వ్యాధులయొక్క స్థానికలక్షణములను బాహ్యచికిత్సల వలన పోగొట్టుటమూలమున బలమైన ప్రకృతిచే తప్పక విధికృతముగ వెంటనేగాని లేక కొంతకాలమైనపిమ్మటగాని అంతరంగవ్యాధి వృద్ధిచెందింపబడి మానవ జాతిని వేలకొలది సంవత్సరముల నుండి పట్టిపీడించుచున్న పేరుపెట్టుటకుకూడ నవకాశములేని దుఃఖకరమైన అత్యాశ్చర్యకరమగు సంఖ్యతో కూడిన అనంతము లైన దీర్ఘవ్యాధులు వ్యాప్తి చేయబడుచున్నవి. బాహ్యలక్షణ ములను బాహ్యచికిత్సలెవ్వియు గావింపక ప్రతివ్యాధితత్వము నకు అనుకూలమగు లోపలకు ఉపయోగించు సారూప్యౌషధ ముమూలమున న్యాయమైన పద్ధతిలో వ్యాధిని సమూలము నిర్మూలము చేయుటకును యీమూడు తత్వములను శరీరము నుండి అంతరింపజేయుటకును వైద్యులు ప్రయత్నించియుండిన అనంతములైన యీవ్యాధిలెవ్వియును యింతతరుచుగా జనింప కుండగనే యుండగలవు.

## 205

హోమోపతీవైద్యుడెన్నడును, దీర్ఘవ్యాధి తత్వముల యొక్క యీప్రాథమికలక్షణములలో (primary symptoms) ఏఒకలక్షణమునుగాని లేక, యీదీర్ఘవ్యాధితత్వములుయింకను వృద్ధిజెందుటమూలమున సంభవించిన ద్వితీయలక్షణములలో (secondary symptoms) ఏఒక్కటిగాని (అతితీవ్రముగ పని చేయు బాహ్యచికిత్సలకుపయోగించు ఔషధముల మూలమున గాని ♦1 శస్త్రచికిత్స మొదలగు యంత్రసహాయ చికిత్సల మూలమున గాని) చికిత్సజేయడు. గాని ప్రాథమిక లక్షణమునకుగాని ద్వితీయలక్షణమునకుగాని ఆధారభూతమగు మహత్తరమైన వ్యాధితత్వమును (Great miasm) మాత్రమే నివారణ

♦1. గాన యిందుల కుదాహరణపూర్వకముగ పెదవులపైన ముఖము మీద బయలుదేరు రణములను (తరుచు సిఫ్లిస్‌తో కలసి విశేషముగవృద్ధిజెందిన సోరాయొక్క ఉత్పత్తి) పాషాణసంబంధమైన ఔషధములమూలమున స్థానికముగ నిర్మూలముగావించుటకు నేనుసలహానీయజాలను. ఏలనన, యివిమిక్కిలి నొప్పితోనుండి చికిత్సయందు తరుచు ఆశాభంగముకలుగజేయును. మరియొక ముఖ్యమైనకారణమేమన, యీతీవ్రమైన ఔషధములు బాధగలభాగమునుండి హానికరమైన అరణమును స్థానికముగ తొలగింపగలిగినప్పటికి యీరణమునకు మూలాధారమగు వ్యాధి యిందుమూలమున ఎంతమాత్రము తగ్గింపబడియుండ లేదు. గాన ప్రాణసంరక్షక జీవశక్తి అంతరంగమునందలి యీ గాఢమైన వ్యాధిని మరియొకముఖ్యమైన స్థానమునకు మార్చవలసిన అవసరముగలిగి, అట్టి పర్యవసానముగ, అంధత్వము, చెముడు, ఉన్మాదము, శ్వాసబంధించు క్షయ, ఉబ్బు, సన్నిపాతము మొదలగు వ్యాధులు సంభవింపగలవు. గాని యీరణము మిక్కిలి పెద్దదిగ పెరుగకుండ యుండినప్పుడును జీవశక్తి యిం

చేయును. అందుమూలమున ఆవ్యాధియొక్క ప్రాథమిక లక్షణములు, ద్వితీయలక్షణములుగూడ ఒక్కమారుగా అదృశ్యము కాగలవు. హోమోపతీవైద్యుడు గావించుచికిత్స రోగికిఅంతకు ముందు చికిత్సగావించియుండు ప్రాచీనవిధాన వైద్యులచే అవలంబించు చికిత్సాపద్ధతివంటి చికిత్సగాకపోవుటచే సర్వసాధారణముగా (పాపము) హోమోపతీవైద్యుడు చికిత్సప్రారంభించు సరికి ప్రాథమిక లక్షణములు *2 ప్రాచీనవైద్యులచే బాహ్య చికిత్సల మూలమున నింతకుపూర్వమే నిర్మూలము కావింపబడి యుండుట గాంచుట తటస్థించును. గాని హోమోపతీవైద్యుడిప్పుడు ముఖ్యముగా ద్వితీయలక్షణములనుబట్టి, అనగా అంతర్గతమై దాగియున్న వ్యాధితత్వములనుండి ( Inherent

---

కను మిక్కిలి బలముగాయున్నప్పుడును మాత్రమే; బాహ్యచికిత్సయందు ఉపయోగించు యీ పాషాణసంబంధమగు ఔషధము సందేహాస్పదముగ ఒక్కొక్కప్పుడు ఆరణమును స్థానికముగ విముక్తిజేయగలదు. గాని సరిగా యిట్టి పరిస్థితులయందుగూడ అసలువ్యాధియొక్క సంపూర్ణ ఆంతరంగిక నివారణ యింకను సాధ్యమైయుండగలదు.

ముఖముపై రణము లేక స్తనములపై రణము శస్త్రము చేయబడినప్పుడును, మరియు కంతులు శస్త్రము చేయబడినప్పుడును పర్యవసానఫలితమొక్కటే. ఏవోదుస్థితిసంభవించును, లేదా సత్వరమరణమున కాసన్నము చేయును ఇట్లు అసంఖ్యాకములైన సందర్భములలో జరుగుచున్నను, ప్రాచీనవిధాన వైద్యులు కళ్లుమూసికొని యింకను, యీపద్ధతినే నూతనముగా చికిత్సకొరకు వచ్చు ప్రతివ్యాధికి అట్టికఠినమగు దురదృష్ట పర్యవసానఫలితములతోనే చికిత్స చేయుదురు.

*2. చిడుముపొక్కు, సవాయిపుండు (బిళ్ల) సెగసంబంధమైన ఆసన గండమాల,

miasms ) అందు ముఖ్యముగా అంతరంగము నందలి సోరా నుండి ఉద్భవించిన, దీర్ఘవ్యాధులతో బైటకువచ్చి వృద్ధిజెందుటచే సంభవించిన లక్షణములనుబట్టి చికిత్స చేయవలయును. ఈదీర్ఘవ్యాధుల అంతరంగిక చికిత్స, అనేక సంవత్సరములు కావించు పరిశోధన, ఆలోచన, అనుభవములనుబట్టిమాత్రమే ఏఒక్కవైద్యుడు మాత్రమో వివరింపగల యీవిషయము నాచే వ్రాయబడిన దీర్ఘవ్యాధులను గ్రంథములో జూప ప్రయత్నించితిని. గాన పాఠకులాగ్రంథమును పరిశీలింప గోరుచున్నాను.

## 206

దీర్ఘవ్యాధిని చికిత్సజేయుటకు ప్రారంభించుటకు ముందు రోగికి సుఖసంబంధమైన వ్యాధిసోకియున్నది లేనిది (లేక ఆసన గండమాల సంబంధమైన సెగ సోకినది లేనిది) మిక్కిలి జాగరూకతతో పరిశీలనచేయుట ‡1 అవుసరము. ఒక్క సవాయి మాత్రమే తగిలియున్నపక్షమున (లేక ఆసనగండమాల సంబంధ

1. ‡ ఈసందర్భమగు పరిశీలనయందు, రోగి ఆతనిబంధువులు వ్యాధిని గూర్చి వ్యాధి మిక్కిలి తీవ్రమైన, కఠినమగు దీర్ఘవ్యాధియైనప్పటికి, చాల కాలముక్రిందట తగిలిన చలినిబట్టి వచ్చినదనియు, (తడియుటవలన, వేడిచేసిన పిమ్మట చన్నీళ్లు త్రాగుటవలన) వెనుక భయపడుటవలన వచ్చినదనియు, బెణుకుట మొదలగు కారణమున వచ్చినదనియు, తెల్పువ్యాధి కారణములను బట్టి మనమెంతయు మోసబోవుట కవకాశ మొసగరాదు. వృద్ధిజెందిన సోరా మూలమున సంభవించు సమస్త దీర్ఘవ్యాధులనటె ఆరోగ్యశరీరమున, సంవత్సరములతరబడి, ఉద్రేకించు, దీర్ఘవ్యాధులను కలుగజేయుటవలన, యీకారణ

మైన) దానికే చికిత్స చేయవలయును. గాని యీరోజులలో యీవ్యాధి ఒంటరిగమాత్రముండుట యరుదు. అట్టి సుఖ వ్యాధులు యింతకుపూర్వమే సోకియున్న పక్షమున, యీవిష యమును జ్ఞప్తియందుంచుకొనవలయును. ఇట్టి వ్యాధియందు, లక్షణములు యధార్థమైన సవాయి లక్షణములుమాత్రమేగాక యున్నపక్షమున, సోరాకూడ సిఫ్లిస్‌తో జేరి క్లిష్టమై యున్న దని గ్రహింపనగును. ప్రాచీనమైన సుఖసంబంధ వ్యాధిని చికిత్స చేయవలసినప్పుడు, సిఫ్లిస్‌తో క్లిష్టముగ ఏర్పడియున్న సోరాతోసహితము చికిత్స చేయవలసియుండును. ఏలనన అంతరంగమందలి చిడుము సంబంధమైన విషదోషము (సోరా) మిక్కిలి తరుచుగా (మిక్కిలి నిశ్చయముగ) దీర్ఘవ్యాధులన్ని టికిని మూలకారణమైయున్నది. దీర్ఘకాలమునుండి వ్యాధి గ్రస్తమైన తత్వములలో నొక్కొక్కప్పుడు యీరెండు తత్వ ములు సైకోసిస్‌తో క్లిష్టముగ నేర్పడి యుండగలవు. మరియు నిపుణతలేని అల్లోపతీ చికిత్సమూలమున మిక్కిలి తరుచుగా విపరీతముగ వృద్ధిజెందింపబడి, క్లిష్టముగ, భయంకరముగ అంగవైకల్యము గావించు సమస్త యితరదీర్ఘవ్యాధులకు, యీ

---

ములు మిక్కిలి అత్యల్పములు. దీర్ఘకాలముపీడించు తీవ్రమైన దీర్ఘవ్యాధి పుట్టి వృద్ధిజెందుటకు, మూలకారణము యీ జ్ఞాపకమునుబట్టి తెలుపు హాని కర ప్రాబల్యముల కంటె (Noxious influences) మిక్కిలి ముఖ్య మైన స్వభావముగల కారణములుండగలవు. ఆరోపింపబడిన యీకారణములు అంతర్హితమైన దీర్ఘవ్యాధి దోషమును (Latent chronic miasm) తీవ్రచలనములోనికి కదలించును.

వ్యాధి లేనామముగలిగియున్నప్పటికి, సోరా కేవలము ప్రధాన మూలకారణము.

## 207

పై విషయములను తెలిసికొనినపిమ్మట, రోగితనకుగల దీర్ఘవ్యాధికిప్పటివరకు ఏవిధమగు అల్లోపతీ చికిత్స పొందియుండెనో, కలతకలుగజేయు ఏఔషధములు ముఖ్యముగా తరుచు రోగికి ప్రయోగింపబడియుండెనో, లోహాది ఔషధగుణములు గల ఎట్టిస్నానములు (mineral baths) రోగి చేసియుండెనో, వ్యాధియొక్క అసలు పరిస్థితినుండి హీనస్థితిలోనికి దీసికొని వచ్చుటకు, ఇవి ఎట్టిగుణములను కలుగజేసియుండెనో, యవి తెలిసికొని సాధ్యమగు సందర్భములలో హానికరమైన కృత్రిమ కృత్యములను (artificial operations) కొంతవరకు చక్కజేసి కొనుటకును, అక్రమముగ లోగడఉపయోగింపబడిన ఔషధములను తిర్గి ప్రయోగింపకుండ, విసర్జించుటకు సావకాశము కలుగుటకును, హోమోపతీవైద్యుడు గ్రహింపవలసియున్నది.

## 208

పిమ్మట రోగియొక్క వయస్సు, జీవితపద్ధతి, ఆహార నియమము, వృత్తి, గృహస్థితి, సాంఘికసంబంధములు మొదలగునవి, వ్యాధిని వృద్ధిజేయుటకు ఎట్లు కారణభూతమగుచున్నవో, లేక చికిత్సకు ఎట్టి అనుకూలములేక వికల్పము

కలుగజేయునో తెలిసికొనుటకు యోచనచేయవలసియున్నది. ఈవిధముగనే, రోగియొక్క మానసికపరిస్థితిని స్వభావమును (State of mind and disposition) గూర్చి తెలిసికొని, యీపరిస్థితులు చికిత్సకు ఏదైన అవరోధము కల్గించునో, లేక ఉత్సాహము కలుగజేయనలసిన అవుసరముగలదో, క్రమమార్గమున బెట్టవలసిన లేక మార్పుజెందించవలసిన అవుసరము గలదో తెలిసికొనుటకు శ్రద్ధతీసికొనవలెను.

## 209

ఈపని పూర్తియైన పిమ్మట పైనజెప్పిన సూచనల ననుసరించి వ్యాధి చిత్రమును సాధ్యమైనంతవరకు పూర్తి గావించుటకు రోగితో మరలమరల చేయు సంభాషణ పూర్వకముగా మిక్కిలి స్పష్టమైనట్టియు విచిత్రమైనట్టియు (సహజ) లక్షణములను దెలిసికొని తన్మూలమున ప్రథమసోరా శాంతికరౌషధమును లేక మిక్కిలి సారూప్యమగు యితర ఔషధమును నిర్ణయించి చికిత్స ప్రారంభించి నడపించుటకు ప్రయత్నింపవలయును.

## 210

ఏకపక్షములని (one sided) పైన నామకరణము గావించిన వ్యాధులన్నియు చాలవరకు సోరానుండి ఉద్భవించుచున్నవి. ఈవ్యాధులు ఏకపక్షములై యుండుట బట్టి యితర

వ్యాధిలక్షణములన్నియు ఒక్క పెద్దప్రాముఖ్యలక్షణము ముందు అదృశ్యమగుటచే నివారణచేయుటకు మిక్కిలి కష్టతరముగ యగుపించగలవు. ఈస్వభావముగల వ్యాధులు మానసిక వ్యాధులని పిలువబడును. గాని శరీర సంబంధమైన యితర సమస్త వ్యాధులయందు మనస్సుయొక్క స్థితి, స్వభావము ఎల్లప్పుడు మార్పుచెందుచుండుటచే ♦1 యీ వ్యాధులు ఇతర వ్యాధులనుండి ప్రత్యేకముగ ఒక తరగతి వ్యాధిగ ఏర్పడి

♦1 మిక్కిలి బాధించువ్యాధులతో సంవత్సరములనుండి దుఃఖించుచు, వైద్యుడు విచారించి జాలిపడునంతటి, సౌమ్యమైన మెత్తటి స్వభావముగల రోగులతో మనము ఎంత తరుచు సమావేశమగుటలేదు! గాని వైద్యుడు రోగియొక్క వ్యాధిని లాంగదీసి ఆరోగ్యము చేకూర్చినపిమ్మట (సారూప్యౌషధచికిత్సయందు పరిపాటుగ జరుగుచున్నది.) రోగి తన స్వభావమునందలి భయంకరమార్పునుగూర్చి భీతిజెంది తరుచు ఆశ్చర్యపడును. ఈరోగి వ్యాధిగ్రస్తుడగుటకు ముందుగల ఆతని స్వాభావికగుణములగు కృతఘ్నత, క్రౌర్యముపైకి తెలియకుండనుండు నాగరికమైన అసూయత, మానవప్రపంచమున అవమానకరము నీచముఅగు స్వభావమును వ్యాధినివారణమై ఆరోగ్యము చేకూరగన ఆతనియందు హోమియోపతివైద్యుడు గాంచగలడు. (అనగా వ్యాధిగ్రస్తమైయున్నప్పుడు మంచి సౌమ్యస్వభావములోనుండి ఆరోగ్యము చేకూరినపిమ్మట ఆతని స్వభావగుణములగు కృతఘ్నత, క్రౌర్యము మొదలగునవి తిరిగి వచ్చివేయును.)

అంతకుపూర్వము మంచి ఓర్మిగల వ్యక్తులు వ్యాధిగ్రస్తమైనప్పుడు, పెంకితనము, తీవ్రము, తొందరపాటు గలిగియుండుటగాని లేక సహింపజాలని చపలచిత్తులగుట లేక ఆతురతతో నిరాశజెందియుండుటగాని సంభవింపగలదు. ఇట్లే మంచి తెలివిగలవ్యక్తి తరుచు మూఢుడగును, మరియు

యుండవు. నివారణగావించుటకు మనము ఆహ్వానింపబడు ఇ
సమస్తమైన వ్యాధులలోను సారూప్యౌషధపద్ధతిని జయప్ర
ముగ చికిత్స గావింపవలయుననిన సరియైన వ్యాధి చిత్రముగ
చిత్రించునప్పుడు వ్యాధిలక్షణసముదాయముతో రోగియొక్క
స్వభావమును (Disposition) ముఖ్యముగ గుర్తింపవల
యున్నది.

## 211

సరిగా పరిశీలన చేయు వైద్యునిదృష్టికి యితర లక్ష
ములన్నియు మరుగుపడియుండి రోగియొక్క స్వభావముయొక్క
స్థితి (State of the disposition) నిశ్చయమగు సహజలక్ష
మై యున్నప్పుడు ప్రధానముగా రోగియొక్క యీసహజ లక
ణమును బట్టియే సారూప్యౌషధమును నిర్ణయము చేయవల
యున్నది. రోగియొక్క స్వభావము సహజలక్షణమై యుం
యితరలక్షణములు మరుగుపడి యున్నప్పుడే యిది వర్తించున

## 212

చికిత్సా ప్రతినిధులను (ఔషధములను) సృష్టించి
సృష్టికర్త (భగవంతుడు) పనిని సృష్టించుటలో సమ

సాధారణమైన అల్పమగు మనశ్శక్తిగలవ్యక్తి మిక్కిలిఆలోచనపరుడు, వివే
వంతుడును అగును. మనస్సు నిలుపుకొనలేనివ్యక్తి మిక్కిలి దీక్షగలిగి, మన
నిశ్చయములయందు ధురంధరత్వముగలిగి యుండును.

వ్యాధులయందలి యీప్రధాన లక్షణమగు మార్పునెందు మనస్సు స్వభావము యొక్క స్థితియందు (Altered state of mind and disposition) ప్రత్యేకలక్ష్యముంచియుండెను. ఏల నన ప్రపంచమునందలితీవ్రమైన ఏఔషధవస్తువును ఆరోగ్యమైన శరీరముగల వ్యక్తులు పరీక్షించినను ఆవ్యక్తులయొక్క మనస్సు నందు స్వభావమునందు (Disposition) మిక్కిలి ప్రాముఖ్య మైన మార్పు గలుగజేయక యుండలేదు. ప్రతి ఔషధము వి విభేదమైన పద్ధతిలో యిట్టి మార్పుగలుగ జేయుచున్నది.

## 213

గాన ప్రతివ్యాధియందును తరుణవ్యాధులలోగూడ, యితరలక్షణములతోబాటు మానసికస్వభావములయందుగలి గిన, మార్పులలోగల లక్షణములనుగూడ గమనించనిపక్షము నను, రోగియొక్క స్వస్తతకొరకు ప్రయోగించు ఔషధము లలో గల వ్యాధికరశక్తి (Disease force) వ్యాధియొక్క యితరలక్షణములకు సారూప్యమై యుండుటయేగాక, రోగి యొక్క మానసికస్వభావలక్షణములకు సరిసమానస్థితి గలుగ జేయ సమర్థమై యుండగల ఔషధమును మనము శోధించని పక్షమునను (ప్రకృతికనుగుణ్యముగ అనగా సారూప్యపద్ధతిని) మనమెన్నడును నివారణ చేయజాలము. ♦1

♦1. సెమ్మది, నిశ్చలత సమచిత్తముగల రోగులయందు ఏకోనైటు ఎన్నడును, సత్వరమైనట్టియు, శాశ్వతమైనట్టియు, నివారణ కలిగింపజాలదు,

## 214

మానసికవ్యాధుల (mental diseases) నివారణను గూర్చి యీయవలసిన సలహాలు కొలదిగమాత్రమేగలవు. వీనినిగూడ యితరవ్యాధులవలెనే నివారణ జేయవలయును. అనగా ఆరోగ్యమైన శరీరమందు, మనస్సునందు, కలుగజేసి యగుపరచు లక్షణములనుగలిగి, మనమునివారణచేయదలచిన వ్యాధికి, సాధ్యమగునంతవరకు, సారూప్యమగు వ్యాధిస్థితిని కలుగజేయు శక్తిగల, ఔషధముచే నివారణ చేయవలయును గాని యింతకంటె వేరొండు మార్గమున నివారణ చేయబడ జాలవు.

## 215

ఈపిలువబడు మానసిక వ్యాధులు మనోవికారవ్యాధుల (Mental and emotional diseases) చాలవరకు అన్నియు శరీర సంబంధమైన వ్యాధులు తప్ప వేరొండుగావు. ఇందు ప్రతి వ్యాధికి విచిత్రలక్షణమగు మనస్సు యొక్కయు స్వభావము యొక్కయు మార్పుజెందిన లక్షణము వృద్ధిజెంది శరీరసంబంధమైన లక్షణములు (కొంచెమెచ్చుతగ్గుగ త్వరగా) తగ్గగలవు.

---

అక్లేనక్సువామికా, సౌమ్యనిశ్చలభావములుగల రోగులయందును పల్సటిల్లా ఉల్లాసము, సంతోషము, పెంకితనముగల రోగులయందును, ఇగ్నీషియా భయమునకుగాని, క్లేశమునకుగాని చలించి, ధ్యానికిలోను గాని, రోగులయందును సత్వర శాశ్వతవ్యాధి నివారణము గావింపజాలవు.

చరమగు సూక్ష్మమైనమానసికావయవమునందు (మెదడు)
వమునందు యీమానసిక వ్యాధులు పూర్తిగా స్థానిక
ములవలె యగునంత మిక్కిలి విస్పష్టమైన ఏకపక్షత్వము
యుండు నంతవరకు వృద్ధిజెందినప్పుడు యీశరీర సంబంధ
లక్షణములు తగ్గిపోగలవు.

## 216

ఊపిరి తిత్తులు చీముపట్టుట లేక శరీరాంతర్భాగము
లి ముఖ్యావయవములు నాశనము చెందుట లేక ప్రసవ
పిమ్మట పురిటిదినములలో సంభవించు తరుణ వ్యాధులు
వలగు ప్రాణభయము కలుగజేయు యీపిలువబడు శరీర
ంధమైన తరుణవ్యాధులు అంతకు పూర్వముగల మానసిక
ణములు చురుకుగ వృద్ధిజెందుటచే తరుణవ్యాధి వలన
ాదము తప్పి ఒకవిధమగు మనోవిచారవ్యాధి ఒకవిధమగు
మొదలగు (a kind of melancholia or mania) వ్యా
గానికి మార్పుజెందిన సందర్భము లనేకములుగలవు. ఇట్లు
ృదములోనికి మార్పు జెందుట మూలమున శరీర సంబంధ
ణముల నుండి ప్రమాదము తప్పును. పిమ్మట సరియగు
గ్యస్థితిలోనికి యీలక్షణములు మార్పుజెందగలవు లేదా
వల, లోతైన పరిశీలనగల వైద్యులచే మాత్రము కను
బడగలనంత తగ్గుస్థితిలో అంతర్గతమై యుండగలవు. ఈ
ముగా ప్రథమమున స్వల్పముగ నుండు మానసిక కలత,

ప్రధానలక్షణమగునంతవరకు వృద్ధిజెంది శరీరమునందలి ఇతర లక్షణములకు బదులుగా నాక్రమించి యుండు మూ ల ము న యితర లక్ష్ణముల యొక్క ఉద్రేకమును శాంతింపజేసి శస్త్రు చికిత్సకుని క త్తికి యిం త వ ర కు అందని ముందు అందజాలని ఆధ్యాత్మిక మానసిక భావసంబంధమైన అవయవములకు శరీ రావయవ సంబంధవ్యాధులు శీ ఘ్రి కా ల ము లో మార్పు చెందింపబడు రీతిని స్థానిక ల క్ష ణ ము వ లె ఒకభాగమునకు మార్పు చెందుచున్నది.

## 217

ఈ వ్యాధులయందు శరీరలక్షణములకు సంబంధించిన లక్షణములను, మరియు, ముఖ్యముగా విచిత్రిమైన ఎల్లపుడు ప్రాముఖ్యము వహించియుండు, ప్రధానలక్షణము యొక్క యదార్థస్వభావమునకు సంబంధించియుండు, మ న స్సు న కు స్వభావమునకు (mind and disposition) సంబంధించిన లక్షణములను, యీ రెండింటితోను గల సంపూర్ణవ్యాధి దృశ్యము తో, వ్యాధినంతయు నిర్మూలముగావించుటకు, పరిశుద్ధగుణములు తెలిసికొనబడిన ఔషధములనుండి, సారూప్యౌషధ వ్యాధికరశక్తిని కనుగొనుటకు అనగా, మనముందుగల వ్యాధి యొక్క శరీరసంబంధలక్షణములతోనేగాక మరియు, ముఖ్యముగా, మానసికభావపరిస్థితితోగూడ సాధ్యమగునంతవరకు మిక్కిలి సారూప్యమగు లక్షణములు, ఏఔషధముయొక్క

లక్షణవివరముల జాబితాయందు యగుపడునో ఆఔషధమును కనుగొనుటకు ( వ్యాధిదృశ్యముతో ) మిక్కిలి జాగరూకత వహింపవలెను (అనగా శరీరసంబంధమైన లక్షణములకును, మానసికలక్షణములకును, సారూప్యమగు ఔషధమును కను గొనవలెను)

## 218

ఈ లక్షణముల సంగ్రహమునకు, వెనుకటిశరీరసంబంధ వ్యాధియని పిలువబడువ్యాధి, అనగా మానసికలక్షణము, ఏకభాగముగ వృద్ధిజెంది హైన్యముజెందక పూర్వముగల గోచరమైన సమస్తలక్షణసముదాయము జెందుచున్నది. ఈ విషయము అనగా వెనుకటి శరీరసంబంధమైన వ్యాధిలక్షణ ములనురోగియొక్క స్నేహితులనుండి తెలిసికొనవచ్చును.

## 219

శరీరసంబంధమైన వెనుకటి లక్షణములను, యిప్పుడు మిగిలియున్న వానియొక్క గుర్తులతో గావించు తారతమ్యము పూర్వముకంటె నివి అస్పష్టముగ గోచరమగుచున్నప్పటికి (యిప్పుడుగూడ, మానసికవ్యాధి, నిర్మలముగ కొలదికాలము మార్పుజెందినప్పుడు ఒక్కొక్కప్పుడు యీలక్షణములు స్పష్ట ముకాగలవు) లేక యీలక్షణములు, మరుగుపడియున్నప్పటికి, యింకను ఉన్నట్లు రుజువుపరచుటకుపయోగించును.

220

ఈ లక్షణసముదాయమునకు, రోగియొక్క స్నేహితులచే తెలుపబడినట్టియు, వైద్యునిచేస్వయముగ, సరిగాగుర్తింపబడినట్టియు, మనస్సుయొక్కయు, స్వభావములయొక్కయు, స్థితియందుగల లక్షణములకు జేర్చుటమూలమునవ్యాధియొక్క సంపూర్ణచిత్రమును నిర్మించగలము. ఈవ్యాధిని సారూప్యౌషధముచే నివారణగావించుటకు, యిట్టి ప్రాముఖ్య సారూప్యలక్షణములను కలుగజేయగల ఔషధమును మరియు, ముఖ్యముగా మానసికవ్యాధి దీర్ఘకాలమునుండియున్న పక్షమున శోరా శాంతికరఔషధములలో మానసికవ్యాధికి, సారూప్యమగు ఔషధమును వెదుకవలసియున్నది.

221

గాని, ఉన్మాదము లేక మతిభ్రమ, (భయమువలన, క్లేశమువలన, సారాయిసంబంధమైన ద్రావములను దుర్వినియోగపరచుటవలన సంభవించిన) రోగియొక్క సాధారణనిర్మల స్థితిలో, తరుణవ్యాధివలె ఆకస్మికముగా సంభవించినపక్షమున యిట్టివ్యాధి ఎల్లప్పుడు అంతరంగమునందలి, శోరానుండి, ముందుకురకవేయు అగ్నిజ్వాలవలె, ఉద్భవించునుగాన అట్లు యీవ్యాధి తరుణస్వభావములో ఆకస్మికముగ సంభవించిన పక్షమున, వెంటనే శోరా శాంతికరములచేచికిత్సగావించరాదు; ప్రారంభమున, సారూప్యౌషధముయొక్క పెద్దపొటెన్సీలలోగల

సూక్ష్మమోతాదులతో, సోరాను తన పూర్వపు పరిచ్ఛిన్న స్థానములోనికి ప్రస్తుతము తిరిగి జేర్చినపక్షమున నావ్యాధి శాంతింపజేయబడి, రోగి స్వస్థతజెందినట్లు యగుపడగలడు: గాన, ప్రారంభమున వ్యాధికనుకూలించు శోధింపబడిన యితరతరగతి ఔషధములచే (ఏకోనైటు, బెల్లడోనా, స్ట్రమోనియమ్, హాయోసిమస్, మెర్క్యురీ మొదలగునవి) చికిత్స గావింపవలయును.

## 222

తరుణమైన మానసికవ్యాధిని లేక మనోవికార సంబంధమైనవ్యాధిని సోరా శాంతకరౌషధములమూలమునగాక యితర మందుల మూలమున నివారణ జేసిన సందర్భమునందు ఇట్టి రోగియొక్క వ్యాధి నివారణ జేయబడెనని యెన్నడును పరిగణింపరాదు. మరియు యిప్పుడు మిక్కిలి అంతస్థితమై మరల బైట బడుటకు సంసిద్ధమై యున్న దీర్ఘవ్యాధి తత్వమగు సోరాను దీర్ఘకాలము గావించు సోరా శాంతికర చికిత్సమూలమున సంపూర్ణముగ విముక్తి జేయుటకు ‡1 త్రుటికాలమైనను ఆలస్యముచేయరాదు. ఇట్టి చికిత్స గావింపబడిన రోగి అహార

1. ‡ దీర్ఘకాలమునుండిగల మానసిక లేక మనోవికార సంబంధమైన వ్యాధి స్వతస్సిద్ధముగ తగ్గిపోవుట చాల అరుదు. (అట్టి తగ్గినసందర్భములలో అంతరంగవ్యాధి దోషముతిరిగి శరీరావయవములకు మార్పుజెందును.) ఇట్టి పరిస్థితులలోనే ఉన్మాద వైద్యాలయములనుండి, స్వస్థత చేకూరినట్లు

నియమములు పథ్యమునరిగ జరిగించుచున్న పక్షమున తిరిగి యిట్టి విధమగు వ్యాధి మరల సంభవించునని భయపడనక్కరలేదు.

## 223

గాని సోరా శాంతకరచికిత్సగావించక వదలివేసిన పక్షమున, మొదట ఉన్మాదముకలుగజేసిన కారణముకంటె అత్యల్పకారణమువలననే అంతకంటె తీవ్రమైన మిక్కిలి దీర్ఘకాలముండు సత్వరమైన నూతనోద్రేకము సంభవింపగలదు. ఈలోపుగ సాధారణముగ సోరా సంపూర్ణముగ వృద్ధిజెంది, ఎడతెగకనుండు మానసికవ్యాధిలోనికిగాని లేక, ఆగి ఆగి నియమితకాలములోవచ్చెడు మానసికవ్యాధిలోనికిగాని చేరగలదు. అప్పుడు

యగుపడురోగిని పంపివేయుదురు. ఇంతవరకు, ఉన్మాదవైద్యాలయములు రోగులతో క్రిక్కిరిసి, యితర పిచ్చిరోగులు చేరుటకు వెనుకటిరోగులలో నొకరు చనిపోయినగాని కాళీలేనట్టి పరిస్థితులలోనున్నవి. ఈవైద్యాలయములయందు ఏ ఒక్కరోగియు యదార్థముగ, తిరుగలేకుండ శాశ్వతముగ నివారణజేయబడి యుండలేదు. శాస్త్రీయవైద్యమని బిరుదుతో, డాబు, ఆడంబరములతో చికిత్సగావించుచు పరిహాసాస్పదముగ గౌరవింపబడు నివారణాశూన్యమైన యీ అల్లోపతీచికిత్స సంపూర్ణముగ వ్యర్థమని ఋజువుపరచి అంగీకరింపజేయు అనేకమైన యితరదృష్టాంతరములలో నిదియొక దృష్టాంతరము. యదార్థమైన నివారణాశాస్త్రముపై నాధారపడియున్న, అకృత్రిమము, పరిశుద్ధమునగు, హోమోపతీచికిత్సమూలమున అట్టి మానసిక శరీరవ్యాధులకు లోనైన దురదృష్టవంతులగు ఎంతమందిరోగులకు ఆరోగ్యము చేకూర్పబడి, పరమానందమునొందు వారి స్నేహితులకు ప్రపంచమునకు ఎంత తరుచుగా వప్పగింపబడుటలేదు,

సోరా శాంతికరములచే నివారణజేయుట మిక్కిలి కష్టతరము కాగలదు.

## 224

మానసికవ్యాధి సంపూర్ణముగ వృద్ధిజెందక, శరీరసంబంధమైన వ్యాధినుండి ఉద్భవించినదా, లేక, విద్యాభ్యాసమునందలి లోపముల మూలమున, దుర్నడతలు, దుష్ట అవినీతిమార్గములు, మనస్సును తగు కట్టుబాటులోనుంచకపోవుట, అజ్ఞానము లేక మూఢవిశ్వాసము మొదలగువాని మూలమున ఉద్భవించినదాయను కొంత సందేహమింకను యున్నప్పుడు యీవిషయమును యీక్రిందిపద్ధతినినిర్ధారణచేయవలయును. పైనచూపించిన రెండవవిధమైన కారణములలో నేదియో యొక కారణమువలన సంభవించినప్పుడు, యోగ్యమైన స్నేహితుల సలహాలమూలమునను, ఓదార్పేదులేక సమాధానపరచెడు వాదనమూలమునను, తీవ్రముగ విషయములను వివరించి తెల్పుటమూలమునను, వివేకమైన సలహాలమూలమునను వ్యాధినితగ్గించి బాగుపరచవచ్చును గాని, శరీరసంబంధవ్యాధిపై ఆధారపడియుండు యదార్థమైన నైతిక, మానసికవ్యాధి, యీపద్ధతిమూలమున చక్కబడజాలదు. మరియు, నిందుమూలమున సత్వరముగ ఉద్రేకించి, మనోవిచారముచే నింకను, రోగి కృంగిపోయి, దుఃఖితుడై, ఓదార్పనలవిగాక, ముగ్ధుడై, (ప్రమాదకరమైన యీ ఉన్మత్తుడు) తనస్వాల

మున యింకను ఉద్రేకించిపోయి, యీ పిచ్చిమాటలు పల్కు-వెర్రివాడు యింకను ప్రత్యక్షముగ పిచ్చివాడగును. †1

## 225

గాని యింతకుమున్నే చెప్పినవిధముగ, శరీరసంబంధమైన వ్యాధులనుండి యీస్థితిలోనికిమారని, కొలది మతిభ్రమ వ్యాధులుగూడ నిశ్చయముగగలవు. ఈవ్యాధులు తలక్రిందు పద్ధతిలో, శరీరమును స్వల్పముగమాత్రము, అస్వస్తతజెందించి విరామములేని ఆదుర్దా, వ్యాకులత, విచారము, తప్పిదములు, తరుచుసంభవించు హడలు, భయము, మొదలగువానినుండి ఉద్భవించి నిలచిఉండగలవు. ఈతరగతి మతిభ్రమవ్యాధులు కొంతకాలమునకు తరుచుగా, శరీరారోగ్యమును విస్తారముగ భగ్నపరుపగలవు.

## 226

ఇట్టి మనోవికారసంబంధమైన వ్యాధులు ప్రథమమున మనస్సువల్లపుట్టి పిమ్మట మనస్సుమూలముననే, నిలిపి యుంచ

---

†1. ఇట్టి వ్యాధులయందు రోగియొక్క మనస్సు ఈ న్యాయసమ్మతమైన బోధనల పర్యవసానముగ, దుఃఖము అస్వస్తత అనుభవించుచున్నట్లగుపడి, శరీరమునచెడిన సామరస్యమును తిర్గి జేర్చుటకు కోరుచునట్లు శరీరమున పనిజేయును; గాని శరీరము తనకుగలవ్యాధిచే మానసిక, స్వభావఅవయవముల యందు తిరిగి గావించు ప్రతీకారగుణమున (reaction) తన బాధలను వానికి క్రొత్తగా పరివర్తనగావించుటమూలమున, యింకను ఎక్కువ అక్రమ స్థితిలోనికి బెట్టగలదు.

బడును. ఈవ్యాధులు శరీరస్థితియందు మిక్కిలి బలముగ వేర్పడకుండక, నవీనమైయుండిన పరిస్థితిలో మానసికచికిత్సలకు విశ్వాసము కలుగజేయుటమూలమున అనుకూలమైన ప్రోత్సాహములు కలుగజేయుట మూలమున, తరుచుగ రోగికి తెలియనశక్యమగు మంచి మార్గోపాయముల నుపయోగించుట మూలమున సత్వరముగ ఆరోగ్యయుత మానసికపరిస్థితికిమార్పు చెందింపవచ్చును. (అనుకూలమగు పథ్యము ఆహారనియమములతో, ఆరోగ్యకరమైన శరీరముగకూడ మార్పుజెందింపవచ్చును.)

## 227

గాని యీవ్యాధులలోగూడ సోరా దీర్ఘవ్యాధితత్వమే వ్యాధికి మూలకారణమగుచున్నది. ఇది యింకను పూర్తిగా వృద్ధిజెందక యుండుటచే సులభముగ సంభవించు నిట్టి మానసికవ్యాధి పరిస్థితిలోనికి తిర్గి రోగిపడకుండ కాపుదలకొరకు వ్యాధినివారణ కాబడియున్నట్లు గోచరించు రోగికి ఆతనివ్యాధిని సమూలముగ నిర్మూలముచేయు సోరా శాంతికరచికిత్స గావింపవలెను.

## 228

శరీరసంబంధ వ్యాధులనుండి ఉద్భవించిన మానసిక లేక మనోవికార సంబంధవ్యాధులను సోరా శాంతికర సాహా

ప్యౌషధములతో చికిత్స గావించుచు రోగియొక్క సన్నిహితులు రోగియెడల అనుకూలముగ మనస్సుకు నచ్చునట్లు ప్రవర్తించు వైద్యునియందు మానసికక్రమపద్ధతిని రోగికితన కలుగజేయు◆1 సహాయభూతపరికరభూతునిగ లక్ష్యము కలుగజేసి రోగియొక్క జీవితపద్ధతి జాగరూకతతో నియమబద్ధము గావించినప్పుడు మాత్రమే ఈవ్యాధులు నివారణ కావింపబడగలవు. తీవ్రమైన వెఱ్ఱిని నెమ్మదిగ ధైర్యస్థైర్యములు వహించి చలింపక బింకమగు పట్టుదలతో మనమెదుర్కొన వలెను. విచారకరముగ

◆ 1. ఈతరగతి రోగులకు చికిత్సచేయుటలో యింగ్లండు దేశమునందే గాక జర్మనీదేశములోగూడ యీరోగులయొక్క యిట్టివ్యాధులను నివారణ జేయసమర్థమైన, యదార్థమగు సామాన్యౌషధ చికిత్సాపద్ధతిని కనుగొన, ప్రయత్నించుటకుమారు చాల ఉన్మాదవైద్యాలయములలో, సర్వమానవులకు జాలిగొల్పు, మిక్కిలి తీవ్రమైనదెబ్బలతోను, బాధకలుగజేయు యితరహింసలతోను, చిత్రహింస గావించుచున్నారు. ఈకృత్యములయందలి యీవైద్యుల అవివేకమునకు, కఠినహృదయమునకు ఆశ్చర్యముపొందకుండ నుండుట దుర్ఘటము. మనస్సాక్షికి వ్యతిరేకమైన యిట్టి దౌర్జన్యయుతమైన పద్ధతిని అవలంబించుటమూలమున యీవైద్యులు చెరసాలకావలికంటెను నీచమైన అపకీర్తికి పాలగుచుండిరి. ఏలనన చెరసాలకావలి తన విద్యుక్తధర్మము ప్రకారముతనకు కలుగజేయబడిన అధికారమునకులోబడి శిక్షార్హులనుమాత్రమే శిక్షించునుగాని ఈవైద్యులు,తమ చికిత్సయందలి నిరుపయోగత్వమునుగూర్చి సిగ్గుపడు మనస్సాక్షితో యీజాలిగొలుపు నిరపరాధులగు రోగులయెడ తమకు అసాధ్యమని ప్రత్యక్షముగ యగుపడు యీ మానసికవ్యాధులను చికిత్సజేయసమకట్టి మిక్కిలి కఠినముగ ప్రవర్తింతురు. మరియు యీచికిత్సాపద్ధతి ఎంతవరకు ఉపయోగించునో తెలియని అజ్ఞానములోనుండి, న్యాయసమ్మతమైనచికిత్స అవలంబింపని సోమరితనముతో నుందురు.

రోగి ఏడ్చుచున్నప్పుడు మౌనముగ నుండి అతని యడల జాలి పడుచున్నట్లుగ చూపులలోను అభినయచేష్టలలోను కనుపరుప వలయును. అవివేకముగ పేలు చున్నప్పుడు చూచీ చూడ నట్లు నిశ్శబ్దముగ నుండవలెను. అసహ్యాకరమైన దుష్టపరివర్తన జేయుచున్నప్పుడును అట్టి విధముగ సంభాషించుచున్నప్పుడును సంపూర్ణముగ అటుచూడకుంట యుండవలెను. రోగియొక్క చర్యలకు రోగిని దూషింపక చుట్టునుగల వస్తువులను పాడుచేసి నిర్మూలము చేయకుండ మాత్రము కాపాడుచుండవలెను. రోగికి ఏవిధమైన శరీర సంబంధమైన శిక్షను కఠినమైన హింసలను ♦1 కలుగజేయవలసిన అవసరము లేకుండ తప్పించు పద్ధతిలో సమస్తమును ఏర్పాటు జేయవలయును. రోగికి ఔషధమీయ వలసివచ్చినప్పుడు రోగి ఔషధమును సవినయముగ తీసికొన నప్పుడు నిర్బంధించుటన్యాయము. గాని సారూప్యౌషధపద్ధతిలో వ్యాధికనుకూలించి ఔషధము యొక్క చిన్న మోతాదు రుచికి ఎప్పుడును బాధకలుగ జేయదు గాన రోగిని నిర్బంధించ వలసిన అవుసరము లేకుండగనే త్రాగు మంచినీటిలో కలిపి తెలియకుండగ యిచ్చి వేయనచ్చును. గాన రోగిని ఎట్టి విధ ముగ నిర్బంధించవలసిన అవుసరము లేదు.

## 229

మరియు వ్యతిరేకము తెల్పుట ఆశాయుత సమాధాన మిచ్చుట, మోటుగా మందలించుట, దూషించుట, విరికి తన

ము గా లో ం గి పో వు ట, యిట్టి రోగులయెడ పనికిరావు. మానసిక, మనోవికార సంబంధమైన వ్యాధులలో యిట్టి పద్ధతులుకూడ సమతుల్యముగ హానికరపద్ధతులు. ఈదూషణను, ఈమాయోపాయమును, వంచనను, నీరోగులు గ్రహింపగలరు గాన వీని మూలమున నీరోగులు ఉద్రేకము జెందుదురు. మరియు నందుమూలమున వారిబాధలధికమగును. వైద్యుడును రోగియొక్క సంరక్షణకర్తయు నీరోగులు వివేకజ్ఞానము గలిగి యుండిరని వారువిశ్వసించునట్లు తామువెల్లప్పుడు నటించవలెను.

వారి మనస్సును, స్వభావమును, వ్యాకులపరచు సమస్త బాహ్య ప్రాబల్యములను సాధ్యమైన పక్షమున తొలగింపవలెను మేఘావృతమైన నీరోగుల మనస్సునకు ఉత్సాహము కలిగించు వినోదములులేవు. హితమైన ఆకర్షణా వి ష య ము లు లేవు. బోధనామార్గములు లేవు. సంభాషణలమూలమున ఉపశమనము కలుగజాలదు. పుస్తకములుగాని, యితరవస్తువులుగాని శాంతి కలిగింపజాలవు. శరీరారోగ్యము ఉత్తమస్థితిలోనికి మార్పు జెందినప్పుడు మాత్రమే నీరోగులమనములయందు సుఖము, శాంతి ప్రకాశించగలదు. ‡1

‡1 తీవ్రమైన ఉన్మాదరోగుల చికిత్స యీచికిత్స కొరకు ప్రత్యేకముగ నేర్పాటు గావించిన సంస్థలలో మాత్రమే గావింప నగును గాని రోగియొక్క కుటుంబ బంధువుల మధ్య జరిగింపబడజాలదు.

ప్రతిమానసిక లేక మనోవికార సంబంధ వ్యాధికొరకు ప్రత్యేకించి శోధించిన పోరా శాంతికరౌషధములలో వ్యాధి పరిస్థితినిబట్టి నమ్మకముగ చిత్రించిన వ్యాధిచిత్రమునకు మిక్కిలి సారూప్యముగ అనుకూలించురీతిని పరిశుద్ధ గుణములను తెలిసికొనబడిన తగినంత సంఖ్యగల యీతరగతి ఔషధములుండి వానినుండి ప్రతిరోగియందును సులభముగ గోచరించు ప్రత్యేక లక్షణములతో ఏర్పడియున్న మానసిక లేక మనోవికార సంబంధమైన వ్యాధిస్థితికి మిక్కిలి అనుకూలమైన సారూప్యౌషధమును శక్తి పంచనలేక శోధించి ప్రయోగించినపక్షమున శీఘ్రకాలములోనే ఆశ్చర్యకరమగు మంచిఅభివృద్ధి కలుగగలదు. అననుకూలమగు సమస్తమగు యితర మందులతో (అల్లోపతీ) తరుచు ప్రయోగింపబడు పెద్దమోతాదుల మూలమున రోగిని మృత్యుముఖమునకీడ్చువరకు గావించు చికిత్సకంటెను మిక్కిలి ఆశ్చర్యకరమగు సుగుణము కలుగగలదు. వాస్తవముగ శరీర సంబంధమైన వ్యాధులనుండి జనించినట్టి గాని లేక వానితో ఏకకాలమందే వృద్ధిజెందినట్టిగాని దీర్ఘకాలమానసికమనోవికార సంబంధ వ్యాధులను నివారణజేయుటలో యోచింపశక్యమగు యితర సమస్త చికిత్సావిధానములకన్న హోమోపతీ పద్ధతి యొక్క మహత్తరమైన ఆధిక్యత మిక్కిలి జయప్రదముగ దేదీప్యమానమైన కాంతితో యీవ్యాధులయందుకంటె మరి

ఎచ్చుటను ప్రదర్శింపబడజాలదని నాకుగల గొప్పఅనుభవమును బట్టి ధైర్యముతో స్థిరముగ జెప్పగలను.

## 231

విడచివిడచివచ్చు వ్యాధులు (intermittent diseases) అనగా విడుపుజ్వరములనంటి వ్యాధులు మరియు కొంతకాల వ్యవధిలో సంభవించు వ్యాధులు (that recur at certain periods) అనగా విడుపుజ్వరములవలె జ్వరలక్షణములేకుండ వచ్చు వ్యాధులు మరియు విభేదమైన తరగతిలోగల వ్యాధి స్థితితో అనిశ్చయమైన కాలవ్యవధిలో కొంతవ్యాధిస్థితి మార్పు జెందుచు వచ్చు వ్యాధులు ప్రత్యేకముగ యోచింపదగి యున్నవి.

## 232

ఈకడపట చెప్పడిన ఒకటి విడచి ఒకటివచ్చు లక్షణ ములుగల వ్యాధులు గూడ (alternating diseases) అసంఖ్యాకములై 1 యున్నవి. గాని యీవ్యాధులన్నియు దీర్ఘవ్యాధుల తరగతికే చెందును. ఇవియన్నియు సర్వసాధారణ

1. ఒకదానితోనొకటి రెండుమూడు స్థితులు మార్పుజెందుచుండ వచ్చును. ఇందులకుదాహరణగ మార్పుజెందు ద్వంద్వవ్యాధులయందు, ఒక విధమైన కండ్లవ్యాధి అదృశ్యమైనతక్షణము, కాళ్లయందు ఒకవిధమైనపోట్లు విడువకుండ సంభవించుట మొదలగు స్థితులు కలుగవచ్చును. కాని కాళ్ల

ముగ వృద్ధిజెందిన సోరా యొక్క ప్రత్యక్షరూపములే యగుచున్నవి. మరియు ఒక్కొక్కప్పుడు అరుదుగా సిఫిలిస్ దీర్ఘవ్యాధి తత్వముతో (Syphilitic miasm) క్లిష్టముగ ఏర్పడియుండగలవు. మొదటి సందర్భములో దీర్ఘవ్యాధులను పుస్తక

---

యందలి యీపోట్లు కొంతకాలమునకు తగ్గినవెంటనే యీకండ్లవ్యాధి సంభవించును. శరీరమునందలి ఏయితరమైనవ్యాధితోనైనను, లేక కొంతభాగముతోనైనను, కంపము, యీదృవ్వ్యాధిలక్షణములు తత్క్షణము మార్పుజెంది సంభవించును. మార్పుజెందు త్రివిధస్థితులుగలసామాన్య అస్వస్థతయందు, ప్రత్యక్షముగ యగుపించుకీలిని,శరీరారోగ్యం, మానసిక శరీరావయవసంబంధశక్తులు అసాధారణముగ వృద్ధిజెందు (అమితమైన ఉల్లాసము, అసాధారణమైన చురుకుదనము, అమితమైనసౌఖ్యభావన, విపరీతమైన ఆకలి మొదలగునవి) సమయములు (periods) సంభవించి, అటుపిమ్మట, తెలియకుండ హఠాత్తుగా, మనోవ్యాకులతతో, వ్యసనకరమగు, సహింపనశక్యమైనరోగభయస్వభావము, అజీర్ణము, నిద్రలేమి మొదలగు, అనేకములైన జీవకార్యక్రిమ సామరస్యమున అక్రిమములుయగుపించి, తిరిగి అట్లే తెలియకుండ తక్షణము అదృశ్యమై వెనుకటి సాధారణఅస్వస్థతకు స్థానమొసగును. ఇట్లే అనేకమైన పలువిధములగు యితరవ్యాధి పరిస్థితులుండగలవు. క్రొత్తవ్యాధిస్థితి యగుపించినప్పుడు, తరుచుగ వెనుకటివ్యాధిస్థితియొక్క గోచరమగు ఏచిహ్నమును యుండదు. కొన్ని యితరవ్యాధులలో క్రొత్తస్థితి సంభవించినప్పుడు మార్పుచెందు మొదటిస్థితియొక్క స్వల్పచిహ్నాలుమాత్రము యగుపడును. మొదటిస్థితియొక్క కొలదిలక్షణములు, రెండవస్థితి యగుపించినప్పుడు ఆస్థితి నడచుచున్నప్పుడు నిలచియుండగలవు. ఒక్కొక్కప్పుడు, మార్పుజెందువ్యాధిస్థితులు, మిక్కిలి వ్యతిరేకమైన స్వభావముకలిగియుండును. అనగా విచారము కాలక్రమముగ (periodically) మార్పుజెందు వెఱ్ఱియానందము పిచ్చిలోనికి మార్పుజెందుచుండును,

ములో బోధింపబడిన విధముగ సోరా శాంతికరౌషధముల చేతను, రెండవ సందర్భమునందు సిఫిలిస్ శాంతికర ఔషధములను సోరా శాంతికరౌషధములతో మార్చి ప్రయోగించుచుండుట చేతను (alternating) అట్టి న్యాధులను నివారణ జేయ వచ్చును.

## 233

మార్పుజెందనిస్వభావముగల వ్యాధిపరిస్థితియదార్థమైన ఒకనిర్ణయకాలమునకువచ్చి అట్టిసరియగుస్థిరమైన నిర్ణయకాల ములోనే మరలుచు యితర సమయములయందు రోగి మంచి ఆరోగ్యముగనున్నట్లు యగుపడుచు నుండువ్యాధులు 'విచిత్రమైన విడుపువ్యాధు (Typical intermittent diseases) లని పిలువబడును. ఈపరిస్థితి నియమితకాలపద్ధతిలో (ఒకానొక కాలమందు) వచ్చిపోవుచుండు జ్వరసంబంధముగాని, వ్యాధిస్థితులయందును, అసంఖ్యాకములైన రకములుగల విడిచివిడిచి వచ్చు జ్వరములలోను గాంచనగును.

## 234

ఇంతకుమున్నే సూచించిన ఒక ప్రత్యేకరోగియందు గాంచబడు విచిత్రమైన జ్వరసంబంధముగాని నియమిత కాల ములో తిర్గిసంభవించు ప్రత్యేక జాతివ్యాధిస్థితులు (morbid states) (ఈవ్యాధులు అంటువ్యాధులవలె బాహుళ్యముగగాని

అచ్చటచ్చట సంభవించెడు ఒకతరగతి వ్యాధులవలెగాని సర్వసాధారణముగా అగుపించవు) ఎల్లప్పుడును దీర్ఘవ్యాధులకే చెందగలవు. ఈవ్యాధులుచాలభాగము యదార్థమైన దీర్ఘవ్యాధులకే చెంది శోరాసంబంధమైయుండి మిక్కిలి అరుదుగా మాత్రము సిఫ్లిస్‌తోక్లిష్టమైయుండగలవు. మరియు నివియన్నియు ఒకేపద్ధతిమూలమున జయప్రదముగ చికిత్స గావింపబడగలవు. కాని ఒక్కొక్కప్పుడు యీవ్యాధులయొక్క విడచివిడచివచ్చు స్వభావ గుణమును సంపూర్ణముగ నిర్మూలము జేయుటకు మాధ్యమిక ఔషధముగ (intermediate remedy) చింకోనా పట్టను పొటెన్సీలోనికి మార్పబడిన ద్రావకముయొక్క ఒక్క మోతాదును ప్రయోగించవలసిన అవసరముండును.

## 235

బాహుళ్యముగగాని, అచ్చటచ్చటగాని (epidemically and sporadically) వ్యాపించు విడుపుజ్వరముల, 1 ♦ (Intermittent fevers) విషయములో, ప్రతిసారియు నగు

♦1 ఇదివరకు సందిగ్ధముగనుండి యింకను అజ్ఞానమగు బాల్యావస్థలో నున్న రోగవిచక్షణాశాస్త్రము, యీజ్వరము కేవలము విడిచివిడిచి వచ్చు జ్వరముగా, చలిజ్వరము (Ague) అను పేరుతో గుర్తించి యుండు రోగోద్రేకము, ప్రతిదినము లేక మూడుదినములకొకసారి, లేక నాల్గుదినములకొకసారి, సంభవించు మధ్యకాలపరిమితిగల విభేదముకంటె నందు వేరురకము లేనట్లు అంగీకరించుచున్నది గాని యిట్టి కాలవ్యత్యాసముకంటె వీనియందింకను, ముఖ్యమైన విభేదములు గలవు. ఈజ్వరములలో అసం

పించు, ఉద్రేకము ఆరీతిగనే, మార్పుజెందు (alternating) వ్యతిరేకమైన రెండుస్థితులతోగాని (చలివేడి లేక వేడిచలి) యింకను మిక్కిలి తరుచుగా మూడు స్థితులతోగాని (చలి, వేడి, చమట) మనము తరుచు గాంచగలము. గాన, సర్వసాధారణమైన రుజువుపరుపబడిన ఔషధముల తరగతినుండి (శోరా శాంతికరముగాని సాధారణమైన ఔషధము) శోధించు ఔష

---

ఖ్యాకములైన రకములుగలవు. రోగోద్రేకమునందు ఒక్క ఉడుకు యున్నంతమాత్రమున, యిందు కొన్నిటిని చలిజ్వరములక్రింద గూడ లెక్కించుటకు వీలులేదు. కొన్ని చలితోమాత్రమే అనంతరము గలుగు చెమటతోగాని చెమటలేకగాని యుండగలవు. మరికొన్ని శరీరమున చల్లదనముతో లోపల ఉడుకుగానుండి లేక లోపల చల్లదనముతో శరీరము వేడిగానుండి యిట్టిలక్షణములతో యగుపించగలవు. మరికొన్ని జ్వరములలో ఒకఅవస్థలో ఉద్రేకమునందు సామాన్యజ్వరము మాత్రమే వచ్చి పిమ్మట స్వస్థతగలిగి పిమ్మట కలుగు ఉద్రేకావస్థయందు, ఉడుకుతో మాత్రమే చెమటతోగాని చెమట లేకుండగాని యుండగలవు. మరికొన్ని జ్వరములలో మొదట ఉడుకువచ్చి, అది తగ్గినపిమ్మటనే చలివచ్చును. మరికొన్ని జ్వరములలో చలిలేక ఉడుకు సంభవించి కొన్నిగంటలైనపిమ్మట రెండవఉద్రేకావస్థవలె చెమటపట్టును. మరికొన్నిటియందు చెమటయే పట్టును. మరికొన్నిటియందు చలి ఉడుకు లేక ఒక్క చమటమాత్రమే ఉండును లేక ఉడుకులోమాత్రమే చెమటయుండును. విచిత్రమైన తరగతి తలనొప్పి, నోటియందు అరుచి, వికారము, వాంతులు, విరేచనములు, అతిదాహము, దాహములేకపోవుట శరీరములోను, అవయవములయందు, విచిత్రమైనపోట్లు, కలతనిద్ర, కలవరింతలు, శాంతముచెడుట, అపస్మారము, మొదలగు అసంఖ్యాకములైన యితరవ్యత్యాసములు, ముఖ్యముగా యీసహచరలక్షణములలో, చలియవస్థను ముందుగాని, కూడాగాని,

ధము, ఆరోగ్యమైన శరీరములో జనింపజేయుస్థితిని, యీరీతిగనే జనింపజేయ సమర్థమై యుండవలెను. లేక ఈఔషధము లక్షణ సారూప్యమున సాధ్యమైనంతమిక్కిలి సాదృశ్యపద్ధతిలో, బలతమమైన, మరియు బాగుగావిస్పష్టమైయున్న, మిక్కిలి విచిత్రముగ మార్పుజెందుస్థితికి అను గుణముగా నుండవలయును.

---

పిమ్మటగాని, ఉడుకుయవస్థకు, ముందుగాని, కూడాగాని, పిమ్మటగాని, చెమటయవస్థకు ముందుగాని, కూడాగాని, పిమ్మటగాని, సంభవించును. మరియు లెక్కలేని యితరరకముల లక్షణములు, గూడ సంభవించును. ఇవన్నియు ప్రత్యక్షముగ మిక్కిలి వివిధతరగతులకు చెందిన, ఏడుపుజ్వరములు. స్వభావసిద్ధమైన భావమునుబట్టి, యీప్రతిజ్వరమునకు, ప్రత్యేకమైన (సారూప్య) చికిత్స జేయవలసియున్నది. ఇవియన్నియు చాలవరకు విస్తారమైన క్వైనా మోతాదులతోను, దానితో ఔషధాలయములయందు తయారుచేయబడిన సల్ఫేట్ అఫ్క్వినైన్ తోను అణచిపెట్టవచ్చునని (తరుచు జరుగుచున్నది) ఒప్పుకొనక తప్పదు. అనగా, వృద్ధిజేయుచు పలుమారు తిరిగి తిరిగి యిచ్చు మోతాదులలో తరుచు యీ చింకోనా మూలమున యీజ్వరములయొక్క నియమిత కాలక్రమ ఉద్రేకమును (జ్వరలక్షణమును) తొలగింపవచ్చును. గాని దేశమంతటను, పర్వతప్రాంతములయందుగూడ వ్యాపించు, సమూహవిడుపుజ్వరములలో చింకోనాపట్ట అనుకూలించని జ్వరములను అనుభవించు రోగులకు దీనిచే కాలక్రమఉద్రేక జ్వరలక్షణమును తొలగించినంతమాత్రమున ఆరోగ్యము చేకూరజాలదు. అందుకుమారుగ వేరొకపద్ధతిలో తరుచుగా పూర్వముకంటెమిక్కిలిదుస్థితిలో వ్యాధిగ్రస్తులై యుండగలరు. చింకోనాపట్ట మూలమున వీరిశరీరమునందలి రక్తము దీర్ఘముగ విషతుల్యముగావింపబడి, దీర్ఘకాలముగావించు యదార్థమైన ఔషధచికిత్సమూలమునగూడ, ఆరోగ్యము చేకూర్పబడుట అరుదు. అధునప్పటికి, నివారణజేయుటయున నిదేయని తలంపబడుచున్నదిసుమా!

(చలిస్థితికిగాని, వేడిస్థితికిగాని, చెమటపట్టు స్థితికిగాని, యీస్థితులలోనేగి బలతమమై మిక్కిలి విచిత్రమైయుండగలదో, దానియందేదోయొక మార్పుజెందు ప్రతిస్థితిలోగల సహచరలక్షణములతోను సారూప్యమైయుండవలెను.) జ్వరము లేక స్వేచ్ఛగానున్న మధ్యకాలమునందు రోగియందుగల లక్షణములనే మిక్కిలి అనుకూలమైన సారూప్యౌషధమును ‡2 కనుగొనుటకు ప్రధానమార్గదర్శకములుగ గైకొనవలయును.

## 236

ఇట్టివ్యాధులయందు ఉద్రేకసమయము గతించినతక్షణము లేక వెంటనే రోగి ఆఉద్రేకగుణములనుండి కొంతవరకు స్వస్తతచేకూరినపిమ్మట ఔషధము ప్రయోగించుటకు మిక్కిలి అనుకూలమైన ప్రయోజనకరమగు కాలము. అప్పుడు ఎట్టి గొప్ప తొందరపాటు, తీవ్రమైన సంక్షోభము, లేక శరీరమున ఆరోగ్యము కలుగజేయుటకు అవుసరమైన, సమస్తమైన మార్పులను ఔషధము కలిగించుటకు అవకాశముండును. ఔషధగుణము వ్యాధికి ఎంతనిర్దిష్టముగ అనుకూలించి యున్నప్పటికి

‡2 నాశిష్యులందరికంటెను, మిక్కిలి లాభదాయకమగు యీవైద్యవిధానమునకు ఎక్కువసేవగావించిన డాక్టర్ బోనింగుహాసన్, మిక్కిలి శ్రద్ధవహింపవలసిన యీవిషయమును చక్కగవివరించి, వివిధమైన సమూహజ్వరములకు సామర్ధ్యమగు ఔషధమును శోధించుటకు "............" అను గ్రంథమును రచించి యీకార్యమును సులభము గావించియుండెను.

వ్యాధి ఉద్రేకముజెందు సమయమున ఔషధమీయబడిన పక్ష
మున స్వభావసిద్ధముగా సంభవించు వ్యాధితో నీఔషధగుణ
ములు సమ్మిశ్రమమై శరీరమున ప్రాణహాని గలుగజేయును.
అట్లు కలుగజేయని పక్షమున 1* అట్టి స్వభావముగల ఉద్రే
కము, గొప్పనీరసము గలుగజేయునంతటి తీవ్రమైన ప్రతీకారము
(reaction) స్పర్థ (contention) కలుగజేయును. గాని ఉద్రే
కము తగ్గినవెంటనే ఔషధమునిచ్చిన అనగా జ్వరములేనిసమయ
ములో తిరిగి ఉద్రేకము కలుగు కాలమునకు చాలముందే ఔష
ధమునిచ్చిన పక్షమున శరీరతత్వముయొక్క జీవశక్తి ఔషధముచే
ప్రశాంతముగ మార్పుజెంది ఆరోగ్యస్థితిలోనికి తిరిగి జేరుటకు
మిక్కిలి అనుకూలమైన పరిస్థితిలో నుండగలదు.

## 237

కొన్ని దుష్టజ్వరములలో సంభవించురీతిని, జ్వరము లేక
యుండు అవస్థ మిక్కిలి స్వల్పమైయున్న పరిస్థితులయందు, లేక
యీఅవస్థ వెనుకటి ఉద్రేకావస్థయొక్క అనంతరబాధలతో,
లతజెంది (Disturb) యున్న పరిస్థితులయందు, సారూప్యౌషధ
మోతాదును, చమటతగ్గుట ప్రారంభించినప్పుడుగాని, లేక

*1 ఈవిషయము చావుజబ్బులయందు గాంచబడును. అట్టి
సందర్భములలో, శీతలస్థితిలో నీయబడిన మితమైన నల్లమందు మోతాదు,
గముగ రోగిప్రాణములను దీసియుండెను.

తగ్గిపోవుచున్న ఉద్రేకఅవస్థయొక్క అనంతరదృశ్యము క్షీణించుట ప్రారంభించినప్పుడుగాని, ప్రయోగింపవలయును.

## 238

తరుచు అనుకూలమైన ఔషధముయొక్క ఒక్కమోతాదుతోనే యిట్టి పలువిధములైనయుద్రేకావస్థలు (attacks) తగ్గిపోయి ఆరోగ్యము చేకూరుచున్నది. గాని చాల సందర్భములలో, ప్రతి ఉద్రేకావస్థకు పిమ్మట మరియొక మోతాదునీయవలసి యుండును. మరియు లక్షణముల యొక్కస్వభావము మారనప్పుడు ఆఔషధమునే మోతాదులను తిరిగి ప్రయోగించువిధమునుగూర్చి నూతనముగా కనిపెట్టబడిన పద్ధతి ననుసరించి (270వ వివరణను (note) చూడుము) ఔషధముగల సీసాను పదిపన్నెండుసార్లు కుదుపుటమూలమున ప్రతి మోతాదుయొక్కసూక్ష్మశక్తిని హెచ్చించి యిచ్చుటయింకను ఉత్తమము. ఒకొక్కప్పుడుఅరుదుగా కొన్నిదినములు స్వస్థతగానున్నపిమ్మటవిడుపుజ్వరముతిరిగియగుపించగలదు. తేమప్రదేశములగుజిల్లాలలోసంభవించురీతిని ప్రథమమునయీజ్వరముద్రేకింపజేసిన హానికరశక్తి యింకను స్వస్థతపడుచున్న రోగిపైపని చేయుచున్నపుడు మాత్రమే కొంతకాలవ్యవధిలో యీజ్వరమే తిరిగి సంభవించగలదు. ఇట్టి కారణభూతమునుండి (causative factor) రోగిని తొలగించుట మూలమున మాత్రమే శాశ్వత నివారణ తరుచు సాధ్యమగును. రోగి యనుభవించు జ్వరము

చవిటినేల సంబంధమగు జ్వరమైన పక్షమున పర్వతప్రాంతము లకు నివాసమును మార్చవలెను.

## 239

ప్రతి ఔషధము తన పరిశుద్ధ గుణములో (Pure action) ఒక ప్రత్యేకమైన విచిత్రజ్వరమును మరియు యితర ఔషధములచే కలుగజేయబడు సమస్తమైన ఇతర జ్వరములకు విభేదమైన మార్పు జెందు అవస్థలతో ఒకవిధమగు విడుపు జ్వరమును గూడ కలుగచేయును గాన ఆరోగ్యమైన వ్యక్తులపై యింతకు మున్నే రుజువు చేయబడిన ఔషధముల యొక్క మితమైన సమూహములో గూడ అసంఖ్యాకములైన పలు విధములగు స్వభావసిద్ధమైన సమస్త విడుపు జ్వరములకు సారూప్యౌషధములను కనుగొనవచ్చును.

## 240

సమూహముగ వ్యాపించియున్న విడుపు జ్వరముల యందు సిద్ధౌషధముగ (Specific) కనుగొనబడిన ఔషధము ఒకటి లేక కొందరి రోగులయందు సరియగు నివారణ కలుగ జేయని పక్షమున నివారణ కభ్యంతరము కలుగజేయు నివ సించు ఊసరక్షేత్రమగు జిల్లాయొక్క ప్రాబల్యమిందులకు కారణము గాని పక్షమున నివారణ కడ్డు దగులుచు వెనుక భాగమున సోరా దీర్ఘ వ్యాధితత్వ మెల్లప్పుడు ఉండితీరును.

గాన నిట్టి సందర్భములయందు సంపూర్ణముగ స్వస్థత చేకూరు వరకు సోరా శాంతికరౌషధములను ప్రయోగించవలయును.

## 241

సమకాలిక విడుపుజ్వరములు (Epidemics of intermittent fevers) (నివసించు ప్రదేశమును బట్టి సంభవించిన జ్వరములుగాని విడుపు జ్వరములు) ఒక ప్రత్యేకమైన తరుణ వ్యాధ్యుద్రేక లక్షణములతో ఏర్పడిన దీర్ఘవ్యాధుల స్వభావము గలిగి యున్నవి. సమూహముగ ఏకకాలమందు వ్యాపించు ప్రతి సమకాలిక వ్యాధియు (Epidemic) విచిత్రముగను వ్యత్యాసములేక సోకిన వ్యక్తుల యందందరియందును సమానమైన లక్షణములతోను యుండును, అందరియందును వ్యత్యాసము లేక సమముగా నుండు లక్షణ సముదాయము కనుగొన బడినప్పుడు అందరి వ్యాధులకు అనుకూలించు సారూప్యౌషధమును (సిద్ధౌషధము) కనుగొనుటకు యీలక్షణ సముదాయము మార్గదర్శకమగును. ఇట్లు కనుగొనబడిన సారూప్యౌషధము ఈసమకాలిక వ్యాధి సంభవించక పూర్వము అనుకూలమైన ఆరోగ్యము కలిగియున్న అనగా వృద్ధి పొందిన సోరా మూలమున దీర్ఘరోగులు గానట్టి రోగులకు అందరకు సర్వత్ర ఉపయుక్తమై యుండగలదు.

## 242

గాని, యిట్టి సమకాలికపు జ్వరములలో, మొదటి ఉద్రేకము (first paroxysm) నివారణచేయక వదలివేయబడిన పక్షమునను, లేక అక్రమమైన అల్లోపతీచికిత్సమూలమున రోగి బలహీనము కావింపబడినపక్షమునను, సాధారణముగా అనేక మంది వ్యక్తులయందుండు, అంతర్జాతమైన సోరా, అప్పటికి అంతర్గతమైన స్థితిలోనున్నప్పటికి, వృద్ధిజెంది, విడుపు జ్వరతర గతిలోబడి, సమస్తరూపములలోనూ, సమకాలిక విడుపుజ్వర భాగమునే ప్రదర్శించుచు, మొదటి ఉద్రేకమునందు ఉపయోగ కరమైయుండి యుండు ఔషధము (అరుదుగా శోరా శాంతి కరము) ఇప్పుడు ఎంతమాత్రము అనుకూలింపక, ఎట్టి ఉప యోగములేక యుండగలదు. ఇప్పుడు మనము సోరాతోకలసిన విడుపుజ్వరమునకే చికిత్సచేయవలయును. ఈజ్వరము హెచ్చు పొటెన్సీలలో అరుదుగా తిరిగి తిరిగి ప్రయోగించు సల్ఫరు లేక హెపార్ సల్ఫుయొక్క సూక్ష్మమైన మోతాదులమూలమున సర్వసాధారణముగా స్వాధీనమగును.

## 243

ఊసరప్రదేశము (marshy) నందు నివసించని ఒకా నొక వ్యక్తికి సంభవించు, ప్రమాదకరమైన విడుపుజ్వరములో మనము ప్రథమమున సర్వసాధారణముగా తరుణవ్యాధుల విష

యములోవలెనే (సోరా మూలోత్పత్తిలో వానిని పోలియుండును) రుజువుచేయబడిన ఔషధములనుండి (సోరా శాంతికరములు కాని) యీప్రత్యేకవ్యాధికి అనుకూలించు ఔషధమును శోధించి, కొన్నిదినములు ప్రయోగించి ఎంతవరకు పనిచేయునో తెసిసికొనవలయును. ఈపద్ధతి నవలంబించినప్పటికి, స్వస్తత చేకూరనిపక్షమున వృద్ధిపొంద నున్ముఖమైయున్న సోరా గలదని తెలిసికొనవలయును. ఈసందర్భములలో సోరా శాంతికరౌషధములుమాత్రమే వ్యాధిని సమూలము నివారణజేయగలవు.

## 244

ఊసరక్షేత్రములగు జిల్లాలలోను, తరుచు నీటితోమునిగియుండు ప్రదేశములలోను, నివశించు దేశస్తులకుమాత్రమే సంభవించెడు విడుపుజ్వరములు, ప్రాచీనవిధాన వైద్యులకు గొప్పపని కలుగజేయును. గాని, బాల్యములో యీప్రదేశములకుగూడ అలవాటుపడిన ఆరోగ్యమైన వ్యక్తి, దోషరహితమైన పథ్యము గావించుచున్నపక్షమునను, లేమిచేతను, విశేషపరిశ్రమచేతను, హానికరమైన కామక్రోధాది గుణములచేతను, తత్వము, హీనస్థితి చెందనిపక్షమునను, అట్టి జ్వరములకు లోనుగాక, మంచి ఆరోగ్యములో యుండవచ్చును. ఆప్రదేశముసందలి విడుపుజ్వరము, అచ్చట ప్రవేశించిన మొదటి ప్రవేశమునందుమాత్రమే తప్పక సంభవింపగలదు. గాని, ఒకటి లేక రెండు చింకోనాపట్టయొక్క పెద్దపొటెన్సీ ద్రావకముయొక్క

చిన్నమోతాదులతోను, పైన వివరింపబడిన చక్కని నియమబద్ధ జీవితపద్ధతితోను, రోగిని సత్వరము నాజ్వరమునుండి విముక్తిగావింపవచ్చును. గాని, తగినంత శరీరవ్యాయామము తీసికొనుచు, ఆరోగ్యమైనపద్ధతినిబట్టి మానసికపరిశ్రమ, శరీరాహారక్రమపద్ధతి జరిగించుచున్నను, ఒకటి లేక కొలది అట్టిచింకోనా చిన్నమోతాదులమూలమున ఊసరక్షేత్రి విడుపుజ్వరములు కొందరివ్యక్తులయందు నివారణచేయబడజాలవు. అట్టి మనుష్యులలో వారియొక్క వ్యాధియొక్క మూలమునందు (root) సోరా ఎల్లప్పుడుయుండి, వృద్ధిజెంద యత్నించుచుండునుగాన, ఊసరక్షేత్రప్రదేశములలో సంభవించు, విడుపుజ్వరములు శోరా శాంతికరచికిత్స కావింపనిదే †1 నివారణకాజాలదు. ఈరోగులు ఆలస్యముగావింపక యీ ఊసరక్షేత్ర ప్రదేశములనుండి మరియొక మెరక ప్రదేశములకు పర్వతప్రాంతములకు మారినపక్షమునను, వ్యాధిలో నింకను సంపూర్ణముగ మునిగియుండక యున్నపక్షమునను, అనగా సోరా పూర్తిగావృద్ధిజెందక అంతర్గతమైనస్థితిలోనికి తన్మూలమున తిర్గి వెళ్ళునవకాశముతో యున్న

1† తరచు ప్రయోగించు చింకోనాపట్టయొక్క పెద్దమోతాదులు, చింకోనా ఔషధసారమగు సల్ఫేట్ ఆఫ్ క్వినైన్ మొదలగునవి యిట్టి రోగులలో తేమప్రదేశపు చలిజ్వరములయొక్క కాలక్రమ ఉద్రేకమును (Periodical fits) నిశ్చయముగ తగ్గించు శక్తిగలిగియున్నవి. ఇందుమూలమున వ్యాధి నివారణ కాబడినదనినమ్మి మోసపోవువ్యక్తులు సోరా శాంతికర చికిత్స పొందనిపక్షమున మరొకవిధముగా తరుచు నివారణకసాధ్యమగు క్వైనా సంబంధమైన వ్యాధితో వ్యాధిగ్రస్తమైయుందురు.

పక్షమునను, స్వస్థత, (జ్వరమువిడిచిపెట్టును) ఒక్కొక్కప్పుడు చేకూరగలదు. గాని శోరా శాంతికర చికిత్సగావింపనిదే వీరెప్పుడును సరియైన ఆరోగ్యమును తిరిగి పొందజాలరు.

## 245

ఇట్లు సారూప్యౌషధ చికిత్సా విధానమునందు వ్యాధులలో గల ప్రధాన వ్యత్యాసములయందును వానికి సంబంధించిన విచిత్ర పరిస్థితులయందును ఎట్టి లక్ష్యముంచవలసినదియు తెలిసి కొనబడెనుగాన పిమ్మట ఔషధముల గూర్చియు వానిని ప్రయోగించుపద్ధతిని గూర్చియు వానిని ఉపయోగించునప్పుడు గమనింపవలసిన పథ్యము ఆహారనియమమును గూర్చియు నేమి తెల్పవలసి యున్నదో యిప్పుడా విషయమునకు పోవుదము.

## 246

చికిత్సయందు స్పష్టముగ గోచరించు సుగుణము యగుపించినస్థితియందు (స్పష్టముగ గోచరించు విధముగ ఆరోగ్యము చేకూరు చున్నప్పుడు) ఈసుగుణము నడచునంతకాలము ఏవిధమగు ఔషధమును తిరిగి ప్రయోగించక పూర్తిగ నిలుపు జేయవలయును. ఏలనన ప్రయోగింపబడిన ఔషధము కలుగ జేయుచుండు సుగుణము వ్యాధిని సత్వరముగ నివారణ జేయు స్థితియందుండును. (ఈ పరిస్థితియందు ప్రయోగింపబడు ఇతర విధమైన ఔషధము యొక్క ప్రతిహోత్రాదు సుగుణమును

భగ్నపరచును. మరియు మిక్కిలి అనుకూలమైన సుగుణమును కలుగజేసిన వెనుకటి ఔషధమునిట్టి పరిస్థితియందు ప్రయోగించినను నిదిగూడ, స్వస్తత చేకూర్చుచున్న సుగుణమును భగ్నపరచును. ("ఆర్గనాన్ 5వ ప్రచురణము") ఈవిషయము తరచుగ తరుణవ్యాధులలోనేగాక, దీర్ఘవ్యాధులలో అధికముగ సంభవించగలదు. మిక్కిలి సారూప్యముగ నిర్ణయింపబడిన సారూప్యౌషధముయొక్క ఒక్క మోతాదుమాత్రమే, నెమ్మదిగ స్వస్తత చేకూర్చుచున్నప్పటికి నదియే, సహజముగ, 40, 50, 60, 100 దినములలో వ్యాధిని నివారణజేయును గాని యిట్టిసందర్భము మిక్కిలి అరుదు. మరియు యింకను మిక్కిలి సత్వరనివారణ లభించుటకు యీ కాలపరిమాణమును సగమునకు, నాల్గవవంతునకు, లేక యింకను తక్కువకాలమునకు తగ్గించుట, రోగికి వైద్యునకుగూడ చాల ముఖ్యవిషయము. ఈక్రింది పద్ధతుల గమనించినపక్షమున నిట్టిసత్వరనివారణను ఎట్టికష్టము లేకుండ మిక్కిలి సుఖముగ కలుగజేయవచ్చునని నవీనముగ పలుసార్లు గావించిన పరిశోధనలనుండి తెలిసికొంటిని. ఒకటి :— మిక్కిలి జాగరూకతతో నిర్ణయించిన ఔషధము, సంపూర్ణముగ సారూప్యమైయుండుట. రెండు :— హెచ్చుపొటెన్సీ ఔషధమును నీటిలోగలిపి, క్రమమైన చిన్నమోతాదులలో ప్రయోగించుట. ఈరెండు పద్ధతులను గమనించి, ఔషధమునిట్లు, అనుకూలమైన నిర్ణయకాలవ్యవధిలోనిచ్చిన, నివారణ సత్వరముగ సిద్ధించగలదని అనుభవమునుబట్టి తెలిసికొంటిని, గాని ఔషధ

శక్తిని మార్పుజేయక తరుచుగ పలుసార్లు ప్రయోగించు మోతాదుల (మాత్రలు) మూలమున, తరుచుగ సంభవించు ♦1 ప్రతీకారమువలె, సారూప్యమగు ఔషధ జనితవ్యాధి కలుగజేయబడు జీవశక్తి, దుష్టమైన తిరుగుబాటునకు, ప్రతీకారమునకు ఉద్రేకింపకుండుటకుగాను, ఒకమోతాదు నిచ్చిన పిమ్మట యిచ్చు ప్రతిమోతాదు యొక్క అంశమును (degree of every dose) కొంతమార్పు జేయవలసినముందు జాగ్రతను ముఖ్యముగ గమనించవలెను.

---

♦1 ఆర్గనాన్ యొక్క అయిదవ ప్రచురణమునందీ పేరాయొక్క వ్యాఖ్యానమునందు, జీవశక్తియొక్క యీఅవాంఛిత ప్రతీకారములను, నిరోధించుటకు, నేను తెల్పినవిషయమంతయు, అప్పటికిగల అనుభవమును బట్టి న్యాయసమ్మతమయ్యెను. గాని యీనాలుగైదు సంవత్సరములలోను, మార్పుజేయబడిన, సక్రమమైన క్రొత్తపద్ధతి, మూలమున సంపూర్ణముగ నీ కష్టములన్నియు తీర్పబడెను. ఇప్పుడీపద్ధతిననుసరించి జాగరూకతతో నిర్ణయించిన ఔషధమును అవసరమైన అనుదినము కొన్నినెలలవరకు యీక్రిందిపద్ధతిని ప్రయోగింపవచ్చును. అనగా దీర్ఘవ్యాధుల చికిత్సలో తక్కువ అంశముగల (degree) పొటెన్సిని ఒకటి లేక రెండు వారములిచ్చిన పిమ్మట యీవిధముగనే హెచ్చు అంశముగల (degree) పొటెన్సీలలోనికి వెళ్ళవచ్చును. (ఇందు చెప్పబడిన క్రొత్తసూక్ష్మశక్తీకరణపద్ధతి (Dynamization method) ననుసరించి ఔషధమును తక్కువ అంశములలో వాడుట ప్రారంభించి పెద్ద అంశముల లోనికి వెళ్ళవలెను.)

ఒకమందును ప్రయోగించినపిమ్మట ఆమందునే మార్పు జేయక అట్టిమోతాదులోనే తిర్గి ప్రయోగించుట ఆచరణీయము గాదు. తరుచుగా తిరిగితిరిగి యీమోతాదును ప్రయోగించుటను( Frequent repetition of dose) గూర్చి చెప్పనవసరమే లేదు. (మరియు సత్వర నివారణకొరకుద్దేసించి స్వల్పకాలవ్యవధిలో మోతాదును ప్రయోగించుటగూడ నిట్టిదే.) ప్రతిరోధము లేకుండ జీవశక్తి యిట్టిమార్పుజెందని (unchanged) మోతాదులను గైకొనదు. అనగా నివారణ చేయదలచిన వ్యాధికి సారూప్యమగు లక్షణములకంటె నూతనమగుఔషధముయొక్క యితరలక్షణములు జనింపగలవు. ఏలనన వెనుకటి మోతాదు జీవశక్తియందు తలంచినమార్పు నిదివరలోనే జరిగించియుండుటచే సూక్ష్మశక్తిగల సారూప్యమైన మార్పుజేయని ఆఔషధముయొక్క రెండవమోతాదు జీవశక్తియందు గావింపవలసిన పనియగుపడదు. గాన నిట్టిమార్పుజెందని కొన్ని మోతాదులను ప్రయోగించుటమూలమున రోగి మరియొకవిధముగ (another way) పూర్వముకంటెను విశేషముగ వ్యాధిగ్రస్తము గావింపబడును. ఏలనన, ఇప్పుడు అసలువ్యాధికి సారూప్యముగాని, ప్రయోగించిన ఔషధముయొక్క లక్షణములునిలచి పనిజేయుచుండుటచే, నిట్లు మోతాదులను తరుచుగ ప్రయోగించుట

మూలమున *1 రోగియొక్కస్థితియందు యదార్థమైన ఉద్రేకము కలుగుటతప్ప, యీషణ్మాత్రమైన నివారణకు, గుణము కలుగదు. ఒకమోతాదుకు పిమ్మటనిచ్చు మోతాదును ప్రతి

---

*1 మిక్కిలి సామాన్యముగ నిర్ణయముచేసి ప్రయోగించిన ఔషధమునూడ, ఆఔషధముయొక్క ఒక్కమాత్ర యొకానొక పొటెన్సీలో మొదట కొంతసుగుణము కలుగజేసిన సందర్భమునందు, పిమ్మట ఆఔషధమును ఆపొటెన్సీలోనే రెండవమోతాదుగాగాని, మూడవమోతాదుగా గాని ప్రయోగింపరాదు. ఈవిధముగనే, వీటియందుకలుపబడిన ఒక ఔషధముయొక్క ప్రథమ మోతాదు సుగుణము కలుగజేసినప్పుడు, ఆ ఔషధమును పాడుచేయకుండ, ఆసీసాలోనే నిలువయుంచి, అందుండి ఒకచిన్న మోతాదును కొలదిదినముల గడువులో తిరిగి ప్రయోగించినప్పటికి ఎట్టి ఉపయోగము కలుగదు. ఈమందును తయారుచేయునప్పుడు పదిసార్లు ఔషధసీసాను గట్టిగా కదుపుటగాని (succussions)పిమ్మటనే నొసంగిన సలహాననుసరించిరెండుసార్లు కదుపుటగాని(two succussions) జరిగించి, యథార్థముగా ఔషధముకలుగజేయు అనుకూలమును తొలగించుటకు ప్రయోగించినప్పటికి, తిర్గి యీయబడు మోతాదుయొక్క అంశమును హెచ్చింపని పక్షమున, ఎట్టి ఉపయోగమును గలుగదు. ఔషధముయొక్క ప్రతిమోతాదును సూక్ష్మశక్తియుతకంశము లోనికి (Dynamisation degree) మార్చినపక్షమున, ఎంతతరుచుగా ప్రయోగించినప్పటికి, ఎన్నిసార్లు కదిపి (succussions) ఎంత హెచ్చు పొటెన్సీలో వాడినప్పటికి ముందు నేను తెలిపినవిధముగా ఎట్టిఅపకారమును యుండదు. మిక్కిలి ఉత్తమముగ నిర్ణయము చేయబడిన ఔషధము, అత్యుత్తమముగ జీవశక్తినుండి వ్యాధిని తొలగింపగలదనియు, దీర్ఘవ్యాధులలో నీఔషధమును వేర్వేరు తరగతులలో (different forms) ప్రయోగించిన పక్షమున వ్యాధి చక్కగ నిర్మూలము చేయబడుననియు ప్రత్యక్షముగ యగుపడుచున్నది.

పర్యాయము కొలదిగమార్చి యిచ్చుచుండిన, అనగా కొంత హెచ్చుఅంశము (Degree) లోనికిమార్చి యిచ్చిన (269-270) ఈఔషధమువూలముననే ఎట్టికష్టములేక జీవశక్తి మార్పుజేయబడి (ప్రకృతిశిద్ధవ్యాధి తగ్గి) నివారణకు సత్వరముగ దీసికొని రాబడును.

## 248

ఇందుకొరకు ఔషధద్రావకమును ♦1 (8, 10, 12 సార్లు కదుపుటమూలమున) తిగ్గి క్రొత్త పొటెన్సీలో బెట్టి, ద్రావ మందును, ఒకటి లేక (హెచ్చించి) కొన్ని చిన్నచెమిచాల మోతాదులలో, దీర్ఘవ్యాధులయందు అనుదినమునుగాని, లేక ప్రతి రెండవదినమునగాని ప్రయోగించవలెను. తరుణవ్యాధులలోనిట్లు ప్రతి మూడు మొదలు ఆరుగంటల కాలములోను, తీవ్రమైన వ్యాధులలో ప్రతిగంటకును లేక యింకను తరుచుగను ప్రయోగించవలెను. దీర్ఘవ్యాధులలో, క్రమముగ నిర్ణయింపబడిన ప్రతి సారూప్యౌషధమును ఔషధగుణము దీర్ఘ

♦1 ఈ ఔషధద్రావకమును 40, 30, 20, 15 లేక 8 చిన్నచెమిచాల నీళ్ళలో తయారుచేయవలెను. ఈద్రావకము నిలువయుండుటకు అందు కొంత ఆల్కహాలు కలుపవలెను. లేదా అందు వసిబొగ్గు వేసియుంచవలెను. వసిబొగ్గు నుపయోగించనప్పుడు, ఆవసిబొగ్గును ఒకదారముచే ద్రావకమునందు వ్రేలాడగట్టియుంచి, సీసాను కదుపనప్పుడు వెలుపటకు తీసివేయవలయును. లోపములేకుండ సూక్ష్మశక్తియుతము గావింపబడిన (పొటెన్సీలో పెట్టబడిన) ఔషధముయొక్కమాత్రను (ఒక్కమాత్రకంటె

కాలపరిమితిగలిగి యున్నప్పటి యీవిధముగా, అనుదినము, నెలలకొలది, నిరంతరము వృద్ధిజెందు సుగుణముతో ప్రయోగింపవచ్చును. ఈద్రావకము (ఏడుమొదలు పదిహేనుదినములు) నుపయోగించినపిమ్మట, అప్పుడుగూడ నీఔషధమే వ్యాధికను కూలించు ఔషధమైయున్నపక్షమున, (అరుదుగామండును) రోగి తన జీవితకాలములో నెప్పుడును అనుభవింపని క్రొత్త బాధలు సంభవింపక, విడువకుండవచ్చు సుగుణము నడచుచు న్నంతకాలము, హెచ్చుపొటెన్సీలో నీమందుయొక్క కొలది మాత్రలతో ద్రావకముజేసి ప్రయోగింపవలెను. పిమ్మట మిగిలియున్నవ్యాధి మార్పుజెందిన లక్షణ సమూహముతో యగుపడుచున్నపక్షమున వెనుకటిమందుకు బదులుగా, యీ లక్షణసముదాయమునకు సారూప్యమగు మరియొకఔషధమును నిర్ణయించి, ప్రతిమోతాదు నిచ్చునప్పుడు ఔషధమును గట్టిగా కదుపుటమూలమున (Succussions) పొటెన్సీయొక్క అంశ మును (Degree of potency) మార్చి కొంతవరకు వృద్ధిజేయ వలెను. ఈవిషయమును జ్ఞప్తియందుంచుకొని, తిరిగితిరిగి

అవసరములేదు) చాలనీళ్ళలో కలిపి ద్రావకము జేయవచ్చును. ఒక సీసాలో 7 లేక 8 చిన్న చెమిచాల నీళ్ళలో ఒకమాత్ర గలిపి ద్రావకము జేసి, సీసాను బాగుగకదిపి, పిమ్మట ఏడు లేక ఎన్మిది చిన్న చెమిచాల నీళ్ళుగల గ్లాసులో ఒక చెమిచాడు ద్రావకముబోసి బాగుగకలిపి అప్పుడు రోగికొక మోతాదియవలెను. రోగి అసాధారణముగ, ఉద్రేకము జెందు, మిక్కిలిసున్నితమైన తత్వముగలిగియున్న పక్షమున, యీద్రావకమునుండి ఒకచిన్న చెమిచాడు ద్రావకముదీసి, నీళ్ళతోనున్న మరియొకగ్లాసులోబోసి

ప్రయోగించు ఔషధమును అట్టిమోతాదులలోనే ప్రయోగింప వలెను. దీర్ఘవ్యాధుల చికిత్సలో మిక్కిలి అనుకూలమైన సారూప్యౌషధమును, అనుదినము ప్రయోగించు నప్పుడు, చికిత్స ఆఖరిదశయందు సారూప్యోద్రేకమని పిలువబడు (161) ఉద్రేకము, యగుపించవలెను. అట్లగుపించి అందు మూలమున వ్యాధిలక్షణములు తిరిగి కొంత వరకు ఉద్రేకించినట్లగుపడి నప్పుడు (యిప్పుడు ప్రత్యక్షముగ బహిర్గతమైయున్న ప్రకృతిసిద్ధవ్యాధికి సారూప్యముగు ఔషధ జనితవ్యాధి) మోతాదుల నింకనుతగ్గించి, దీర్ఘకాలగడవులో తిర్గి ప్రయోగించవలెను. లేదా, స్వస్థతచేకూరుస్థితికి ఔషధ సహాయమవుసరమున్నది లేనిది జూచుటకు, కొన్నిరోజులవరకు ఔషధప్రయోగమును నిలుపుజేయవలయును. అందుమూలమున సారూప్యౌషధమును అధికముగ నుపయోగించుట మూలమున కలిగిన స్పష్టమైనలక్షణములు, వెంటనే అదృశ్యమై, మంచి ఆరోగ్యములో శరీరముంచబడును. ఒకచిన్నసీసాలో,బలము తగ్గింపబడిన (Diluted) ఆల్కహాలు (మద్యసారము) పోసి అందు ఔషధము యొక్క ఒక్క మాత్రను, సీసాను గట్టిగకదుపుట మూలమున (Succus-

---

బాగుగాకలిపి, చిన్న చెమిచాల మోతాదులోగాని, అంతకంటె నెక్కువగ గాని నీయవచ్చును. ఈవిధముగా ఒకగ్లాసునుండి వేరొక గ్లాసునకు, మూడు లేక నాల్గు గ్లాసులకుమార్చి ఔషధమును తయారుజేయవలెనిసంత సున్నితతత్వముగల రోగులుగూడ గలరు. ఈవిధముగ ఒకగ్లాసునుండి వేరొకగ్లాసునకు తయారుచేయు ద్రావకమును అనుదినము, నూతనముగ తయారుచేయువలయును. పెద్దపాటెన్సీలోగల మాత్రలను, కొలదిగింజలెత్తు పాల పంచదారలో బాగుగా నలగగొట్టి, ఆపొడుమును సీసాలోవేసి అవసరమైనన్ని నీళ్ళుపోసి కరగించి ఉపయోగించుట ఉత్తమము.

ion) కరగించి, ప్రతిరెండు, మూడు లేక నాలుగు దినముల
కొకసారి వాసనజూచుటమూలమున ఔషధసేవగావించునప్పుడు
కూడ, ప్రతిపర్యాయము ఆఘ్రాణించునప్పుడు సీసాను ఎనిమిది
లేక పదిసార్లు పూర్తిగకలిపి (succussion) ఉపయోగించ
వలెను.

## 249

వ్యాధికి సారూప్యముగ నిర్ణయముగావించి ప్రయోగించిన ఔషధము పనిచేయునప్పుడు నివారణచేయదలచిన వ్యాధికిసంబంధించని బాధకరమగు క్రొత్త లక్షణములను కలిగిన పక్షమున, అట్టి ఔషధము యదార్థమైన సుగుణము ♦1 (స్వస్తత) చేకూర్పజాలదు. మరియు, నీఔషధము సారూప్య

♦1 గోచరమగు సుగుణము వ్యాధియందు చేకూర్చుటకు, ప్రత్యేకముగ అనుకూలమైన సారూప్యౌషధము మిక్కిలి చిన్నదిగ తయారుచేయరాదని మనయనుభవమంతయు తెలుపుచున్నది. గాన ఔషధమును ప్రయోగించిన పిమ్మట, ఎట్టిసుగుణము యగుపించనప్పుడును లేక కొలదిగ ఉద్రేకము (Aggravation) సంభవించినప్పుడును, ప్రాచీనవిధాన వైద్యములో, మోతాదు చిన్నదగుట మూలమున ఔషధము ప్రయోజనకారియై యుండలేదని భావించు పొరబాటు అభిప్రాయమురీతిని, ఆఔషధముయొక్క మోతాదును, మరలమరల ప్రయోగించుటగాని, హెచ్చించుటగాని, జరిగించిన పక్షమున, అక్రమముగను హానికరముగను ప్రవర్తించడమగును. భౌతికమానసిక నియమములయందు, అపథ్యదోషము సంభవించని సందర్భములలో, నూతనలక్షణములు జనించుటవలన, కలుగు ప్రతిఉద్రేకము ఔషధముయొక్క అననుకూలతను రుజువుపరచునుగాని, ప్రయోగింపబడిన ఔషధము మిక్కిలి బలహీనముగ నుండెనని సూచింపదు.

ముగ నిర్ణయముగావింపబడెనని తలంపరాదు. గాన ఉద్రేకము మిక్కిలి హెచ్చుగనున్నపక్షమున, సారూప్యగుణముల కనుగుణ్యముగ మిక్కిలి సరిగానిర్ణయముజేయబడిన మఱియొక మందును ప్రయోగించుటకుపూర్వము విరుగుడు మందుమూలమున సాధ్యమైనంతవరకు ప్రతిహతము (Neutralize) గావింపవలయును. లేదా, బాధకరమగు లక్షణములు, తీవ్రమైన లక్షణములుగాని, పక్షమున, అననుకూలముగ ప్రయోగింపబడిన ఔషధస్థానము నాక్రమించుటకు ♦2 తక్షణమే రెండవ ఔషధమును ప్రయోగించవలెను.

## 250

వ్యాధిపరిస్థితిని సరిగాపరిశీలనజేసి శ్రద్ధతో జూచెడు, వైద్యునకు, తొందరపాటుగల వ్యాధులలో (urgent cases) ఆరు, ఎనిమిది లేక పండ్రెండుగంటలు గతించినపిమ్మట, లోగడ ప్రయోగించిన ఔషధము, సరిగ నిర్ణయింపబడియుండలేదని, గోచరించి, ఒకగంటనుండొకగంటకు, రోగియొక్కస్థితి నెమ్మదిగ

♦2 వ్యాధిలక్షణములు వివరముగ తెల్పబడి, మనస్సాక్షిగ అతిజాగరూకతగల వైద్యుడు నిర్ణయము గావించిన ఔషధమును సాధ్యమగునంత చిన్న మోతాదులో నీయప్రారంభించిన పక్షమున (యిట్టి మోతాదులోనే ప్రారంభించవలెను.) విరుగుడు ఔషధమీయవలసిన అవసరమెన్నడును కలుగదు. ఉత్తమముగ నిర్ణయము గావించిన ఔషధముయొక్క యిట్టిచిన్న మోతాదు, సంపూర్ణముగ రోగికి తిర్గి ఆరోగ్యము చేకూర్పగలదు.

విస్పష్టముగ క్రొత్త లక్షణములు జనించుటమూలమున దుస్థితిలో బడుచున్నట్లు యగుపడినప్పుడు, అప్పుడుగల వ్యాధిపరిస్థితికి, (167) సాధ్యమగునంతవరకు, మిక్కిలి అనుకూలమైన, సారూప్యౌషధమును నిర్ణయముగావించి, ప్రయోగించి, తాను గావించిన తప్పిదమును సవరించుకొనుట అతని విద్యుక్త ధర్మము.

## 251

కొన్ని మందులు (ఇగ్నీషియా, బ్రియోనియా, రూస్ మరియు ఒక్కొక్కప్పుడు బెల్లడోనా మొదలగునవి) ప్రధానముగ ఒకటివిడచి ఒకటి సంభవించుగుణములతో (alternating actions) ఒకదానికొకటి వ్యతిరేకమైన ఒకవిధమగు ప్రాథమిక గుణలక్షణములతో (primary action symptoms)మనుష్యుని ఆరోగ్యమును మార్పుజేయుశక్తి గలిగియుండెను. సరియైన సారూప్యపద్ధతులననుసరించి యీయౌషధములలో నొకదానిని ప్రయోగించినప్పుడు, సుగుణము సంభవించనిపక్షమున, వైద్యుడీయౌషధమునే ♦1 మరియొక క్రొత్త మోతాదును, సమానమైన చిన్నమోతాదులోనే, ప్రయోగించిన తక్షణమే చాలవరకు వ్యాధులయందు తనయుద్దేశ్యమీడేరును. అనగా వ్యాధి నివారణయగును.

---

♦1 మెటీరియా మెడికా పూరా మొదటివాల్యూములో ఇగ్నేషియాను గూర్చి వ్రాయబడిన ఉపోద్ఘాతములో ప్రత్యేకించి వివరించిన విధముగా

## 252

దీర్ఘ వ్యాధులలో (సోరాసంబంధమైన) మిక్కిలి అనుకూలముగ నిర్ణయింపబడిన సారూప్యౌషధము(శోరా శాంతిక రౌషధము) అనుకూలమగు (సూక్ష్మమైన) మోతాదులలో ప్రయోగింపబడినప్పుడు, సుగుణము కలుగనిపక్షమున, వ్యాధిని నిలపియుంచు కారణమింకను, పట్టి విడువకుండెననియు, మరియు, రోగియొక్క జీవితపద్ధతియందు, లేక తానుంచబడిన స్థలమునందు, ఇందుకు సంబంధించిన ప్రమేయముండి, శాశ్వత నివారణ కలుగుటకు అవరోధము కలుగుచుండుటచే, అట్టి పరిస్థితినుండి తొలగించవలయుననియు, దెలిసికొనుటకు నిది రూఢియైన చిహ్నము.

## 253

సమస్త వ్యాధులలోను, అందుముఖ్యముగ తరుణ వ్యాధులలో, ప్రతివ్యక్తికి గోచరముగాని, ఉద్రేకము లేక ఉపశమనము, కొలదిగ ప్రారంభమైనటుల మనకు తెలుపు చిహ్నములలో రోగియొక్క మానసికస్థితి పూర్ణమైన ఆతని ప్రవర్తన ఇవిమిక్కిలి నిశ్చయమైనట్టియు, సుబోధకమైనట్టియు చిహ్నములు. అట్టి కొలదిపాటి సుగుణమునందు (Improvement) విశేషతరమైన సుఖము, వృద్ధిజెందినశాంతి, మానసిక స్వేచ్ఛ, ఉన్నతోత్సాహశక్తులను (ఒకవిధముగ సహజమైనస్థితికి

జేరుచున్నట్లు) మనము గాంచగలము. కొలదిపాటి ఉద్రేక ప్రారంభమునందు (aggravation) పైనజెప్పినస్థితికి మిక్కిలి వ్యతిరేకమైన స్థితియుండగలదు. అనగా మానసిక స్వభావపరిస్థితి బలవంతమైన నిస్సహాయ దుస్థితిలోనుండగలదు. ప్రవర్తన చేష్టలు, తీరు, వీనిని జాగరూకతతో పరిశీలనజేసిన సులభముగ గాంచవచ్చును. గాని మాటలలో వర్ణింప శక్యముగాదు. ‡1

---

‡1 అనుకూలమైనమందును తగినంత చిన్నమోతాదులో (సాధ్యమైనంత చిన్నమోతాదులో) ప్రయోగించిన వెంటనే మనస్సునందు (Disposition) సుగుణచిహ్నములు గాంచవచ్చును. అనవసరమైన పెద్దమోతాదులో ప్రయోగింపబడిన ఔషధము, మిక్కిలి సారూప్యమైన ఔషధమైనప్పటికి, అతితీవ్రముగ పనిజేసి, ప్రథమమున, మనస్సునందు, స్వభావమునందు, మిక్కిలి విశేషముగ దీర్ఘకాలముండు, వ్యాకులము గలుగజేసి, అందుపై వెంటనే, యీఉద్రేకలక్షణములయందు గోచరమగు సుగుణమునగుపరచును. ఇది తెలిసికొనవలసిన చాలముఖ్యమైన సూత్రము. హోమోపతీపద్ధతినిగూర్చి మిక్కిలి అహంభావముగల ఆరంభకూరుల చేతను, ప్రాచీనవిధానమును కృషి చేయుచు వీవైద్యవిధానములోనికిమారిన వైద్యుల చేతను యీముఖ్యసూత్రము ప్రధానముగ నిర్లక్ష్యము చేయబడుచుండెను. ప్రాచీనదురభిప్రాయముల చే నీవ్యక్తులు, ఔషధములయొక్క తక్కువపొటెన్సీల చిన్నమోతాదులను గ్రహించుటచే అతి సూక్ష్మమోతాదుల చే చికిత్సగావించుటవలనకలుగు గొప్ప లాభము. వరప్రసాదము, లభింపక విఫలులైరి. ఈపద్ధతి మిక్కిలి అనుకూలమగు పద్ధతియని అనేక వేలపర్యాయములు అనుభవము, గోచరింపజేసియుండెను. సారూప్యపద్ధతి, ఎంతగుణము జేయసమర్థమైయున్నదో అంతగుణమును నీసూక్ష్మమోతాదులపద్ధతి అవలంబింపని వైద్యులు కలుగజేయజాలరు. గాన యీవ్యక్తులు సారూప్యవిధాన అవలంబకులమని తలంచుటకధికారములేదు.

254

ఇతరక్రొత్త లక్షణములు లేక వృద్ధిజెందిన లక్షణములు, లేక క్రొత్త లక్షణములేమియు కలుగక ఆదిలక్షణములు తగ్గిపోవుట, ఇవియన్నియు చికిత్సచేయు వ్యాధియొక్క ఉద్రేకమును ఉపశమనమును గూర్చి కడుజాగరూకతతో పరిశీలనజేసి శోధించు వైద్యుని మనస్సునుండి సమస్త సందేహములను పారద్రోలును. రోగులయందు ఈఉద్రేకోపశమనముల యొక్క వివరములను తెలుపుట కసమర్థములును లేక తెలుపుట కంగీకరింప నిచ్ఛగించని వారును యున్నప్పటికి, పైన తెల్పబడిన వివరములు సమస్త సందేహములను పారద్రోలును.

255

గాని యావిషయమై మనము వ్రాసికొనిన లక్షణవివరములను ఒక్కొక్కటే చదివి వినిపించి వీనికి క్రొత్త అసాధారణ లక్షణములు సంభవించెనని రోగి తెల్పినప్పుడు ఆవిషయమును గమనించివిని పూర్వపు లక్షణములు వృద్ధిజెందని పక్షమున ఆవిషయమును గుర్తించి యావిషయములను వివరించి గూడ ఉద్రేకోపశమనముల దెల్పుట కసమర్థులను, లేక తెల్పుట కంగీకరింపని వారిని ఒప్పించవచ్చును. ఇట్టి సందర్భములో మనస్సునందును, స్వభావమునందును సుగుణాభివృద్ధికనున్నే యగుపించియుండిన పక్షమున ఔషధము వ్యాధిని

హాస్త్రవముగ తగ్గించు గుణమును కలుగజేసియుండును. లేక తగినంత కాలవ్యవధిలేకయున్న పక్షమున త్వరలోనే గుణము కలుగజేయును. ఇట్టి పరిస్థితులయందు సుగుణము (Improvement) పైకియగుపించుటకు చాలకాలము దీసికొనుచున్న పక్షమున నిది రోగియొక్క ప్రవర్తనయందలి కొంతదోషముమీాద గాని, లేక యితర అవరోధ పరిస్థితులమీాదగాని ఆధారపడి యుండును.

## 256

ఇందుకు బదులుగా రోగి కొన్ని కొత్త ఆకస్మిక సంభవములను (fresh accidents) ముఖ్యమైన లక్షణములను (Important symptoms) తెలిపియున్న పక్షమున (నిర్ణయించిన ఔషధము సరియైన సారూప్యౌషధము గాదని సూచనజేయును) గుణముగ నున్నదని రోగియెంత నిశ్చయముగ విశ్వసించునట్లు తెల్పినప్పటికి (శ్వాసకోశము నందు కరుపుగల క్షయ రోగులలో తరుచుగనీవిషయముగాంచబడును ఈవిషయమును విశ్వ) సింపక నారోగియొక్కవ్యాధిపరిస్థితి ఉద్రేకించినట్లుగ పరిగణింపవలెను. ఈవిషయము వెంటనే ప్రత్యక్షముగ యగుపడగలదు.

## 257

యదార్థమైన వైద్యుడు ఔషధములయందు అభిమానౌషధములను (favourite remedies) పెట్టుకొన కుండుటకు

మిక్కిలి శ్రద్ధ వహింపవలెను. అట్లు కొన్ని మందులను అభిమానముగ పెట్టుకొనుట మూలమున ఒక్కొక్కప్పుడు దైవికముగ (by chance) మిక్కిలి ఉపయోగకరములై తరుచు ఉపయోగించినప్పటికి మిక్కిలి సారూప్యముగ అనుకూలించు ఉపయోగకరమగు అరుదుగా ఉపయోగపడు కొన్ని మందులు తరుచుగా విడిచిపెట్టబడును.

## 258

మరియు ఒక్కొక్క సందర్భములో ఒక్కొక్క ఔషధము నుపయోగించినప్పుడు అప్పుడప్పుడు దుర్గుణములు కలుగజేసి యుండెనను దురభిప్రాయములలో విశ్వాసము లేకను (తప్పుగా ఔషధము నిర్ణయించుట మూలమున తన లోపము వనే యిట్లు జరుగును) యితర తప్పు అభిప్రాయములతోను తాము చికిత్స చేయబోవు వ్యాధికి సారూప్యముగాదని ఆఔషధములను ఉపయోగించుట విడచి పెట్టరాదు. సహజ లక్షణ సముదాయమునకు మిక్కిలి సరిగ సారూప్యమైన ఔషధమే ప్రతివ్యాధికి ముఖ్యముగ తగియున్నదని వైద్యుడు జ్ఞప్తియందుంచుకొనవలెను గాని యీసరియైన ఔషధమును నిర్ణయము గావించుటయందు తప్పు దురభిప్రాయములకు జోక్యమొసంగరాదు.

## 259

సారూప్యౌషధ చికిత్సయందు క్రమమైనట్టియు అవసర మైనట్టియు మోతాదుయొక్క అణుస్వరూపమును యోచించి చికిత్సయందు పథ్యము, ఆహార నియమము గమనించుటలో యోచిన్న మోతాదు యొక్క గుణము యితర ఉద్రేకకర ఔషధములచే †1(foreign medicinal irritants)నిర్మూలము చేయబడకుండగను లేక కలత జేయబడకుండగను ఔషధ గుణ ముగల సమస్తమును వర్జింపవలయునని మనము సులభముగ గ్రహింప గలము.

## 260

దీర్ఘవ్యాధులతో బాధపడు రోగుల విషయములో ముఖ్యముగా నివారణకర్తృతగులు నిట్టి అవరోధములను గూర్చి అతి జాగరూకతతో పరిశీలనజేయుట మిక్కిలి అవుసరము. ఏలనన యిట్టిహానికర ప్రాబల్యములమూలమునను, పత్యము, ఆహారనియమములయందలి వ్యాధిని కలుగజేయు నితరదోష ముల మూలమునను యీవ్యాధులు సర్వసాధారణముగా

†1 ప్రశాంతమగు అర్ధరాత్రిసమయమున దూరమునుండి వినిపించు మృదుమధుర వేణుగానము, మెత్తనిహృదయమును, ఉన్నతభావములకు ప్రేరింపజేసి, తన్మయత్వమున కరగించును. ఈమృదుమధుర గానము, పగటి పూటయందలి, ధ్వనులమధ్యను పరస్పరము విరుద్ధమైన కేకలమధ్యను వినబడక శక్తివిహీన మైయుండును.

ఉద్రేకము జెందుచున్నవి. ఈవిషయము తరుచుగా తెలియకుండగనే జరిగిపోవుచుండును. *1

---

*1 కాఫీ, చైనాదేశపు తదితరదేశపు టీలు, రోగి పరిస్థితికిఅనుకూలమగు ఔషధోద్భిజ్జ పదార్థములనుండి (medicinal vegetable substances) తయారుజేసిన బీరుఅను సారాయి, ఔషధసంబంధమైన సుగంధద్రవ్యములతో (medicinal spices)తయారుచేసిన శ్రేష్టమైనద్రవములు సమస్తపానకములు (punch) సుగంధద్రవ్యములతోజేసిన, తినుబండ పదార్థములు, (spiced chocolates) సువాసననీరు, సమస్తమైన సువాసన ద్రవ్యములు (గదిలో మిక్కిలి సువాసనగల పుష్పములుంచుట) పండ్లపొడుములు, మూలికలతోకలిపి తయారుజేయుసువాసనవస్తువులు, సెంట్లు; సుగంధద్రవ్యములతో జేయబడినపులుసులు మొదలగు ఆహారపదార్థములు సుగంధద్రవ్యములతో జేయబడిన రొట్టెలు, మంచుగడ్డపానీయములు, పులుసు తయారుజేయుటకుపయోగించు ఔషధసంబంధమైన గుణముగల కూరగాయలు, ఔషధగుణములుగల మొక్కలయొక్క కొమ్మలతోను ఆకులతోను, వేళ్లతోను తయారుజేయబడిన ఆహారపదార్థములు, తోటకూర, ఉల్లి, చెడిపోవుస్థితిలోనున్న మాంసము, నిలువవెన్న, ఔషధగుణముగల సమస్తమాంసములు, (పందిమాంసము, పందికొవ్వు, పొట్టిబాతుమాంసము, లేగదూడమాంసము, పులిసిన పదార్థములు) ఈపదార్థములనన్నింటిని రోగి దరిజేరనీయక దూరముగానుంచవలెను. అమిత భోజనము వర్జింపవలెను. మితముతప్పి ఉప్పు, పంచదార ఉపయోగించుట మానవలెను. సారాయములను నీటితోగలుపక త్రాగుట, ఉష్ణమైనగదిలో నివశించుట, ఉలుదుస్తులను ధరించుట, వెలుతురు గాలి తగులని గదులలో, ఎల్లప్పుడు కూర్చుని పనిజేయుట, విలాసముకొరకు గాంచు వ్యాయామములలో తరుచుగా నిమగ్నుడగుట (స్వారిచేయుట, బండ్లుతోలుట, లేక యాడుట మొదలగునవి) దీర్ఘకాలము స్తన్యపానమొసగుట, పగలు భోజనమైనపిమ్మట పరుపుకుజేర్లబడి చాలసేపు నిద్రించుట, రాత్రి చాలభాగము మేలుకొనుట

దీర్ఘవ్యాధులల్లో, ఔషధమును ప్రయోగించుచున్నప్పుడు, స్వస్థతచేకూరుటకు అవరోధముకలిగించు అడ్డంకులను తొలగించుట, అవసరమైన సందర్భములలో, అట్టి అడ్డంకులకు ప్రతిపక్షములభింపజేయుట, (Supply reverse) మిక్కిలి అనుకూలమైన నియమమై (regimen) యున్నది. సాత్వికమైన, నైతికమానసిక విరామము, అన్నితరగతుల వాతావరణములయందు, మంచివ్యాయామము, (అనుదినమునటచుట, కొలదిపాటి పనిజేయుట,) అనుకూలమైన, బలముకలుగజేయు, ఔషధసంబంధములేని ఆహారములు పానీయములు మొదలగునవి పథ్యమునందు గమనించవలెను.

---

అశుభ్రముగనుండుట, అస్వాభావిక వ్యభిచారమునకు లోనగుట (unnatural deburchery) అవినీతికరమైన పుస్తకములను జదువుటమూలమున దుర్బలత్వము జెందుట, పరుండి చదువుట, కృత్రిమమైథునము, గర్భధారణ గలుగకుండుటకు గావించు అక్రమమైథునము, లేక సంయోగములేకుండ నిరోధముజేయుట, కోపము, దుఃఖము, విసుపుదల, కలిగించు విషయములకులోనగుట, క్రీడావ్యామోహము, భోజనమైనపిమ్మట శరీరమానసిక అధిక వ్యాయామము, ఊసరక్షేత్రములయందు తేమగదులయందు నివశించుట లోభిత్వ లేక దరిద్రజీవనము, మొదలగు సమస్తమును, నివారణకవరోధము కలుగకుండుటకు, నివారణకసాధ్యముకాకుండుటకుసాధ్యమగునంతవరకువర్జింప పవలెను. లేక తొలగింపవలెను. నాశిష్యులుకొందరు, అనవసరముగా, నింకను అనేకములైన, సాధారణమగు సమత్వపదార్థములనుగూడ విడిచిపెట్టించి రోగులకుబాధకలుగజేయుచుండిరి. ఇది అంతమెచ్చదగిన విషయము గాదు,

## 262

మానసికవ్యాధులుగాని తరుణవ్యాధులయందు, ఉత్తే జముగాంచిన ప్రాణసంరక్షక మనశ్శక్తియొక్క సూక్ష్మమైన, అమోఘ అంతరంగ వివేకజ్ఞానము, వ్యత్యాసము లేకుండ తాను దీసికొనదగిన ఆహారమును నిర్ణయము గావించును. గాన, రోగివెంటనే ఆహారముగ దీసికొనగోరిన వస్తువులను నిరాకరించుట మూలమున ప్రకృతియొక్క పైనజెప్పిన అంత రంగ అభిమతమున కవరోధము కల్గింపక, రోగికోరు అట్టిపదా ర్థములను యిప్పించుటకును లేక యేమైన, హానికర పదార్థ ములు కావలయునని కోరిన వానిని దీసికొనకుండుటకు బోధించి సమ్మతింపజేయుటకును, వైద్యుడు రోగియొక్క బంధువులను, స్నేహితులను సలహా జేయవలసి యుండును.

## 263

తరుణవ్యాధికి పాల్పడిన రోగికి ఆహారపానీయముల యందుగల వాంఛలు, ముఖ్యముగ, ఎట్టిసందేహము లేకుండ ఉపశాంతి (palliative relief) కలుగజేయు వస్తువులపై యుండగలవు. ఈవస్తువులు ఔషధసంబంధమైనవిగాక, కేవ లము ఒకవిధమైన కోరికను తృప్తిపరచు వస్తువులుమాత్రమే యైయుండును. మితమైన హద్దులో, యీకోరికను తృప్తి పరుపక, యేకొలదిపాటి అభ్యంతరము గల్గజేసినను, దీని

మూలమున వ్యాధి సమూలము నిర్మూలమగుటకు వ్యతిరేకము కలుగగలదు. ♦1 గాని యీవ్యతిరేకము అనుకూలమైన సారూప్యౌషధశక్తిచే పూర్తిగ పరిహరింపబడి, జయింపబడగలదు. మరియు, పట్టుదలగ వాంఛించియున్న వస్తువును, దీసికొనుటవలన విశ్రాంతి కలుగగలదు. ఈ రెండింటి మూలమునను యీవ్యతిరేకము తొలగింపబడి, జీవశక్తి విడుదల జేయబడును. ఈవిధముగ తరుణవ్యాధులలో రోగియొక్క కోరికకు పూర్తిగ యనుకూలముగ, గదియొక్క ఉష్ణోగ్రత, పరుండు పక్కయొక్క ఉష్ణము, చల్లదనమును ఏర్పాటుజేయవలయును. ఎట్టివిధమగు మానసికపరిశ్రమలకును ఉద్రేకకర మనోవికారములకును అవకాశమొసగక రోగిని స్వేచ్ఛగ నుంచవలెను.

## 264

యదార్థమైన వైద్యుడు ఔషధము యొక్క వ్యాధి నివారణాశక్తులపై ఆధారపడగలిగి యుండుటకు మంచి శక్తిగల పరిశుద్ధమైన మందులను గలిగియుండవలెను. వానియొక్క పరి

♦1 ఇట్టిసంస్థితి అరుదుగానుండును. ఇందులకుదాహరణముగ, కేవలము ఉద్రేకవ్యాధులయందు (inflamatory diseases) ఉద్భిజ్జామ్లములచే (Vegetable acids) గుణము నిర్మూలముచేయబడగల ఎక్కోనైటు ముఖ్యావసరమైయున్న సందర్భమునందు, రోగియొక్క వాంఛ, చాలవరకు ఎల్లప్పుడు, శుభ్రమైన చన్నీళ్ళకొరకు మాత్రమే. యీయందును గాని ఉద్భిజ్జామ్లములయందుండదు,

శుద్ధత్వమును గూర్చి పరీక్ష జేయుటకు వైద్యుడు సమర్థుడై యుండవలెను.

## 265

రోగి యెల్లప్పుడు యదార్థమైన ఔషధమును దీసికొనుటకు, వైద్యుడు ఆఔషధముయొక్క పరిశుద్ధత్వమును మనస్సాక్షిగ పూర్తిగ విశ్వసించి ప్రయోగింపవలయును. గాన వ్యాధి లక్షణములను బట్టి సరిగ నిర్ణయము గావించిన ఔషధమును తానే తయారు జేసి రోగికీయవలయును.

## 266

ఉద్భిజ్జజంతుగణములకు (Vegetable and animal kingdom) జెందిన వస్తువులు ముడి స్థితిలోనే (Raw state) ఔషధగుణములు గలిగియుండును ‡1

‡1 సమస్తమైన ఉద్భిజ్జ జంతుగణముడిపదార్థములు హెచ్చుగగాని తక్కువగగాని, ఔషధశక్తులు గలిగియుండి, తమవిచిత్రమైన మార్గమున, మనుష్యునియొక్క ఆరోగ్యమును, మార్పుజేయసమర్థులైయున్నవి. నాగరికులు అహారముగనుపయోగించు కాయగూరలయందు, జంతుమాంసములయందు, యితరులుపయోగించు వస్తువులకంటె బలము కలుగజేయు పదార్థము విశేషముగ గలదు, గాని యీయభిప్రాయమును వారు అంగీకరించుటలేదు. ఈవస్తువులు, అపక్వపదార్థస్థితియందు విశేషముగ ఔషధశక్తులు గలిగియుండవచ్చును, మరియు గృహోపయోగము నిమిత్తము, పచనము జేయుటలో, హానికరమైన రసమును పిండితీసివేయుట, (దక్షిణ

అప్పుడే తీసిన మొక్కలనుండి వెంటనే తీసిన రసమును తత్క్షణము సమానమైన పరిమాణములో వెలుగుటకు శక్తిగల సారాయిలో కలిపి యీవిధముగా లభించినన్ని దేశీయమైన మొక్కలయొక్క శక్తిని మనము లభ్యము జేసికొనవచ్చును. ఇట్టి మిశ్రమ ద్రవ్యమును గట్టిబిరడా గల సీసాలో ఒకపగలు ఒకరాత్రి యుంచి అందలి ఘనీభవ పదార్థములు క్రిందకు దిగిన పిమ్మట పరిశుభ్రముగ పైకి తేరిన ద్రావకమును ఔషధముగ నుపయోగించు నిమిత్తము మరియొక సీసాలోనికి జేర్చ

---

అమెరికా, కాస్సవారూట్ (cassavaroot) మొదలగునవి) పులియ బెట్టుటమూలమునను (రొట్టె, ద్రాక్షసారాయముతోను, దోసకాయ ఊరగాయతోను, తయారుజేసెడు, పుల్లటి పులుసు మొదలగునవి) వేడి జేయుట మూలమునను, (ఉడకబెట్టుట, కాల్చుట, వేచుట, ఆవిరిపై గాల్చుట మొదలగునవి) అందలి ఔషధగుణములు నిర్మూలము జేయబడి తొలగింపబడునని తలంచుచుండిరి. ఉద్భిజ్జజంతుపదార్థములు, ఉప్పుకలుపుటచేతను, (ఊరగాయలు) ద్రాక్షసారాయి జేర్చుటచేతను, (పులుసులు, పచ్చళ్ళు) నిశ్చయముగ చాలవరకు వానిఔషధగుణములను గోల్పోవును గాని వీనిసమ్మేళనమున యితరఅనర్థములు సంభవింపగలవు.

ఈ పద్ధతిమూలమున, విశేషమైన ఔషధశక్తులుగల కూరలుగూడ, సంపూర్ణముగగాని కొంతవరకుగాని, ఔషధగుణమును గోల్పోవును. సమస్తమైన మూలములు, (iris) మనగవేరు, కందజాతికిజెందిన, వివిధదుంపలు, సమస్తఆమ్లపదార్థములు, నివియన్నియు, బాగుగ ఎండబెట్టుట మూలమున, అందలి ఔషధగుణము నశించును. మిక్కిలి తీవ్రమైన కొన్ని మొక్కల రసమునుకాచి తయారుచేయునప్పుడు, నల్లటిముద్దవలె తయారగును. మిక్కిలి

వలెను. *1 ఉద్భిజ్జ రసము (Vegetable juice) ఏ విధముగను పులిసి పోకుండ కాపాడుటకు తత్క్షణము సారాయి కలిపి

---

ప్రమాదకరమైన మొక్కలయొక్క రసముగాక దీర్ఘకాలము నిలవయుంచిన, శక్తివిహీనమగును. ఈ రసము మితమైన వాతావరణ ఉష్ణోగ్రతకు, పులిసి, (అందుపై దానియొక్క ఔషధశక్తి చాలవరకు తగ్గిపోవును) ఆటుపిమ్మట మురిగి, అందుమూలమున వానియొక్క విశేష ఔషధగుణములు పూర్తిగ నశించును. అందు అడుగుకు చేరినమడ్డిని పూర్తిగ కడిగివేసినపక్షమున, నది సాధారణపిండిపదార్థమువలె, మిక్కిలి నిరపాయముగనుపయోగించును కొన్ని పచ్చనిమొక్కలను ఒకదానిపై నొకటివేసియుంచిన అన్యోన్యద్రవీభూతకారణమున (Transudation) వానియొక్క ఔషధ ధర్మగుణములు నశించును.

*1 ఈవిధమగు అత్యుత్తమమైన ఔషధమును తయారు జేయు పద్ధతి జర్మనీ దేశమునుండి వ్యాప్తిజేయబడి రష్యా యందు వ్యాప్తియయినందులకు మనమెంతయు యభినందించవలసియున్నదని బ్యూక్ హాల్ అను నాతడు నిశ్చయముగ తెల్పియుండెను. గాని యీవిషయమును నేను ఆర్గనాన్ మొదటి ప్రచురణమునందు తెల్పియుంటిని. ఈవిషయము రష్యాయందు వ్యాప్తమగుటకు రెండుసంవత్సరములకు పూర్వమే (ఆర్గనాన్ 1810 సంవత్సరములో వెలువడినది) ప్రపంచమునకు వెల్లడించియుంటిని, గాని అతడీ విషయమును గూర్చి నాస్వంత వాక్యములలోనే ఉ దా హ ర ణ మొసగి యున్నప్పటికి అందును గూర్చి నేను గావించిన సూచనలను అందులగూర్చి నేను కనుగొనిన విషయములను మరుగుపరచెను. ఇట్టి చర్య చాలమంది జర్మనీ దేశస్థుల ఉత్తమ సాంప్రదాయమునకు కళంకము తెచ్చుచున్నది. ఈ వి ష య ము ను కనుగొనిన గౌరవము జర్మనీ దేశమునకు చెందియుండ కొందరు జనసామాన్యము యీవిషయము కనుగొనబడిన ఉత్పత్తి స్థానము జర్మనీ దేశమునకు బదులుగా ఏషియా యెడారులని, నిర్ణయము జేయుచుండిరి.

(Spirit of wine) ముందుగూడ జెడుట కవకాశము లేనట్లు గావింపవలెను. ఇట్లు గావించుట మూలమున ఔషధ గుణ మెన్నటికిని చెడి పోకుండ నుండగలదు. మరియు నిట్లు తయారు చేయబడిన ఔషధమును మంచిబిరడా గల సీసాలలో భద్రి పరచి ఆవిరియై హరింపకుండ కాపాడుటకు మైనమును చుట్టును అతికి సూర్యరశ్మి తగులకుండ భద్రపరుపవలెను. †2

ఇంతకు పూర్వము ఉద్భిజ్జరసములను కొంతకాలము నిలువ చేసి అందునుండి సారము దీయుటకు ఆల్కహాలు అప్పుడప్పు డుపయోగింపబడు చుండెను. గాని రసమును నిలువ యుంచుటకే సారాయి ఉపయోగింపబడు చుండెనుగాని ఆస్థితియందు రోగులకు ప్రయోగించుటకు కాదు.

† 2 క్రొత్తగా తీయబడిన రసమునుండి ఘనీభవశ్వేత పదార్థము (fibrinous and albuminous matter) క్రిందకు దిగునట్లు జేయుటకు రసముతో సరిసమానపరిమాణముగల ఆల్కహాలు సర్వసాధారణముగ మిక్కిలి అనుకూలమైన సరిపాలు అయినప్పటికి మిక్కిలి దట్టమైన జిగురు పదార్థము (సింఫిటమ్ పైయోలాటిరికల్ మొదలగునవి) లేక శ్వేతాధిక్యత (ఎథూసా, సెనాపియమ్, సోలనమ్ మొదలగునవి) గల మూలికల యొక్క రసములో ఘనీభవశ్వేత పదార్థము క్రిందకు దిగునట్లు చేయుటకు రెట్టింపు పాలులో ఆల్కహాల్ కలుపుట సర్వసాధారణముగా అవుసరము. ఒలెండరీ,బూక్సస్,టాక్సస్,సెడమ్ సెబీనా మొదలగుతక్కువ రసమువచ్చు మూలికలనుండి రసము దీయునప్పుడు ప్రథమమున వానిని మొదట మెత్తటి ముద్దగా ప్రత్యేకముగా నూరి రసము ఆల్కహాలుతో కలియుటకొరకు గాను పిమ్మట రెట్టింపు ఆల్కహాలును కలిపి అందుండి రసమును గట్టిగా నొక్కి తీయవలయును. ఇది బాగుగ సెండిన పిమ్మట పాలపంచదార (Sugar of milk) తో కలిపి పలుసార్లు నూరి పొటెన్సీల లోనికిని, అటు పిమ్మట ద్రావకములో హెచ్చుపొటెన్సీలలోనికి దీసికొని రావచ్చును.

అప్పటికప్పుడు రసముదీయుటకు పచ్చిగానున్న స్థితిలో లభింపక, పరదేశములనుండివచ్చు, మొక్కలు వేరళ్ళు, గింజలు, వ్రేళ్లు, మొదలగువానిని ఔషధముగ నుపయోగించుటకు, నమ్మకముపైని చూర్ణముచేయబడిన రూపములో అచ్చటనుండివచ్చిన విధముగానే దీసికొనక, వివేకజ్ఞానముగల వైద్యుడు, వానిని ఔషధముగ ప్రయోగించుటకుముందు, పూర్తియైన ముడిస్థితియందు, (crude state) వానియొక్క పరిశుద్ధతత్వమునుగూర్చి తాను ప్రథమమున విశ్వశించియుండవలెను. ♦1 (అనగా ముడిరూపములోనే తెప్పించుకొని వానిపరిశుద్ధత్వమును తెలిసికొని అటుపిమ్మటనే మందుగ తయారుచేసికొనవలెను.)

---

♦1 చూర్ణమురూపములో వానిని భద్రపరుచుటకు, ముందు జాగరూకత అవుసరము. ఔషధములను విక్రియించు వర్తకులుగూడ నిదివరకు ఈవిషయమును సర్వసాధారణముగ నిర్లక్ష్యము జేయుచుండిరి. ఉద్భిజ్జజంతుసంబంధ వస్తువులు బాగుగ ఎండినపిమ్మట తయారుచేయబడిన చూర్ణములుగూడ, మంచిబిరడాలుగల సీసాలలో భద్రపరచినప్పటికి చెడిపోకుండ జాగ్రత్తపరచుట కష్టమగుచుండెను. ఉద్భిజ్జముడిపదార్థమంతయు, ఎంతపొడిగా నున్నప్పటికి, యీవస్తువులు ఒక్కొక్కపొరచొప్పున కలసి ఏర్పడియుండుటచే అందుకొంత తడియుండక తప్పదు. ఈతడి ఎండిన మూలికను చెడకుండ భద్రపరచుట కెట్టి అభ్యంతరము కలుగజేయదు. గాని చూర్ణముచేయబడినస్థితికి ఇది అమితమై యుండును. ఉద్భిజ్జ జంతుసంభంధపదార్థములు, పూర్తిగ నెండియున్నప్పటికి, మెత్తగ

సారూప్యౌషధ పద్ధతి యొక్క ప్రత్యేక ఉపయోగము కొరకు యింతవరకు నెవ్వరును వినియుండని మేరకు పూర్వమెవ్వరును ప్రయత్నించియుండని యీ విధానమునందు మాత్రమే గల విచిత్రమైన పద్ధతి మూలమున ముడి పదార్థముల యొక్క అంతరంగ ఔషధ శక్తులు వృద్ధి జేయబడుచున్నవి. ప్రకృతి రూపములోనున్న స్థితియందు మానవ శరీరమున యే కొలది పాటి ఔషధ శక్తిని గూడ కలుగ జేయజాలని యీ వస్తువులన్నియు యీపద్ధతి మూలమున అపరిమిత

---

చూర్ణము చేయబడినప్పుడు, కొంతవరకు చమ్మదనము గలిగి యుండును. చమ్మదనమును తొలగింపక, సీసాలలో నెంతజాగరూకతతో భద్రపరచినప్పటికి, సత్వరముగ బూజెక్కి, చెడిపోకుండ నుండజాలవు. ఈ చూర్ణమును యెత్తగు అంచులుగల ఒకపళ్ళెములోబోసి, మరుగుచున్న నీటిపైన పళ్ళెమునుంచి, ప్రతిరేణువు ఒకదానినొకటి అంటకుండ పొడిదై ధూళివలె తయారగువరకు కలుపుచుండవలెను. ఇట్లు జేయుటమూలమున అందలి తడిహరించును. ఈస్థితియందు ఈచూర్ణమును, మంచిబిరడాలుగల సీసాలలో భద్రపరచి, సీలుజేసియుంచిన ఎంతకాలమువరకైనను, బూజుగాని, క్రిమిగాని పట్టి చెడిపోకుండనుండును. ఈసీసాలకు వెలుతురు తగలకుండ మూతగల పెట్టెలలో నుంచిన మిక్కిలి భద్రముగనుండగలవు. గాలితగులని పాత్రలలో అధికమైన వెలుతురు తగులకుండనుంచనిపక్షమున ఉద్భిజ్జ జంతుపదార్థములు కొంతకాలమునకు క్రమముగ శక్తివిహీనమగును. చూర్ణములు గూడ నిర్వీర్యమగును.

ముగ మిక్కిలి సమర్థమగు, స్వస్థత కలుగజేయు సాధనవ
శాగలవు. ♦1

ప్రకృతిసిద్ధమైన వస్తువులయొక్క గుణములలో నీ

---

♦1 ఈవిషయమును నేను కనిపెట్టుటకు పూర్వము పలువిధము
స్వభావసిద్ధమగు వస్తువులయందు రాపిడి మూలమున (Friction) అనే
లగు మార్పులను (ఇందుల కుదాహరణ:—వెచ్చదనము, వేడి, నిప్పు,ని
యుక్తమగు వస్తువులయందు వాసనగలుగ జేయుట, ఉక్కునకు అయస్కా
శక్తిని గలుగజేయుట మొదలగునవి రాపిడి మూలమునదీసికొని రావచ్చు
యనుభవమునుబట్టి మనకు తెలిసియున్నది. గాని పైన దెల్పబడిన రాపి
గలుగజేయబడు నీధర్మములన్నియు, భౌతిక,అచేతన పదార్థములకు మాత్ర
జెందియున్నవి. అదియునుగాక ముడి రూపములో నున్న ఔషధ దిను
యొక్క స్థూలపదార్థమును మార్పుజేయగల సమర్థమగు శక్తుల మూలమ
శరీర పరిస్థితులయందు దేహ ధర్మముల సంబంధమైన వ్యాధి సంబంధమై
(Physiological and pathogenic) మార్పులు ప్రకృతి శాసనవ
ననుసరించి (Laws of nature) సంభవింపగలవు. ఔషధదినుసు
ఒకానొక భాగములో అభేదమైన వస్తువును సంపుటీకరణము గావి
(Indifferent vehicle) నూరుట చేతను (Trituratio
ధూననముల చేతను (Succussion) ఈశక్తులు దీసికొని రాబడుచున్న
ఈశరీర సంబంధమైనట్టియు వ్యాధి సంబంధమైనట్టియు అత్యాశ్చర్యకరమ
నీప్రకృతి శాసనములు నాకాలమునకు పూర్వము కనుగొనబడి యుండలే
గాన సారూప్యసూత్రముల ననుసరించి తయారు చేయబడిన ఔషధము
యొక్క అతిసూక్ష్మమైన మోతాదులలోగల ఇంద్రజాలమువంటి నివారణ
శక్తులయందు నవీన ప్రకృతి శాస్త్ర విద్యార్థులకును వైద్యులకు
నమ్మకము లేకపోవుటలో ఆశ్చర్యమేమున్నది.

ముఖ్యమైన మార్పు, అంతర్గతమై నిదివరకు గాంచబడక నిద్రబోవుచున్నట్లుండి † 2 దాగి యున్న సూక్ష్మశక్తులను

† 2 ఈవిషయమే ఇనుపకమ్మియందు, ఉక్కుకమ్మియందు గాంచ బడును. ఇనుపముక్కయందు లేక ఉక్కుకమ్మియందు అంతర్గతమై కునుకుచున్న అయస్కాంతశక్తియొక్క చిహ్నము (Magnatic force) అంతరంగమున గుర్తింపవచ్చును. ఎట్లన:— కొలిమిలోబెట్టి సాపుచేయబడిన యినుపకమ్మిని లేక ఉక్కుకమ్మిని నిలువబెట్టి అయస్కాంత సూదిని (Magnatic needle) అడుగు భాగమున బెట్టిన ఉత్తరధృవమును త్రోసివేసి దక్షిణధృవమును నాకర్షించును. అనగా అడుగుభాగము ఉత్తర ధృవమని తెలియజేయును. ఇట్లే పైభాగముననుంచిన దక్షిణధృవమును త్రోసివేసి ఉత్తరధృవము నాకర్షించును. ఈకమ్మియందు అయస్కాంత శక్తి లేనిపక్షమున నిట్లు ఆకర్షింపజాలదు. గాని యిందుగల అయస్కాంత శక్తి అంతర్గతమైనశక్తి. ఈశక్తి అయస్కాంతము నాకర్షించును గాని చిన్న రేణువు రూపములోనున్న ఒక్క యినుపముక్కనైనను ఆకర్షింప జాలదు.

గాని, యీఉక్కుకమ్మిని మరియొక మొద్దుఆకురాయితో ఒకేవైపునకు (in one direction) రాపిడిజేసి (Rubbing) చలనవర్ధితశక్తికరము (Dynamisation) గావించినపిమ్మట మాత్రమే, నీకమ్మి నిజమైన మంచిశక్తిగల అయస్కాంతమై యినుపముక్కల నాకర్షించుటయే గాక దానితో అనుసంధానమై యున్నట్టి ఇనుప లేక ఉక్కుముక్కకును, మరియు కొలదిదూరములోనున్న ఇనుప లేక ఉక్కుముక్కను గూడ తన శక్తిని కలుగజేయును. ఎంతఎక్కువగా రాపిడిజేసిన అంతఎక్కువ అంశములో నీశక్తి కలుగగలదు. ఈవిధముగనే ఒకఔషధవస్తువును నూరుటమూలమున లేక దానియొక్క ద్రావకమును కదుపుట మూలమున (Shaking) అంతరంగమున అంతర్గతమైన ఔషధశక్తులు వృద్ధిజెందును. మరియు నిట్లు గావించిన కొలదియు మిక్కిలిగ అంచలి స్థూలవస్తువును నిరాకారత్వము (Spiritualize) గావించును.

(Dynamic Powers 11 పేరా) వృద్ధిజెందించగలదు. ఈసూక్ష్మ శక్తులు, జీవితపద్ధతిని లోబరచుకొని జంతుజీవనముయొక్క స్వస్తతను మార్పుజేయును. ♦3

ఈ ప్రకృతిసిద్ధమైన వస్తువులకు, సమగుణముగల వస్తువును (indifferent substance) గాని లేక ద్రవమునుగాని, జేర్చి, కదుపుట (shaking) లేక నూరుట మూలమున సూక్ష్మరేణువులు, యంత్రకరశక్తిని (mechanical action) భిన్నముచేయబడి, యీశక్తి కలుగజేయబడుచున్నది. ఈ

♦3 ప్రకృతిసిద్ధమైన వస్తువును యీఅభివృద్ధి చేయబడిన స్థితియందు సజీవేంద్రియజ్ఞాన తంతువుల (Living sensitive fibres) దగ్గరకు తీసుకొని వచ్చిన లేక వానిస్పర్శమునకు తీసికొనివచ్చిన (లోపలకు తీసికొనుట లేక వాసనజూచుట మూలమున) జంతువులయొక్కయు, మనుష్యులయొక్కయు, ఆరోగ్యమునందు మార్పుగలుగజేయగల శక్తిని నెక్కువ బలకరముగ ప్రదర్శించగలదను విషయమునకు మాత్రమే యీవిషయమిచ్చుట సంబంధించియున్నది. అయస్కాంతాయుతమైన కడ్డీ (megnatic bar) ముఖ్యముగ దానియొక్క అయస్కాంతశక్తి వృద్ధిజేయబడినప్పుడు ధృవము దగ్గరనున్న లేక తగులుచున్న ఉక్కుసూదియందు మాత్రమే అయస్కాంతశక్తిని జూపింపగలదు. (అట్లే ఔషధశక్తివృద్ధిజేయబడి (యిందు తెల్పబడిన పద్ధతిని) సజీవస్పర్శజ్ఞాన తంతువులదగ్గరకు దీసికొని రాబడినప్పుడు మాత్రమే తమశక్తిని జూపింపగలవు.) చలనవర్ధితశక్తికరము గావింపబడిన ఔషధములు (Dynamized medicines) నిర్జీవమైన వస్తువులపై నెట్టిగుణమును నెట్లు కలుగజేయజాలవో యట్లే అయస్కాంతాయుతమైన యినుము మిగిలిన రసాయన భౌతికధర్మములయందు మార్పుజెందక పోవుటయేగాక యితరలోహములయందు (ఇత్తడి) ఎట్టిమార్పులను తీసికొనిరాజాలదు.

పద్ధతి చలనవర్ధిత శక్తికరణముగావించుట ( Dynamizing Potentising )యనియు, అట్లు పలువిధములై తరహాలయందు ఉత్పత్తి కాబడినవి, చలనవర్ధితశక్తులని *4 (Dynamizations or potencies) యు పిలువబడుచున్నవి.

## 270

ఈశక్తి వికాసమును ఉత్తమముగ లభింపజేయుటకు, చలనవర్ధితశక్తికరముగావించు వస్తువుయొక్క స్వల్పభాగమును అనగా ఒక గింజయెత్తు భాగమును, మూడుగంటలకాలము

---

* 4 సారూప్యౌషధ పొటెన్సీలను వట్టి హీనద్రావణములని (Dilutions) పిలుచుట అనుదినము మనము వినుచుంటిమి. ప్రకృతిసిద్ధమైన వస్తువులయందు అంతరంగమునగల నిర్దిష్టౌషధ శక్తులను బైటకు రాపిడి చేయుట, కదుపుట మూలమున దీసికొని రాబడి ఆవస్తువులయొక్క యదార్థమైన ప్రాముఖ్యము వెల్లడి జేయబడి హీనద్రావకములకు సరియైన ప్రతిపక్షములైయున్నప్పటికి నీ ఔషధములిట్లు పిలువబడుచుండెను.

హీన ద్రావకమునకు అనౌషధ అనుపానunmedicinal medium సరియము అంతముఖ్యమైన విధిగాదు

ఒకగింజయెత్తు ఉప్పుతో తయారు చేయబడిన ద్రావణము విస్తారమైన నీటిలో కలుపబడినప్పుడు గింజెత్తు ఉప్పు ఆనీటిలో అదృశ్యమై అందు ఔషధ లవణ గుణము వృద్ధియగదు. గాని దీనిని చలన వర్ధితశక్తికరము (Dynamization) గావించిన మిక్కిలి అద్భుతమైన శక్తిలోనికి వృద్ధి జెందించును.

మూడుపర్యాయములు, ఈక్రిందవివరించిన పద్ధతిప్రకారము ‡1 నూరుగింజలయెత్తు పాల పంచదారతో, పదిలక్షలవభాగము వరకు, చూర్ణరూపములో నూరవలయును. ఈక్రిందచూప

---

1‡ మెత్తటి తడియిసుకతో పింగాణీకల్వముయొక్క అడుగుభాగమును గరుకులేకుండజేసి పిమ్మట నూరుగింజలయెత్తు పాలపంచదారలో మూడవవంతు భాగమును ఆకల్వములో వేయవలెను. దీనిమీద నూరవలసిన ఒకగింజఎత్తు అవుషధినుసును (పాదరసము, పెట్రోలియము, మొదలగునవి ఒకబొట్టు) వేయవలయును. చలనవర్ధితశక్తికరణము (Dynamization) గావించుటకుపయోగించు పాలపంచదార సన్నని తంతులపై స్ఫటికీకరణము (crystallization) గావింపబడి పెద్ద కడ్డీలుగా తయారుచేయబడి మనకువచ్చు పాలపంచదార ప్రత్యేకపరిశుద్ధమైన నాణ్యముగలదై యుండవలెను. ఒక్కక్షణము అవుషధముకలుపు పింగాణిబద్దతో వీనిని మిశ్రమముగావించి గరుకులేకుండ జేయబడిన పింగాణి పాత్రముతో బలముగా ఆరు మొదలు ఏడు నిమిషములు నూరవలయును. పిమ్మట కల్వముయొక్క పాత్రముయొక్క అడుగుభాగమున చుట్టునుగల యీమందును రాసిగా జేయుటకు మూడు మొదలు నాలుగు నిమిషములవరకు గోకవలయును. పిమ్మట అందుఅధికముగ నేమియు కలుపక వెనుకటి విధముగనే ఆరు మొదలు ఏడు నిమిషములవరకు నూరి పిమ్మట కల్వమునకు, పాత్రమునకు అంటుకొనిన దానిని మూడు మొదలు నాలుగు నిమిషములవరకు గోకవలెను ఇప్పుడు నూరుగింజలయెత్తు పాలపంచదారను మూడుభాగములు జేసిన దానిలోనుండి రెండవభాగము నిందు గలిపి బద్దతో మిశ్రమముగావించి ఆరు మొదలు ఏడు నిమిషములవరకు నూరి పిమ్మట మూడు నిమిషములు మొదలు నాలుగు నిమిషములవరకు గోకి అటుపిమ్మట నేమియుగలుపక ఆరు మొదలు ఏడు నిమిషములవరకు నూరవలయును. ఇప్పుడు మూడవ భాగమునిందు జేర్చి బద్దతో మిశ్రమము గావించి పూర్వమువలె మందును అతిజాగరూకతతో దగ్గరకు గోయుచు ఆరునిమిషములు మొదలు ఏడు నిమిషములవరకు నూర

బడిన కారణములనుబట్టి (బి) యీచూర్ణముయొక్క ఒకగింజ యెత్తు చూర్ణము, ఒగభాగము ఆల్కహోలు నాలుగుభాగము

---

పలెను. ఇట్లు తయారుజేసిన చూర్ణమును మంచి బిరడాగల సీసాలోనుంచి సూర్యరస్మి తగులకుండ భద్రపరచి సీసాపై అవుషధముయొక్క పేరుతో మొదటిగుణనఫలము (first product) $\overline{100}$ గుర్తువేసి యుంచవలెను. ఈగుణన ఫలమును (product) $\overline{10000}$ నకు వృద్ధిజేయుటకు చూర్ణముగా వింపబడిన $\overline{100}$ నుండి ఒకగింజయెత్తు భాగము చూర్ణముచేయబడిన (కడ్డీలుగానున్నది) 100 గింజల ఎత్తు పాలపంచదార నుండి మూడవవంతు భాగమును కలిపి ఆరు మొదలు ఏడు నిముషములవరకు నూరవలెను. పైవిధముగనే రెండవ భాగమును, మూడవ భాగమును కలుపుటకుముందు రెండు పర్యాయములు ఆరుమొదలు ఏడు నిమిషములవరకు నూరుట, మూడు మొదలు నాలుగు నిమిషములవరకు గోకుట అతి జాగరూకతతో సరిగ గావింపవలెను. మూడవ భాగము కలిపి నూరునప్పుడు అతిజాగరూకతతో ఆరు మొదలు ఏడు నిమిషములు రెండుసార్లు నూరవలెను. మూడవభాగము నూరిన పిమ్మట తిరిగి యీపద్ధతినే అవలంబింపవలెను. ఇదియంతయు పూర్తియైనపిమ్మట యీచూర్ణమును మంచి బిరడాగల సీసాలో భద్రపరచి $\overline{10000}$ గురుతుతో చీటిని అంటించవలెను.

ఇప్పుడు యీచూర్ణము నుండి ఒకగింజఎత్తు భాగమును దీసికొని పైవిధముగనే, 100 గింజలెత్తు పాలపంచదారను దీసికొని, పైన జెప్పబడిన పద్ధతి ప్రకారము నూరిన 1/1000000 అగును. అనగా (1) ప్రతిగింజెత్తు చూర్ణము 1/1000000 వంతు భాగములో అసలు మందును కలిగియుండును. ఈవిధముగ అట్టి చూర్ణము మూడు అంశములుగ తయారగుటకు ఆరు మొదలు ఏడు నిమిషములు, ఆరుపర్యాయములు నూరుటయు, మూడుమొదలు నాల్గు నిమిషములు ఆరుపర్యాయములు గోకుటయు మొత్తము ప్రతి అంశమునకు (Degree) ఒకగంట తీసికొనును. ఈవిధముగ మొదటి అంశము ఒక గంటనూరిన పిమ్మట నీచూర్ణములో ప్రతిగింజెత్తు చూర్ణమునందు అసలు

లు, వడియగట్టిన నీరు, మిశ్రిమము గావించిన, 500 బొట్లు మిశ్రిమ ద్రివమునందు కరగించి అందుండి ఒక్కబొట్టు ఒక సీసాలో వేయవలయును. దీనికి, 100 బొట్లు పరిశుద్ధమైన ఆల్కహాలుకలిపి, ‡2 చేతితోనూరు బలమైన ధూననములు (Successions) సాగెడు గట్టివస్తువుపై *3 నీయవలెను. ఇది చలనవర్ధితకరణముయొక్క (Dynamization) మొదటి అంశ ములో (first degree) గల ఔషధము. ఈ ఔషధములో

---

మందు దినుసు 1/1000 భాగమును రెండవ అంశమునందు 1/10000 భాగ మును మూడవ అంశమునందు 1/1000000 భాగమును యుండును. ఇది నూరిన చూర్ణము యొక్క మూడు అంశములు నైయున్నది. ఈవిధానము నిట్లు సక్రిమముగ జరిగించిన పక్షమున అవుషధవస్తువుయొక్క చలన వర్ధిత శక్తికరణమునకు (Dynamization) చక్కగ ప్రారంభించడమగును.

మరియొక మందును నూరుటకు కల్వము నుపయోగించుటకు ముందు కల్వమును పాత్రిమును బాగుగ శుభ్రి పరుచవలయును. కల్వమును, పాత్రి మును, బద్దను ముందు వేడినీళ్ళతో శుభ్రముగ కడిగి పిమ్మట ఒకఅరగంట కాలము వీనిని మరుగుచున్న నీరుగల డేకిసాలో నుంచవలెను. పిమ్మట వీనిని నిప్పు శగ తగులునట్లుగ యుంచి యిందు విషయమై తగు జాగరూకత గూడ తీసికొనవలెను.

‡2 పాకెట్సులో బెట్టుట కుపయోగించు సీసాయందు అవుషధమును మూడు వంతుల భాగము వరకే నింపవలయును.

*3 సాధారణముగా తోలు బైండు పుస్తకముపై

చిన్న పంచదార మాత్రలను ::4 (Sugar gobules) తడిపి *5 ఆరిపోవుటకు వెంటనే అద్దుకాగితముపై పరచి, పిమ్మట మంచిసీసాలో భద్రపరచి, 1వ నెంబరు అని పొటెన్సీ అంశముయొక్క గురుతు సీసాపై వేయవలెను. ఈఔషధము నింకను చలనవర్ధిత శక్తీకరము గావించుట కిందుండి, ఒక ‡6

:: 4 ఈచిన్న పంచదార మాత్రలు పిండిపదార్థముతోను పంచదారతోను తయారుచేయబడి ?ల్లిడ ప్రమాణమున అందుండు చిన్నముక్కలు తొలగింపబడి మాత్రలు ప్రత్యేకింపబడును. ఈమాత్రలు ఒకగళ్లా ద్వారా అవసరమును బట్టి తీసికొనవలయును ఈగళ్లా ఒకగింజఎత్తు తూకమునకు సరిపోవు 100 మాత్రలు మాత్రమే అందుండి పడుటకు తావోసంగును. హోమోపతీ వైద్యుని ఉపయోగమునకు ఇది మిక్కిలి అనుకూలమైన పరిమాణము.

*5 గాజు, పింగాణి లేక వెండితో గుండ్రముగా తయారు జేయబడి అడుగున మూలలుగల కుట్టుపనివాని అంగుళత్రాణము ఆకారము వంటి ఆకారముగల చిన్న పాత్రయందు యీమాత్రలుంచి చలన వర్ధిత శక్తికరణము గావించిన అల్కహాల్ తో గూడిన ఔషధముతో నీమాత్రలను తడిపి కలియునట్లు కదిపి త్వరితముగ ఆరిపోవుటకు వెంటనే అద్దుడు కాగితముపై పోయవలెను.

‡6 ప్రథమమున తెల్పబడిన సూచనను బట్టి ఔషధమును హెచ్చు పొటెన్సీలలో పెట్టుటకు తక్కువ పొటెన్సీలోగల ఔషధము యొక్క ఒక బిందువునకు 100 బిందువులు అల్కహాల్ తీసికొనబడెను. అనేక సార్లు సీసాను కదుపుట మూలముగా ప్రత్యేకము ఎక్కువ శక్తి నుపయోగించ నవసరము లేకుండ ఔషధశక్తిని పూర్తిగా వృద్ధిజెందించి హెచ్చుపొటెన్సీలలో పెట్టుటకు యీపాలు (100 : 1) మిక్కిలి సంకుచితమై యున్నట్లు [too limited] మిక్కిలి శ్రమ దీసికొని గావింపబడిన పరిశోధనా ఫలితముగ తెలిసి కొంటిని.

మాత్రను దీసికొని, నూతనమైన రెండవసీసాలోనుంచి (యీ మాత్రికరగుటకు ఒక్క నీటిబిందువువేసి) పిమ్మట 100 చుక్కల ఆల్కాహాల్ పోసి, పైనచెప్పినవిధముగనే, నూరుబలమైన ధూననములతో, చలనవర్థితశక్తికరణము గావింపవలెను.

ఈఆల్కాహాలుతోకూడిన ఔషధద్రవములోతిరిగి చిన్న పంచదారమాత్రలు తడిపి, వెంటనే అద్దుడుకాగితముపై ఆర బెట్టి, మంచిబిరడాగల సీసాలోనుంచి, ఉష్ణము సూర్యరశ్మి

ఒకగింజఎత్తుగల నూరు మాత్రిలనుండి ఒకమాత్రిను దీసికొని 100 బిందువుల ఆల్కాహాలుతో చలనవర్థిత శక్తి కరణము గావించిన 500 సంఖ్య గల అట్టి మాత్రిలు ఒక్క బిందువును మాత్రిమే పీల్చగలిగి యుండుటచే ఒకటికి 50000లు గాని ( 1 ; 5C000 ) అంతకు పైగా గాని సామ్యము (Proportion) వచ్చును. ఔషధమునకు అందు గలపబడు అనుపానమునకు (Medium)గల అసామ్యోన్నతాంకముతో (Disproportionate Higher ratio ) సీసాకు మూడువంతుల వరకు ఆల్కాహాల్ తో నింపి విడువకుండ అనేక ధూననము (Succussions) లొసంగిన మిక్కిలి వృద్ధి జేయబడిన గొప్పశక్తి కలిగింపబడును. కొలదిపాటి అనుపానముతో అనగా 100కి 1 సామ్యములో బలమైన యంత్రిము మూలమున అనేక ధూననములు గావించి యిట్టి ఉన్నత చలన వర్థిత శక్తికరణము గావించిన ఔషధములు ముఖ్యముగ బలహీనులగు రోగులయందు జీవశక్తిస్థిరమైన సౌమ్య ప్రతీకార గుణము కలిగింపక తక్షణమే ఉగ్రిముగను తీవ్రముగను ప్రమాదకరముగను గూడ పని చేయగలవు. గాన నేను పైనజెప్పిన పద్ధతి యిట్టి ఉపద్రివములకు తావొసంగక ఉన్నతఔషధ శక్తులను వృద్ధి బొందించి సౌమ్యగుణమును కలుగచేయును. మరియు వ్యాధికి సక్రిమముగ నిర్దిష్టము గావించి ప్రియోగించినవ్యాధిగ్రిస్తమైన సమస్త భాగములను నివారణకరముగ పట్టుకొనును.

తగల ఖండిక భద్రపరచి, ఆసీసాపై 2వ నెంబరు పొటెన్సీ అని గుర్తువేయవలెను. ఈవిధముగ, 29వ పొటెన్సీ చేరువరకు యీవిధానమును సాగించవలెను, పిమ్మట నూరుచుక్కల ఆల్కహాల్‌ను నూరుఘూననములచే ఆల్కహాల్ ఔషధద్రవ మును (Alcholic medicinal fluid) తయారుచేసి, దానితో ఔషధముచే సరిగా తడుపబడి, ఆరబెట్టబడిన పంచదారమాత్ర లను, 30వ చలనవర్ధిత శక్తీకరణఅంశము (Dynamisation degree) లో పెట్టవలయును.

ముడిరూపములోగల ఔషధము లీ పద్ధతిని (శక్తివంత మగు) ఔషధములుగ తయారుచేయబడుచున్నవి. ఈపద్ధతి మూలమున మాత్రమే యీమందులు వ్యాధిగ్రస్త శరీరము నందలి, బాధపడుభాగములను, మిక్కిలి బలకరముగ వశ్యము

---

తరుణ జ్వరములలో యీవిధముగ సక్రమముగ తయారు జేయబడిన ఔష ధము యొక్క (దీర్ఘమైన గుణములుగల జౌషధము లైయున్నప్పటికి) చిన్న పొటెన్సీలయొక్క చిన్న మోతాదులను తక్కువ కాలవ్యవధిలో తిరిగి తిరిగి ప్రయోగింపవచ్చును. దీర్ఘవ్యాధుల చికిత్సయందు చిన్నపొటెన్సీలలోనే చికిత్స ప్రారంభించి ఆవసరమును బట్టి పెద్ద పొటెన్సీలను సౌమ్యముగ పనిచేయు బలమైన హెచ్చు పొటెన్సీలను గూడ ప్రయోగింపవచ్చును

మిక్కిలి అరుదుగా కొన్నివ్యాధులయందు స్వస్థత చేకూరిన పిమ్మటను గూడ నొకకటి బాధకరమగు స్థానిక లక్షణము నిర్మూలముగాక నిలచి యున్నప్పుడు సమర్థముగ పనిజేసి యున్న సారూప్యౌషధమును చేతితో చాల ఘూననమునిచ్చి జౌషధశక్తి వృద్ధిగావించి తప్పక ప్రయోగించవలసిన అవసరము గలుగుచుండును. ఇట్లు ఔషధశక్తినివృద్ధిజేసి ప్రయోగించిన పిమ్మట స్థానిక లక్షణము అత్యద్భుతముగ తరుచు అదృశ్యమగును.

గావించుకొనుటకు పూర్ణమైన సామర్థ్యమును పొందుచున్నవి. ఈవిధముగ అంతరంగ జీవపద్ధతిపై ప్రకృతిసిద్ధమైన వ్యాధి యొక్క ప్రాబల్యము, సారూప్యకల్పిత వ్యాధిమూలమున, ప్రతిహతము (netrualize) గావింపబడుచున్నది. పైనచెప్ప బడిన విధమున నీవిధానము సక్రమముగ నెరవేర్చిన పక్షమున నీ యంత్రకరవిధానమున (Mechanical procedure) మందు దినుసులయందు (Drugs) మార్పుదీసుకొని రాబడుచున్నది. ఈమందుదినుసులు, ప్రకృతిసిద్ధమైన స్థితియందు, కేవలము భౌతికపదార్థములుగను, ఒక్కొక్కప్పుడు, అనౌషధభౌతిక పదార్థములుగను, వర్తించును. గాని, అత్యధికముగ నిట్టి ఉన్నతచలనవర్ధిత శక్తీకరము, గావించుటమూలమున, యీభౌతికస్థితి మార్పుచేయబడి, కడకు, జీవశక్తివంటి ♦7 ఔషధశక్తి

♦7 ఈచలనవర్ధితశక్తీకరణపద్ధతి మూలమున (అనేకములైన కష్టతరమగు పరిశోధనలచేతను, వ్యతిరేక పరిశోధనలచేతను, యీవిధముగ తయారుజేయబడిన ఔషధములు, మిక్కిలి శక్తివంతమైన సామ్యగుణము గలిగి, అనగా మిక్కిలి క్రియయుక్తమై యుండగలవని కనుగొంటిని) ప్రతిచలనవర్ధిత శక్తీకరఅంశముతోను (each degree of Dynamisation) 50000 సార్లు, ఔషధమునందలి స్థూలభాగము తగ్గిపోవుచుండెను గాని, ఔషధశక్తి, అత్యద్భుతముగ వృద్ధిజెందుచుండెనను తలంచు యీ యభిప్రాయము అసంభవముగ అగపించదు. 125 కు 18 సున్నలు జేర్చిన సంఖ్యగల చలనవర్ధితశక్తీకరణమును యింకను చలనవర్ధితశక్తీకరణము గావించిన, మూడవఅంశము చలనవర్ధితశక్తీకరణమునకు మాత్రమే (Third degree of dynamisation) జేరుచున్నది. ఈవిధముగ 30 వ పొటెన్సీ జేయబడిన పిదప, సంఖ్యానీకములో లెక్కింపనలవిగాని, సంఖ్యా

లోనికి సూక్ష్మీకరణము గావింపబడుచున్నది. ఈ ఔషధశక్తి యింద్రియజ్ఞానములకు లభ్యముగాదు. గాని, యీ ఔషధముతో తడుపబడి ఆరబెట్టబడిన మాత్రిలు, (యీమాత్రిలు నీటిలో కరిగిలపబడినప్పుడు మిక్కిలి అధికముగను) ఈశక్తిని గొంపోవు పరికరములుగ వర్తింపగలవు. ఈస్థితియందు వ్యాధిగ్రస్థ శరీరమున, నీ అగోచరశక్తియొక్క నివారణాశక్తిని స్పష్టముగ నగుపరచును.

## 271

మానవులను, వ్యాధులనుండి, సంరక్షించుటకు ♦1

వైద్యుడు న్యాయముగ, తనకుదాను స్వయముగ సాహాప్యా

---

భాగముపచ్చును. ఇట్టి చలనవర్ధితశక్తికరణము మూలమున (అంతరంగ ఔషధసారముయొక్క నిజమైనవికాసము) ఔషధస్థూలభాగము, కడకు దానియొక్క వ్యక్తిగత, నిరాకార (భావనాయుత) సారము లోనికి కరగి పోవును. ఈ ఔషధవస్తువు, సహజస్థితియందు, యీవికాసమునొందని, భావనాయుతసారము కలిగియున్నదని తలంపవచ్చును.

♦1 ముందు ప్రభుత్వమువారు, సక్రమముగ తయారుగావలసిన సాహాప్యౌషధములయొక్క ముఖ్యావసరమును గుర్తించి, సాహాప్యౌషధ వైద్యాలయములలో శాస్త్రమునందును, అనుభవమునందును, శిక్షణపొంది శాస్త్రీయముగ అర్హతనుపొందిన, సమర్థులగు సాహాప్యౌషధవైద్యులకు ఔషధములను, ఉచితముగా నొసంగుటకు నిష్పక్షపాతబుద్ధిగల తగిన మనుష్యునిచే నీఔషధములను తయారుచేయించువరకు, నీఔషధములను వైద్యుడు స్వయముగ తయారుజేసికొనవలయును. ఈ ఔషధములను వికల్పకోరి ఉపయోగించుటకును, బీదసాదల కుచితముగ నిచ్చుటకును, ప్రతివైద్యుడు తగునమ్మకము గలిగియుండును.

షధములను, తయారుజేసికొనవలయును. ఇట్లు వైద్యుడు సాహాప్యౌషధమును స్వయముగ తయారుజేసికొనునప్పుడు, వ్యాధిని నివారణజేయుటకొరకు ఔషధముగ తయారుజేయవలసిన ముడివస్తువులనుండి రసమును దీసి ఉపయోగింపవలసిన అవసరములేనప్పుడు, తనకుగావలసినవస్తువు కొంచముమాత్రమే యైయుండుటచే, అప్పటికప్పుడు తీసినమొక్కనే ఉపయోగింపవచ్చును. కొలదిగింజలయెత్తు యీమూలికను దీసికొని, 100 గింజలఎత్తు పాలపంచదారతో మూడుపర్యాయములు, ప్రత్యేకముగ నూరుటమూలమున, పదిలక్షలవ భాగమునకు (270) దీసికొనిరాబడును. దీనినియింకను చలనవర్ధిత శక్తికరము గావించుటకు (Dynamization) పొడిగానుండునట్టి లేక నూనెవిధమైనట్టి సహజరూపములోనున్న యితరమగు మందుదినుసులకు, గావించు పద్ధతివిధముగా ఆవస్తువునుండి, కొంచముభాగము దీసికొని, ఆవిధముగా ఔషధమును తయారుజేయనగును.

## 272

నూతనమైన సామాన్య అస్వస్థతకు నాలికపై వేసికొని ఉపయోగించు అట్టిమాత్ర ♦1 ఒక చిన్నమోతాదై యున్నది. గాని యీచిన్నమోతాదును నాలికపై వేసికొని, సేవించుట

♦1 ఈమాత్రలకు సూర్యకాంతి, వేడితగులకుండ భద్రపరచి యుంచినపక్షమున చాలసంవత్సరములు యీమాత్రలయందు ఔషధగుణము నిలచియుండును.

మూలమున, కొలది తంతునరములు (Nerves) మాత్రమే ఔషధముచేస్పృశించబడును. ఇట్టిమాత్రను కొంచము పాలపంచదారలో, చితుకగొట్టి; వలసినంతటిలోగలిపి, ప్రయోగించుటకు పూర్వము బాగుగా కదిపినపక్షమున చాలదినములకు ఉపయోగించు, అంతకంటె శక్తికరమగు, ఔషధముగ తయారగును. ఎంత చిన్నదైనప్పటికి యిట్టి ప్రతిమోతాదు, అనేక తంతునరములను (Nerves) స్పృశించును.

## 273

చికిత్సయందుందు ఏరోగికిని, అమిశ్రమమైన, ఒక్కమందుకంటె, ఏకకాలమందు, ఉపయోగించనవసరములేదు. గాన, ఏకకాలమందు, అట్టి ఒక్కమందుకంటెనిచ్చుటకు అనుమతింపబడదు. ప్రకృతితోనెక్కుడు సామర్థ్యముగను ఔషధము నిర్ణయించుటకు, మిక్కిలి శాస్త్రీయముగను, నుండునది, ఏకకాలమందుగావించు అమిశ్రితమైన, ఏకమూలికాప్రయోగమా ♦1 లేక పలువిధములుగ గుణముజేయు, అనేకములైన ఔషధముల

---

♦1 ఒండొంటికి ప్రతిపక్షమైన రెండుపదార్థముల సమ్మేళనమైన ప్రతిహతలవణము (Neutral Natrum), మార్పుజెందని భాగములలో (unchangable proportions) రసాయనానురాగమున జనించిన (chemical affinity) మధ్యమలవణములును (middle salts) పుట్టియందులభ్యమగు, గంధకాయుతధాతువులును (sulphuretted metals) స్థిరసంయోగభాగములలో (constant combining proportions) గంధకము (sulpher) క్షారలవణములు (Alkaline salts) వ్యక్తికలు

మిశ్రమమా (Mixture) యను సందేహమేలజనింపవలయునో తలంచ శక్యముగాకున్నది. ఏక కాలమందు, రెండువిభేదమైన ఔషధవస్తువులను రోగికి ప్రయోగించుటకు, సారూప్యౌషధ శాస్త్ర మెంతమాత్రము అంగీకరింపదు.

## 274

నిజమైన వైద్యుడు, మిశ్రముగావింపబడక, ఒక్కటిగ ప్రయోగింపబడు, సారూప్యౌషధములయందు, తాను అభిలషించు, కార్యసాఫల్యమంతయు, పొందగలడుగాన, (అనగా సహజముగజనించిన వ్యాధిని సంపూర్ణముగ శక్తివిహీనము

---

(earths) రసాయన శాస్త్రపద్ధతిని జనింపజేయబడిన పదార్థములు, (నేట్రిమ్‌సల్ఫు, కాల్‌కేరియాసల్ఫు మొదలగునవి) ఆల్కహాలు, ఆమ్లములు, (Acids) స్ఫరముతో (phosphorus) స్రవము (Distillation) గావించుటమూలమున జనించిన, హిమద్రవములు (ethers) మొదలగు వానిని, సారూప్యౌషధవైద్యుడు, అమిశ్రమద్రవ్యములుగ పరిగణించి రోగులకుపయోగించవచ్చును. మొక్కలయొక్క క్షారజనిదములయొక్క (Alkaloids) ఆమ్లములు (Acids) (ఖినిన్, స్ట్రిక్నైన్, మార్ఫిన్ మొదలగునవి) సజ్జీకరణమునందు(Preparations) పలువిధములుగ మార్పు జెందును గాన, వీనిని అమిశ్రమద్రవ్యములుగ దీసికొనుటను సారూప్యౌషధవైద్య డంగీకరింపరాదు. ఈవస్తువులు, చికిత్సకవుసరమైయున్న సహజస్థితియందు (చింకోనాపట్ట, నక్సువామికా (ముషిణి) నల్లమందు) కలిగియున్న గుణములన్నియు, కలిగియున్నవని తలంపరాదు. మరియు, క్షారజనిదములు (Alkaloids) కేవలము మొక్కలయొక్క పదార్థనిర్మాణభాగములు (constituents) గావు.

గావించి, నిర్మూలముజేసి, శాశ్వతముగ నివారణ జేయు సారూప్యశక్తిని గలిగిన కల్పితవ్యాధిశక్తులు) కార్యసాఫల్యము నకు సామాన్యసాధనములు సరిపోవుచుండ క్లిష్టమైన సాధనములను ప్రయోగించుటకు యత్నించుట తప్పు. ఉత్తమసూత్రమును జ్ఞప్తియందుంచుకొని, అమిశ్రమ ఏకఔషధవస్తువును ప్రయోగించుటతప్ప, మరెయ్యదియు ఔషధముగ ప్రయోగించుటకు ఎన్నడును యోచింపరాదు. ఆరోగ్యమైన శరీరములపై అమిశ్రమవస్తువులయొక్క పరిశుద్ధమైన, విశేషగుణములు, సంపూర్ణముగ రుజువుచేయబడి యుండెను. గాని, రెండు లేక అంతకంటె అధికమైన, ఔషధవస్తువులను మిశ్రము గావించినప్పుడు, అట్టి మిశ్రమౌషధము మానవశరీరమునందు, ఒకదానిగుణమొకటి ఎట్లు మార్పుచేసి, ఆటంకపరుచునో, ఆవిషయమును తెలిసికొనుట కింతవరకు అసాధ్యమై యున్నది. మరియు, ఒక అమిశ్రమ ఔషధవస్తువును, లక్షణములు సరిగా తెలిసికొనబడిన వ్యాధికి సారూప్యముగ నిర్ణయముగావించి ఉపయోగించినప్పుడు, ఆఔషధమొక్కటిమాత్రమే సమర్థమైన సహాయమొసగును. మరియు, ఒకానొకసమయమున, వ్యాధిలక్షణములకు ఔషధము సారూప్యముగ నిర్ణయింపబడక అందుమూలమున ఎట్టి ఉపయోగము కలుగనప్పటికి, యిందుమూలమున, ఉద్రేకించిన క్రొత్తలక్షణములు, ఆరోగ్యమైన శరీరముపై యీ ఔషధములు పరిశోధన జేయబడినప్పుడు కనుగొనబడిన లక్షణములను, స్థిరపరచి యీవిధముగా మనకు

ఔషధపరిజ్ఞానము కలుగజేయును. ఈలాభము, మిశ్రమ ఔషధములను *1 ప్రయోగించినప్పుడు లభించుటలేదు. ఈ కారణములనుబట్టిగూడ, వైద్యుడు, ఒక ఔషధవస్తువును ప్రయోగించుటనుగూర్చి తప్ప మిశ్రమౌషధములను గూర్చి యెన్నడును తలంపరాదు.

## 275

వ్యాధికి ఔషధముయొక్క అనుకూలత, సరియైన సారూప్యనిర్ణయముమీదనే ఆధారపడియుండదు. మోతాదుయొక్క సక్రమమైన పరిమాణము, లేక మోతాదుయొక్క సూక్ష్మరూపముమీదగూడ ఆధారపడియుండును. వ్యాధికి, మిక్కిలి సారూప్యముగ ఔషధమును నిర్ణయించినప్పటికి, అట్లు నిర్ణయించిన ఔషధమును మిక్కిలి బలమైనమోతాదులలో ప్రయోగించినపక్షమున, స్వభావమునుబట్టి సహజమైన ఉపయోగకరమగు గుణముకలిగి యున్నప్పటికి నీఔషధము సారూప్యగుణములను కలుగజేయుశక్తి గలిగియుండుటచే, జీవశక్తియందును, తద్వారా మిక్కిలి సున్నితమైన, సహజముగజనించిన

---

1* శాస్త్రీయమైన వైద్యుడు వ్యాధిని పూర్తిగ పరిశీలనజేసి సరిగా నిర్ణయము గావించిన ఔషధమును లోపలకు ప్రయోగించవలెను. పానీయములిచ్చుట (Drinks) పలువిధములైన మూలికలతో కాపటములు పెట్టుట మందుకలిపిన నీటితో ఎనీమాలు చేయుట, తైలములుమర్దనాచేయుట, మొదలగు పరిపాటు కార్యక్రమమంతయు అశాస్త్రీయమైన ఎల్లోపతీ వైద్యునకు వదలివేయవలెను. (అనగా అట్టిపనులకు హోమోపతీవైద్యుడు గడంగరాదు)

వ్యాధిచే లోగడనే మిక్కిలి వ్యాధిగ్రస్తమైన అవయవభాగములయందును, అనవసరమైన మిక్కిలి బలకరమగు, చిహ్నములనీఔషధము కలుగజేయును,

## 276

ఈకారణమునుబట్టి ఔషధము, సారూప్యముగ వ్యాధికి అనుకూలించియున్నప్పటికి, పెద్దదైన ప్రతిమోతాదు, హానికలుగజేయును. మరియు బలమైన మోతాదులు (Strong doses) సారూప్యమెచ్చుగ నున్నకొలది, మరియు పొటెన్సీ హెచ్చైనకొలది †1 (the higher the potency) ఎక్కువహాని కలుగజేయును. ఈవ్యాధిస్థితికి ఏవిధముగను అనుకూలింపక సారూప్యముగాని (అల్లోపతీమందు) ఔషధము యొక్క సరిసమానమగు పెద్దమోతాదుకంటెను, మిక్కిలి అధికమగు హానిని కలుగజేయును.

సరిగా నిర్ణయము గావించిన సారూప్యౌషధముయొక్క మిక్కిలి పెద్దమోతాదులను ముఖ్యముగా తరుచుప్రయోగించి

---

1† తక్కువ పొటెన్సీలను ప్రయోగించుటకే ఇష్టపడియుండుట చేతను, నిర్ణయము గావించిన ఔషధము సరిగ సారూప్యము గాకపోవుట చేతను, మరియు ఔషధములను తయారుజేయు వారిచే ఔషధములు శ్రేష్ఠముగ తయారుజేయబడక పోవుటచేతను, కొంతమంది హోమోపతీవైద్యులు ప్రాచీనకాలమున పెద్దమోతాదులనుగూర్చి శ్లాఘించియుండిరి. (నేనుగూడ యినవై సంవత్సరముల క్రిందట యింతకంటె ఉత్తమపద్ధతి తెలియక పెద్దమోతాదులనే ప్రయోగించుచుండెడి వాడను.)

నేప్పుడు, విధిగా, నిస్సారమైన బాధను దీసికొనివచ్చును. మరియు, రోగిని తరుచుగ ప్రమాదస్థితిలో బెట్టును. లేదా, వ్యాధినివారణ అసాధ్యమగునట్లు జేయును. మిక్కిలిపెద్దవగు యీ హోమియోపతీ మోతాదులు, జీవపద్ధతియొక్క యింద్రియ జ్ఞానమునకు సంబంధించినంతవరకు సహజముగజనించిన వ్యాధిని వాస్తవముగ నిర్మూలముజేయును. మిక్కిలి బలమైన సారూప్యౌషధమును దీసికొనిన క్షణమునుండి, సహజముగజనించిన వ్యాధినుండి రోగి, ఎంతమాత్రము బాధపడడు; గాని, అందుపై నిర్మూలముజేయుట మిక్కిలి కష్టతరమగు ‡ 2

2‡ ఈవిధముగ సవాయి వ్యాధికి విడువకుండ వైరూప్యమగు పాదరస సంబంధమైన అల్లోపతీ పెద్దమోతాదుల నుపయోగించుటమూలమున నివారణజేయుట అసాధ్యమగునట్టి పాదరస సంబంధమైన వ్యాధులు వృద్ధిజెందుచున్నవి. అందుకు మారుగ సౌమ్యమైన శక్తికరమగు పాదరస సజ్జీకరణము (Mercurial preparation) యొక్క ఒకటి లేక కొన్ని మోతాదులను ఉపయోగించిన కొలది దినములలో సుఖవ్యాధియంతయు వుండు స్థానిక బాహ్యచికిత్సలమూలమున పుండును నిర్మూలము గావించనిపక్షమున (అల్లోపతీ వైద్యములో ఎల్లప్పుడు గావింపబడు విధముగ) సంపూర్ణముగ నివారణ యగును.

ఈవిధముగనే విషప్రజ్వరమునకు హెచ్చు పొటెన్సీలుగల క్వైనా యొక్క ఒక్క చిన్న మోతాదు వ్యాధిని నివారణ జేయుటలో ఆశాభంగము కలిగింపక సహాయకారి యగుచుండ (మన్యపు జ్వరములలోను, సోరాసంబంధమైన వ్యాధికిలోనుగాని వ్యక్తులయందు గూడ) అల్లోపతీవైద్యుడు చింకోనా పట్టయు, క్వైనాయు, అనుదినము మిక్కిలి పెద్దమోతాదులలో ప్రయోగించుచుండును. ఇందుమూలమున క్వైనా సంబంధమైన దీర్ఘవ్యాధి (ఏకకాలముండే

సారూప్యమైన, అంతకంటెనెక్కుడు తీవ్రమగు, ఔషధజనిత వ్యాధిచే, అధికముగ వ్యాధిగ్రస్తమగును.

## 277

ఈ కారణమునుబట్టియు, మరియు, మోతాదు తగినంత చిన్నమోతాదై, ఔషధనిర్ణయము, ఎంతసరిగా నుండునో అంతఅధికముగ, ఔషధము అనుకూలముగను, అత్యద్భుతమైన శక్తివంతముగను, నుండగలదు గాన మిక్కిలి సారూప్యముగ నిర్ణయము గావింపబడిన ఔషధముయొక్క మోతాదును, సౌమ్యమైన నివారణాగుణమున కనుకూలమగు, సూక్ష్మఅంశమునకు తగ్గించినపక్షమున యింకను మిక్కిలి అనుకూలమై యుండగలదు.

## 278

నిశ్చయమైన, సౌమ్యనివారణకర గుణములను కలుగ జేయుటకు మిక్కిలి అనుకూలమైన అతిసూక్ష్మఅంశమేది?

---

వృద్ధిజెందిన సోరాతో ద్వంద్వమై) జనించి ముఖ్యముగ ప్రధాన అంతరంగ జీవావయవములను, కాలేయమును (liver) ప్లీహమును (spleen) పాడుజేసి క్రమక్రమముగ రోగిని మృత్యువాత బడజేయును. లేదా ఓచారకరమగు దేహారోగ్య స్థితియందు సంవత్సరములు కొలది బాధించుచుండును. సారూప్యౌషధముయొక్క పెద్దమోతాదులను దుర్వినియోగపరచుట మూలమున జనించిన విపత్తునకు సారూప్యౌషధ విషపరిహార ఔషధము (Homeopathic antidote)ను నూహింప నశక్యము.

మంచినివారణ కలుగజేయుటకు వ్యాధికి సారూప్యముగ నిర్ణయ ముగావించిన, ప్రతిప్రత్యేక ఔషధముయొక్క మోతాదు ఎంతసూక్ష్మముగ నుండవలెను? యను ప్రశ్న యిచ్చటజనించు చున్నది. మిక్కిలి సూక్ష్మముగ, సౌమ్యతమముగ, అతి వేగము, నివారణలభించుటకు, సారూప్యచికిత్సాపద్ధతికొరకు, ప్రతిప్రత్యేక ఔషధమునకు ఎంతటి మోతాదు సరిపడునో, నిర్ణయించి, యీవిషయమును పరిష్కరించుట సులభముగ ఊహించునంతటి భావనాయుత, యోచనావిషయముగాదు. చక్కగ కల్పింపబడిన హేతువాదములు మూలమునను, రమ్య మైన కుతర్కములమూలమునను, యీవిషయము పరిష్క రింపబడదు. భావనాయుతమైన సమస్తమైన వ్యాధులను గూర్చి, ముందుగ పట్టికవ్రాయుట ఎట్లుఅసాధ్యమో ఈవిష యమును పరిష్కరించుటగూడ నట్టిది. ప్రతి రోగియొక్క గ్రహణశక్తినిగూర్చి కడుజాగరూకతతో గావించు, పరిశీలన, నిజమైన పరిశోధన, సరియైన అనుభవముమాత్రమే ప్రతివ్యక్తి గతమైన వ్యాధియందు నీవిషయమును సిద్ధారణజేయగలవు. ఈవిషయమునకు, సారూప్యౌషధ నివారణాపద్ధతికి అవుసర మగు, మోతాదులయొక్క సూక్ష్మరూపమునుగూర్చి నిజ మైన యనుభవమేది తెల్పుడుచేయుచున్నదో దానికి వ్యతిరేక ముగ, సారూప్యముగ, శరీరమునందలి వ్యాధిగ్రస్తమైన భాగ ములను స్పృశింపక, వ్యాధిగ్రస్తముగాని భాగములనుమాత్రమే నెమరొందను ప్రాచీనవిధానమునందలి అననుకూల ఔషధముల

యొక్క పెద్దమోతాదులను ఉదాహరణజూపుట అసంగతము.

## 279

దేహములో ఆమాశయాది ముఖ్యమైన అవయవములు విస్తారముగ చెడిపోయినకారణమున, వ్యాధియొక్క ఉత్పత్తి అందుపై ఆధారపడియుండని పక్షమునను, (క్లిష్టమైన వ్యాధికి గాని, దీర్ఘవ్యాధికిగాని, యీవ్యాధిజెందియున్నప్పటికి) మరియు చికిత్సయందు సమస్తమైన యితరప్రాబల్యములుగల పదార్థములను, రోగి దరిజేరనీయక దూరముగనుంచినపక్షనను, సారూప్యముగనిర్ణయముకాబడి ఉన్నతశక్తీకరణము (Highly potentised) గావింపబడిన ఔషధముయొక్క మోతాదును, ముఖ్యముగ దీర్ఘవ్యాధి చికిత్సయందు, సహజముగ జనించిన, వ్యాధి కంటె, బలహీనముగను, అధమము, వ్యాధిగ్రస్తమైన భాగములనుండి, వ్యాధిని తొలగించి, జీవనశక్తియొక్క అనుభవమునుండి, నిర్మూలముజేసి, యిల్లునివారణయొక్క ఆరంభమును కలుగజేయజాలనంతటి, చిన్నదిగను, తయారుజేయరాదని, యదార్థమైన యనుభవము, సర్వసాధారణముగ (Universally) నిరూపణజేయుచున్నది. (అనగా ప్రయోగించుఔషధముయొక్క శక్తి వ్యాధిశక్తికంటె నధికమై యుండవలెను.)

## 280

బాధకరమగు క్రొత్తలక్షణములెవ్వియును, జనింపజేయకుండ, ఉపయుక్తముగ నడచుచుండు ఔషధముయొక్క మో

తాదును, క్రిమక్రమముగ హెచ్చించుచు, వెనుకటిబాధలే బాధలు, సౌమ్యమైనతరహాలో, ఒకటివెంబడి ఒకటి తిరి యగుపించి, యనుభవించుట యారంభించుటమూలమున, సర సౌమ్యమైన సుగుణము నడచునంతకాలము ఔషధమునిచ్చు చుండవలెను. ప్రతిపర్యాయము ధూననములమూలమున (247 (Succussions) ఔషధశక్తిని మార్పుజేసి, క్రిమ క్రిమము హెచ్చించు మితమైనమోతాదుద్వారా, వెనుకటిలక్షణముల ఒకటివెంబడిఒకటి యగుపించుట, సాన్నిహిత్యమునకువచ్చుచున్న నివారణను సూచించును. మరియు నీపరిస్థితి, సహజముగ జనించినవ్యాధిని విడచిపెట్టుటకు, జీవపద్ధతికి ఎంతమాత్రము సారూప్యమైన ఔషధజనితవ్యాధిని కలుగజేయ నవసరములేదని సూచించును (148). జీవపద్ధతియిప్పుడు, సహజముగ జనించిన వ్యాధినుండి విముక్తిజెంది, సారూప్యౌదేకమని లోగడ తెల్ప బడిన, కొంత ఔషధజనితవ్యాధియొక్క అనుభవప్రారంభ మును సూచనజేయును.

# 281

ఈవిషయమునందు నమ్మకము గలుగుటకు, (అనగా ఔషధఉద్రేకముయగుపించిన పిమ్మట) ఔషధగుణమును తెలిసి కొనుటకు ఎనిమిది, పది, లేక పదిహేను దినములు రోగికి ఏవిధ మగు ఔషధమునీయక కొన్ని పాలపంచదార పొట్లములిచ్చి యుంచవలెను. ఆఖరి కొలదిలక్షణములు, పూర్వపు వ్యాధిలక్ష

ణములు, ఔషధోద్రేకము మూలమున జనించినపక్షమున, కొలది దినములలోను లేక గంటలలోను అదృశ్యమగును. ఔషధమొసగకయుంచిన యీదినములలో మంచి ఆరోగ్య విధులను అవలంబించుచుండిన అసలువ్యాధి ఎంతమాత్రము యగుపించక రోగికి స్వస్థతచేకూరును. కడపటి దినములలో వెనుకటి వ్యాధిలక్షణ చిహ్నములు సంభవించిన నివి అసలు వ్యాధియొక్క పూర్తిగ నిర్మూలముజెందని గతశేషములు గాన అట్టి పరిస్థితియందు వెనుక తెల్పబడిన విధముగా నూతన మైన హెచ్చు పొటెన్సీలో ఔషధమును ప్రయోగించి చికిత్స జేయవలయును. నివారణ యనుసరింపవలసియున్న పక్షమున మొదటి చిన్నమోతాదులను పైవిధముగనే తిరిగి క్రమక్రమ ముగ హెచ్చుశక్తిలోనికి హెచ్చించవలెను. ప్రకోపము (Irritability) హెచ్చుగాగల రోగులకు మోతాదులను నెమ్మదిగ హెచ్చింపవలెను. వశ్యత (Susceptibility) తక్కువ గానున్న రోగులకు ఔషధమునుప్రయోగించుటలో త్వరితముగ హెచ్చుమోతాదులకు బోవచ్చును. వశ్యతలేని వ్యక్తులయం దలి గ్రహణశక్తితో బోల్చిన 1000కి 1 సంబంధ సామ్యము వంటి (ratio) గ్రహణశక్తి (impressionability) గలరోగులు గూడ గలరు.

## 282

చికిత్సయందు ముఖ్యముగ దీర్ఘవ్యాధుల చికిత్సయందు మొదటి మోతాదు సారూప్యోద్రేకమును దీసికొనివచ్చిన పక్ష

మున అనగా మొదటి మోతాదు ప్రయోగించిన పిమ్మట మొదట కనుగొనబడిన ప్రథమవ్యాధి లక్షణములు స్పష్టముగ వృద్ధిజెందిన పక్షమునను, మరియు ఔషధము ప్రయోగించుటకు ముందు కదుపుట మూలమున ఔషధశక్తి కొంతవరకు మార్పు జేయబడినప్పటికి (అధిక శక్తికరణము గావించుట) తిరిగి ప్రయోగించిన ప్రతిమోతాదు యీవిధముగనే సారూప్యోద్రేకమును దీసికొనివచ్చిన పక్షమునను, మోతాదులు పూర్తిగ మిక్కిలి పెద్దవయ్యెనని తెలిసికొనుటకిదియొక నిశ్చయమైన చిహ్నము. 1◆

---

◆1 దీర్ఘవ్యాధులచికిత్స సాధ్యమైనంత చిన్నమోతాదులలో ప్రారంభించి, క్రమక్రముగమాత్రమే హెచ్చుజేయవలయునను నిబంధన, త్రివిధ దీర్ఘవ్యాధితత్వముల (Three miasms) చికిత్సకు, నీవ్యాధితత్వములింకను చర్మముపైన యగుపడునప్పుడు అనగా, నవీనముగబయలుదేరిన పొక్కురూపములోనున్న చిడుము ఎట్టిచికిత్సయు గావింపబడని సవాయిపొక్కు (మర్మావయవములు, నోరు, పెదవులు, మొదలగు ప్రదేశములయందు) సురుపుడుకాయలు (Fig warts)ని ఐయునప్పుడు, గావించు చికిత్సకు (ఈనిబంధన) వర్తింపదు.

ఈవ్యాధులకు ప్రారంభమునుండియు, నిర్దిష్టౌషధములను పెద్దమోతాదులలో హెచ్చుపొటెన్సీలలోనికి క్రమముగ వృద్ధిజేయుచు అనుదినము (దినమునకు అనేకసార్లుగూడ) ఉపయోగింపవలసిన అవసరముగలదు, ఇట్టి స్థితియందు వ్యాధులు, యిట్టివిధమగు ఔషధప్రయోగమునకెట్టి అభ్యతరము కలిగింపవు. ఈపద్ధతినవలంబించి, అంతరంగమున దాగియున్న వ్యాధులచికిత్సయందు, పెద్దమోతాదులనువిడువకుండ, ప్రయోగించుటమూలమున, వ్యాధిని నిర్మూలముజేసినప్పటికి, అందుమూలమున దీర్ఘమైన ఔషధజనిత వ్యాధికలుగునను. ప్రమాదమునుగూర్చి ఏవిధము భయపడనవసరము లేదు. ఈత్రివిధ

పూర్తిగ ప్రకృతినిబట్టి కృషిచేయుటకు, నిజమైననివారణాశాస్త్రజ్ఞుడు, సమస్తవిధముల అనుకూలమైన, చిన్నమోదులో (కేవలము దీనిమూలముననే) సరిగా శోధించిన సారూప్యౌషధమును నిర్ణయించును. మానవదుర్బలత్వమున, మార్గముదప్పి, అననుకూలమైన, మందును ప్రయోగించినపక్షమున, వ్యాధికి అననుకూలసంబంధముగల ఔషధమును ప్రయోగించుట

---

వ్యాధితత్వములు బాహ్యముగ ప్రత్యక్షగ యగుపడుచున్నప్పుడుగల పరిస్థితి వేరుగనుండును. ఏలనన, అనుదినచికిత్సయందు, దినదినము, జీవపద్ధతినుండి వ్యాధిని, పెద్దమోతాదుయొక్క ఏఅంశము ఎంతవరకు తొలగించుచున్నదో పరిశీలనజేసి నిర్ణయించుకొనవచ్చును. మరియు, బాహ్యలక్షణములు, అదృశ్యమగుటనుబట్టి యీఔషధములయొక్క అవుసరమిక నెంతమాత్రము లేదని, వైద్యుడు విశ్వసించునప్పుడుమాత్రమే, నీత్రివిధతత్వములు నివారణకాగలవు. (అనగా లోపలకు ప్రయోగించిన ఔషధముచే బాహ్యలక్షణము లదృశ్యమైనప్పుడు యింక ఔషధప్రయోగ మవుసరము లేదనియు దీర్ఘవ్యాధితత్వము నివారణయయ్యెననియు తెలిసికొనవలెను).

వ్యాధులు సర్వసామాన్యముగ, జీవపద్ధతిపై సంభవించు, చైతన్యశక్తికర సంఘర్షణములు మాత్రమేయైయుండుటచే, నీవ్యాధులకు మూలాధారము ఏస్థూలపదార్థముయైయుండదు. (ప్రాచీనవిధాన వైద్యులు, మోసకరముగ వేలకొలది సంవత్సరములనుండి, యీస్థూలపదార్థమే వ్యాధికారణమని కల్పనజేసి, ఆపద్ధతిని రోగులను వినాశకరముగ చికిత్సజేయుచుండినవిధముగా యీస్థూలపదార్థము వ్యాధికారణముకాదు.) ఈప్రాచీనవిధానచికిత్సచే ఈత్రివిధ వ్యాధితత్వములకు స్థానికచికిత్స గావింపబడకపూర్వముగల స్థితికంటెను, అంతులేకుండ విపరీతముగ వ్యాధిగ్రస్తముగావించి, నివారణకసాధ్యమైన స్థితిలో నధికముగ రోగిని బెట్టుటతప్ప, యీవ్యాధులయందు కడిగివేయవలసి

వలన, కలుగునష్టము రోగి తన జీవశక్తి మూలమునను, తిరిగి లక్షణసాదృశ్యమునుబట్టి సరిగా నిర్ణయముగావించిన ఔషధమును (నిదిగూడ చిన్న మోతాదులలోనే) వెంటనే ప్రయోగించి ప్రతిరోధము కలుగజేయుటమూలమునను సత్వరముగ నిర్మూలముజేసి చక్కజేయగలుగునంత కొలదిగనుండును. (అనగా అననుకూలమైన ఔషధమును ప్రయోగించుటమూలమున కలుగు నష్టము మిక్కిలి కొలదిగనుండును. ఈనష్టము అనుకూలమైన ఔషధమును వెంటనే ప్రయోగించుటమూలమునను జీవశక్తి చేతను చక్కజేయబడును.)

---

నది, కాల్చివేయవలసినది, కట్టివేయవలసినది, లేక కోసివేయవలసినది, ఏదియునులేదు. జీవశక్తిపై ప్రాబల్యమునువహించు చైతన్యయుత శత్రుకరపద్ధతియే, దుష్టమైన అంతరంగ వ్యాధితత్వములయొక్క యీ బాహ్యచిహ్నముల సారము. ఇది, కేవలము జీవశక్తిపైపనిచేయు, సాదృశ్యౌషధములచే, నిర్మూలము చేయబడగలదు. ఈఔషధములు బలకరముగ సాదృశ్యమైన పద్ధతిలో జీవశక్తినిమార్పుజేసి, నిరాకారమైయున్న వ్యాధియను శత్రువుయొక్క అంతరంగ బాహ్యభావనలను, శరీరమునందుండకుండ తొలగించి, యీవిధముగ రోగిని వ్యాధినుండి విముక్తిగావించి నివారణజేయును.

చిహ్నమును బాహ్యలక్షణలతోసహితము, లోపలకు దీసికొను సిద్ధౌషధములమూలమున (Specific remedies) నివారణజేయవలయును. ఇట్లేన యిస్ఫురంధ్రము అంతరంగమునందలి సఖిసంబంధమైన తత్వముతోసహితము లోపలకిచ్చు ఔషధములమూలముననే నివారణచేయవలయును. గాని సురుప్రడుకాయలను (Fig warts) దీనికి ఎట్టిచికిత్సయులేక చాలకాలమునుండి యున్నపక్షమున సంపూర్ణముగ నివారణజేయుటకు, దీనియొక్క సిద్ధౌషధమును, ఏకకాలమందే, లోపలకిచ్చుచు, పైకి ఉపయోగించుట (External applications) మూలమున చికిత్సచేయుట అవసరము.

ఔషధప్రయోగముచే, సర్వసాధారణముగా, గుణము కలుగజేయునవి, నాలుక, నోరు, జీర్ణకోశముమాత్రమేగాక ముక్కు శ్వాసావయవయములుగూడ, నోటిద్వారా శ్వాస లోపలకుదీయుట, అఘ్రాణించుటమూలమున, ద్రవరూపము లోనున్న ఔషధమును గ్రహించును. భాసినీ త్వక్కుచే (Epidermis) కప్పబడియున్న తక్కిన, శరీరభాగమందలి చర్మమంతయు, ఔషధద్రావణము (Medicinal solution) యొక్క గుణమును ముఖ్యముగా, లోపలకు ఔషధమును ప్రయోగించుచు, పైకి ఔషధమును మర్దనాచేయుట ఒకేకాలమందు జరిగించినపక్షమున, గ్రహించి స్వీకరించగలదు *1

*1 తల్లి లేక దాదులయొక్క స్తన్యపానముద్వారా శిశువులపై పనిజేయు ఔషధశక్తి అద్భుతముగ, ముక్కిలిసహాయకరమైయుండగలదు. సరిగా నిర్ణయించిన, సాధారణౌషధమును మితమైనమోతాదులలో, పాలిచ్చుతల్లికి లేక దాదికి ప్రయోగించినపక్షమున, శిశువులకుగల ప్రతివ్యాధియులొంగును. పూర్వీకులకంటె ఆధునికులు, మందును వ్యర్థముగావింపక ఈవిధమగు ఔషధ ప్రయోగముచే సులభముగను, నిశ్చయముగను ఔషధమును ఉపయోగింతురు. చాలమందిశిశువులు, సర్వసాధారణముగా సోరాను వంశానుగతముగ తల్లినుండి పొందియుండనిపక్షమున, పాలిచ్చుదాదుల స్తన్యపానముద్వారా పొందుదురు. పాలిచ్చుదాదులకు ఔషధమును ప్రయోగించి, శిశువులను సోరానుండి సంరక్షింపవచ్చును. వంశానుగతముగ సంభవించుచు చాలవరకు దీర్ఘవ్యాధులను జనింపజేయుసోరాను నిర్మూలముజేయుటకు, తల్లులకు, ఉపగ్రంథమునందు (270) తెల్పబడిన నిబంధనల ననుసరించి తయారుజేయ

ఈవిధముగ, నివారణకరముగ యగుపించిన, లోపలకు ప్రయోగించుఔషధమును, పైనపట్టించుటమూలముసను, యీ ఔషధమును, పీపుమీద, చేతులకు, మర్దనాచేయుటమూలము నను మిక్కిలి చాలకాలమునుండిగల వ్యాధుల నివారణకు, వైద్యుడు సహాయముజేయవచ్చును. ఇట్లు పైనపట్టించుట లేక మర్దనచేయుటలో, చర్మసంబంధమైన పొక్కులు, యీడ్పు (Spasm) భాధ (Pain) గల భాగ భాగములను వదలివేయ వలయును. ♦1

---

బడి సూక్ష్మశక్తిలోనికి దీసికొనిరాబడిన సల్ఫరు (Sulphur dynamizations) మూలమున ముఖ్యముగా, సౌమ్యమైన శోరాశాంతికరచికిత్సగావించుటముఖ్యావసరము, తల్లులయందు గర్భమునందలి పిండమునందుగలసోరాను నిర్మూలము జేసి, యీసోరాదోషము సంతతికిఅంకురింపకుండ జేయవలయును. ఇట్లు చికిత్సజేయబడిన గర్భవతులవిషయములో యదార్థముగ నీసోరా, సంతానమునకు అంకురించక నశించగలదు. ఇట్లు చికిత్సచేయబడిన గర్భవతులకు ప్రపంచమునందలి అందరకు ఆశ్చర్యముకలుగునట్లు, పూర్వముజనించిన సంతానముకంటె, బలవంతులును, ఆరోగ్యవంతులును యగు పిల్లలు పుట్టియుండిరి. నాచే కనుపెట్టబడిన శోరాసిద్ధాంతమునందలి గొప్పసత్యమును స్థిరపరచుట కిదియొక నూతనవిషయము.

♦1 ఈవిషయమును, చర్మము ఆరోగ్యముగను శుభ్రముగను నుండి అంగవైకల్యమునొందిన రోగులు, కాకతాళీన్యాయముగ, సామాన్యమైన అవుషధవస్తువులను జలస్నానములను గావించుటమూలమున, స్థిరముగ, త్వరలో నివారణచేయబడిన, అద్భుతనివారణలు, (ఎంతఅరుదుగానున్నప్పటికి).

ఖనిజ అయస్కాంతములు (Mineral magnets) విద్యుచ్ఛక్తి (Electricity) రసాయన గుణజనిత విద్యుచ్ఛక్తి (Galvanism) వీనియొక్క చలనవర్ధితశక్తి లేక సూక్ష్మశక్తి (Dynamic force) మనజీవపద్ధతిపై (life principle) శక్తివంతముగ పని చేయుటలో ఎంతమాత్రము తీసిపోవు. ఆఘ్రాణించుట మూలముగాని, చర్మముపై మర్దనా చేయుట మూలముగాని, లేక

---

విశదపరుపగలవు. ఆదియునుగాక, చర్మముపైగలపొక్కులు, లోహసంబంధమైన స్నానములచే (mineral baths) అణగగొట్టబడినప్పుడు, యిట్టిస్నానములు తరుచు రోగికి అధికమైనహానిని దీసికొనివచ్చును. ఇట్టిసందర్భములయందు కొలదికాలము స్వస్థతగలిగినపిమ్మట, నివారణగాక అంతరంగమునగలవ్యాధి, ఆరోగ్యమునకు ప్రాణమునకు, మిక్కిలి ముఖ్యమైన, వేరొక భాగములయందు, వ్యాధిరూపముదాల్చుటచే, జీవపద్ధతి అవకాశమొసగును. అందుచే ఒక్కొక్కప్పుడు, కంటిసంబంధమైన నరమునకు పక్షవాతమువచ్చి అంధత్వము జనించును. ఒక్కొక్కప్పుడు, కంటియందుండు, స్ఫటిక దర్పణము (Crystaline lens) మబ్బుకమ్మును, లేక చెముడువచ్చును. ఉన్మాదము లేక శ్వాససంబంధించు క్షయ, సంభవించును. లేదా, సన్నిపాత వ్యాధి సంభవించి రోగియొక్క బాధలను అంతమొందించును.

"అవుషధమునుపయోగించుటకుపూర్వము ఆఅవుషధమును ఆరోగ్యమైనమానవశరీరమున, అతిజాగరూకతతో బుజువుజేసి, యీ విధముగా అవుషధ గుణములను తెలిసికొనిగాని, (20, 21) హోమియోపతీవైద్యుడెన్నడునుఏరోగికిని అవుషధమును ప్రయోగించడు" అనునది హోమియోపతీవైద్యునియొక్క మూలసూత్రము. ఇతర ప్రాచీనవిధానవైద్యులకు హోమియోపతీవైద్యునకుగల వ్యత్యాసము యిచ్చటనే గలదు.)

నోటిద్వారా తీసికొనుటవలనగాని వ్యాధులను ప్రతిహతము జేయు (Newtralise) సరియగు ఔషధములకంటె నివి తక్కువ సారూప్యములుగావు. వ్యాధులు ముఖ్యముగా స్పర్శజ్ఞానము

---

“ఈయౌషధము ఒకవిధమగు కొన్నివ్యాధులకు కొంతవరకు ఉపయోగించవచ్చును” అను వట్టియూహామూలమున రోగికి యౌషధమును నిర్ణయించుట, లేక “ఆయావ్యాధులలో ఆయాయౌషధములుపయోగించెను” యను వినికిడినిబట్టి, వదంతులనుబట్టి రోగికి యౌషధమునిర్ణయించుట మొదలగు, మనస్సాక్షికి వ్యతిరేకమగు సాహసకృత్యములను, లోకోపకారియగు హోమియోపతీవైద్యుడు, అల్లోపతీవైద్యునకే వదలివేయును. గాన నిజమైన హోమియోపతీవైద్యుడెన్నడును, రోగులకు పలువిధములైన లోహాదిసంబంధమైన నీటిస్నానములను, నియోగింపడు. ఏలనన, వానియొక్క సరియైనగుణములు చాలవరకు అతనికి తెలియును. ఈస్నానములను దుర్వినియోగపరచిన మిక్కిలి తీవ్రమైన ప్రమాదకరమగు మందులనుపయోగించినట్లే లెక్కింపవలెను. అజ్ఞానులగు అల్లోపతీవైద్యులు మహాఢ్యముగ వెయ్యిమంది రోగులకు స్నానములను నియోగింప, అందు ఒకరిద్దరు కాక తాళన్యాయముగ నివారణజెంద, ఈ అద్భుతమునుగూర్చి ప్రపంచమెల్లడలను చాటెంతురు. ఈలోపుగ వందలకొలది రోగులు పూర్వముకంటె నెక్కుడు దుస్థితిలో చల్లగ జారిపోవుదురు. తక్కినవారు దీర్ఘవిశ్రాంతి దీసికొనుటకు (మరణమునకు) ఆయత్తమైయుందురు. మూలసూత్రములకు విరుద్ధముగ నెన్నడును ప్రవర్తింపని నిజమైన హోమియోపతీవైద్యుడు జయము 1కి 500 లేక 1000 వంతున సంబంధసామ్యముండు లాటరీవలె తన అధీనమున నుంచబడినరోగుల ప్రాణములతో నెన్నడును జూదమాడడు. మరియు రోగియొక్క ప్రాణములనెన్నడును ప్రమాదమునకు పాలుగావింపడు తరుచు రోగులను వారి అంగీకారముతో తన బాధ్యతనుండి విడుదలజేసికొనుటకు లోహాదిసంబంధమైన నీటిస్నానములకు పంపివేయుడు,

నకు సంబంధించిన వ్యాధులు, ఉద్రేకమునకు సంబంధించిన వ్యాధులు విపరీతేంద్రియ గ్రహణమునకు సంబంధించిన వ్యాధులు అప్రియత్నపూర్వక కండర చలనములు (invol untary muscular movements) మొదలగు వ్యాధులను వీని మూలమున నివారణ గావింపవచ్చును.

విద్యుచ్ఛక్తిని, రసాయనగుణ జనిత విద్యుచ్ఛక్తిని, విద్యుదయస్కాంత యంత్రమును (Electro magnetic machine) సారూప్యపద్ధతిగ నుపయోగించుటకు అవలంబింప వలసిన నిశ్చయమైన మార్గమింకను అగమ్యగోచరముగ నున్నది. ఇంతవరకు విద్యుచ్ఛక్తి, రసాయన గుణజనిత విద్యుచ్ఛక్తి, ఉపశాంతికొరకు మాత్రమే ఉపయోగింపబడు చున్నవి. గాని యీసాధనముల మూలమున గావించు చికిత్సలు రోగికిమిక్కిలి హాని కలుగజేయుచున్నవి. మరియు ఆరోగ్యమైన మానవశరీరమునందు వీనియొక్క సవ్యపరిశుద్ధ గుణములు యింతవరకు పరీక్ష చేయబడి యుండలేదు.

## 287

మెటీరియామెడికా పూరా (హానిమాన్ చే వ్రాయబడిన వస్తుగుణదీపిక) యందు శక్తివంతమగు, అయస్కాంతదండము (Magnetic bar) యొక్క ఉత్తరదక్షిణధృవములను (North & South pole) గూర్చి వివరింపబడిన సవ్యగుణములనుబట్టి, అయస్కాంత శక్తులను, చికిత్సకొరకు ప్రయోగింపవచ్చును.

రెండుధృవములు సమానముగ శక్తివంతములై నప్పటికి, వానిగుణ ములకనుగుణముగ ఒకదానినొకటి ప్రతిఘటించును. ఈ రెండు ధృవములలోను నేదిసూచకమగునో, దానిని ప్రయోగించినప్పు డు, స్పర్శకాలపరిమాణమోతాదునుమార్పుజేయుచుండవలెను. ఇందుమూలమున మిక్కిలి తీవ్రమైన ఉద్రేకముకలిగి దానిని విరుగుడు చేయవలసివచ్చినపక్షమున మెరుగుబెట్టిన జింకురేకును ఆభాగముపై నుంచిన ఆఉద్రేకము తగ్గిపోవును.

## 288

స్వభావమునందు ఇతరఔషధములుతో మిక్కిలి విభేద మైయున్న జంతువశీకరణము (Animal magnetism) లేక మెస్మరిజమ్ (ఈవిధానమును కనిపెట్టిన మెస్మర్ అనునాతని నామమున గౌరవనీయముగ నీపేరున పిలువ బడుచున్నది.) గూర్చి యిచటవివరింప అవసరముగలదని తలంచితిని. ఒక శతాబ్దమునుండింతవరకు తరుచు మూఢ్యముగ, తిరస్కరింపబడి, కళంకపరుపబడిన ఈనివారణాశక్తి,పలుమార్గములపనిజేయగలదు. ఇది భగవంతునిచే మానవునకు ప్రసాదింపబడిన అమూల్యమైన బహుమానము. సదుద్దేశ్యముగల వ్యక్తియొక్క బలమైన మన శ్శక్తి, స్పర్శమూలమున మరియు, స్పృశింపనవసరములేకుండగనే, కొంతదూరమునుండిగూడ, సూక్ష్మశక్తికరణముగ (Dynamically) (శక్తివంతమైన అయస్కాంత దండము, యొక్క ధృవ

లను, తిరిగి బ్రతికించుకార్యము జరిగించుటకు అట్టి మానవ శరీరమునందు, ప్రవేశపెట్టబడు, మానవశక్తియొక్క గుణము, మిక్కిలి మహనీయముగ యగుపరుపబడెను. ఇట్లు మృతినొందిన వ్యక్తులను తిరిగి బ్రతికించిన ప్రత్యక్షనిదర్శనము లనేకములుగలవు.

వశీకరణము గావించు (Mesmerising person) స్త్రీగాని, పురుషుడుగాని మంచి స్వభావము, ఉత్సాహము గలిగియున్నపక్షమున, (స్వమత దురభిమానము, మూఢవిశ్వాసము, గూఢమతము, అధ్యాత్మికస్వప్నములు, మొదలగు నీచపద్ధతులవలంబించినప్పటికి) తన సహాయమునుకోరు రోగులకు, తన ఉత్తమశక్తిని, కలుగజేయఆత్మత్యాగయుతమైన యీకార్యమును యింకను జయప్రదముగ నిర్వహింప కేంద్రీకరించుటకు అధికమైనశక్తి గలిగియుండును. ఈవ్యక్తులొక్కొక్కప్పుడు అత్యద్భుతమైన పనులుజేయుదురు.

## 289

వశీకరణవిద్యను కృషిజేయుటకు పైనజెప్పబడిన పద్ధతులన్నియు, రోగియందు ప్రవేశపెట్టబడు జీవశక్తియొక్క ప్రసరణముపై (influx) ఆధారపడియుండును. గాన యీపద్ధతి సవ్య వశీకరణ ♦1 (Positive mesmerism) మని పిలువబడుచున్నది

♦1 సవ్యవశీకరణశక్తియొక్క నిశ్చయమైన నివారణాశక్తిని గూర్చి, యిచ్చట తెల్పబడిన విషయము, అప్యాది దుర్వినియోగము వచుప బడిన విషయమునుగూర్చిగాదు. ఈనిషయముగ తరచుగనముల్లను [illegible]

ప్రతిపక్షపద్ధతిగ గావించు, వశీకరణశక్తి ప్రయోగము, సవ్య గుణములకు వ్యతిరేకగుణములను కలుగజేయును గాన "అపసవ్యవశీకరణము" (Negative mesmerism) యని పిలువబడును. స్వప్నచారనిద్ర (Somnambulic sleep) నుండి మేల్కొలుపుటకుపయోగించు కరచలనములు, (Passes) ఉపశమనము గావించుట, విశ్రాంతికలిగించుట (Soothing and ventilating) యని పిలువబడును. కరకరణపద్ధతులు (Manual processes) ఈఅపసవ్య వశీకరణ పద్ధతి కేజెందును. రోగినిపరుండబెట్టి, రోగిశరీరమున కంగుళమెడములో మనచేతిని సమదూరములో (parallel) పరుపుగచాచి, తలచిగురునుండి, కాలిగోళ్ళవరకు, మిక్కిలి వేగముగ కరచలనము గావించుటమూలమున, ‡2 బలహీనముజెందని, వ్యక్తుల శరీరమునందలి ప్రత్యేకభాగ

సారి విడువకుండ నొక అరగంట లేక గంటవరకు అనుదినము, బలహీనమైన నరములసంబంధమైన, దోషముగల రోగులపై గావించుట మూలమున, శరీరనిర్మాణమునందంతటను, విపరీతమైన సంక్షోభముజనించి, నిద్రలో నడచిపోవుట, (Somnamblism) యనువ్యాధి సంక్రమించును. ఈ రోగులు ప్రపంచజ్ఞానమునకుదూరమై, వీరి మనోభావములు పైశాచిక ప్రపంచములో విహరించుచు, మిక్కిలి ప్రకృతివిరుద్ధమైన ప్రమాదకర స్థితిలోనుందురు. ఈ పద్ధతిమూలముననే దీర్ఘవ్యాధులను నివారణజేయుటకు తరుచు ప్రయత్నింపబడుచుండెను.

‡2 సవ్యముగగాని అపసవ్యముగగాని వశీకరణము గావింపబడు వ్యక్తి శరీరమునందేభాగముననుగూడ, పట్టువస్త్రమును ధరింపరాదను, నిబంధన సర్వవిదితము.

ములయందు, అధికముగ జేరియున్న జీవశక్తి, పైనవివరింపబడిన అపసవ్యపశీకరణశక్తిచే, మిక్కిలి నిశ్చయముగను, సులభముగను విమోచనము (discharge) గావింపబడుచున్నది. ఎంతత్వరిత ముగ నీకరచలనము (pass) గావింపబడునో, అంతవిశేషముగ నీవిమోచనము గావింపబడును. ఇందుకుదాహరణముగ, ఆరోగ్యముగనున్న ఒక స్త్రీ † 3 తీవ్రమైన మానసిక విస్మయముచే (mental shock) ఆకస్మిక ఋతునిరోధముమూలమున, సమస్త బాహ్యాకారములనుబట్టి గాంచ, మృతిజెందిపడియున్న స్థితి యందు, గుండెలయందుజేరియున్న, జీవశక్తి, పైనజెప్పబడిన తీవ్ర అపసవ్యకరచలనముల మూలమున, విమోచనముగావింప బడి, శరీరమునందంతటను, సమముగ తిర్గి వ్యాపింపజేయబడి, తక్షణమే, సర్వసామాన్యంగా, ఈరోగికి తిర్గిప్రాణము చేర్పబడు చున్నది. *4 ఈవిధముగనే ఉద్రేకులగు వ్యక్తులకు, మిక్కిలిశక్తి వంతమగు, సవ్యకరచలనము (positive pass) మొదలగువాని మూలమున, సంభవించిన అధికమైన, అస్థిమితమును నిద్రలేమి తోగూడిన ఆందోళనమును, సౌమ్యమైన, తక్కువ గమనికగల అపసవ్య కరచలనముల మూలమున, తగ్గింపవచ్చును.

---

† 3 గాన తక్కువగానున్న జీవశక్తితో దీర్ఘవ్యాధిమూలమున బాధపడురోగికి, అపసవ్యకరచలనము, ముఖ్యముగ, మిక్కిలి వేగముగ కావించుట మిక్కిలి ప్రమాదకరము.

* 4. వశీకరవిద్యావతియగు ఒకస్త్రీ, పదిసంవత్సరములుగల ఒక పల్లెటూరి బాలుని, తన రెండుబొటనవేళ్ళతోను, జీర్ణకోశము క్రిందనుండి,

శక్తివంతుడైన మంచిస్వభావముగల వ్యక్తిచే, దీర్ఘరోగులకుగావింపబడు, మాలీసు (Massage) గూడ నీమయమునకు జెందగలదు. ఇట్టిప్రక్రియవలన రోగి స్వస్తత చేకూరినప్పటికి, యిట్టిస్వస్తత మందగమనమున చేకూరుచుండునుగాన, మాంస హీనతచేతను, దుర్బలజీర్ణశక్తిచేతను, నిద్రలేమిచేతను ఇంకను రోగి బాధ పడుచుండును. కాళ్ళయందలి, చేతులయందలి, రొమ్మునందలి, నడుమునందలి కండరములను (Muscles) ప్రత్యేకముగపట్టి మితముగ నొక్కిపిసుకుటమూలమున, కండరములకు మంచిరక్తము, దుష్టరక్తము, ప్రవహింపజేయు రక్తనాళములకు, బలమునుచేకూర్చి, జీవశక్తికి చురుకుదనము కలుగును. ఈపద్ధతి యందు, వశీకరశక్తియొక్క ప్రాబల్యము (Mesmeric influences) ప్రధానాంశముగాన, మిక్కిలి సూక్ష్మతత్వముగలరోగులకు అధికముగ మాలీసుజేయరాదు.

---

గుండెలుయొక్క చిన్న చీరెముకలవంచనుండి, మిక్కిలి శక్తివంతములైన అనేకసార్లు వేగముగ కరచలనము (passes) ఇచ్చియుండెను. వెంటనే ఆబాలుడు స్మృతితప్పి చలనములేక, పడిపోయెను. తెలివిని తెప్పించుటకు, గావించు సమస్తప్రయత్నములు నిష్ఫలమయ్యెను. బాలుడు చనిపోయెనని విడిచివేయబడెను. గాని, అతని సోదరునిపిలచి తలవద్దనుండి కాలివ్రేళ్ళవరకు మిక్కిలివేగముగ అపసవ్యకరచలనములు గావింపమని నియోగించియుంటిని. అట్లుజేసినవెంటనే బాలునకు స్మృతివచ్చి, ఉత్సాహముజేరి స్వస్థతజెందెను,

పరిశుద్ధమైన నీటిస్నానములు, కొంతవరకు ఉపశమనకర ముగను, కొంతవరకు సారూప్యకరముగను, తరుణవ్యాధుల యందు ఆరోగ్యము కలుగజేయుటకు సహాయభూతమగును. వ్యాధినివారణ గావింపబడిన దీర్ఘరోగులు స్వస్థత చేకూరు పరిస్థితులయందుగూడ, స్వస్థతస్థితికి అనుకూలమగు, స్నానజల ఉష్ణోగ్రతను (Temparature of the bath) స్నానముజేయు కాలపరిమాణమును, తిర్గి స్నానముజేయదగిన కాలమును, క్రమ ముగపరిశీలనగావించి, యిట్టిజలస్నానములనాచరించిన, ఆరోగ్యము చేకూర్చుటలో నీస్నానములు (Baths) మిక్కిలి సహాయ భూతమగును. ఈస్నానములను సక్రమముగ ఆచరించినప్పటికి, వ్యాధిగ్రస్తమైన శరీరమునందు ప్రయోజనకరమగు భౌతికమైన మార్పులనుమాత్రమే కలుగజేయును గాని యివి యదార్థమైన మందులుగావు. హిమహతమగుట మూలమున, నీటియందు మునిగిపోవుటమూలమున, లేక శ్వాసబంధింపబడుటమూలమున నరతంతువులు మొద్దుబారి, క్షీణించుచున్న చలన స్పర్శజ్ఞానస్థితి యందు, గోరువెచ్చని నీటిస్నానములు, 25° మొదలు 27° అంశములోగల ఉష్ణములో యీ మొద్దుబారిన నరతంతువులకు చైతన్యమును కలుగజేయును. ఇట్టిస్నానములు ఉపశమనకరము మాత్రమేయైయున్నప్పటికి, ముఖ్యముగ అట్టిరోగుల శరీరమును చేతులతోరాయుట, (rubbing) కాఫీ యిచ్చుట, మొదలగు

పరిచర్యలతో సీస్నానములనుగూడ గావించిన మిక్కిలి సహా
భూతమగును. కొన్ని, అపస్మార యీడ్పులక్షణముల యందు
బాలపాపచిన్నెలక్షణములయందును యగుపడురీతిని, చలనజ్ఞా
ము కొన్నిఅవయవములయందు అధికముగకూడి, హెచ్చుత
లుగ వ్యాప్తమైయున్నప్పుడు, యీపద్ధతులు సారూప్యసహా
మొసగవచ్చును. ఈవిధముగనే, ఔషధసహాయమున దీ
వ్యాధులు నివారణజేయబడిన వ్యక్తులను, జీవోష్ణలోప
(Vital heat) తోనున్నవ్యక్తులను, 6°, 10°, హాంశములమ
ఉష్ణముగల శీతలోదకస్నానములు సారూప్యముగ సహాయభూ
మై పనిజేయును. ఒక్కసారిగ చటాలున నీటిలోమునుగుటయ
అటుపిమ్మట, నిల్చే మరలమరల మునిగి గావించుస్నానములు
బలహీనముజెందిన నరతంతువులకు ఉపశమనకరముగ శక్తిగల
జేయును. గాన నిందుకొరకుగావించు యిట్టి స్నానములు,
కాలపరిమాణమునకు పైగా, కొన్ని నిముషములవరకు, జల
యొక్క ఉష్ణాగ్రతను క్రమముగ, తగ్గించుచు, గావింపవలె
ఈస్నానములు ఉపశమనకరముగ యున్నప్పటికి, భౌతికమ
మాత్రమే పనిజేయగలవు గాన, సూక్ష్మశక్తిగలిగిన, ఉపశమ
ఔషధముల నుపయోగించుటమూలమున [illegible]
పడవలసిన, అనంతర వ్యతిరేక [illegible] ఫలితములతో
బంధములేదు.




రామచంద్రపురమున ఆనంద తీర్థ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి

# తప్పొప్పుల పట్టిక.



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 5 | విభేదమై | విభేదమైన |
| 8 | 24 | . | , |
| 11 | 21 | విచచ్ఛణా | విచక్షణా |
| 12 | 16 | గుణములకు | గుణములను |
| 14 | 4 | నిట్టితరగతి | ఎట్టితరగతి |
| 15 | 5 | నేర్భబడిన | నేర్పడిన |
| 15 | 8 | తెంసికొను | తెలిసికొను |
| 15 | 8 | అవుసంముగు | అవుసరముగు |
| 24 | 5 | ఉదకజని | ఉదజని |
| 25 | 19 | సామాప్యోద్రికకౌషధము | సారూప్యోద్రికకౌషధము |
| 32 | 4 | సుంమచ్ఛభించిన | సుండుచ్ఛ ం న |
| 35 | 7 | న్రవించు | స్రవించు |
| 35 | 20 | వేపనములు | లేపనముల |
| 37 | 4 | Setores | Setons |
| 40 | 20 | meterial | material |
| 42 | 15 | పరిశుద్దజేయు | పరిశుద్ధిజేయు |
| 44 | 6 | వృద్ది | వృద్ధి |
| 44 | 14 | పదార్దమునను | పదార్థములను |
| 46 | 18 | అపాయమునకో! | అపాయములో! |
| 46 | 19 | భయాకర | భయంకర. |
| 51 | 6 | Diuretie | Diuretic |
| 51 | 13 | Aprerient | Aperient |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 51 | 18 | తీ సె వేయ | తీసి వేయ |
| 53 | 13 | సారూవ్యమైన | సారూప్యమైన |
| 53 | 13 | వాధిని | వ్యాధిని |
| 53 | 20 | అంలి | అంత |
| 53 | 24 | ల్రష్టికర్త | సృష్టికర్త |
| 54 | 2 | గోపరమగు | గోచరమగు |
| 56 | 9 | చైతన్యశక్తి | ........ |
| 60 | 14 | రణములు | రణముల |
| 63 | 9 | జాలవు. | జాలవు. |
| 64 | 5 | ప్రయత్నింమండిరి | ప్రయత్నించుచుం |
| 75 | 3 | తరగతికిజెందిన | తరగతికిజెందని |
| 75 | 22 | స్వాస్థతే | స్వాస్థత |
| 77 | 11 | వ్యాధినందుద్భవించిన | వ్యాధినుండుద్భవించి |
| 78 | 14 | దీసికొనివచ్చి | దీసికొనివచ్చు |
| 73 | 11 | యున్నది. | యున్నవి. |
| 80 | 21 | వచింపబడిన | వంచింపబడిన |
| 90 | 23 | వనకుగల | మనకుగల |
| 93 | 4 | Contraries | Contrariis |
| 94 | 19 | ర్ణనియకాలము | నిర్ణయకాలము |
| 103 | 13 | Prositive | Positive |
| 118 | 9 | వైద్యుడును | వైద్యునకు |
| 130 | 18 | నూయబోధనల | మాయబోధనల |
| 133 | 3 | నెయ్యోదిమో | దెయ్యాదియో |
| 148 | 9 | నుడింయు | నుండియు |
| 148. | 9 | బోధపడుచు | బాధపడు |
| 158 | 16 | లక్షణముఁను | లక్షణములను |